విశ్వసాహిత్యమాల 70

# విద్య

హెర్బర్టు స్పెన్సర్.

అనువాదం:

ఖండవిల్లి బాలేందుశేఖరం, M. A.,

లెక్చరర్, నిజాం కాలేజి,

హైదరాబాదు.



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

# ఉపోద్ఘాతము

1. రాజకీయముగ స్వాతంత్ర్యం లభించినందువలనను, తదితర కారణములవలనను మన దేశములో ఇప్పుడు ఎంతో జాగృతి కల్గినది. ఇంకను ఎంతయో జాగృతి కలుగవలసియున్నది. ఇట్టి జాగృతికి విజ్ఞానము మూలము. కనుక విజ్ఞానదాయకములైన గ్రంథములు మనకు విస్తారముగ కావలెను. అట్టి గ్రంథములు స్వతంత్రములైన కావచ్చును. లేదా అనువాదములైన కావచ్చును విజ్ఞానప్రదములగు పుస్తకములను పరభాషలనుండి మన భాషలోనికి సంతరించుకొనుట న్యూనతకాదు. అది మన భాషకును, మనకును పుష్టిని కల్గించును. ఈ భావముతో నేను హెర్బర్టు స్పెన్సరు మహాశయుని 'ఎడ్యుకేషన్' అను ఉత్తమకృతిని తెనుగులోనికి అనువదించినాను.

2. స్పెన్సరు మహాశయుని గ్రంథము మిక్కిలి అపూర్వమైనది. ఇట్టి ఉత్తమమైన పుస్తకములు ఇంగ్లీషు భాషలోకూడ చాల తక్కువ. ఈ గ్రంథము వెలువడిన అనతికాలములోనే ఇది పెక్కు ఐరోపీయ భాషలలోని కనువదింపబడి పండిత జనులచేతను, సామాన్యుల చేతను కూడ మిక్కిలి ప్రశంసింపబడినది. ఇట్టి ఉత్తమమగు పుస్తకము మన భాషలోకూడ ఉండవలెనని నాకు తోచినది.

3. "ఎడ్యుకేషన్" అను ఈ పుస్తకములో విద్యను గూర్చి సమగ్రమైన చర్చ కావింపబడినది. మన భారతీయ సాంప్రదాయముల ప్రకారము ఉత్తమమగు విద్య బ్రహ్మవిద్య మాత్రమే. కాని, పాశ్చాత్య విద్వాంసుడగు స్పెన్సర్ మహాశయుడీ భావమును మన్నింపనిచో మన మాశ్చర్యపడనక్కరలేదు. ఆయన చేపట్టిన యంశము లౌకికవిద్య.

ఆ విషయము నాతడు సంపూర్ణముగ, సూక్ష్మాతిసూక్ష్మములతో చర్చించి పాఠకులకు సరియైన త్రోవను చూపినాడు. ఈతడు కావించిన సిద్ధాంతము లను కొన్నిటిని ఆధునిక విద్యావేత్తలంగీకరింపక పోవచ్చును. కాని స్పెన్సరు మహాశయుని తర్కము మాత్రము నిర్దుష్టమైనదని అందరును అంగీకరించి తీరుదురు ఈ గ్రంథములో నాకు రెండు ఉత్తమ లక్షణ ములు కానవచ్చినవి ఒకటి ఇందలి అపూర్వ విషయ సంగ్రహము. రెండవది సిద్ధాంత నిర్ణయమును కావించుటకు పూర్వము కావింపబడిన సమగ్ర సూక్ష్మ తర్క వితర్కములు హేతువాదము. ఈ పుస్తకమును శ్రద్ధగ చదువువారి కీ వాదసమగ్రతయు, ప్రాగల్భ్యమును గోచరింపక మానవు. స్పెన్సరు మహాశయుడు శాస్త్రీయ దృష్టితోపాటు లౌకిక విజ్ఞాన మును కూడ సంపుటీకరణము కావించినాడు. ఇయ్యది ఈ గ్రంథమునకు వన్నెకూర్చినదని నా విశ్వాసము

4 సుమారు ఎనుబది సంవత్సరములకు పూర్వము వ్రాయబడిన ఈ గ్రంథము ప్రాతబడినట్లు కొందరు నిత్యనూతనప్రియులు విమర్శింప వచ్చును. కాని "ఎడ్యుకేషన్" వంటి శాస్త్రీయ గ్రంథములు మేలిమి బంగారమును పోలును కాలము గడచినంతమాత్రమున మేలిమిబంగారము వన్నె తరిగినట్లుకాని, విలువ కోల్పోయినట్లుకాని మేము వినలేదు.

5. ఈ గ్రంథమునందు చర్చింపబడిన కొన్ని యంశములు నేటి భారతదేశపు పరిస్థితులకు చక్కగ వర్తింపగలవని మా విశ్వాసము. శాస్త్రీయ విజ్ఞానముయొక్క ఆవశ్యకతనుగూర్చి స్పెన్సరు మహాశయుడు సవిస్తరముగ వాదించినాడు. ఇట్టి విజ్ఞానము నేటి మన విద్యాసంస్థలలో చాల అవసరము. బాలబాలికలకు విద్యను గరపునపుడు ప్రకృతిసూత్రముల ననుగుణ్యముగను, సహజాతమునకు ప్రోత్సాహకరముగను పాఠ్యాంశము లను రూపొందించుట చాల అవసరము. ఈ యంశమును కూడ స్పెన్సరు పండితుడు పదేపదే బలపరచినాడు. ఈ రెండవ భావమును నేటి మన

ఉపాధ్యాయులు దృష్టియందుంచుకొనవలసిన ఆవశ్యకత చాల కలదు. ఇంకను ఇట్టి విషయములు ఈ పుస్తకములో పెక్కులు కలవు.

6. శారీరక విద్య చాల అవసరమనియు, శక్తిని మించిన విద్యను బాలబాలికలకు నేర్పుట హానికరమనియు స్పెన్సరు మహాశయుడు సుదీర్ఘముగ ప్రతిపాదించినాడు. ఈ యంశము నేటి ఉపాధ్యాయులు పలువురకును తెలిసినదే కాని యీ చర్చను నిర్లక్ష్యముగ భావింపరాదు. సర్వజ్ఞులగు వారు కూడ తెలిసిన యంశములలోనే పొరపాటు చేయ వచ్చును. అట్టి పొరపాట్లు కావింపకుండగలందులకై ఈ చర్చ మనకొక హెచ్చరికయని భావించుట ఉచితము.

7. నేను కావించిన అనువాదము కేవల భావానువాదము కాదు. స్పెన్సరు పండితుని భాషను కూడ సముచితముగ ఆంధ్రములో ప్రదర్శించుటకు నేను యత్నించినాను. కాని మాతృకయందలి భాషాప్రాశస్త్యమును నే నెంతవరకు పాఠకులకు చూపగల్గినానో నాకు తెలియదు. భాషయందెట్టి లోపములున్నను భావప్రాశస్త్యమును పురస్కరించుకొని విద్యార్థులును, ఉపాధ్యాయులును, తలిదండ్రులును ఈ పుస్తకమును ప్రోత్సహింతురని నేను నమ్ముచున్నాను 'ఎడ్యుకేషన్' కేవల పాఠ్యగ్రంథము కాదు. విజ్ఞాన ప్రియులగు తలిదండ్రులందరును కూడ ఈ పుస్తకమును చదివితీరవలెను. ఇయ్యది దైనందిన జీవితములో వారికి చక్కని త్రోవచూపు కరదీపిక

హైద్రాబాదు,
20—1—1958.

బండవల్లి బాలేందుశేఖరం.



# ముందుమాట

చిరకాల దాస్యశృంఖలాలనుంచి బైటబడిన ఏ దేశప్రజలైనా చితికి శిథిలమైన తమ యింటిని చక్కబెట్టుకోవలసి యుండునుగదా! దేశ పునర్నిర్మాణమంటే ప్రాజెక్టులు, పరిశ్రమలు, రహదారులు విపణులు మాత్రమే గాదు. ప్రజలలో ధైర్యోత్సాహములను, శిక్షణను, ఆత్మవిశ్వాసమును, యుక్తాయుక్త వివేకమును పెంపొందించుకొన్ననాడే దేశ పునర్నిర్మాణ కార్యక్రమము నిరాటంకముగా సాగగలదు అంతేగాక పరదాస్యము క్రింద జనులలో వ్యాపించిన అనారోగ్యకరమైన భావములను, భయావహములైన పరధర్మములను పారద్రోలవలసియుండును. భావిపౌరులైన నేటిబిడ్డలను, వారి మనస్తత్వములను చక్కని పద్ధతులపై, శాస్త్రీయ సిద్ధాంతములపై తీర్చి దిద్దుకొనవలెను. ఇదియే దేశ పునర్నిర్మాణములో అతి కష్టతరమైన కార్యము.

నేడు మన దేశములో అనర్థదాయకములును, అవాంఛనీయములును నగు పరిస్థితులు అన్ని తరముల, తరగతుల జనులలోను వ్యాపించి యున్నాయనియు, వాటిని సరిజేసికొననిచో పురోభివృద్ధిమాట యటుంచి, ప్రస్తుత పరిస్థితులుకూడ యింకను దిగజారి, పతనము తప్పదనియు వివేక జ్ఞానసహితులందరును అంగీకరించుచున్న విషయమే. ఐతే యీపని నెచ్చట, ఎట్లు ప్రారంభించవలెను ? ఎవరు ఏమిచేయవలెను ?

ఎవరు చూచినను చిలకపలుకులవలె దేశ పునర్నిర్మాణ సూత్రములను వల్లెవేయువారే ! తమకు విశ్వాసములేని, పరిచయములేని సిద్ధాంతములను గూర్చి మహోపన్యాసముల నిచ్చువారే ! "బోద్ధారోమత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితం" అని భర్తృహరి చెప్పిన వాక్యమును స్మరించి ఊరకొనవలసినదేనా ?

రాదు, కానక్కరలేదు. కర్తవ్యోన్ముఖులైన మన ప్రజలు తప్పక తమ సమస్యలను పరిష్కరించుకోగలరు. అందువల్లనే మన విద్యాప్రణాళికలను పునరాలోచించి, విస్తరించవలెనని అందరును గ్రహించియే యున్నారు. విద్యాప్రమాణాలు పడిపోయినవనీ, పరిపాలనములు మందగించినవనీ, శిక్షణారాహిత్యము పెచ్చుపెరిగినదనీ పెద్దలందరూ ఏక కంఠముగా ఘోషిస్తున్నారు.

ఇంతకాలంగానూ మనకు పరపాలనముక్రింద గరపబడుతూ వచ్చినది 'విద్య' గాదనీ, మన అధోగతికీ, దానిస ప్రవృత్తులకీ యీ 'విద్య'యే కారణమనీ విద్యావేత్తలూ, దేశనాయకులూగూడ గ్రహించియే, విద్యావిధానము మార్చవలెనని తీవ్రకృషి సలుపుతూన్నారు. ఇక్కడ ఒక ప్రమాదముకూడ లేకపోలేదు. పాతదంతా చెడుగుగా భావించి, అంగీకృతములైన మంచి సిద్ధాంతములనుకూడ త్రోసివుచ్చు ప్రమాదంకూడ ఉంది. 'విద్యావిధానము'ను గూర్చి యేమియు తెలియనివారుకూడ, పెట్టి అధికారమును లేకుండగనే విద్యాప్రణాళికలను రచించ బూనుకొంటూన్నారు. ఉన్న పరిస్థితులుకూడ చెడిపోయే ప్రమాదం వచ్చింది. గాన విద్యావిధానమునుగూర్చి ప్రాచ్య, పాశ్చాత్య తత్త్వవేత్తలు రచించిన ఉత్తమగ్రంథములను కొన్నిటిని దేశభాషలలో ప్రచురించినచో అందరకీ అవి అందుబాటులోకివచ్చి, భవిష్యన్నిర్ణయములను తీసికొనుటలో నుపయోగపడునని భావించితిమి.

ఈ ఉద్దేశ్యముతోనే హెర్బర్టు స్పెన్సర్ అను ఇంగ్లాండు తత్త్వ చింతకుడు రచించిన "విద్య" (ఎడ్యుకేషన్) అను పుస్తకమును ప్రచురించితిమి. ఇది 1859 వరకును ప్రముఖ యింగ్లాండు పత్రికలతో ప్రచురింపబడి, పుస్తకరూపంగా వెలువడినట్టిది. రచింపబడి దాదాపొక శతాబ్దమైనను దానిలోని భావము అనేకములు నేటికినీ ఆలోచించదగినవే

యూరోపులోని సాంప్రదాయిక విద్యాపద్ధతులపై 18, 19 శతాబ్ధములలో అసంతృప్తి వ్యాపించి, అనేకులు తత్త్వ చింతకులు విద్యా

వేత్తలు, "విద్యావిధాన మెట్లుండవలె," నను విషయముపై ఆలోచనలను కేంద్రీకరించిరి. ఫ్రెంచి తత్త్వవేత్త, మహా మేధావియైన రూసో మహాశయుడు 'ఎమైలీ' అను ఉద్గ్రంథమును రచించెను. అది పాశ్చాత్య ప్రపంచము నుద్ధూతలూగించిన గ్రంథములలో నొకటి. రూసో భావముల నెన్నిటినో బలపరుస్తూ, విపులీకరిస్తూ, అన్వయిస్తూ మరెందరో మేధావులు రచనలుగావించేరు. ఇంగ్లాండు దేశీయుడైన హెర్బర్టు స్పెన్సరు రచించిన 'విద్య' అను నీ గ్రంథము ఆ కోవలో చేరినదే.

రూసో మహాశయుని రచన 'ఎమైలీ'ని కూడ ఆంధ్రపాఠకుల ముందుంచుటకు విశ్వసాహిత్యమాల ప్రయత్నిస్తుంది విద్యావిషయికమైన ఆధునికతత్త్వ చింతకుల గ్రంథములను మరికొన్నిటిని కూడ ప్రచురించి, మన దేశసుస్థితికి పునాదులు వేయుటలో 'ఉడతాభక్తి'ని చూపవలెననియే మా ఆశయము.

బోధకులు, తల్లిదండ్రులు, విద్యార్థులుకూడ యీ గ్రంథమును తప్పక చదివి, దీనివలని ఉపయోగమును పొందినచో మా కృషి సఫలమని భావిస్తాము

విద్యఅంటే ఏమిటి? దానిలోని భేదములు. అందరకూ ఒకేరకం విద్య నొసగవలెనా? కాదా? ప్రాథమికవిద్య యెట్టిది? సాంప్రదాయికమైన విద్య; దానిలోని లోపాలోపాలు; సుఖజీవన సాధకముగా నుండాలంటే యెట్టి ప్రాతిపదికపై విద్యావిధానమును నిర్మించాలి? ఇట్టి అనేక సమస్యలపై మన కత్యంతోపయుక్తమైన భోగట్టాను యీ గ్రంథము సమకూరుస్తోంది. ఆంధ్ర మహాశయులీ గ్రంథమును స్వీకరించి, ఉపయోగపరచుకొన్నచో మా కృషి సఫలమైనట్లు భావిస్తాము

ఇట్లు,

20-2-1958.<br>
రాజమండ్రి.

మహీధర జగన్మోహనరావు,<br>
సంపాదకులు.



# విద్య

## జ్ఞానము యొక్క విలువ



ఆదికాలమునందు మానవుడు మొట్టమొదట దేహా
లంకరణమునకు ప్రాముఖ్యత నొసంగెను. కొంతకాలము
గడచిన తరువాత ఆతడు దుస్తుల ఆవశ్యకతను గుర్తించెను.
అందముకొరకై కొందరు జనులు చాల బాధకోర్చి, తమ దేహ
ముపై పచ్చబొట్లు పొడిపించుకొందురు, ఎంతటి శీతోష్ణముల
నైనను శాంతముగ సహింతురు. అమెరికా దేశములోని అనాగ
రకులైన ఇండియనులకు తమ దేహసౌఖ్యము విషయమై ఎంత
మాత్రమును శ్రద్ధ యుండదు. కాని దేహముల కలదుకొను
చక్కని మైపూతను సంపాదించి, చిత్రవర్ణరంజిత మగు తను
శోభచే ఇతరుల మెప్పును బడయుటకై వారు దినములకొలది
పాటుపడుదురని హంబోల్డు అను ఒక పండితుడు తెల్పినాడు.
ఈ తెగకు చెందిన స్త్రీలు దిగంబరలై యెల్లెడల తిరుగు
చుందురు కాని దేహమునకు రంగులు పూసికొనుట పొరపా
టునకూడ వారు మరువరు. ఇట్లు చేయుట సంఘమర్యాదకు

భిన్నమని వారి విశ్వాసము. అనాగరకజాతులవారికి రంగు పూసలు, మాయనగలు అనిన ప్రాణము. సన్నని వస్త్రముల యెడల వారి కెక్కువ మోజు లేదని అనుభవశాలురు తెల్పుదురు. అనాగరక ప్రజలకు మనము వస్త్రములు, అంగీలు మున్నగువానిని బహూకరించిన పక్షమున వారు వానిని ధరించి ఆనందించుటకుమారు, వానిని వెట్టిమొట్టి అలంకారములుగ మార్చివై చెదరు. పై యంశములవలన నొక సత్యము తెలియ వచ్చుచున్నది: సంఘములో అలంకారసాధనముల కున్నంత గౌరవము కేవలము ఉపయోగకరములైన వస్తువుల కుండదు. మిక్కిలి ఆశ్చర్యకరమైన మరియొక సంఘటనను గమనింపుడు: ఆఫ్రికా వాసులలో కొందరు ఎండ చక్కగా కాయుచున్నప్పుడు తమ మేకతోలు అంగరఖాల నొడలినిండ కప్పుకొని సవిలాసముగ తిరుగుచు, వాన కురియుట ప్రారంభము కాగానే (ఆ సుందరపరిధానములు చెడిపోవునను భయముచే) వానిని చక్కగ మడతపెట్టి దాచుకొని, చలిలో గజగజ వడకుచు బాధపడుదురు. ఆదిమ మానవుల జీవితవిధానమును పరీక్షించిన యెడల మానవుడు ప్రప్రథమమున అలంకారములకొరకు మాత్రమే పాటుపడినట్లును, ఆ యలంకారములనుండియే దుస్తులు ఉద్భవించినట్లును మనకు తెలియవచ్చును. మన నాగరకయుగములో కూడ మానవులు తమ దుస్తుల పైమెరగులు, అందచందములు, విన్యాసములకొసంగినంత ప్రాముఖ్యత వాని ఉపయోగము,

మును ఇచ్ఛయించెను. [illegible] [illegible] ములు నేర్చునను చదువరు. జన్మకే, [illegible] [illegible] [illegible] వారికి కావలసినది. [illegible] [illegible] [illegible] లు తను తమ పాండిత్యవి [illegible] [illegible] [illegible] వారి [illegible] యును. రాజుల జనన [illegible] [illegible], వారి [illegible] మున్నగు అముఖ్యమైన వారి [illegible] ములు నేర్చినచో స్త్రీలు వల్లెవేయుదురు. [illegible] [illegible] [illegible] [illegible] పోలేరు. కాని ఇట్టి విద్య యందు [illegible] [illegible] లో పలు వృత్తి యుద్దేశ్యము. ఇట్టి యం[illegible] [illegible] తెలియని వారికి సంఘము నందు న్యూనత సంభవించును. కాలికలకు వ్రాయుట, చదువుట, చక్కని వస్త్రధారణము, వ్యాపారము, శిల్పకళయు నేర్పినయెడల వారికి నిత్యజీవితములో కావలసిన విద్యనంతను మనము నేర్పినట్లే భావింపవచ్చును.

భౌతిక మానసిక విషయములలో మానవులు ఉపయోగమునకంటె అందమునకే యెక్కుడు గౌరవము నేల యొసంగుచున్నారో తెలిసికొనవలయు ననిన యెడల, మనమిందలి తత్త్వమును గ్రహింపవలయును. ప్రాచీనకాలము నుండి నేటివరకును కూడ వ్యక్తి ప్రయోజనములు, సంఘ ప్రయోజనములకు లోనుకావింపబడుటయే దీనికి ముఖ్యకారణము. ఇతరవ్యక్తులను లోబరచుకొనుటయే సంఘప్రయోజనము. రాజులు, శాసనసభలు, చట్టబద్ధమైన సంస్థలు మున్నగునవి మాత్రమే అధికారమును నెరపుచుండు నని

మనము భావించుచున్నాము. అది పొరపాటు. ఇవి లోకు లందరును అంగీకరించిన ప్రభుత్వములు. లోకులు సామాన్య ముగ నంగీకరింపని ప్రభుత్వములుకూడ చాల కలవు. సంఘ మండలి యన్ని విభాగములందును ఇట్టి దొరతనములు పెంపొందుచుండును. ఆ దొరతనమునందు తాము రాజో, రాణియో, లేక ఏదైన పెద్ద అధికారియో కావలెనని ఎల్ల రును ప్రాకులాడుచుందురు. తోటి మానవులలో కొందరి కంటె అధిక్యతను సంపాదించి, వారి మన్ననలకు పాత్రు లగుచు, తమకంటె ఉన్నతపదవిలో నున్నవారిని సంతుష్టి పరచి, వారి అనుగ్రహమును సంపాదించుటకై మానవు లందరును కూడ తమ సర్వశక్తులను వెచ్చించుచుందురు. ధనసంపాదనము వలననో, హుందా జీవితమువలననో, అంద మైన వస్త్రముల వలననో, లేక పాండిత్యప్రకర్ష వలననో మానవు డితరుల లోబరచుకొనుటకై యత్నించును. ఈ విధ ముగ సమాజమునందు భిన్నవిభిన్నమగు నిర్బంధము లేర్పడి సంఘ జీవితమును క్రమబద్ధము కావించుచున్నవి. అనాగరక సంఘములకు నాయకుడైన యాతడు దేహమునిండ వీర గంధము పూసికొని, మెడలో కంకాళమాలను ధరించి తన యనుచరుల గుండెలలో అదటు పుట్టించును; విలాసిను లగు సుందరాంగులు మిక్కిలి శ్రద్ధగ ముస్తాబు చేసికొని, తమ తళుకు బెళుకులు, తమ కళాకోవిదత్వముల వలన, మానవ హృదయములపై విజయపరంపరలను సాధింతురు. అట్లే

[illegible] [illegible] [illegible] [illegible]
ప్ర[illegible]వనము [illegible] [illegible] సైన్యములునా
[illegible]ముగ వచ్చియున్న[illegible]. మన [illegible] స్వాతంత్ర్యములను
విశాలముగ [illegible] మనము సంతుష్టి
నొందజాలము. మన శక్తిసామర్థ్యములచే ఇతర మానవుల
[illegible] వానిని మనకు లోను కావించు
కొనవలెనని పలుమారు వాదించుచున్నాము. మన విద్యా
వ్యాసంగ మీ లక్ష్యములవలననే ఏర్పడుచున్నది. ఇట్టి
ఉపయోగకరమైన విద్య ఏది? అని మనము విమర్శింపము.
ఏ విద్యవలన మనకు ప్రజాభిమానము, గౌరవప్రపత్తులు,
సంఘములో మర్యాద, పలుకుబడి, హోదాయు లభించునో,
అట్టి విద్యను సంపాదించుటకై మనము ప్రాకులాడుదుము.
మనలో నిజమైన యోగ్యత యెంతకలదో మనము తర్కించు
కొనము. లోకులు మనల గూర్చి యేమి భావించుచున్నారో
అది మనకు చాల ముఖ్యము. అదేవిధముగ విద్యావిష
యములో కూడ మనము విద్య యందలి నిజమగు సత్యమును
పరిగణింపక, దాని బాహ్యఫలితముల యెడ నెక్కుడు
శ్రద్ధ వూనుదుము. కావున మనము సంపాదించు విద్య
యెంతవరకు ప్రయోజకారి అను విషయమును మనము
విమర్శింపనేరకున్నాము.

వివిధములగు విద్యల యందెంత విలువగలదను విష
యమును, మన మీనాటివరకును సక్రమపద్ధతులపై విమ

ర్శించి, ఎట్టి నిర్ణయములను కావించుకొనలేదు. మన విద్యా విధానము ఎంతయో వెనుకబడియున్నదనుట కిది మరియొక నిదర్శనము. వివిధవిద్యల పరస్పర యోగ్యతను నిర్ణయించుటకు మానదండమును మనము ఏర్పాటు చేయలేదు. దీని యవసరమునుకూడ మనము పూర్తిగ గుర్తింపలేదు. జనులు తమ కిచ్చవచ్చిన పుస్తకములను చదువుచుందురు; తమకు నచ్చిన యుపన్యాసముల వినుచుందురు. వాని యాధారముపై తమ బాలబాలిక లీ విధమగు విద్యను సంపాదింపవలయుననియు, ఆవిధమగు విద్య వారి కనవసరమనియు నిర్ణయించుచుందురు. ఇట్లు నిర్ణయింపుటలో వారు తమ యిష్టానిష్టములనో, ఆచారమునో అనుసరింతురు. అంతే కాని ఏవిషయము లభ్యసనయోగ్యము లను నంశమును వారు సకారణముగ విమర్శింపరు. వివిధవిద్యల ప్రయోజనము, నిరర్థకత మున్నగు విషయముల గూర్చి తరచు మనలో తర్కవితర్కములు జరుగుచుండుననుమాట నిజమే. కాని ఏదైన నొక విద్యాశాఖకొరకై మనము వెచ్చించు కాలము సోపయోగమా నిరుపయోగమా అను నంశమునుకాని, అదే సమయమును మరొక విద్యను నేర్చుటలో గడపుట లాభదాయకముకాదా యను విషయమును గాని మనము తీవ్రముగా నాలోచింపక, ఇతఃపూర్వము మనకు గల అభిప్రాయముల ననుసరించి ఈసమస్యలను తేలికగ తేల్చివేయుచుందుము. ప్రాచీన గ్రంథ విజ్ఞానము, ఆధునిక శాస్త్ర

విజ్ఞానములలో నేది శ్రేష్ఠమను సంశయముపై కేవల వాదో పవాదములు మరల తలయెత్తినవి. కాని యీ వాదవివాద ములు నిశ్చితముగ నొక ప్రమాణానుసారము సాధార ముగగాక వ్యక్తుల స్వకీయవిశ్వాసములపై నాధారపడి యున్నవి. ఈ సమస్య విశాలతరమగు మరియొక సమస్యలో నొక అంతర్భాగము మాత్రమే యని మనము గ్రహింప వలెను. ప్రాచీన ఆధునిక విజ్ఞానములలో నేది శ్రేష్ఠతరమో నిర్ణయించినంతమాత్రమున విద్యావిధానమున కావశ్యక మగు పాఠ్యప్రణాళిక సిద్ధము కాజాలదు. రొట్టె, బంగాళ దుంపలు, వీనిలో నేది యెక్కువ పుష్టికరమో నిర్ణయించి నంత మాత్రమున ఆహారశాస్త్రవిజ్ఞానము పూర్తియైనట్లు తెల్పుటకు వలనుపడదుకదా !

ఒక విషయము మన కుపయోగకరమైనదా కాదా యని తెలిసికొనినంతమాత్రమున మన పని పూర్తికాదు. ఇతర విద్యలతో పోల్చిచూచినపక్షమున నీవిద్య కెంత విలువకలదను ప్రశ్నను కూడ తేల్చుకొనుట మనకు చాల ముఖ్యమైనది. కొందరు జనులు తాము నేర్చిన విద్యల ప్రాశస్త్యము నుగ్గడించి అంతటితో సంతృప్తిపడుదురు. కాని అది సరియైన పద్ధతికాదు. ఇతర విద్యలకును, మనము నేర్చిన విద్యకును గల తారతమ్యము తెలిసికొనుట చాల అవసరము. బహుశః మనము నేర్చు అన్నివిద్యలందును కూడ కొంచెమో గొప్పయో ఉపయోగముండకపోదు.

వేర్వేరు జమీందారు లేయే రాజచిహ్నములను, ధ్వజము లను ఉపయోగించుచుండెడివారో తెలిసికొనుటకై ఒక విజ్ఞాని యొకసంవత్సరము కాలము కిష్టించె నని తలంపుడు. ఆతని పరిశోధనల వలన ప్రాచీనుల విశ్వాసములు, ఆచారములు మున్నగునవి తెలియనగును. ఇంగ్లాండు దేశము లోని వివిధగ్రామములకు, పట్టణములకు, నడుమగల దూరము తెలిసికొనుటకై ఒకడు శ్రమపడిన యెడల దానివలన ఏదో యొక ప్రయాణము చేయుచున్నప్పుడు కొంత ఉపయోగము కాన్పింపకమానదు. గ్రామములోని 'అమ్మలక్కల కబుర్లు' శ్రద్ధగావిని జ్ఞప్తి యుంచుకొనుటవలన కూడ కొంత ఉపయోగముండకపోదు. కాని పైన తెలుపబడిన కృషికిని, వాని ఫలితములకును ఎట్టి సామరస్యమునుఉండదు. ఏ బుద్ధిమంతుడును కూడ తన కుమారుడు కొన్ని సంవత్సరముల కాలము వ్యయపరచి ఇట్టి నిరర్థకమైన యంశముల సేకరించుట కంగీకరింపడు. ఈ కాలమును మరొక విధముగ గడపినచో ఎంతయో లాభము సంభవించుట తథ్యము. కావున విద్యల నభ్యసించుట యందొండొంటి తారతమ్యమును గుర్తించి, వ్యవహరించుట చాలముఖ్యము. అన్ని విద్యలను కూడ అభ్యసించుటకు తగిన జీవితపరిమాణము మనకు కల్గిన యెడల నిక కావలసినదేమి ? ఒక ప్రాచీనకవి యిట్లు పల్కుచున్నాడు :

కృతయుగమ్మున నైనను • కోనసంతె
దీర్ఘజీవుల మనుజులు సైతము • ధరణి నేర
ఎట్టి విద్యల నార్జించు • మెట్టి కార్య
శూరతను జేయు టెరుంగ • మా కాలమెల్ల !

మన జీవితము అత్యల్పము. కావున అన్నివిద్యలను మనము నేర్వజాలము. మనకు లభించు స్వల్పకాలములో మనకు లెక్కకు మించిన పను లుండును. కావున మిక్కిలి ఉపయోగకరమగు విద్యలను సాధించు విషయములో మనము చాల శ్రద్ధవహించవలసియున్నది. ఏదో తాత్కాలిక ప్రయోజనముల పరిష్కరించుకొని విద్యాభ్యాసమునకు దిగుట అవివేకము. ఎట్టి విద్యచే మన జీవితమునకు పరమార్థసిద్ధి కల్గునో అట్టి విద్యను సాధించుటయందు మన కాలము వ్యయము కావలెను.

వివిధవిద్యల యుపయోగమందలి తారతమ్యమును తెలిసికొనుటయే ఇప్పుడు మనము ముఖ్యముగ పరిష్కరింప వలసిన సమస్య. విద్యల ప్రాశస్త్యమునందు తరతమ విభేద మును కావించుట యెట్లను ప్రశ్నను మనము తుట్టతుదిని విచారింతము. ఉత్తమమగు విద్య యేదియో గుర్తించుట ఈ చర్చయొక్క ముఖ్యలక్ష్యము. పాఠ్యప్రణాళికను నిర్ణ యించుటకు పూర్వమే యే యంశములను నేర్చుకొనుట మనకు మిక్కిలి అవసరమో గుర్తింపవలెను.

పై యంశమును నిర్ణయించుటకై మన కొక మాన
దండము కావలసియున్నది. ఈ కొలతబద్దయేదో మన మెల్లర
మును సర్వసామాన్యముగ సంగీకరించియే యున్నాము.
ఏదైన నొక విజ్ఞానశాఖ శ్రేష్ఠతమమైన దని వాదించువారు,
ఆ శాఖకును, జీవితావసరములకును, ఎట్టి సంబంధముగలదో
నిరూపింతురు. ఒక గణితశాస్త్రజ్ఞుని కాని, భాషాకోవిదుని
గాని, ప్రకృతిశాస్త్రజ్ఞుని గాని, తత్త్వశాస్త్రపండితుని గాని,
వారి వారి విద్యలవలన నేమి ప్రయోజనము కలదని మనము
ప్రశ్నించిన యెడల, ఆతడు తన విద్యను నేర్చినవారు నిత్య
కృత్యములలో మిక్కిలి లాభదాయకమగు మార్గముల నవ
లంబింతురనియో, లేక పొరపాట్లను కావింపరనియో, లేక
తమ తమ పనులను విజయవంతముగ సాధింతురనియో,
లేక సౌఖ్యమును పొందుదురనియో నిరూపించును. వ్రాత
కోతలను నేర్చిన బాలుడు తనవృత్తియందు బాగుగ కృతా
ర్థుడగునని ఉపాధ్యాయుడు వాదించును. అనగా ఆ బాలుడు
జీవితోపాధిని సంపాదించి సుఖజీవనము గడపునని ఆతని
భావము. ఇట్లు నిరూపింపగల్గిన యెడల, ఆ విద్య ప్రయో
జనకరమైనదని యర్థము. ఏదైన నొక విద్య వలన మానవ
జీవితమున కెట్టి లాభమును కల్గుటలేదని మనము నిర్ధారణ
చేసిన యెడల, ఆ విద్య నిరుపయోగమని భావింపబడును.
కావున అన్ని విద్యలును కూడ జీవితావసరములను పూర్తి
చేయుటయే లక్ష్యముగా కల్గియున్నవి. ఆ లక్ష్య మొకప్పుడు

వినోదము కావచ్చును, లేక [illegible] కావచ్చును.
ఏది యెట్లున్నను [illegible].

‘జ్ఞానము యొక్క విలువ’ యనగ నిదేమో ఇప్పుడు మనకు స్పష్టమగును. జ్ఞానము [illegible] కాక, విద్య తనయొక్క ఫలములలో [illegible] తెలిసికొనవలెను. సమస్త దేశకాలపాత్రములందు [illegible] జ్ఞానమును గన వడి లేక ప్రవర్తన [illegible] ప్రధాన లక్ష్యము. [illegible] దేహము నెట్లు కాపాడుకొనవలెను; మనస్సు నెట్లు వి-కాసింపజేయవలెను; స్వాతంత్ర్యము నెట్లు సంపాదించవలెను; కుటుంబజీవితము నెట్లు నడుపవలెను; [illegible] ముగ పూర్తికావింపవలెను. ప్రకృతి మనకొసంగిన శక్తు లన్నిటిని సంపూర్ణముగ వికసింపజేయుట వలన మనము తరించి, ఇతరులను తరింపజేయుట యెట్లు? సంపూర్ణ జీవితమును గడపుట యెట్లు? అను ప్రశ్నలకు మనకు సమాధానము కావలెను. ఈ విషయములను తెలిసికొనుట మన కెంతో యవసరము. కావున, విద్య మనకీ యంశముల బోధింపవలయును. సంపూర్ణజీవితముకొరకై మనల సంసిద్ధుల కావించుటయే విద్య యొక్క లక్ష్యము. ఏదైన నొక విద్యా విధానమందలి యోగ్యతను నిర్ణయించునప్పు డావిధానము, పై ధర్మముల నెంతవరకు నిర్వర్తించుచున్నదో నిర్ణయించుట యవసరము.

పైన మనము నిర్ణయించిన పరీక్షను సమగ్రముగ కాని, అసమగ్రముగ కాని యెవ్వరును ఇంతకు పూర్వము కావించి యుండలేదు. మన మీపనికై శ్రద్ధతో పూనుకొన వలసి యున్నది. అన్నివిధములైన విద్యలను మన మీ కొలత బద్దతో కొలిచి వాని యోగ్యతను నిర్ణయింపవలయును. సంపూర్ణమగు జీవితమును మన మిప్పుడును, మున్ముందును కూడ దృష్టియం దుంచుకొనవలయును. మన బాలబాలిక లకు నేర్పబడు విద్యలును, అవలంబింపవలసిన శిక్షణాపద్ధ తులును, పై ఆశయమును సాధించుట కనువుగ నుండవల యును. విద్యావిషయములందు మనము కేవల మాచారము లకు లోనుకాకూడదు. అదే,విధముగ బుద్ధిశాలురు కొందరు కావించు వ్యక్తిగత సిద్ధాంతములను కూడ మన మంగీక రింపరాదు. ఈ విధమగు జ్ఞానము భవిష్యజ్జీవితములో బాల బాలికల కుపయుక్తమగునని కాని, ఇయ్యది నిత్యజీవిత ములో ఎక్కుడు లాభదాయకమని కాని, నిర్ణయమైనంత మాత్రమున మనము సంతుష్టిచెంది యూరకుండరాదు. వివిధవిద్యలను పోల్చి చూచి, దేనియం దెంత మహాత్వము కలదో మనము తేల్చుకొనవలెను. ఆపైన మన కేవిద్య లభ్యసనీయములో సిద్ధాంతీకరింపవచ్చును.

కాని ఇయ్యది కష్టసాధ్యమగు కార్యమనుటలో సందేహము లేదు. ఇందు మనము సంపూర్ణముగ కృతార్థత నందజాలము. కాని యీ విషయమునందు మన కతి ముఖ్య

మగు నర్థము లిమిడీ యున్నవి. కావున కష్టసాధ్యమని జంకక, మన మీసమస్యను పరిష్కరించుటకై సర్వశక్తుల నుపయో గింపవలెను. సక్రమపద్ధతులపై ఈకార్యమునకు పూనుకొనిన పక్షమున, మనకు మిక్కిలి ముఖ్యమగు నంశములు తెలిసి రాగలవు.

మానవుని వివిధకార్యకలాపములను వాని వాని ప్రాధాన్యత ననుసరించి విభాగ మొనర్చుట మన ప్రథమ కర్తవ్యము. వానిని మన మీక్రింది విధమున నిర్ణయింప నగును. (1) ఆత్మసంరక్షణకై ముఖ్యమగు కార్యములు (2) జీవితావసరములను సంపాదించుటయందు మనకుతోడ్పడి పరోక్షముగ నాత్మసంరక్షణకు తోడ్పడు కార్యకలాపములు (3) సంతానమును పెంచి, సక్రమశిక్షణ నొసంగుట కవసర మగు పనులు (4) సక్రమమగు సాంఘిక రాజకీయ సంబంధ ముల నెలకొల్పుకొనుట కవసరమగు పనులు (5) మన వ్యక్తిగతమగు కోర్కెలు, ఉత్సాహము మున్నగు వానికి తృప్తి కల్గించునట్టియు, విరామకాలమునం దుపయుక్తమగు నట్టియు కార్యవిధానములు.

పై యంశములు వాని వాని ప్రాముఖ్యత ననుసరించి క్రమముగ నమర్పబడినవని యెల్లరును సులభముగ తెలిసి కొనజాలుదురు. అనుక్షణమును ఆత్మసంరక్షణమునకై మనము కావించు కట్టుదిట్టము లితరవిషయములన్నిటికంటెను చాల

ముఖ్యమైనవి. తనచుట్టుప్రక్కలనుండు వస్తువులను, జీవజంతువులను, వాని నడవడులను, వాని మధ్య తాను నడచుకొనవలసిన పద్ధతులను, ఎరుగనట్టి మానవు డున్న యెడల ఆతడు వీధిలో కాలుపెట్టగానే తన ప్రాణము గోల్పోవుట తథ్యము. ఇతర విషయములలో నాతని కెంత పాండిత్యమున్నను అయ్యది నిరర్థకము. ఇతర విషయములలో మానవుడెంత యజ్ఞానియైనను ఆతనికి ప్రాణాపాయము తటస్థింపదు. కాని ఆత్మసంరక్షణనుగూర్చిన యజ్ఞానమాతనికి ప్రాణాంతకముగ పరిణమించును. కావున ఆత్మరక్షణ కావశ్యకమగు జ్ఞానము చాల ముఖ్యమైనది.

జీవితోపాధిని సంపాదించుకొని, ఆ విధముగ పరోక్షముగ నాత్మసంరక్షణను కావించుకొనుట కవసరమగు జ్ఞానము ద్వితీయస్థానము నాక్రమించును. దీని నెవ్వరును కాదనజాలరు. మానవుడు మొట్టమొదట తన జీవితావసరములను సంపాదింపవలయును. ఆపైన నాతడు తనకు కల్గిన సంతానమును పోషించుటకు సమర్థుడగును. కావున జనులు తమ జీవితావసరముల సాధించు పద్ధతులను మనము మొట్టమొదట చింతింపవలయును. ఆపైన సంతానసంరక్షణనుగూర్చి విచారింపనగును. ఆత్మసంరక్షణమున కర్వాత సంపాదించిన తరువాత జీవి, తన సంతానపోషణభారమును వహింపగలడు. కావున కుటుంబపోషణముకంటె ఆత్మపోషణమే ముఖ్యతర

మనియు, ప్రాణసంరక్షణము తరువాత నాత్మపోషణమే ముఖ్యముగ విచార్యమగు నర్థ మనియు తేలుచున్నది.

మానవుని క్రమవికాసము ననుసరించి చూచినయెడల మొట్టమొదట కుటుంబము లేర్పడును. ఆపైన రాజ్యము లుద్భవించును. రాజ్యములో పౌరుడగుటకుపూర్వమే మానవుడు సంతానవంతుడై, ఆ సంతానమును రక్షింపవలసినవాడగును. రాజ్యము నశించినను కుటుంబపోషణ బాధ్యత నాతడు వీడజాలడు. పౌరులు పుట్టిపెరిగినతరువాతనే రాజ్యము లేర్పడును. కావున పౌరుని బాధ్యతలకంటె జనకుని బాధ్యతలే అవశ్యచింతనీయములు. పై విషయమును నిరూపించుటకు మరియొక కారణమునుకూడ చూపవచ్చును. ఒక సంఘములోని వ్యక్తులెల్లరును సద్గుణవంతులైన పక్షమున నాసంఘ ముత్తమసంఘ మనబడును. పౌరులయొక్క నడవడిని సరిదిద్దుటకై యుత్తమకాలము బాల్యదశయేకాని ఇతరములుకావు. కావున ఒకరాజ్యముయొక్క క్షేమము కుటుంబమునందే ఇమిడియున్నట్లు చెప్పవచ్చును. కావున రాజ్యక్షేమమునకు మార్గముల నరయుటకుపూర్వము మనము కుటుంబక్షేమము నారయవలయును.

జీవితమునందలి ముఖ్యతరమైన కార్యముల నిర్వర్తించినతరువాత (అనగా జీవితోపాధిని సంపాదించుట, స్వసంతానమును రక్షించుకొనుట మున్నగునవి) మానవుడు సంగీ

తము, కవిత్వము, చిత్రలేఖనము మున్నగు ఆనందసంధా యకములగు పనులయెడ దృష్టిని మరల్చును. కావున వీని యునికి చక్కని సమాజవ్యవస్థపై ఆధారపడియుండుననుట తేటతెల్లము. సమాజమేర్పడి, చాలవరకు వృద్ధిచెందినతరు వాతకాని పై లలితకళలు పెంపొందజాలవు. అంతేకాదు. లలితకళలచే వ్యక్తీకరింపబడు భావములు సంఘముయొక్క ఆశయములు, అనుబంధములు మున్నగునవి. సంఘము కళా భివృద్ధి కవసరమగు పరిస్థితుల కల్పించును. కళయం దిమిడి యుండు భావములకును, ఆశయములకునుకూడ సంఘవికాసమే మూలము. కావున పౌరధర్మనిర్వహణముకై కావింపబడు కృషి ముఖ్యతరము. కళావికాసమున ప్రదర్శింపబడు కార్యో త్సాహము దీనితరువాత గణింపదగినది. కావున విద్యా విధానమునందు పౌరశిక్షణకు ప్రథమస్థానమును, కళాభిరుచికి ద్వితీయస్థానమును ఇచ్చుట ఉచితము.

విద్యావిధానమునందలి వివిధశాఖలకు ఈదిగువ తెలు పబడినవిధమున క్రమముగ స్థానమొసంగవలెను: ఆత్మరక్ష ణముకొరకై మనకు శిక్షణ నొసంగు విద్య, పరోక్షముగ నాత్మసంరక్షణముకొరకై చేయూతనొసగు విద్య, మాతృత్వ పితృత్వములకొరకై మనల సిద్ధముచేయు విద్య, మనల మంచి పౌరులుగకావించు విద్య, వివిధకళలయందు మనకభినివే శము కల్గించు విద్య. విద్యయందలి వివిధశాఖల నొండొంటి నుండి సంపూర్ణముగ వేరుచేయుటకు వలనుపడదు. ఈశాఖల

న్నియు ఒండొంటితో పెనవేసికొనియుండును. కావున నొక శాఖయందొసంగు శిక్షణలో ఇతరశాఖలయందలి విజ్ఞానము కొంతవరకును ఇమిడియుండును. ఈ శాఖలయందలి విజ్ఞానములో కొన్నిభాగము లితరశాఖలలోని కొన్నిఅంశముల కంటె ముఖ్యతరములు కావచ్చును. ఉదాహరణమున నొక వ్యక్తిని తీసికొందము. ఆతడు వ్యాపారవిషయమునందు మహానిపుణుడే కాని ఇతరాంశము లాతనికెంతమాత్రమును తెలియవని భావింపుము. వేరొకవ్యక్తికి ధనసంపాదనయందు సామాన్యనైపుణిమాత్రము కలదు. కాని యాతనికి తన బిడ్డలను పెంచుకొనువిధానముకూడ తెలియును. ఈయిద్దరు వ్యక్తులలో రెండవయాతని జీవితమే విజయవంతమగుననుట లో సందేహములేదు. ఒకానొకవ్యక్తి సాంఘికపౌరజీవితముంగూర్చి సమగ్రవిజ్ఞానమును సంపాదించియు, లలితకళలు, వాఙ్మయము మున్నగు వైజ్ఞానికాంశముల నేమియు నెరుంగడని తలంపుము. అట్టి యాతనికంటె వివిధవిద్యలయందు కొంచెమో, గొప్పయో తెలిసికొనిన సామాన్యుడు సుఖతర జీవితమును గడపజాలును. విద్యావిషయమున మనము నిర్వచించిన యంశములందు కొన్నిసందర్భములలో చిన్నచిన్న మార్పులు కావించుట అనివార్యము కావచ్చును. కాని మొత్తముమీద విద్యలను మనము పైన తెలిసికొన్న క్రమములో నెలకొల్పుట సరియైనపద్ధతి. జీవితరంగమునందలి మన

కార్యకలాపముల ననుసరించియే, మనవిద్యావిధానము నేర్ప రచు కొనవలెను.

జీవితరంగమందలి అన్ని శాఖలలోను సంపూర్ణమగు శిక్షణ నొసంగుటయే విద్యయొక్క లక్ష్యము. కాని ఆదర్శ మును సాధించుట కష్టసాధ్యము. కావున విద్యావిధానమం దలి వివిధశాఖలలో పరిమితప్రజ్ఞనైన మనము సాధించుటకు యత్నింపవలెను. అజ్ఞానమునందలి వివిధాంగములలో సామ రస్యముండవలెను. పై విజ్ఞానశాఖలలో నేయొక్క శాఖలో కాని రెండింటిలో కాని నిష్ణాతృత్వమును సాధించినచాలదు. ఈవిజ్ఞానశాఖలన్నిటియెడలనుకూడ మనదృష్టిని సమానముగ బరుపవలయును. వివిధాంగములయందలి భిన్నాంశముల యెడల నానివాని ప్రాముఖ్యమునుబట్టి శ్రద్ధ చూపనగును. పైన తెలుపబడిన విజ్ఞానాంగము నొకదానిని కొందరు తమకు జీవనోపాధిగ వినియోగించుకొనవచ్చును. వారిమాట యట్లుం డనిండు. సామాన్యమానవులందరునుకూడ నిత్యజీవితముతో సన్నిహితసంబంధముగల యంశములన్నిటిలో సంపూర్ణజ్ఞాన మును సాధించుట యవసరము. నిత్యజీవితముతో దూరసం బంధము[illegible]కల్గిన విషయములలో సంపూర్ణతను సాధిం పకపోయినను నష్టములేదు.

విద్యావిధానము నీ కొలతబద్దచే నిర్ణయించుటకై యత్నించుచున్న మనము కొన్ని సర్వసామాన్యమగు నంశ ముల దృష్టియందుంచుకొనుట ముఖ్యము. సంపూర్ణజీవితము

నకు దోహదమొసంగు విజ్ఞానములో కొన్ని భాగములు చాల ముఖ్యములు. మరికొన్ని ఆనుషంగికములు. కొన్ని విధములగు జ్ఞానమునందు స్వయంగతమగు మహాత్త్వముండును. మరికొన్నిటియందు మహాత్త్వ మర్థాంశమేయుండును. ఇతరములలో తాత్కాలికమగు మహాత్త్వమే కానగును. ఉదాహారణమునకు ఈ క్రింది శాస్త్రీయాంశముల గమనింపుడు: పక్షవాతము సంభవించుటకు పూర్వము దేహము మొద్దువారును; ఝల్లుమనును. నీటిలోపడి కొట్టుకొనిపోవు వస్తువులనా జలము ప్రవాహవేగము ననుసరించి ప్రతిఘటించును. క్లోరిన్ అనుపదార్థము క్రిమిసంహారకము. ఈ జ్ఞానమెల్ల కాలము లందును ఉపయోగకరమైనది. కావున దీని మహాత్త్వము స్వయంగతము. నేఁను నూరుశతాబ్దుల యనంతరమును కూడ ఈ జ్ఞానము మానవజీవితమున కుపయోగకరముగ నుండును. ల్యాటిన్ గ్రీకు భాషల నేర్పుటవలన మన (ఆంగ్ల) భాష యందు మనకు లభించు అధికతర పాండిత్యము వాంఛనీయమే కాని యిందలి మహాత్త్వ మర్థాంశము మాత్రమే. ఆంగ్లభాషను, గ్రీకుల్యాటిను భాషలు మాతృకలుగా గల యితర భాషలను, మాట్లాడు ప్రజలకు ఈ ప్రమాణిక భాషలయందు ప్రవేశ మావశ్యకము. ఆభాషలు జీవించియున్నంతకాలమే ల్యాటిను గ్రీకుల ప్రాముఖ్యత నిలచును. ఆపైన నశించును. కొందరు వ్యక్తుల పేళ్ళు, కొన్ని తేదీలు, కొన్ని ప్రాచీన సంఘటనలు, మున్నగు

వానికి మన పాఠశాలలలో చరిత్ర యను నామ మొసంగ బడుచున్నది. ఈపాఠ్యభాగము చరిత్రనామమున కనర్హము. ఇట్టి జ్ఞానమునకు గల ప్రాముఖ్యము కేవలము మన ఆచారముపైననే ఆధారపడియున్నది. మన నిత్యజీవితమునకును, ఈ చరిత్రకును ఎట్టి సంబంధమును లేదు. చరిత్రను బోధించుటలేదను విమర్శకు గురికాకుండుటకు మాత్రమే ఈ విద్య మన పాఠశాలలలో బోధింపబడుచున్నది. సమస్త మానవులకును, సర్వకాలములందును ఉపయుక్తమగు విజ్ఞానము కొన్నిజాతులకు మాత్రమే కొంత కాలము వరకును ఉపయుక్తమగు విజ్ఞానము కంటె శ్రేష్ఠతరము. కొందరు ప్రజలకు మాత్రము కేవల తాత్కాలిక ప్రయోజనముగల విజ్ఞానము చాల తక్కువ విలువగలది. కావున స్వయంగత మహాత్వము గల యంశములకు ప్రథమస్థానమును, అర్థమహాత్వముగల యంశములకు ద్వితీయస్థానమును, కేవల తాత్కాలిక ప్రయోజనముగల యంశముల కధమ స్థానమును, ఇచ్చుట సమంజసము.

ఉపోద్ఘాత పూర్వకమగు మరియొక విషయము: మనము తెలిసికొను వివిధవిషయములకు రెండు విధములగు విలువలు కలవు. ఒకటి విజ్ఞానాత్మకము, రెండవది శిక్షణాత్మకము. జ్ఞానమువలన మన నడవడి మార్పునకు లోనగును. జ్ఞానార్జనమునందు మనస్సునకు పరిశ్రమ లభించును. జ్ఞానమూలమున మానవజీవితమునకు సంపూర్ణత్వము

సిద్ధించును. మనము సాధించుజ్ఞానమునందు కొన్నివిషయము లలో స్వయంగతమగు మహాత్వముకలదు. మరికొన్నింటియం దర్థమహాత్వము మాత్రమే యుండును. వేరింటియందు తాత్కాలికప్రాముఖ్యత మాత్రమే కలదు. ఈ జ్ఞానమువలన కలుగు సత్ఫలితములు విజ్ఞానాత్మకములు, శిక్షణాత్మకములు అని రెండు తెరగులుగ నుండును.

మానవుల అదృష్టమువలన, విద్యయందలి అతి ముఖ్యమగుభాగము—అనగా మానవుని ఆత్మసంరక్షణము నకు సూటిగ సంబంధించియుండు జ్ఞానమును మనకు కలుగ జేయుటకై ఏర్పాట్లు ఇతఃపూర్వమే చేయబడినవి. ఈజ్ఞానము చాల ముఖ్యమైనది. మానవులు కావించు ఏర్పాట్లన్నియు వట్టి తప్పులతడకలు. కావున ప్రకృతిమాత పై జ్ఞానమును మనకొసంగు బాధ్యతను తాను స్వయముగ గైకొన్నది. దాదిచేతులలో పెరుగుచున్నకాలమునందే పసిపిల్లవాడు క్రొత్తవారిని చూడగనే ముఖము చాటుచేసికొని బిగ్గరగ నేడ్చును. అపరిచితుడగు వ్యక్తి తనకు శత్రుడు కావచ్చు నను భయ మీపసిబాలునియందుద్భవించినదని మనమెరుంగ వలయును. ఆ బిడ్డడు తప్పటడుగులు వేయుచున్నప్పు డే దైన నొక క్రొత్తకుక్క యాతనిని సమీపించిన పక్షమున ఆతడు చాల భయపడిపోవును. ఏదైన నత్యాశ్చర్యకరమగు దృశ్యము కాన్పించినను, శబ్దము వినబడినను ఆబిడ్డ తల్లి వద్దకు పారిపోవును. వీనివలన ఆత్మసంరక్షణమను సహజాతము

ఆతని యందు వృద్ధిచెందుచున్న దని మనము తెలిసికొనన
నగును. ఆత్మసంరక్షణమున కావశ్యకమగు జ్ఞానమును పసి
బిడ్డలు క్షణ క్షణమును కూడ సాధించుచుందురు. పడిపోవ
కుండ నిలువబడుట, ఇతరులతో ఢీకొనకుండ నడచుట,
ఏ పదార్థములు కఠినములై తాకిడివలన బాధకల్గించునో
తెలిసికొనుట, ఏ వస్తువులు భారములై దేహముపై పడి
నచో గాయములు సంభవించునో, ఏవస్తువులు తనబరువును
మోయగల్గునో ఏవి మోయజాలదో గ్రహించుట; నిప్పు,
ఆయుధములు, వాడియైన వస్తువులవలన సంభవించు ఆపద
లను గుర్తించుట, ప్రాణాపాయము, దేహబాధ మున్నగు
వానినుండి తప్పించుకొనుట మున్నగు ముఖ్యాంశములను
పసిబాలుడు ప్రతినిమిషమందునుకూడ తెలిసికొనుచుండును.
మరికొంతకాలము గడచిన తరువాత బాలుడు పెద్దవాడై
పరుగెత్తుట, చెట్లనెక్కుట, దూకుట, క్రీడారంగములో తన
శక్తిసామర్థ్యములను ప్రదర్శించుట మున్నగు కార్యము
లలో పాల్గొన జొచ్చును. అప్పు డాతని కండరములు దృఢ
మగుటయేగాక, జ్ఞానేంద్రియములు పదనువారి, తనచుట్టు
ప్రక్కల గల జీవజాలములో తానెట్లు మెలగవలయునో,
ఆతడు తెలిసికొనుటకు సమర్థుడగును. ముందు ముందు
జీవితరంగములో మన కెల్లరకును రాగల ఆపదలనుండి
తప్పించుకొను మార్గములనుకూడ ఆబాలుడు తెలిసికొనును.
జీవితమునకు పునాదివంటి ఈ విద్యావిధానము విషయమై

ప్రకృతిస్వయముగ శ్రద్ధగైకొనుచున్నది కావున మన మా యంశమును గూర్చి యెక్కువ కష్టపడనక్కరలేదు. ప్రతి బాలునికిని బాలికకును కూడ ఇట్టి అనుభవమును, ఇట్టి శిక్షణయు ధారాళముగ లభించుటకై తగిన యనుకూలతలను కల్పించుట మాత్రమే మన విధి. వివేకహీనులైన కొందరు ఉపాధ్యాయినులు తమ శిక్షణలోనున్న బాలికలను వారి కిచ్చవచ్చిన దేహపరిశ్రమాదికములలో పాల్గొనకుండ నిరోధింతురు. ఇట్లు చేయుటవలన ఆ విద్యార్థినులు ఆపద సంభవించినప్పుడు ఆత్మరక్షణము కావించుకొనుటయం దసమర్థలగుదురు.

ఆత్మసంరక్షణమున కావశ్యకమగు జ్ఞానమునందు మరికొన్ని యంశములు కూడ చేరి యున్నవి. భౌతికముగ దేహమునకు గాయములు తగులకుండగను, ప్రాణాపాయము సంభవింపకుండగను మనల మనము రక్షించుకొనుటతో పాటు, శారీరకధర్మముల నతిక్రమించుటవలన సంభవించు రుగ్మతలనుండి తప్పించుకొనుటకూడ మనకు చాల అవసరము. సంపూర్ణమగు జీవిత మనగా అకస్మాత్తుగ సంభవించు నపాయములనుండి ఆత్మసంరక్షణము కావించుకొనుట మాత్రమేకాదు. దురభ్యాసములవలన దేహారోగ్యము చెడి మనము క్రమక్రమముగ మృత్యువువాత పడకుండ మనల కాపాడుకొనుట కూడ ఇందు గర్భితమై యున్నది. దేహారోగ్యమును, బలమును నశించిన యెడల మనము మన వృత్తి

ధర్మములను కాని, పితృధర్మములను కాని, సాంఘిక ధర్మ ములను కాని సక్రమముగ నిర్వర్తించుట దుస్సాధ్యమగును. కావున ఆత్మసంరక్షణమునందలి యీ ద్వితీయాంగమునకు మొదటిశాఖకు గల ప్రాముఖ్యమే ఇంచుమించు కలదు. అందువలన ఇట్టి జ్ఞానమునకు కూడ విద్యావిధానమునం దున్నతస్థానము లభింపవలెను.

ఆరోగ్యసంరక్షణ విషయములో కూడ ప్రకృతి మనకు కొంతవరకు మార్గదర్శకమగుచున్నది. వివిధ కర్మేంద్రియానుభూతులును, జ్ఞానమును, భౌతికవాంఛలును కలసి మానవుడు ప్రకృతినియమముల కనుగుణముగ నడచు కొనునట్లు ప్రోత్సహించుచున్నవి. ఆహారాభావము, తీవ్ర మగు శీతాతపములును (ఆరోగ్యరక్షణమున కావశ్యకము లగు) ప్రేరణల మనలో కల్పించుచున్నవి. ఈ ప్రేరణల నలక్ష్యము చేయుట వలనుపడదు. మానవు లెల్లరును సహజ మగు నీప్రేరణలకనుగుణముగ వర్తించినచో ఆపదలు తొలగి పోవును. శారీరికముగ కాని, మానసికముగ కాని అలసట కలుగగానే విశ్రాంతి తీసికొనిన యెడలను, గాలిచొరని భవనములలో నివసించుటచే కల్గుశ్రమను నివారించుకొను టకై చల్లని గాలిలో తిరుగాడు నలవాట్లను చేసికొనిన పక్ష మునను, క్షుత్పిపాసలు కలుగకపూర్వ మాహారపానముల స్వీకరింపకుండిన యెడలను మన దేహారోగ్యము చాలవరకు మంచి స్థితిలోనుండును. శారీరికధర్మముల గూర్చి మనలో

చాలమంది కేమియును తెలియదు. ఇంద్రియప్రేరణల మూలమున ప్రకృతి మనకు మార్గదర్శక మగుచున్న విషయము మనము గుర్తించుటలేదు. నిజమున కీ ప్రేరణలు మనము నమ్మదగిన మిత్రములు. కాని చాలకాలమువరకును మనము వీని నుల్లంఘించిన యెడల నివి మొద్దుబారిపోవును. ఆరోగ్యరక్షణమునకై వలయు కట్టుదిట్టములు ప్రకృతియే చేసినమాట నిజమే కాని తద్విషయిక మగు జ్ఞానము లేనియెడల ప్రకృతి కావించిన ఏర్పాట్లన్నియు నిరర్థకములగును.

శారీరకశాస్త్రజ్ఞాన మెల్లవారికిని ఆవశ్యకమా కాదా యను విషయమున నెవ్వరికిని సందేహముండనక్కరలేదు. వయస్సు ముదురుచున్నకాలమందును, వార్థక్యమునందును మనలో పలువురెట్టి యారోగ్యము కల్గియుందురో యించుక గమనింపుడు. ముదిమి యందుకూడ చక్కని యారోగ్య భాగ్యము గల్గియుండు వారు మిక్కిలి అరుదు. అనుదినమును మనకు తీవ్రరోగములచే బాధపడువారో, లేక దీర్ఘరోగులో, దుర్బలులో, అకాలవృద్ధులో కానవచ్చుచుందురు. ఇట్టి వారిలో నెవరినైన మీరు ప్రశ్నింపుడు: శారీరక ధర్మముల విషయమై సరియైన జ్ఞానము వీరికి లభించియుండిన పక్షమున వీరు తమ్ము బాధించుచున్న రుగ్మతలకు గురియయ్యెడివారు కారని తెలియవచ్చును. కొందరు గుండెజబ్బుతో బాధపడుచుందురు. దీనికి కారణము కీళ్ళ జ్వరము. శీతాతపముల

నుండి దేహమును జాగ్రత్తగ రక్షించుకొనకపోవుట వలన
నీజ్వరము సంభవించును. మితిమీరి గ్రంథపఠనము చేయుట
వలన కొందరి కాజన్మము కండ్లు చెడిపోవును. మోకాలికి
దెబ్బ తగిలి బాధగ నున్నను, ఆ కాలికి విశ్రాంతి ఈయక
నడచుచు వచ్చినయెడల శాశ్వతముగ కుంటితనము వచ్చును.
మానసికకష్టము విస్తారముగ చేసిన యెడల గుండెదడ ప్రారం
భించును. కాని ఈ యంశములు పలువుర కర్థము కావు.
బలప్రదర్శనము కావింపబోయి, కాలకో చేతికో తీరని
నష్టము కల్గించుకొనువారి ననేకుల మనము నిత్యము గాంచు
చుందుము. శక్తికిమించిన పనిపాటలు చేయుటవలన శరీ
రారోగ్యము శాశ్వతముగ గోల్పోయినవా రెందరో కలరు.
దౌర్బల్యమువలన సంభవించు అనేక అల్పరోగములను మన
మనుదినమును చూచుచునే యుందుము. రోగములవలన
సంభవించు దేహబాధ, విసుగుదల, నిరుత్సాహము, ధన
వ్యయము, వ్యర్థకాలయాపనము మున్నగువానిని గమనిం
పుడు. అనారోగ్యమువలన సంభవించు ఇతర నష్టములు
కూడ పెక్కులు కలవు. దేహస్వాస్థ్యము చెడుటవలన మన
ధర్మములను మనము నెరవేర్పజాలము. తరచు మన పని
పాటలు పూర్తిగ నాగిపోవును. సర్వసాధారణముగ నవి
మనకు భారముగ తోచును. విసువుదల హెచ్చి మన బిడ్డల
పోషణను మనము సక్రమముగ చూచుకొనజాలము. పౌర
ధర్మములను నిర్వర్తించుట దుస్సాధ్యమగును. ఆహ్లాదమును

కల్గింపవలసిన సంగీతము మున్నగునవి చికాకు పుట్టించును. శారీరక ధర్మముల నతిక్రమించుట ఇంచుమించు పాపము వంటిది. ఈ పాపములలో కొన్ని మనము స్వయముగ చేసినవి. కొన్ని మన తండ్రి తాతలు చేసినవి. ఈ పాపముల వలన సంభవించు అనారోగ్యము సంపూర్ణజీవనమున కెంత భంగకరమో గమనింపుడు. అనారోగ్యమువలన జీవనము భగ్నమగును. బ్రతుకు భార మనిపించును. జీవితము సంతోషప్రదమైనదని కాని, ప్రకృతి యిచ్చిన వరమని కాని అనారోగ్యవంతుడు భావింపజాలడు.

ఇంతేకాదు శారీరక నియమముల నుల్లంఘించుట వలన దేహదార్ఢ్యము తగ్గుటయేకాక ఆయుర్దాయము కూడ క్షీణించును. ఏదైన రుగ్మత సంభవించి, దానినుండి మనము కోలుకొనిన తరువాత, దేహము సంపూర్ణముగ యథాస్థితికి వచ్చునని తలంచుట పొరపాటు. దేహయంత్రము ఒక పర్యాయము చెడిపోయిన తరువాత, అందువలన నెట్టి దుష్ఫలితములును కలుగకుండ స్థితిగతులు తొల్లింటివలెనే ఉండునని తలంపరాదు. ఇట్టి రుగ్మతలవలన దేహమునకు శాశ్వతమగు నష్టము సంభవించును. ఆ నష్ట మప్పటికప్పుడు కానరాక పోవచ్చును. కాని నష్టము మాత్రము తథ్యము. ప్రకృతి మన గుణదోషముల నతిశ్రద్ధగ లెక్కించును. ఆరోగ్యము తరచు చెడుచుండిన పక్షమున జీవితపరిమాణము తప్పక తగ్గిపోవును. ఆరోగ్యమునకు సంభవించు నిట్టి చిన్నచిన్న

ఆఘాతముల మూలముననే దేహస్వాస్థ్యము చెడి, తనువు రోగగ్రస్తమై, మానవు డకాలమరణమునకు గురి యగును. నూరు సంవత్సరములు జీవింపవలసి యుండియు, మానవులు పలువు రంతవరకు జీవింపరు. ఇది యెంతటి నష్టమో గమనింపుడు. అనారోగ్యమువలన మన జీవితములో కొంత భాగము నిరర్థక మగును. అకాలమరణము వలన జీవిత మింకను హ్రస్వ మగును. ఈ విధముగ మానవజీవితములో సగము భాగము వృథా యగుచున్నది.

ఆరోగ్యము చెడకుండ కాపాడుకొనుటలో మన కుపయోగపడుచు, ఆత్మసంరక్షణమునకై ప్రత్యక్షముగ నుపకరించు విజ్ఞానము మిక్కిలి ముఖ్యమైనది. ఇట్టి జ్ఞానము సంపాదించినంత మాత్రమున రోగములు పూర్తిగ తొలగి పోవునని చెప్పజాలము. ఆధునికనాగరకత యందలి కొన్ని లక్షణముల వలన మనము శారీరకధర్మముల నుల్లంఘింపవలసినవారమగుచున్నాము. సహజప్రేరణల ప్రోద్బలము వలన, మనవిశ్వాసములకు భిన్నముగ వర్తించి తాత్కాలిక సౌఖ్యముకొరకై భావిక్షేమమును బలియిచ్చుచుందుము. ఆరోగ్యసూత్రజ్ఞానమును సరియైనపద్ధతులపై కలుగజేసిన పక్షమున, దాని వలన నెంతో మంచికల్గును. ఆరోగ్యసూత్రములు చక్కగ గ్రహించినమీదట మనము దాని ననుసరించుట సంభవించును. ఆ పైన నియమబద్ధమగు జీవితము ప్రారంభించును. దృఢకాయము, మానసికోత్సాహమును,

జీవితానందమునకు మూలములు. పై కారణములచే శరీర ధర్మముల గూర్చియు, మనయొక్క దైనందిన విధానమును గూర్చియు తెల్పుటకు ఆవశ్యకమగు శారీరకశాస్త్రవిజ్ఞానము, సక్రమమగు విద్యావిధానములో నతి ముఖ్యమగు నొకయంగము.

నిజమునకు పైన తెలుపబడిన విషయముల నన్నిటిని సవిస్తరముగ తెలుపనవసరములేదు. వానిని సమర్థింపవలసిన యావశ్యకత అంతకుముందే లేదు. కాని పై యంశముల నపహాస్యము చేయువారు పలువురుందురు. ఏదో మూరు మూల పురాణగాథలో, లేక దేవతల వీరకృత్యములో తెలియకపోవుట అవమానకరమని తలంచు ప్రముఖులు పలువురు నేను కలరు. అట్టి పండితులు వెన్నుముక నిర్వర్తించు ధర్మము లేవియో, నాడి నిముసమున కెన్నిసార్లు కొట్టు కొనునో, ఊపిరితిత్తు లెట్లు పనిచేయునో తెలిసికొనరు. అది అవమానకరమని కూడ వారికి తోచదు. రెండువేల సంవత్సరములకు పూర్వము గ్రీకు ప్రజలలో వ్యాపించియున్న మూఢవిశ్వాసములను వీరు తమ బిడ్డలకు శ్రద్ధగ నేర్పింతురు. కాని శరీర నిర్మాణము, వివిధాంగముల ధర్మములు మున్నగు వానిని గూర్చిన జ్ఞాన మవసరమని వారికి తోచదు. అంతే కాదు. అట్టి విద్య యనవసరమనికూడ వారు తలంతురు. దీని కంతకును కాలక్రమమున నేర్పడిన ఆచారములే కారణము. విద్యావిధానమునం దుపయుక్తమగు నంశములకంటె కేవల మాలంకారికము లగువానికి ప్రాముఖ్యత హెచ్చు.

జీవనోపాధిని సంపాదించుట కనుకూలముల కల్పించి, ఆ విధముగ ఆత్మ సంరక్షణమునకు పరోక్షముగ సహాయ పడు జ్ఞానముయొక్క ఆవశ్యకతనుగూర్చి వేరుగ ప్రశంసింప నక్కరలేదు. దీని నందరును అంగీకరింతురు. మనలో చాల మంది విద్య కియ్యది ముఖ్యలక్ష్య మని భావింతురు. మానవుడు తన జీవితయాత్రను విజయవంతముగ కొనసాగించుటకై వలయు విద్య ముఖ్యాతిముఖ్య మను నంశము మనము కేవలము సిద్ధాంతరూపమున నంగీకరించుచున్నాము. కాని యెట్టి విద్యవలన నీఫలితము కల్గునో యెవ్వరును ఎరుంగరు. ప్రస్తుత విద్యావిధానములో మనము విద్యార్థులకు వ్రాతకోతలు, వాచకము, లెక్కలు మున్నగు విషయములను బోధించుచున్నాము. కాని ఇంతకు మించి మన మేమియు చేయుట లేదు. మనము బాలబాలికలకు నేర్పు విద్యలో చాలభాగము జీవనోపాధిని సంపాదించుట కుపయోగపడునది కాదు. అంతే కాదు. వృత్తి ధర్మములతో సన్నిహిత సంబంధముగల అనేకాంశములను మనము పూర్తిగా నిర్లక్ష్యము చేయుచున్నాము.

మనలో నే కొలదిమందియో తక్క మిగిలినవా రందరును వస్తూత్పాదనము, ఆ వస్తువులను కావలసినవారి కందజేయుట మున్నగు పనులలో మగ్నులై యుందురు. ఈ పనులను సక్రమముగ నెరవేర్చుటకై, ఆయా వస్తువులకు సంబంధించిన పరిజ్ఞానము మిక్కిలి ఆవశ్యకము. అనగా తాము

నిత్యమును వాడు పదార్థముల భౌతిక, రసాయనిక లక్షణ ముల నాయావృత్తుల నవలంబించువారు తప్పక తెలిసికొన వలెను. శాస్త్రీయజ్ఞానము వారికి చాల ముఖ్యము. నాగరక జీవనమునకు శాస్త్రీయవిజ్ఞానము మూలాధారము. కాని యిట్టి విజ్ఞానమునెడ మన విద్యానిపుణులు నిర్లక్ష్యతను చూపుచున్నారు. శాస్త్ర విజ్ఞానముయొక్క ప్రాముఖ్యత నెవ్వరును చక్కగ గుర్తించుట లేదు. చర్చింపబడుచున్న ఈ యంశములు మనకు సుపరిచితములు కావున వానిని మన మలక్ష్యము చేయుచున్నాము. కావున నీ వాదమును బలపర చుటకును, పాఠకుల కీ యంశముల నచ్చజెప్పుటకును విషయ ముల నన్నిటిని ఇచ్చట సూక్ష్మముగ తెల్పెదము.

యుక్తాయుక్త వివేక మెల్లవారికిని కూడ చాల అవస రము. దాని నల్లుండనిండు. ప్రతి పారిశ్రామికుడును వస్తూ త్పాదనము, వస్తువినిమయము, భావియందు వ్యాపారమును గూర్చిన పథకములు మున్నగు కార్యములలో నిమగ్నుడై యున్నప్పు డాతనికి గణితము చాల అవసరము. బుద్ధిపూర్వ కముగనో, లేక కేవల మంధప్రాయముగనో ఆత డీ జ్ఞానము నాధారముగ చేసికొని తన వృత్తియందు జయమును సాధిం చును. పారిశ్రామిక కార్యకలాపములందు గణితము చాల ముఖ్యము. ఇచ్చి పుచ్చుకొనుటలోను, అంచనాలు వేయుట లోను, వస్తువుల అమ్మకము కొనుబడిలోను, లెక్కలు వ్రాయుటలోను గణితము చాల అవసరము. ఇట్టి శాస్త్ర

# విద్య

విజ్ఞానముయొక్క ఆవశ్యకతనుగూర్చి యెవ్వరికిని విస్తరించి తెలుప నవసరములేదు.

నిర్మాణ సంబంధమగు నున్నత కళలందుకూడ గణిత శాస్త్రములో ప్రత్యేక విజ్ఞానము మిక్కిలి ఆవశ్యకము. తన బుద్ధికి తోచినట్లుగా పనులు చేసికొనిపోవు గ్రామపు వడ్రంగికిని, బ్రిటానియా వంతెనవంటి ఉత్తమ నిర్మాణమును కావించు వాస్తుశాస్త్ర నిపుణునికిని కూడ స్థలసంబంధమగు విజ్ఞానము తప్పక కావలెను. వారనుక్షణమును స్థల సంబంధముల గూర్చి యాలోచించుచుందురు. భూములను కొల్చు పర్యవేక్షకునికిని, ఆ భూములపై కట్టవలసిన భవనముల యాకృతిని సిద్ధముచేయు వాస్తుశాస్త్రజ్ఞునికిని, పునాదులు వేయించు నిర్మాతకును, రాళ్ళను చెక్కునట్టి తాపీపనివానికిని కూడ రేఖాగణిత విజ్ఞానమే మార్గదర్శకము. అయో మార్గముల నిర్మించుటలో మొదటినుండి తుదివరకు ఈ శాస్త్రము చాల ముఖ్యము. అయోమార్గముయొక్క పటములు, అందలి విభాగములు సిద్ధముచేయుటలోను, గుర్తుగా కొయ్యలు నాటుటలోను, కట్టలు మున్నగువానిని నిర్మించుట కవసరమగు క్షేత్రగణితములోను, వంతెనలు, వారధులు, తూములు, రైలుస్టేషనులు మున్నగువాని స్వరూపముల వ్రాసి, వానిని కట్టుటయందును రేఖాశాస్త్రము తప్పక తెలిసియుండవలెను. అదేవిధముగ నౌకాశ్రయములు, నౌకానిర్మాణ కేంద్రములు, వారధిస్తంభములు, మున్నగు వివిధ

నిర్మాణాత్మక కార్యములందును మన కీ విజ్ఞాన మావశ్య కము. ఇట్టి నిర్మాణములు సముద్ర తీరములందును, భూగర్భ ములోని గనులవద్దను తరచు కానవచ్చుచుండును. వ్యవ సాయదారులు తమ పొలములకు సంబంధించిన పిల్లకాలువల నిర్మించుటలో మట్టముల కొల్చుట పరిపాటియైనది. అనగా వారికి కూడ రేఖాగణిత మవసరమని తేలుచున్నది.

ఆపైన సిద్ధాంతాత్మకములును, ప్రయోగాత్మకము లును అగు శాస్త్రములను పరీక్షింతము. వీనిలో కూడ యంత్రశాస్త్ర సహాయమువలననే నేటి మన పరిశ్రమలు సాధ్యమగుచున్నవి. యంత్రముల మూలముననే నేడు వివిధ మగు పరిశ్రమలు సాగుచున్నవి. ఉదాహరణముగ నీవు నిత్యము తినెడి రొట్టెనుగూర్చి ఆలోచింపుము. ఈ ధాన్యము పండిన పొలములోగల అనవసరమగు నీటిని తోడివేయుటకై యంత్రనిర్మితము లగు నిటుకలు కావలసి వచ్చెను. నీరు తోడివేసిన పైన భూమి వ్యవసాయయోగ్య మయ్యెను. భూమిని దున్నుటకు మరియొక యంత్రము సాయపడెను. పండిన గోధుమపంటను కోసి, కుప్పలను నూర్చి, ధాన్య మును చేటలతో చెరుగుటకై మరియొక యంత్ర మవసర మయ్యెను. గోధుమలను విసరి, జల్లించుటకు కూడ యంత్రము కావలెను. ఈపిండితో బిస్కట్లు చేయుట కూడ యంత్ర సహాయముననే సాగుచున్నది. నీవు కూర్చుండియున్న గదిని చక్కగా పరిశీలింపుము. మీయిల్లు క్రొత్తగా నిర్మింపబడిన

పక్షమున, గోడలలోని ఇటుకలన్నియు యంత్రములలో తయారైనవే. నేలపైగల బల్లకూర్పు అంతయును యంత్ర సహాయమునకోసి చిత్రికపట్టినదే. మీయింటిలోని బీరువాలు, మేజాలు మొదలగు వానిని నునుపెక్కించుట, కుర్చీల కాళ్లను సిద్ధముచేయుట, మీవద్దగల తివాసీలు, తెరలు తయారుచేయుట మొదలగు పనులన్నియు యంత్ర సహాయమునసే సాగినవి. నీవు ధరించిన వస్త్రులు–తెల్లనివి, అద్దకపు పనిగలవి–అన్నియుకూడ యంత్రములపై తయారై, యంత్రములచే కుట్టబడినవే. నీవు చదువుచున్న పుస్తకములోని కాగితములను సిద్ధముచేసిన దొక యంత్రము. అందలి అక్షరముల నచ్చువేసినది మరియొక యంత్రము. వివిధవస్తువులను భూమిపైనను, సముద్రముపైనను దూరప్రాంతములకు గొనిపోయి, ప్రజానీకమున కందజేయునవికూడ యంత్రములే. యంత్రశాస్త్ర పరిజ్ఞానమును మన ప్రయోజనముల సాధించుటకై సక్రమముగ నుపయోగించినచో కార్యసిద్ధియు, లేనిచో కార్యభంగమును సంభవించును. తాను వాడుచున్న పదార్థముల బలమును చక్కగ గుర్తింపకుండ వాస్తుశాస్త్రజ్ఞుడేదైన వంతెనను నిర్మించిన పక్షమున నది కూలిపోవును. యంత్రముల లక్షణములను బాగుగ తెలిసికొనకుండ పనిచేయు పారిశ్రామికుడు సంఘర్షణ, జడత్వము మున్నగు సిద్ధాంతముల నెరింగి పనిచేయు పారిశ్రామికునితో పోటీ చేయజాలడు. పాతపద్ధతులపై ఓడలు నిర్మించు నావి

కుడు, శాస్త్రీయపద్ధతుల ననుసరించి తరంగరేఖా సూత్ర
ముపై ఓడలు నిర్మించు వాని కంటె తప్పక వెనుకపడును.
రెండు జాతులొండొంటితో పోటీ చేయుచున్నప్పుడు
ఎక్కువ నేర్పుగల జాతి విజయమును పొందును. జాతుల
యొక్క అదృష్టము నేడు యంత్రశాస్త్రపరిజ్ఞానముపై నాధార
పడుచున్నది.

సిద్ధాంతాత్మకములు, ప్రయోగాత్మకములు నగు
శాస్త్రములు కొన్ని స్థూలశక్తులతో సంబంధముగలవి.
వీనిలోని ఉన్నతశాఖలు సూక్ష్మమగు అణువుల గూర్చి
వ్యవహరించును. ఈశాస్త్రములు మన నిత్యజీవితమందెంతో
ఉపయోగకారులుగ నుండును. పై రెండు విధములగు శాస్త్ర
ముల సంయోగమువలన ఆవిరి యంత్ర ముద్భవించినది.
ఇయ్యది కొన్నివేలమంది మానవులు చేయగల పనిని
తానొక్కటియే నిర్వర్తించును. ఉష్ణతనుగూర్చి వివరించు
పదార్థవిజ్ఞానశాఖ మనకింధనము నెట్లు పొదుపుగ వాడుకొన
వలయునో నేర్పుచున్నది. కొలిమినూదుటలో చల్లని గాలికి
మారుగ వేడిగాలి నుపయోగించినందున నెక్కువ లోహ
మును కరుగవచ్చునని తెలియవచ్చినది. గనులలోనికి శుభ్ర
మగు వాయువును పంపుమార్గము కూడ మనకు తెలియ
నైనది. రక్షితదీపమును ఉపయోగించుటవలన గనులలో
ప్రేలుడు ప్రమాదములు తొలగినవి. ఉష్ణమాపకము సహా
యమున మన మెన్నియో పనులను సక్రమముగా చేయగల్గు

చున్నాము. పదార్థవిజ్ఞానశాస్త్రము నందలి కాంతిశాఖ మూలముగ మన కనేక నూతనాంశములు తెలియవచ్చినవి. తన్మూలముగ వృద్ధులకును, దృష్టిలోపము గలవారికిని దృష్టి భాగ్యము కల్గుచున్నది. దుర్భిణీయంత్రముయొక్క సాయముచే రోగములకు మూలమైన అనేక సూక్ష్మజీవులను కనుగొనగల్గుచున్నాము. వివిధపదార్థములలోని కత్తినిగుర్తించుచున్నాము. ఉత్తమమగు దీపగృహములను నిర్మించి, ఓడలు పగిలిపోకుండ కాపాడుచున్నాము. విద్యుచ్ఛక్తి, అయస్కాంతశాస్త్రముల యందలి పరిశోధనలవలన నావికాయంత్రము సృష్టింపబడినది. దాని సహాయముచే మన మనేక వేలప్రయాణీకులను, వెలలేని వస్తుజాలమును ఆపదలనుండి కాపాడుచున్నాము. విద్యుచ్ఛక్తి మూలమున గ్రంథముల అచ్చుకూడ సాధ్యమగుచున్నది. ఈవిధముగ అనేక శాస్త్రములు కళలు సంరక్షింపబడుచున్నవి. శాస్త్రపరిశోధనల వలననే తంత్రీమార్గముల నిర్మాణము సాధ్యపడినది. భావికాలమున వ్యాపారనిర్వాహణమునకును, రాజకీయ వ్యవహారముల జరపుటకును ఇయ్యది సాధనము కాగలదు. వంటశాలలోని క్రొత్తరకపు పొయ్యిదగ్గరనుండి, చిత్తరువులను పోల్చుట కుపయోగపడు జంటదుర్భిణి వరకును గల అనేక నూతనసాధనములు పదార్థవిజ్ఞానశాస్త్రమందు కావింపబడిన పరిశోధనలవలననే మనకు లభ్యమగుచున్నవి.

రసాయనశాస్త్రముయొక్క ఉపయోగము లింతకు

కొంచి యున్నవి. రసాయనశాస్త్ర సిద్ధాంతముల చక్కగ నెరింగినయెడల బట్టలను చలువచేయుట, రంగులు వేయుట, అద్దకపుపని మున్నగు నవి బాగుగ జరగును. లేనిచో నవి చెడిపోవును. రాగి, తగరము, తుత్తునాగము, సీసము, వెండి, ఇనుము మున్నగువానిని కరగుటకై రసాయనశాస్త్ర జ్ఞాన మావశ్యకము. చక్కెరను శుభ్రపరచుట, గ్యాసును సిద్ధము చేయుట, సబ్బులు తయారుచేయుట, గాజు, చీనామట్టి పరిశ్రమలు మున్నగునవి పై శాస్త్రములతో పరిచయము లేని యెడల సాధ్యము కాదు. రసాయనశాస్త్ర జ్ఞానము సంపాదించిన బట్టీ యజమాని తన పరిశ్రమశాలయందు సారాయమును మాత్రమే కాక ఆమ్లములనుకూడ సిద్ధపరచును. ఆతని లాభనష్టము లీ యంశముపై ఆధారపడును. మద్యములను తయారుచేయువారు తమ వ్యాపారస్థితి ననుసరించి, రసాయనశాస్త్రజ్ఞు నొక్కనిని తమవద్ద కొలువుంచుకొనుట కూడ కద్దు. దీనివలన వ్యాపారి కెంతయో లాభము కల్గును. ఈనాటి ప్రతిపరిశ్రమకునుకూడ రసాయనశాస్త్ర మధిష్ఠాన దైవముగనున్నది. వ్యవసాయము లాభదాయకము కావలెననినచో రసాయనశాస్త్రముయొక్క సహాయ మవసరము. భూములు, ఎరువులు వీనిని పరీక్షించుట, వానిని తగు విధముగ మార్చువిధానము, రసాయనికములగు ఎరువుల వాడకము, పురీషములనుండి కృత్రిమపు టెరువులు సిద్ధపరచి వానిని వాడుట మున్నగు విశేషములన్నియు నీశాస్త్ర

విజ్ఞానమువలన తెలియనగును. కావున వ్యవసాయదారుడు వీని నెరుంగుట మంచిది. ఒరపిడినిప్పుపుల్లల పరిశ్రమ, మల పదార్థములను శుభ్రపరచుట, ఛాయాచిత్రములు తీయుట, తుక్కుపదార్థములనుండి సువాసన ద్రవ్యములను సిద్ధము చేయుట మున్నగు ఎన్నో పరిశ్రమలలో రసాయనశాస్త్రము యొక్క ప్రభావము తప్పక చూపట్టుచున్నది. కావున పరిశ్రమలతో ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధము గల వారందరికిని రసాయనశాస్త్రజ్ఞాన మవశ్యము సాధింప దగినది.

ఉపలక్షితశాస్త్రములలో మనము మొట్టమొదట ఖగోళశాస్త్రమును గూర్చి విచారింపవలెను. ఈ శాస్త్రవిజ్ఞానము వలననే మన దేశీయుల నౌకానిర్వాహణసామర్థ్య మపారముగ వృద్ధిచెంది మన విదేశవ్యాపార మెన్నోరెట్లు పెంపుచెందినది. ఈ వ్యాపారమే మనప్రజలలో పలువురికి జీవనోపాధిని కల్పించుచున్నది. మన మనుదినమును వాడు వస్తువులును, భోగ్యపదార్థములును ఇందు మూలముననే లభించుచున్నవి.

భూగర్భశాస్త్రవిజ్ఞానమువలనకూడ పరిశ్రమాభివృద్ధికి దోహదముకల్గును. ఇప్పు డినుము మనకు గల భాగ్యములో నొక ముఖ్యాంగము. మనదేశమందలి బొగ్గు ఎంతకాలము వరకు లభింపగల దనునది మన కొక ముఖ్యసమస్య. మనదేశములో గనులకు సంబంధించిన జ్ఞానమును వ్యాప్తి చెందించు

టకు కళాశాలలు వెలసినవి. భూగర్భపరిశోధనకై ఏర్పాట్లు జరిగినవి. కావున భూగర్భపరిశోధనము మన భౌతికాభివృద్ధి కెంతయో ఆవశ్యకమని వేరుగ తెలుపనక్కరలేదు.

ఇక జీవశాస్త్రమునుగూర్చి విచారింతము : ఈ శాస్త్ర విజ్ఞానముకూడ ఆత్మరక్షణకొరకై పరోక్షముగ సహాయ పడుచున్నది. ఈ శాస్త్రమునకు పరిశ్రమలతో సంబంధము లేనిమాట నిజము. కాని పరిశ్రమలలో అతి ముఖ్యమైన ఆహారపరిశ్రమతో దీనికి మిక్కిలి సన్నిహిత సంబంధము కలదు. వ్యవసాయమునకు వృక్ష జంతు జీవితములతో మైత్రి కలదు. కావుననే వృక్ష జంతు శాస్త్రములు వ్యవసాయపద్ధ తులకు పునాదిగ నేర్పడియున్నవి. జీవశాస్త్రమునందలి సత్యము లొక విజ్ఞానశాఖగ నేర్పడుటకు పూర్వమే, కేవలము ఊహాలవలన వాని ననేకులు వ్యవసాయదారులు తెలిసికొని, వారి ననుసరించుచుండిరి. ఉదాహరణమునకు కొన్నివిధము లగు మొక్కలకు కొన్ని ప్రత్యేకమగు యెరువులు కావలె ననియు, ఒక భూమిలో కొన్నిపంటలను పండించిన పక్షమున నా భూమి ఇతరసస్యముల సేద్యమున కనర్హమగు ననియు, గుఱ్ఱములకు పుష్టికరమగు నాహార మీయని పక్షమున నవి చక్కగ పనిచేయజాలవనియు, కొన్ని పరిస్థితులవలన ఆవు లకును, గొఱ్ఱెలకును తెగుళ్ళు సంభవించుననియు రైతులు చాలకాలమునుండియే యెరింగి యుండిరి. దైనందిన జీవిత ములో సంపాదించిన జ్ఞానమువలనను, జంతు సస్యపోషణలో

సంపాదించిన అనుభవమువలనను, వ్యవసాయదారులు తమ కార్యకలాపముల సాగించుకొందురు. ఇదియే వారికిగల జీవ శాస్త్రి పరిచయము. స్వల్పమును అనిశ్చితమునైన ఈపాటి జ్ఞానమువలననే రైతులు తమ వృత్తిని విజయవంతముగ సాగించుకొన గల్గుచున్నప్పుడు, వారికి సంపూర్ణమును, నిశ్చితమునగు జీవశాస్త్రి విజ్ఞానము లభించిన పక్షమున నిక తెలుపవలసిన దేమి? జీవశాస్త్రి విజ్ఞానము సంపూర్ణముగ లేని ఈనాడు కూడ రైతుల కీ శాస్త్రిమువలన నెంతో లాభము కల్గుచున్నది: జంతువుల దేహములో నెంత వేడిమి ఉత్పన్నమైన నంతపదార్థము వ్యర్థమగుచున్నదనుట యొక ముఖ్య శాస్త్రీయ విషయము. దేహమందలి యుష్ణత యెంత తక్కువ వ్యయపడిన నంత ఆహారపదార్థమును మనము పొదుపు చేయుచున్నామని తెలిసికొనవలెను. జంతువులను వెచ్చని కొట్టములందు కట్టివేసి కాపాడినయెడల వానిమేత కొంతవరకు తగ్గును. ఈ యంశమును పశుపోషణ కావించువారు తెలిసికొనియే యున్నారు. ఇదే విధముగ ఆహార పదార్థములలో మార్పుకూడ అవసరము. భోజనపదార్థములోను, వ్యంజనములలోను మార్పు చేయుచుండుటవలన దేహమునకు పుష్టి సంభవించుటయేకాక ఆహారము సులభముగ జీర్ణమగునని శారీరకశాస్త్రిపండితులు సల్పిన ప్రయోగములవలన తెలియవచ్చినది. ప్రతి సంవత్సరమును వేల కొలది గొఱ్ఱెలు 'వణుకు' అను వ్యాధివలన మరణించు

చున్నవి. ఒకవిధమగు క్రిమి ఆ జంతువుల మెదడులో ప్రవేశించి దానిని దొలుచుటవలన గొఱ్ఱెలు చనిపోవుచున్నవి. ఈ రోగము సంభవించినప్పుడు పురుగు నెలకొనియున్న ప్రదేశమున పుఱ్ఱె మెత్తబడును. ఈ గుర్తునుబట్టి క్రిమిని వెలుపలికి లాగివైచినపక్షమున గొఱ్ఱె ప్రాణము రక్షింపబడును. వ్యవసాయదారులు జీవశాస్త్రమున కెంతగా ఋణపడియున్నారో చూచితిరా !

పరిశ్రమలలో జయమును సాధించుటకై సాంఘిక శాస్త్రవిజ్ఞానముకూడ చాల అవసరము. తమ తమ వ్యాపారములకు సంబంధించిన నిర్ణయములను కావించుటకుపూర్వము కొందరు బేహారులు అర్థము యొక్క చలామణీని పరీక్షింతురు; మరికొందరు ధరలను పరిశీలింతురు; ఇంకను కొందరు ధాన్యములు, ప్రత్తి, చక్కెర, సిల్కు మున్నగు వస్తువుల యుత్పత్తి నంచనా వేయుదురు; యుద్ధప్రారంభమునకుగల యవకాశముల విమర్శింతురు; వీరందరును కూడ ఒక విధముగ సంఘపుస్థితిగతులను పరిశీలించు విద్యార్థులని తెల్పుట తప్పుకాదు. వీరు సంపాదించు జ్ఞానమూహాలపై యాధారపడి, లోపభూయిష్ఠమై యుండుననుట నిజమే కాని వారికి వారి వారి కార్యకలాపములలో సిద్ధించు లాభనష్టములు వారు సాంఘికస్థితినిగూర్చి కావించుకొను నిర్ణయముల గుణదోషములపై ఆధారపడియుండును. పారిశ్రామికులు తా ముత్పత్తికావించు వస్తువులకు సంఘములో గల గిరాకీని

బట్టియు, అనేక ఇతర పరిస్థితులను, సంఘవ్యాపారములను బట్టియు ఉత్పత్తిని నిర్ణయింతురు. చిల్లరవ్యాపారమును శావించువారుకూడ ఇట్టి పద్ధతినే అవలంబింపవలెను. తాను అమ్మెడి వస్తువుల టోకు ధర, గిరాకీయును ముందు ముందు ఎట్లుండునో చక్కగ గుర్తించిన యెడల ఆవర్తకుని వ్యాపారము లాభదాయకముగ సాగును. ఒకానొక సంఘములో వ్యాపారము సాగించువారు ఆ సంఘధర్మముల యందలి విశేషములు చక్కగ గుర్తించుట యెంతయో అవసరము.

కావున వస్తువుల యుత్పత్తి, మారకము, పంపకము మున్నగు కార్యకలాపములలో నిమగ్నులై యున్న వారికి శాస్త్రీయవిజ్ఞానమందలి యొక శాఖయందో, మరొకశాఖ యందో పరిచయముండుట యెంతో ఆవశ్యకము. పరిశ్రమలలో నేదైన యొకదానితో ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధముగల ప్రతివారికిని ఆయాపదార్థములకు చెందిన గణిత, పదార్థవిజ్ఞాన, రాసాయనిక లక్షణముల నెరుంగుట తప్పనిసరియగును. ఇట్టివారికి జీవశాస్త్రముతో కూడ పరిచయముండుట అవసరము. సాంఘికశాస్త్రవిజ్ఞానము వీరి కత్యంతముఖ్యము. జీవనోపాధిని సంపాదించుట యనగా పరోక్షముగా నాత్మసంరక్షణ శావించుకొనుటయే కాని వేరుకాదు. మనము పైన తెల్పిన శాస్త్రములలో కొన్నిటిని కాని అన్నిటినికాని నేర్చిననాడు మానవుడు జీవనోపాధిని సంపాదించుకొనుటలో చక్కగ కృతకృత్యుడగును.

ఈలక్ష్యమును సాధించుటకై మనకు సక్రమమైన శాస్త్రీయ విజ్ఞానమే కావలెనను నిర్బంధములేదు. ఆ జ్ఞానము కేవలము అనుభవజన్యమగు సామాన్యజ్ఞానమైనను సరే. దానివలన మానవుని జీవితము విజయవంతముగ సాగగలదు. మన మేదైన నొకవృత్తిని నేర్చుకొనునప్పుడావృత్తియందు గర్భితమైయున్న శాస్త్రమును నేర్చుచున్నామని తెలుపనగును. కావున జీవితసాఫల్యము కొరకై శాస్త్రీయవిజ్ఞానము తప్పక కావలెనని తేలుచున్నది. అనుభవజన్యజ్ఞానముకంటె క్రమబద్ధమగు శాస్త్రీయవిజ్ఞానము సర్వవిధముల శ్రేష్ఠమైనది. తానవలంబించు వృత్తినిగూర్చియు, అందలి సంఘటనలకుగల కార్యకారణసంబంధములను గూర్చియు చక్కగ తెలిసికొన దలచిన ప్రతి వ్యాపారియు శాస్త్రీయజ్ఞానమును సంపాదించితీర వలెను. ఈ నాడుసమిష్టిపెట్టుబడిదారీపద్ధతి విస్తారముగ వాడుకలో నున్నది. కార్మికులు తక్క మిగిలిన వారందరును ఏదో యొక పరిశ్రమయందు పెట్టుబడిదారులుగ సంబంధము కల్గియున్నారు. ఇట్టి వారికి తమ పరిశ్రమతో మాత్రమే కాక ఇతర పరిశ్రమలతో కూడ కొంచెమో గొప్పయో మైత్రి యుండకపోదు. ఈ యితర పరిశ్రమలకు చెందిన శాస్త్రీయ విజ్ఞానము సాధించిననాడు మనకు కల్గులాభములు వృద్ధిచెందును; లేనిచో క్షీణించును. ఉదాహరణముగ గనులను త్రవ్వించు నొక కంపెనీ వ్యవహారముల పరిశీలింతము: ఈ కంపెనీలోని వాటాదారులలో ఎవ్వరికిని ఈ పరిశ్రమను

గూర్చిన శాస్త్రీయజ్ఞానము లేనందున, భూమిపొరలలో ఎఱ్ఱ రంగుగల పాత ఇసుకరాయి వెల్వడిన యెడల దాని క్రింద రాక్షసిబొగ్గు లభింపదను సంశయము తెలియలేదు. ఈ అజ్ఞానము వలన ఆ కంపెనీకి చాల నష్టము సంభవించెను. ఆవిరిసహాయము లేకుండగనే నిరంతరము తిరుగుచుండు యంత్రములను నిర్మింపవలయునని కొందరు పెట్టుబడిదారు లిటీవల యత్నములు సల్పిరి. కాని ఈ వ్యాపారులకు శక్తికి సంబంధించిన నిక్షేపక సమానీకరణ సిద్ధాంతములు చక్కగ తెలిసిన పక్షమున వారిట్టి వ్యర్థప్రయత్నముల పొంతకు పోక తమ ధనమును రక్షించుకొనగల్గెడివారు. నూతనయంత్రములను కనుగొనుటకై అనుదినమును ఎవ్వరో యొకరు ప్రయత్నములు సాగించుచున్నారు. శాస్త్రీయవిజ్ఞాన మించుకయైనను కలవారీ వ్యర్థసమారంభముల పొంతకు పోరుకదా? మన దేశమందలి ప్రతి ప్రదేశమునందును కూడ ప్రజలు ఏవో అసాధ్యకార్యముల సాధించుటకై ప్రయత్నముల సల్పి తమ ధనమును పోగొట్టుకొనుచున్నారు.

శాస్త్రీయవిజ్ఞానము లేనికారణమున నేడు పలువురు మానవులు అనేకసందర్భములలో విస్తారమగు ధననష్టమునకు గురియగుచున్నారు. శాస్త్రవిజ్ఞాన శూన్యతవలన మున్ముందు ఇంతకు మించినట్టి నష్టము లింకను తరచుగ సంభవింపగలవు. ఉత్పత్తిదారు లొండొరులతో పోటీపడి ఉత్పత్తివిధానముల శాస్త్రీయవిజ్ఞానముతో ముడిపెట్టగలరు. భావికాలమున సమిష్టి

పెట్టుబడిదారీపద్ధతి తప్పక వ్యాప్తిచెందగలదు. వీని యభి వృద్ధితోపాటు శాస్త్రీయవిజ్ఞానావశ్యకత కూడ తప్పక హెచ్చుగలదు. మన జీవితావసరములకు మిక్కిలి ఆవశ్యక మైన ఇట్టి శాస్త్రీయవిజ్ఞానమును, మన నేటిపాఠశాలలలోని విద్యావిధానము పూర్తిగ నలక్ష్యము చేయుచున్నది. కాని పాఠశాలలలో విద్యాభ్యాసము పూర్తియైనవెనుక మన యువకులు తమకు వీలైనంతవరకు శాస్త్రజ్ఞానమును సాధించు చున్నారు. లేనియెడల మన పరిశ్రమలన్నియు తప్పక క్షీణించిపోవును. అనేకతరములనుండి మానవు లిట్టి శాస్త్రీయ జ్ఞానమును సంపాదించి, ప్రభుత్వేతరసంస్థల మూలమున దానిని ప్రజలలో వ్యాప్తి నొందించి యున్నారు. లేనిచో మన దేశమున పరిశ్రమలు నెలకొనెడివేకావు. ఆంగ్ల ప్రజలు మన ప్రభుత్వపాఠశాలలలో గరుపబడు విద్యపై మాత్రమే పూర్తిగ ఆధారపడియుండిన యెడల, వారు జమీందారీ యుగమునందువలెనే మిక్కిలి వెనుకబడి యుండెడివారు. ప్రకృతిశాస్త్రసూత్రముల చక్కగ నవగాహనచేసికొనిన కారణమువలన మనము భౌతికశక్తులను వశపరచుకొని వానిచే మన పనిపాటలు చేయించుకొనుచున్నాము. కొన్ని శతాబ్దు లకు పూర్వము రాజాధిరాజులకు కూడ లభ్యపడని సౌఖ్య ములు నేడు సామాన్యుడగు కార్మికునికి కూడ లభించు చున్నవి. కాని ఈ యభివృద్ధి ప్రభుత్వపాఠశాలలలో నొసంగ బడు శిక్షణావిధానమువలన సంభవించినదని తెల్పుట కెంత

మాత్రమును సావకాశము లేదు. మనజాతిని నేటి అత్యున్నత స్థితికి గొనివచ్చినట్టియు, మన యునికికి మూలకారణమైనట్టియు శాస్త్ర విజ్ఞానమును మన ప్రజలు దేశమునందలి మారుమూలలందు సాధించినారు. ఇది యిట్లుండగా మన ప్రభుత్వవిద్యాసంస్థలు నిర్జీవమైన కొన్ని సూత్రములపట్టుకొని ప్రాకులాడుచున్నవి.

మానవజీవితమందలి మూడవశాఖనుగూర్చి యిప్పుడు చర్చింతము. దీని విషయమై మన మెట్టి శ్రద్ధను చూపుచుండుటలేదు. ఏవైన కొన్ని విచిత్రపరిణామముల వలన మన నాగరకతకు సంబంధించిన యితరచిహ్నము లన్నియు నశించి, మనపాఠశాలలయందు వాడబడు పాఠ్యపుస్తకములును, మనకళాశాలా విద్యార్థులు వ్రాసెడి పరీక్షాపత్రములును మాత్రమే భావితరముల వారికి లభించుననుకొనుడు. భావితరమునాటి పురాతత్త్వపరిశోధకులు మన పుస్తకములను చదివి మిక్కిలి యాశ్చర్యపడుటయే కాక, ఈ తరము వారి కెవ్వరికిని సంతానవంతులు కావలెనను ఇచ్ఛయే లేదు కాబోలునని భ్రమపడుదురు. "ఈపాఠ్యప్రణాళిక ఆజన్మబ్రహ్మచారులకై యుద్దేశింపబడి యుండవచ్చును. ఇందు అనేక విషయములగూర్చిన సవిస్తరమగు నేర్పాట్లుకలవు. సమకాలీనములును, ప్రాచీనములునగు జాతుల చరిత్రను గూర్చి వీరు ప్రత్యేకశ్రద్ధ వూనినారు. కాని స్వభాషలో విద్యాభ్యాసము చేయవలసిన యవసరము వారికి లేనేలేదు

కాబోలు. సంతానపోషణనుగూర్చి వీరి పుస్తకములలో నెట్టి ప్రశంసయును లేదు. వీరు మానవుని కతిముఖ్యమగు నీబాధ్యతను నిర్వర్తించుటకై తగిన శిక్షణ నొసంగవలయునని యెరుంగజాలనంతటి అవ్యక్తులు కాజాలరు. బహుశః ఈ విద్యావిధాన మా కాలమునాటి యొక విరాగి సంఘము కొరకై యుద్దేశింపబడి యుండవచ్చును.'' అని భావి యుగమునాటి పరిశోధకు లూహింతు రని నా దృఢ విశ్వాసము.

మానవ జీవితము నందలి సౌఖ్యము, నైతికోన్నతి లేక పతనము ననునవి మన సంతానమును పెంచెడి పద్ధతుల పైననే ఆధారపడియుండును. కాని మున్ముందు సంతానవంతులు కాగల మన విద్యార్థులకు తమ బిడ్డల పోషణను గూర్చిన యొకించుక శిక్షణకూడ యొసంగకపోవుట ఆశ్చర్యకరముకాదా? భావితరమువారి క్షేమసౌఖ్యములను అర్థరహితమగు నాచారములు, తాత్కాలికమగు మన కోర్కెలు, మోజులు, అజ్ఞానులైన దాదులు ముదిమిచే మతి చెడిన అమ్మమ్మల సలహాలపై విడచిపెట్టుటకంటె ఘోర కార్య మేదియుండగలదు? ఎవ్వరైన వర్తకుడు సామాన్యమగు గణితము, జమాఖర్చులు వ్రాసికొనుట మున్నగు నంశములను తెలిసికొనకుండ వ్యాపారరంగములోనికి దిగిన యెడల, మన మాతని మూర్ఖత్వమున కచ్చెరువంది, ఆతనికి సర్వనాశనము తప్పదని తలంతుము. శారీరకశాస్త్రము

నభ్యసింపకుండగనే ఎవ్వడైన శస్త్రవైద్యము చేయుటకు పూనుకొనిన పక్షమున ఆతని దుడుకుతనమునకు మన మాశ్చర్యపడుదుము. ఆతని రోగులను చూచి జాలిపడుదుము. కాని శిశుసంరక్షణమునందిమిడియున్న శారీరక, మానసిక నైతిక సూత్రముల నించుకయును తెలిసికొనకుండ బిడ్డలను పెంచుటయను కష్టసాధ్యమగు బాధ్యతను తమపై వేసికొనెడి తల్లిదండ్రులను గాంచి మన మాశ్చర్యపడము. వారి భావిసంతానముపై జాలిచెందము.

వేలకొలది శిశువులు ప్రతి సంవత్సరమును మరణించుచున్నారు. సజీవులైయున్న బిడ్డలలో లక్షలకొలది దుర్బలులై యుందురు. కోట్లకొలది అల్పవయస్కులు నిజముగ పొందవలసిన దేహసౌష్ఠవము లేకుండ నవయుచుందురు. ఈ విషయముల గాంచినయెడల జీవితసూత్రముల నెఱుంగని తల్లిదండ్రులవలన సంతానమున కెట్టి ఘోరమగు నష్టము సంభవించుచున్నదో మీరు గుర్తింపగలరు. మన మవలంబించుచున్న పోషణావిధానము వలన శిశువుల భావిజీవితమునకు లాభమును నష్టమును సంభవించునని యెరుంగుడు. మన మీ సందర్భమున నవలంబించు పద్ధతులు సకృత్తుగ మాత్రమే సక్రమములుగా పరిణమించును. సర్వసాధారణముగ నవి నష్టప్రదములే యగుచున్నవి. శిశుపోషణ విషయమై నేడు అవలంబింపబడు అశాస్త్రీయములును, అర్థవిరహితములు నగు పద్ధతులవలన ఎంతటి నష్టము సంభవించు

చున్నదో చింతింపుడు. ఒక చిన్నపిల్లవానికి దేహమునకు తగినంత వెచ్చదనము నీయజాలనట్టియు, శరీరమునంతను చక్కగ కప్పనట్టియు కురుచదుస్తులను వేసి ఆడుకొనుటకు బయటకు పంపినయెడల ఆతని దేహము చలిచే కందిపోవును. దీనివలన ఆ బాలుని భావిజీవితము రోగగ్రస్తము కావచ్చును; లేదా అతడు తగినంత ఏపుగ పెరుగకపోవచ్చును; లేదా బలహీనుడు కావచ్చును; లేదా పెద్దవాడైన తరువాత తగినంత దేహదార్ఢ్యము లేనివాడు కావచ్చును. ఇయ్యవి ఆతని భావిసౌఖ్యమునకును, జీవితసాఫల్యమునకును అవరోధకములుగ పరిణమించునుగదా! చిన్నబిడ్డల కెల్లప్పుడును ఒకేవిధమగు ఆహారము నిచ్చుచుండినను, లేక వారికి తగినంత పుష్టికరమైన ఆహార మొసంగకపోయినను, భావికాలమున వారు పెద్దవారై స్త్రీపురుషుల దశను పొందినప్పుడు వారికి సంపూర్ణమగు దేహబలము కాని, కార్యసాధన కౌశల్యము కాని లభింపదు. ఇది తథ్యము. బాలబాలికలను వారి కిష్టమువచ్చినట్లు కేకలు వేయుచు ఆడుకొననీయక పోయినను, చలికాలములో అవసరమగు వెచ్చనిదుస్తులు లేనికారణమున వారిని నిర్బంధముగ నింటిలో కూర్చుండ బెట్టినను, వారు ఎదుగవలసినంత చక్కగను, దృఢగాత్రులుగను ఎదుగరు. తమ కుమారులును, కుమార్తెలును దుర్బలులుగను, రోగగ్రస్తులుగను పరిణమించినయెడల అయ్యది తమ దురదృష్ట ఫలమనియు, భగవన్నిర్ణయమనియు యెంచి తల్లి

దండ్రు లూరకుండుదు. అజ్ఞానజన్యములైన నేటి భావముల ననుసరించి ఈ దుఃఖములు కారణములు లేకుండగనే సంభవించుచున్నవని వారు తలంతురు. లేక మానవాతీతమగు శక్తు లీ దుఃఖముల కల్పించుచున్నట్లు వారు విశ్వసింతురు. కాని ఇయ్యది వాస్తవము కాదు. కొందరి విషయములో పై దుఃఖములు వంశానుగతముగ సంభవించుచున్నవి. కాని అధికసంఖ్యాకులు లోపభూయిష్ఠమగు పోషణమువలన పై కష్టములకు గురియగుచున్నారు. సర్వసాధారణముగ తమ తనయులకును, తనయలకును సంక్రమించు నీ దుఃఖములకును, దౌర్బల్యమునకును, నిరుత్సాహమునకును తలిదండ్రులే బాధ్యులు. అనుక్షణమును తమ బాలబాలికల జీవితక్రమమును నిర్ణయించు మహత్తరాధికారమును వారు నెరపుచున్నారు. కాని అల్పవయస్కులగు వీరి దైహిక మానసిక నైతికాభివృద్ధి మార్గముల చక్కగ నెరుంగక తమ విధినిషేధములచే వారి (బాల బాలికల) అభివృద్ధి కవరోధము కల్పించుచున్నారు. ఈ విషయములో వీరు క్రూరమగు నశ్రద్ధను చూపుచున్నారు. అతిసామాన్యమగు శారీరకశాస్త్రసూత్రముల నెరుంగక తల్లిదండ్రులు క్రమక్రమముగ తమ సంతానముయొక్క ఆరోగ్యమును పాడుచేయుచున్నారు. ఈ విధముగ నజ్ఞానులగు మాతాపితరులు తమ సంతానమును రోగములకును, అకాలమరణమునకును గురిచేయుటయేకాక వారి సంతానమునకు కూడ ఇట్టి దుస్థితియే కల్గించుచున్నారు.

శారీరక విషయములందువలెనే నైతికరంగమునందు కూడ మాతాపితరుల యజ్ఞానమువలన బిడ్డలకు నష్టము సంభవించుట సర్వత్ర కానవచ్చుచున్నవి. అల్పవయస్కురాలైన మాతను, ఆమె శిశుపోషణావిధానమును గమనింపుడు. నేడు తల్లియైన బాలిక కొలది సంవత్సరములకు పూర్వము బడిలో చదువుకొనుచుండెడిది. అచ్చట ఆమె ఏవో కొన్ని పదములు, నామములు, తేదీలు మాత్రము నేర్చుకొన్నది. కాని స్వతంత్రముగా నాలోచించుకొనుటకు ఆమెకు అవకాశము లభింపలేదు. క్రమక్రమముగా వికసించుచున్న శిశుహృదయముతో నెట్లు వర్తింపవలెనో ఆమె యించుకయును తెలిసికొనలేదు. ఈ విషయమునుగూర్చి స్వతంత్రముగ నాలోచించుకొనుటకు తగిన క్రమశిక్షణకూడ ఆమెకు లభింపలేదు. ఆపైన ఆబాలిక సంగీతము, కుట్టుపని, నవలలను చదువుట, విందులకు పోవుట మున్నగువానియందు కాలముపుచ్చినది. కాని మాతృత్వమునకు సంబంధించిన గురుతరబాధ్యతలను గూర్చి ఆమె యించుకయును ఆలోచింపలేదు. ఇట్టి బాధ్యతలకు మార్గదర్శకముకాగల యెట్టి గంభీరవిజ్ఞానమును ఆమె సంపాదించియుండదు. ఇట్టిపరిస్థితిలో ఆమె క్రమవికాసము చెందుచున్న యొక ప్రాణి సంరక్షణభారమును పూనవలసి వచ్చుచున్నది. ఈ విషయముల గూర్చి ఆమె కెట్టి జ్ఞానమును లేదు. శిశుపోషణను గూర్చిన సంపూర్ణజ్ఞానముకలవారే ఈబాధ్యతలను చక్కగ నిర్వర్తింపజాలకున్నప్పుడీ

యజ్ఞానురాలిమాట వేరుగ చెప్పనేల? మనః ప్రవృత్తు లెట్టివో, అవి యెట్లు వృద్ధిచెందునో, వాని ప్రయోజన మెట్టిదో, ఈ ప్రవృత్తులను సదుపయోగ మొనర్చుట యెట్లో ఈ మాత కొంకించుకయు తెలియదు. బాలురలోగల కొన్ని వాంఛలు పూర్తిగా చెడ్డవని యామె తలంచును. కాని యిది కొంతవరకు మాత్రమే నిజము. మరికొన్ని బాల్యప్రవృత్తు లవి యెంత హద్దుమీరిపోయినను కూడ మంచివేయని ఆమె భావించును. కాని ఇది కూడ నిజముకాదు. తాను పోషించుచున్న అల్ప జీవిని గూర్చి యించుకయును యెరుంగని ఈమె, ఎట్టి పద్ధతులులాభదాయకములో ఏవి నష్టదాయకములో కనుగొన జాలదుకదా! ఇట్టి పరిస్థితులలో ప్రమాదములు సంభవించుట అనివార్యము కదా? మనోరంగమునం దాయాకాలములందు సంభవించుచుండు మార్పులను తెలియని ఇట్టి తల్లి తన బిడ్డల విషయమై యెట్టి జోక్యమును కల్పించుకొనకుండ ఊర కుండుటయే శ్రేయోదాయకము. లేనిచో అనేక దుష్ఫలిత ములు కల్గును. బాలబాలికలకు సహజములును, లాభ దాయకములును అగు పనులను ఆమె నిరోధించును. ఈ విధ ముగ ఆమె వారి ఆనందమును చెరచుటయేగాక వారి కెంతో నష్టమునుకూడ కల్గించును. ఇట్లు వర్తించుట వలన బిడ్డలయొక్కయు తల్లియొక్కయు స్వభావము చెడును. తల్లి బిడ్డల కుండవలసిన స్నేహానుబంధము సడలిపోవును. తన దృష్టికి మంచివని తోచిన పనులను బిడ్డలచే చేయించుటకై

ఆమె వారి నొకప్పుడు బెదరించును; లేదా లంచమిచ్చును:
లేదా ఇతరుల మెప్పును పొందవచ్చునని ఆశపెట్టును. బిడ్డలు
తాను చెప్పినపని చేసిన జాలును; అట్లు చేయుటలో వారి
యుద్దేశ్య మెట్టిదియో తెలిసికొనుట కామె యత్నింపదు.
ఈ విధముగ బాలబాలికలయందు సద్గుణములకు మారు
మోసపు స్వభావము, భయము, స్వార్థపరత మున్నగు చెడ్డ
గుణములు వృద్ధిచెందును. ఇట్టి తల్లులు ఒకవంక బిడ్డల
నెల్లప్పుడును సత్యమే పల్కుమని బోధించుచు, వేరొకవంక
తాము బెదరించిన ప్రకారము బిడ్డల నెన్నడును శిక్షింపరు.
దీనివలన వారు తమబిడ్డల కసత్యమును మాత్రమే ఉదా
హరణ పూర్వకముగ నేర్పుచున్నారు. ఒకవంక బిడ్డల కాత్మ
నిగ్రహమును బోధించుచు, వారు తప్పు చేయకపోయినను
తల్లి అనవసరముగ వారిపై ఆగ్రహపడును. బాలుర విషయ
మందును, పెద్దల విషయమునందును కూడ అవలంబింపదగిన
క్రమశిక్షణావిధాన మొక్కటియే కలదు: మంచిపని కాని
చెడ్డపనికాని యొకటి చేసినప్పుడు దానివలన ప్రకృతిసిద్ధముగ
కలుగు సుఖమునుకాని దుఃఖమునుకాని కలుగునట్లు ఏర్పాట్లు
చేయుటయే నిజమైన శిక్షణ. కాని అజ్ఞానురాండ్రగు మన
తల్లుల కీయంశ మొకించుకయును తెలియదు. వారి కీ విష
యమున నెట్టి శాస్త్రీయజ్ఞానమును ఉండదు. ఆయా కాలము
లందు తమ బిడ్డలలో కల్గుచున్న మానసికమైన మార్పులను
తెలిసికొని, తదనుగుణముగ వర్తించుట ఆమె యెరుంగదు.

కావున మన తల్లులు బిడ్డలతో తమ కప్పటి కెట్లు తోచిన నట్లు వర్తించుచున్నారు. ఈ శిక్షణయందు అన్యోన్య విరుద్ధములును, నష్టదాయకములు నగు పద్ధతు లవలంబింపబడు చున్నవి. ఇట్టి శిక్షణవలన బాలబాలికలకు సర్వనాశనము తప్పక కలుగవలసినదే కాని దినదినాభివృద్ధి చెందుచున్న తరుణవయస్కులలో ఇతరములగు అల్పశక్తులను సరకు చేయక, తమ జాతియందలి విశిష్ట నైతికలక్షణముల నల వరచుకొను నొక ప్రబలమగు నైజము నెలకొనియున్న కారణమున నిట్టి ప్రమాదము సంభవించుట లేదు.

ఇక మానసికశిక్షణనుగూర్చి ఆలోచింతము. ఇచ్చట సైతము పై దుస్థితియే ప్రబలియున్నది. మనోవికాసమును, అందును ముఖ్యముగ చిన్నబిడ్డల మనోవికాసమును కొన్ని ప్రత్యేకధర్మముల ననుసరించి జరగును. ఈ ప్రత్యేకధర్మములను, సూత్రములను ఎరుంగకుండ శిశువులకు విద్యాబోధ కావించుట సాధ్యముకాదు. బాలబాలికల మనస్సులలో భావము లెట్లు కల్గునో, అవి యెట్లు పెంపుచెందునో తెలిసికొనకుండ, వారికి విద్యను నేర్పుటకై యత్నించుట మూర్ఖత్వము కాదా? విద్యాబోధ విషయములో నేడు మన మవలంబించుచున్న పద్ధతులకును, ఆదర్శప్రాయమగు పద్ధతులకును చాలభేదము కలదు. ఈనాటి తల్లిదండ్రులకు గాని, ఉపాధ్యాయులకుగాని మనస్తత్త్వశాస్త్రజ్ఞానము లేదు. పై కారణముల వలన నేడు బోధింపబడు విద్య యందలి యంశము

లును, విద్యావిధానమును కూడ లోపభూయిష్టముగ నున్నవి. బాలబాలికలకు నిజముగ బోధింపవలసిన విషయముల మాని వైచి, అనవసరమగు నంశములను, లోపభూయిష్ఠమగు పద్ధతుల ప్రకారమును, క్రమపద్ధతికి భిన్నముగాను వీరు బోధించుచున్నారు. విద్య యనగా గ్రంథములనుండి సంపాదించు జ్ఞానము మాత్రమే యనుభ్రమకులోనై, నేటి తల్లి దండ్రులు అదనురాకుండగనే తమబిడ్డలను బాలశిక్షలు మున్నగు వానిని చదువవలసినదిగ నిర్బంధించుచున్నారు. దీని వలన పిన్నవయస్సు గల బిడ్డలకెంతో హానికల్గుచున్నది. జ్ఞానార్జనమునందు పుస్తకము లుపాంగములవంటివి. ప్రత్యక్ష సాధనముల మూలముగ జ్ఞానము లభింపనప్పు డీ పరోక్ష సాధనముల వాడవలెను. గ్రంథపఠన మనగా స్వయంకృషి వలన నీవు తెలిసికొనజాలని యంశముల నితరులసహాయమున తెలిసికొనుట యని యర్థము. ఈ సత్యమును గ్రహింపజాలక ఉపాధ్యాయులు తమ విద్యార్థులకు అచ్ఛమగు నూత్న భావముల నందిచ్చుటకుమారు ఒకచేయిమారి ప్రాతబడిన విషయములతో వారి మనస్సులను నింపుచున్నారు. బాల్యావస్థయందు స్వతస్సిద్ధముగ లభించువిద్యయొక్క అపారమగు లాభమును మన ఉపాధ్యాయులు గుర్తింపజాలకున్నారు. పసిపాపలయందు సహజముగ నెలకొనియుండు నిరంతర పరిశీలనాశక్తి నలక్ష్యము చేయుటకాని, నిరోధించుటకాని తగదని వీరెరుంగరు. ఈ పరిశీలనాశక్తికి దోహదము కల్గించి

దానిని సాధ్యమైనంత వరకు నిర్దుష్టముగా కావించుట శ్రేయస్కరమని వీరికి తెలియదు. ఈ కారణములచే ఉపాధ్యాయులును తల్లిదండ్రులును, ఆ శైశవదశయందు బాలబాలికల కర్థముకాని అసహ్యాకరమగు పుస్తకములను నిర్బంధముగ వారిచే చదివింపబూనుచున్నారు. విద్యావిషయము నందు వీరికి కొన్ని మూఢవిశ్వాసములుండును. వీరు జ్ఞానముకంటె జ్ఞానము యొక్క చిహ్నములనే విశేషముగ గౌరవింతురు. తన గృహమందును, ఇంటికెదురుగనున్న వీధులందును, చుట్టుప్రక్కలనుండెడి పొలములందును కానవచ్చు వస్తుజాలమును, అచ్చట జరగు కార్యకలాపములను బాలుడు బాగుగా పరిచయమొనర్చుకొనవలయును. ఆపైన గ్రంథముల మూలముగ సంపాదింపదగిన నూతనజ్ఞాన సంచయముతో నాతనికి సంబంధము కల్పింపవలెను ఏలనన పరోక్షజ్ఞానముకంటె ప్రత్యక్షజ్ఞాన మెక్కువ ఉపయోగకరమైనది. అంతేకాదు. పుస్తకములలో వాడబడు పదములకు సంబంధించిన యంశములతో అంతకు పూర్వమే పరిచయమేర్పడియున్న పక్షమున, ఆ పదముల గ్రహించుట సులభసాధ్యమగును. ఇవన్నియు నేటి మన ఉపాధ్యాయులు మున్నగువారికి తెలియవు. నిర్ణీతకాలమునకు ముందే ప్రారంభింపబడు నీ విద్యాబోధ బాలుర మానసిక వికాససిద్ధాంతముల నెంతమాత్రమును లెక్కగొనదు. మానసికాభివృద్ధియందు బాలుడు మొదట మూర్తములను, ఆపైన నమూర్తములను

తెలిసికొనుట సరియగు పద్ధతి. కాని మన ఉపాధ్యాయు లీ సూత్రము నెరుంగక ప్రాథమిక దశయందే బాలురకు వ్యాకరణము వంటి అగ్రాహ్యవిషయములను బోధింపదొడగు దురు. నిజమున కీ విషయము నాలస్యముగ ప్రారంభింపవలెను. రాజకీయభూగోళమునందు బాలురకెట్టి రుచియు నుండదు. ఈ విషయమును సాంఘిక విజ్ఞానముతో జోడించి బోధింప వలయును. కాని. మన ఉపాధ్యాయు లీ విషయమును పసి బాలురకు బలవంతముగ నేర్పజూచెదరు. దీనితో పోల్చి చూచిన యెడల భౌతికభూగోళము బాలబాలికలకు సులభ ముగ నర్థమై వారి నాకర్షించును. కాని ఈ విజ్ఞానమును మన యొజ్జలు నిర్లక్ష్యము సేయుదురు. పసిబిడ్డలకు నేర్పెడి విష యము లన్నియును కూడ తలక్రిందుగ బోధింపబడుచున్నవి. మన ఉపాధ్యాయులు తమ లేబ్రాయపు శిష్యులచే నిర్వచన ములను, నిబంధనలను, సూత్రములను పుట్టు మొదలనే వల్లెవేయింతురు. కొన్ని విషయములను చదివి వానినుండి నిర్వచనాదికముల గ్రహించుట ప్రకృతిసహజమగు విధా నము. కాని యీపద్ధతి నే డవలంబింపబడుటలేదు. ఈవిద్యా విధానము నందంతటను వ్యాపించియున్న దుష్టసూత్ర మొకటి గలదు. అయ్యది రోకటిపాటగ అన్ని యంశము లను వల్లెవేయుట. దీనివలన ఆత్మలేని విద్యయొక్క బాహ్య స్వరూపము మాత్రమే మనకు దక్కుచున్నది. దానివలన కల్గు దుష్ఫలితములే గమనింపుడు. బాలుర విషయగ్రహణ

శక్తిని అసహజముగ నిరోధించి మొద్దువారించుట వలనను, నిర్బంధముగ పుస్తకములను చదివించుటవలనను, విషయముల నర్థముచేసికొనుశక్తి యుద్భవించుటకు పూర్వమే వానిని నేర్పుటకై యత్నించి బాలుర మనస్సుల నల్లకల్లోలము కావించుట వలనను, ఆయా పాఠ్యాంశములందలి విశేషములను మొదట తెల్పి వానినుండి సామాన్యధర్మములను, సూత్రములను గ్రహించుటకుమారుగ బోధనా విధానమును తలక్రిందు చేయుటవలనను, ఇతరులు తెల్పిన విషయములను బాలురకు బలవంతముగ నేర్పి స్వాయముగ జ్ఞానసంగ్రహణము కావించుటకు వారి కవకాశము లీయకపోవుటవలనను, బాలుర లేత మనస్సులపై మోయలేని భారమును మోపుట వలనను, ఈకాలపు విద్యార్థులలో పలువురు పొందదగినంత యభివృద్ధిని పొందుట లేదు. పరీక్షలందు కృతార్థులుకాగానే విద్యార్థులు పుస్తకములకు స్వస్తిచెప్పుచున్నారు. నేర్వబడిన యంశములలో విశేషభాగము క్రమబద్ధముకాని కారణమున నయ్యవి విస్మృతిపాలగుచున్నవి. నేర్వబడిన విద్యను జీవిత విధానమునకు వర్తింపజేయు పద్ధతులు బోధింపబడనందున, ఆ విద్యనిరర్థకమగుచున్నది. నేటి విద్యార్థులలో నిర్దుష్టమగు పరిశీలనాశక్తి కాని, స్వతంత్రాలోచనా శక్తికాని కానవచ్చుటలేదు. నేటి మన విద్యావిధానములో వీని నన్నిటిని మించిన మరియొక గొప్ప లోపము కలదు. మన విద్యార్థి

బృంద మతిముఖ్యములగు విషయములను ప్రక్కకు నెట్టి, అముఖ్యములగు విషయములను గ్రహించుచున్నారు.

నేటి మన విద్యావిధానమునందుగల లోపముల వలన కల్గు దుష్టపరిణామములు మనకు స్పష్టముగ కానవచ్చుచున్నవి. మన బాలుర శారీరక, నైతిక, మానసిక శిక్షణ అత్యంతలోపభూయిష్ఠమై యున్నది. విద్యావిధానమును చక్కని పద్ధతుల ప్రకారము సరిదిద్దు శక్తి సామర్థ్యములు విద్యార్థుల తల్లిదండ్రులయందు లోపించి యుండుటయే దీనికి కారణము. తాము చేయబూనిన ఘనకార్యముల విజయవంతములుగ నొనర్పజాలు విషయములను, సూత్రములను ఒకించుకయేని తెలిసికొనక, ఒకపనికై పూనుకొనిన యెడల ఇట్టి పరిణామములే సంభవించుట తథ్యముకాదా? పాదరక్షలనుచేయుట, గృహనిర్మాణము కావించుట, ఒక పడవను కాని ఆవిరియంత్రమును కాని నడుపుట, మున్నగు పనులు చేయదలచినవారు, చాల కాలము వరకు ఆపనులను శ్రద్ధగ నేర్చుకొనవలెను. అటేవిధముగ ఒక మానవుని మనోదేహములకు క్రమవికాసమును కల్గింప బూనువారు కూడ దీర్ఘమును, సక్రమమును అగు శిక్షణను పొందవలెను. ఈపని యెవరికి తోచిన వారు చేయజాలునట్టి సులభకార్యముకాదు. లోకములోని అతిక్లిష్టకార్యములలో నిది యొక్కటి. కావున సక్రమమగు శిక్షణలేకుండ యెవ్వరును పిన్నవారికి విద్యాబోధ కావించుటకు పూనుకొనరాదు.

బుద్ధిమంతుడైన మానవు డితరములగు కళలనన్నిటిని కూడ అలక్ష్యముచేయనగును. కాని అతిముఖ్యమగు నీ శిక్షణను మాత్ర మశ్రద్ధచేయుటకు వీలు లేదు. అనాలోచితముగ నీ దుష్ట (విద్యా) సూత్రములు నంగీకరించి వాని ప్రకారము వర్తించుతండ్రులు తమకుమారుల యభిమానమును కోల్పోవుదురు. తండ్రి యవలంబించు క్రూరపద్ధతుల వలన కుమారు డాతనిపై తిరుగుబాటుచేయును. ఈవిధముగ తనయులు చెడిపోవుదురు. తండ్రికి దుఃఖము సంప్రాప్తించును. అట్టి సందర్భమున నా తండ్రి "అయ్యో! కావ్యనాటకాదుల నలక్ష్యము చేసియైనను నేను నీతిశాస్త్రమును పఠించిన నెంత బాగుగ నుండెడిది" అని వాపోవును. తన ప్రథమసంతానము విషజ్వరమున కాహుతియై, ఈమనకు మించిన చదువువలన నీపసివాని దేహము బలహీనమై యాతడు మరణించెను కాని లేనియెడల నాతడు తప్పక దక్కియుండెడి వాడని వైద్యుడు పల్కుచున్నప్పుడు దుఃఖమును, పశ్చాత్తాపమును మనస్సును దహింపజేయగా తల్లి యెంతయో బాధపడును. దాంతే మహాకవియొక్క మూలగ్రంథములను (ఇటాలియను భాషయందు) చదువగల్గిన ప్రజ్ఞ నామాత సంపాదించియున్నను, ఆసందర్భమున నామెకు దుఃఖోపశమనము కాజాలదుకదా!

ప్రతి మానవునికిని చాల అవసరమైన యీ శిశుపోషణ కార్యకలాపములను సక్రమముగ నెరవేర్చుటకై జీవితసూత్రముల నెరింగియుండుట అతిముఖ్యము. శారీరక

శాస్త్రము, మనస్తత్వశాస్త్రము వీటి ప్రాథమికసిద్ధాంతముల
నైన యెఱుంగని యెడల పసిబిడ్డలను చక్కగ పెంచగల్గుట
సాధ్యముకాదు. బిడ్డలను కని పెంచెడి తల్లిదండ్రులందరును
పై రెండు శాస్త్రములందును సంపూర్ణప్రజ్ఞను సాధింపవలయు
నని మేము వాదించుటలేదు. అట్లు పల్కుట హాస్యాస్పద
మగును. పై శాస్త్రముల యందలి ప్రాథమికసూత్రములను,
ఆ సూత్రముల విశదము కావించుట కవసరమగు నుదాహరణ
ములను సామాన్యజనులు నేర్చిన యెడల చాలును. వీలైన
యెడల నీవిజ్ఞానమును సశాస్త్రీయముగను, సహేతుకముగను
నేర్వవలయును. లేనిచో కేవలము రోకటిపాటగనైనను
వానిని తెలిసికొనుట అత్యవసరము. ఆ విషయము నట్లుండ
నిండు. ఈక్రింది యంశములు మాత్రము నిర్వివాదమైనవి :
పసిబిడ్డల శారీరక మానసికాభివృద్ధులు కొన్ని నిర్ణీతమార్గ
ముల ననుసరించి జరగును. తల్లి దండ్రులు కొంత వరకైన
నీమార్గముల ననుసరింపని యెడల బిడ్డలకు సర్వనాశనము
తప్పదు. శారీరక మానసిక ధర్మములలో విశేషభాగమును
నిర్లక్ష్యముచేసినచో పసిబిడ్డలలో తీవ్రమగు శారీరక మాన
సిక లోపములు బయలుదేరును. ఈ ధర్మముల పూర్తిగ
నవలంబించిన యెడల శిశువులు పెరిగి పెద్దవారైనప్పుడు సర్వ
విధముల మంచిస్థితి యందుందురు. ఈ సత్యములను గుర్తెరిం
గిన తరువాత తాము శారీరకమనస్తత్వశాస్త్రముల పఠింప
వలయునో లేదో తల్లిదండ్రులే నిర్ణయించుకొందురు గాక !

మాతాపితృధర్మముల విమర్శించిన మీదట పౌర ధర్మముల గూర్చి విచారింతము. మానవుడు పౌరధర్మముల నిర్వర్తించుటకొరకై యెట్టి శిక్షణను పొందవలెనో ఆలోచింతము. ఈవిషయమునకు సంబంధించిన విజ్ఞానమును మన పాఠశాలలయందలి పాఠ్యప్రణాళికలలో రాజకీయసామాజిక ధర్మము లనుపేర నామమాత్రముగా చేర్చియున్నారు. వీని యందు చరిత్రకు ముఖ్యస్థానము లభించుచున్నది.

ఈ శీర్షిక క్రింద బాలురకు బోధింపబడు విషయములు వారి కెంతమాత్రమును మార్గదర్శకములుగ లేవని ఈవరకే తెల్పియున్నాము. బాల బాలికల కొరకై వ్రాయబడిన సంగ్రహ దేశచరిత్రలలో కాని, వయోధికుల కొరకై వ్రాయబడెడి సవిస్తరమగు చరిత్రలలో కాని రాజకీయ జీవితమునకు సంబంధించిన సిద్ధాంతముల విశదీకరించుట జరుగుటలేదు. మన బాల బాలికలు రాజులయొక్క జీవితచరిత్రలను మాత్రము చదువుచున్నారు. రాజుల జీవిత చరిత్రలవలన సామాజికశాస్త్ర నియమములు తెలియజాలవు. రాజులదర్బారులలో జరుగు కుతంత్రములు, కుట్రలు, రాజ్యాక్రమణలు మున్నగువానిని, వీనితో సంబంధముగల వ్యక్తుల జీవితములను పఠించినంత మాత్రమున ఒకజాతి యభివృద్ధికిగల కారణములు తేటతెల్లము కాజాలవు. ఎవరో కొందరు వ్యక్తులొండొరులతో తగవులాడి యుద్ధమునకు దిగిరనియు ఆ యుద్ధమునందీ యీ పేర్లుగల సేనానాయకులును, ఉప

సేనానాయకులును పాల్గొనిరనియు, ఇరుపక్షముల వారికడను ఇందరు పదాతులును, ఆశ్వికులును, ఇన్నిశతఘ్నులును కల వనియు, వారు తమ సైన్యముల నీ యీ వ్యూహముల నన్ని నిలువబెట్టిరనియు, ఆ సైన్యము లీయీ యెత్తులువైచి, ఈవిధముగ నొండొరుల దాకి, తుదకు వెనుకకు తగ్గిరనియు, ఆ యుద్ధదినమునం దీ భాగమున నిట్టి అనుకూలతలును, ఈ భాగమున నిట్టి నష్టములును సంభవించెననియు, సైన్యముల నడకలో ఈ సందర్భమున నొక సైనికోద్యోగి మరణించె ననియు, మరొక్క సందర్భమున ఒక సేనావిభాగమంతయు మృత్యువుపాలయ్యెననియు, ఈ విధముగ నిరుపక్షముల యదృష్టమును కొంతకాలమువరకు సంశయాస్పదముగనుం డిన మీదట తుట్టతుదకు విజయలక్ష్మి యొక పక్షమువారిని వరించెననియు, ఈ యుద్ధమున నిందరు సైనికులు గాయ పడిరనియు, ఇందరు మరణించిరనియు, ఇందరు శత్రువులచే బందీలుగ గైకొనబడిరనియు, మున్నగు విశేషములను మీరు తెలిసికొనిరని భావింపుడు. కాని ఇందువలన మంచి పౌరులుగ మీరు చేయవలసిన పనులెట్టివో మీకు బాగుగా తెలియవచ్చినవా? ప్రపంచమునందలి యన్ని దేశములందును సంభవించిన మహాసంగ్రామముల గాథను శ్రద్ధగా పఠించి నంతమాత్రమున మీరు మీ వోటును సక్రమముగా నుప యోగింపజాలుదురా? కాని చారిత్రికాంశములు సత్యసంఘ టనలనియు, అట్టి సత్యాంశముల నెరుంగుటకు పలువురిచ్చు

గింతురనియు కొందరు పలుకవచ్చును. అయినను మనస్సున కింపైనంత మాత్రమున నీ విషయము లుపయోగకరములు కాజాలవు. సాంప్రదాయవాదులు కొందరు నిరర్థకాంశము లకు కూడ సార్థకత్వము నారోపింతురు. పుష్పసంగ్రహము నందు మోజుగల మనుజుడు వానియెత్తు బంగారము నిచ్చి నను ఆ పుష్పములను విడువజాలడు. మరికొందరికి పగిలి పోయిన వికారమగు చీనాపాత్రల ముక్క లోక గొప్ప నిక్షేపము. పేరుమోసిన హంతకుల స్మారక చిహ్నముల సంపాదించుటలో విస్తారముగ ధనవ్యయము చేయువారు కూడ కలరు. ఆయా వ్యక్తుల మనస్సులకు నచ్చినంత మాత్రమున మన కా పను లనుసరణయోగ్యము లగునా? అదే విధముగ కొన్నివిధములగు చారిత్రికాంశములలో కొందరి కభిరుచి యున్నంతమాత్రమున వానికి విలువ కల్గునా? ఆ యంశములు మనకు నిత్యజీవితములో ఏ విధముగ నుప యోగించునో తెలిసికొనిన మీదట వాని విలువను నిర్ణ యింపనగును. నిన్నటిరోజున నీ ప్రక్కయింటిలో పిల్లి యీనినదని ఎవరైన వచ్చి నీకు తెల్పినయెడల ఆ యంశము నిరర్థకమని నీవు త్రోసిపుచ్చెదవు. అగుటకది సత్యమే. కాని అయ్యది నిరర్థకమగు సత్యము. దానివలన నీ జీవితవిధానము ప్రభావితము కాజాలదు. ఈ యంశమును తెలిసికొనినందు వలన నీ జీవితమున కెక్కువ సంపూర్ణత సిద్ధింపదు. ఈనాటి చరిత్రలలో తెలుపబడు ననేక సత్యాంశములకు పై సూత్ర

మును వర్తింపజేసిన యెడల, ఫలితము నీకే తెలియగలదు. పై యంశములు సత్యగర్భితములే కాని వానినుండి మన మెట్టి ఫలశ్రుతిని సాధింపలేము. వీనివలన మన నడవడిని సరిదిద్దుకొనుట కెట్టి అవకాశమును లేదు. సత్యముయొక్క పరమార్థము మార్గదర్శకత్వము. పై సత్యము లట్టివికావు. నీ కిష్టమైన యెడల కేవలము వినోదముకొరకై వానిని చదువుము. కాని వానివలన లాభము పొందుచున్నట్లుమాత్రము భ్రమపడకుము.

చరిత్రనామమున కర్హమగు విషయసంచయమును నేటి మన పుస్తకములలో చాలవరకు విడచివేయుచున్నారు. ఇటీవలనుండియే మన చారిత్రకులు కొందరు ఉపయోగకరమగు నంశములను తమ గ్రంథములలో తెల్పుట ప్రారంభించుచున్నారు. పూర్వకాలమున రాజ్యమునందు రాజే సర్వమునై యుండెడివాడు. ప్రజల కెట్టి ప్రాముఖ్యతయు లేకుండెను. కావున చరిత్ర యనగా రాజులు కావించిన పనులు మాత్రమే యను భావము వ్యాపించెను. జాతీయజీవన మీ కార్యకలాపములకు వెనుక నొక తెరగ మాత్ర ముండెడిది. రాజుల చరిత్రకంటె జాతియొక్క అభివృద్ధియే ముఖ్యతరమను భావ మిటీవలనే వ్యాప్తిలోనికి వచ్చినందున చారిత్రకులు సాంఘికసంక్షేమమునుగూర్చి చర్చించుట ప్రారంభించినారు. నిజమునకు మనము తెలిసికొనవలసినది సాంఘిక చరిత్రయే. ఒకజాతి యే విధముగా క్రమాభివృద్ధి చెంది,

చక్కని రాజ్యాంగవ్యవస్థ నేర్పాటుచేసికొనినదో తెలిసి కొనుట మన కవసరము. ఈ విషయములతోపాటు ఆనాటి ప్రభుత్వమునుగూర్చి కూడ కొన్ని విశేషములు మనము తెలిసికొనవచ్చును. కాని ఆ ప్రభుత్వమునందలి యుద్యోగులగూర్చిన పుక్కిటి పురాణములతో మన కెట్టి యవసర మును లేదు. ఆ కాలమునందు ప్రభుత్వ నిర్మాణ మెట్లు జరిగెను ? ఆ ప్రభుత్వపు సిద్ధాంతములు, కార్యవిధానము, ఇష్టానిష్టములు, లోపములు ఎట్లుండెడివి ? అను నంశముల తెలిసికొనుట మనకు చాల ముఖ్యము. ప్రభుత్వమును గూర్చి వర్ణించునప్పుడు కేంద్రప్రభుత్వమును గూర్చియే కాక రాష్ట్రీయ, స్థానిక ప్రభుత్వములకు సంబంధించిన వివరముల నన్నిటిసికూడ మనము గ్రహించుట మిక్కిలి అవసరము. రాజకీయాంశములతోపాటు సమకాలీనమగు మత విషయి కములగు నేర్పాట్లు, మతసంస్థల వ్యవస్థ, వాని యధికార ములు, వాని కార్యాచరణ విధానము, రాజులకును మత సంస్థలకును గల సంబంధములు, ప్రజలు నిజమని నమ్మి అనుసరించిన మతసిద్ధాంతములు, మతవిషయికములగు కర్మ కాండలు మున్నగువానికికూడ చరిత్రలందు స్థానము లభింప వలెను. ఆయా కాలమునందలి సాంఘిక మర్యాదలు, అనగా బిరుదములు, అన్యోన్య గౌరవము మున్నగువానివలన సం ఘమునందలి వివిధశాఖ లొండొంటి నే విధముగా తమ అదుపు ఆజ్ఞలలో నుంచుకొనగల్గెనో మనకు తెలియనగును.

ఇంటను బయటను ప్రజాజీవితమును రూపొందించిన ఆచార ములు, స్త్రీపురుషాదుల సంబంధములు, తల్లిదండ్రులు బిడ్డల కును గల సంబంధములు మొదలగునవి మన మెరుంగవలెను. ప్రజానీకములో వ్యాపించియున్న మూఢ విశ్వాసములు, వాడుకలోనున్న మంత్రతంత్రాదులనుకూడ చరిత్ర సూచింప వలెను. ఆ పైన చరిత్ర పారిశ్రామికజీవితమును వర్ణింపవలెను. పారిశ్రామికకర్మ లే విధముగా విభజింపబడెను, వృత్తి విభా గము, కులములు, పారిశ్రామికసంస్థలు లేక తదితరమార్గము లలో వేని ననుసరించి జరగెను, కార్మికులు యజమానుల సంబంధము లెట్లుండెను, వస్తుజాలము యొక్క పంపకము నకై యెట్టి యేర్పాట్లుండెడివి, రాకపోకల సాధనములు, చలామణీలో నుండెడి నాణెములు, మున్నగు వానిని మనము తప్పక విచారింపవలెను. వివిధపరిశ్రమల నుత్పత్తి విధానపు దృష్టిచే కూడ పరిశీలింపదగును. వస్తువుల నెవ్వ రుత్పత్తి కావించెడివారు, సరకుల మంచి చెడ్డలెట్లుండెను అను విష యములు కూడ చర్చింపవలెను. జాతి యందలి వివిధ తర గతుల వారా కాలమున మానసికముగ నెట్టి యభివృద్ధి గాంచి యుండిరను సంశయములుకూడ విచారింపదగినది. ప్రజ లలో విద్యాభివృద్ధి యెంతవరకు జరగిన దను విషయము మాత్రమే కాక, ఆనాడు శాస్త్రవిజ్ఞాన మెంతవరకు పెంపొంది నది, ప్రజల భావము లెట్లుండెను అనువిషయముల కూడ మనము తెలిసికొనవలెను. భవననిర్మాణము, శిల్పము, చిత్ర

లేఖనము, సంగీతము, కవిత్వము, కల్పనా కథలు, ప్రజా నీకము యొక్క దుస్తులు మున్నగు వానివలన నాకాలము నందు సౌందర్యపిపాస యెంత వరకు కానవచ్చుచుండెనో కూడ యెఱుంగవచ్చును. సామాన్యప్రజల నిత్యజీవితము అనగా వారి ఆహారము, గృహనిర్మాణము, ఆటపాటలు మున్నగు వానిని కూడ మనము మఱువరాదు. అంతే కాక ఆ సమాజము యొక్క శాసనములు, అలవాట్లు, సామెతలు, మున్నగు వాని వలన ఆప్రజలు ఆచరణయందును సిద్ధాంతము లందును ఎట్టి నీతినియమముల కల్గియుండిరో తెలిసికొన నగును. వీనినన్నిటిని కూడ సూక్ష్మముగను, యథార్థముగను గ్రహించి, ఆపైన సమాజవికాసమందలి యొక శాఖకును వేరొకశాఖకును గల సంబంధమును మనము తెలిసికొన వలయును. సంఘమునందలి వివిధరంగములలోని యభివృద్ధి అన్యోన్యాశ్రయము; చారిత్రకవిషయముల నీ విధముగ ప్రదర్శించుట యందలి యుద్దేశ్యము చదువరులు అందుగల సామాన్యధర్మముల గుర్తెఱుంగ వలయుననియే కాని వేరొండు కాదు. సమాజము నందొక రంగమున నొక విధమగు స్థితి గతులు నెలకొని యున్నప్పుడు వేరొక రంగమున దానికి సామీప్యముగల పరిస్థితులు కానవచ్చునని ఇందువలన వ్యక్త మగును. చరిత్రరచన సాగించునప్పు డొక దశయందలి విశ్వాసములు, సంస్థలు, ఆచారములు, ఏర్పాట్లు మరియొక దశయందు ఎట్లు మార్పుచెందెనో, ఈమార్పు ఒకే రంగము

నకు పరిమితము కాక, అన్నిరంగములందును కూడ నెట్లు కానవచ్చునో వర్ణించుట యవసరము. భూతకాలమును గూర్చిన యిట్టి విశేషములే, పౌరులు తమ నడవడిని తీర్చి దిద్దుకొనుటలో ఉపయోగకారులగును. సామాజికచరిత్రను వర్ణించు గాథయే నిజముగ మనకు ప్రయోజనకారియైనది. వివిధజాతుల సమాజిక వికాసగాథను తెలిసికొనుట కను కూలముగ సత్యాంశములను ప్రదర్శించుటయే చారిత్రకుని యొక్క నిజమైన ధర్మము. ఇట్టి గాథలనుండి సమాజములో మార్పు లే సూత్రముల ననుసరించి జరుగునో మనము తెలిసి కొనవచ్చును.

చరిత్రకు సంబంధించిన యంశముల మనము సవిస్తర ముగ గ్రహింపగల్గినను, వీని కన్నిటికిని మూలాధారమగు విషయమును మన మెఱుంగజాలనియెడల నీ విజ్ఞానమంతయు నిరర్థకమే యగును. ప్రకృతిశాస్త్రములే వీనికి మూలకందము. సమాజమునందు జరుగు మార్పులను జీవశాస్త్ర, మనస్తత్వ శాస్త్రముల సామాన్యసూత్రములమూలమున గాని మనము సహేతుకముగ వ్యాఖ్యానింపజాలము. కేవల అనుభవజన్య ములగు కొన్ని స్థూలసూత్రములవలన సమాజమునందు జరుగు సామాన్య సంఘటనల యాంతర్యమును మనము గ్రహింప గల్గుచున్నాము. ఉదాహరణముగా ఒక వస్తువు యొక్క ఉత్పత్తికిని దాని గిరాకీకిని గల సంబంధమును గమనింపుము. ఒక ప్రత్యేక పరిస్థితిలో మానవుని భావన

లును, కృత్యములును ఎట్లుండునో యెఱుంగకుండ, సమాజ విజ్ఞానమునందలి ప్రాథమిక సత్యములుకూడ మన కెఱుక పడవు. అదే విధముగ మానవుని శారీరక మానసిక శక్తులను గూర్చిన కూలంకషజ్ఞానము సాధించకుండ సామాజిక వికాసమందలి ఆంతర్యమును మనము సంపూర్ణముగ తెలిసికొనలేము. సిద్ధాంతరూపముగ నీ విషయము నాలోచింపుము. ఇందలి నిజము నీకే వ్యక్తమగును. సమాజము వ్యక్తులతో కూడి యున్నది. సమాజమునందు జరుగు కార్యకలాపములను వ్యక్తు లేకస్థులై కావింతురు. కావున సమాజమునందు కల్గు సంఘటనలకుగల మూలకారణములను మనము వ్యక్తుల యందే కాంచగల్గుదుము. మానవుల కృత్యములు వారి ప్రకృతిధర్మములపై ఆధారపడి యుండును. ఈ ధర్మముల నెఱుంగకుండ మానవుల కృత్యముల నెఱుంగుట దుస్సాధ్యము. ఈ ధర్మముల పైపొరలను తొలగించి వాని మూలమును కన్గొనిన పక్షమున నా కృత్యములు మానవుని మనోదేహములకు సంబంధించిన ధర్మములు మాత్రమే యని విశదపడును. కావున సమాజ విజ్ఞానమును సాధించుటకు శారీరకమనస్తత్వశాస్త్రము లతిముఖ్యము లని తెలియవచ్చుచున్నది. ఇదే విషయమును సులభతరముగ తెలుపదలచిన యెడల నిట్లు పలుకనగును. సామాజికసంఘటనలు జీవిత రంగమునందలి క్లిష్టసంఘటనలేకాని వేరుకావు. కావున నవి జీవితసూత్రముల కనుగుణ్యముగ నుండును. ఈ సంఘటనల

నర్థముచేసికొనుటకు జీవితసూత్రముల నర్థము చేసికొనవలెను. కావున పౌరధర్మ నిర్వహణ విధానము నెరుంగుటయందు కూడ మనకు శాస్త్రీయజ్ఞాన మతిముఖ్యము. మనకిప్పుడు పాఠశాలలలో నొసంగబడు విద్యవలన, మానవునకు తన పౌరధర్మము లెట్టివో తెలిసికొనుటకు సావకాశము లేదు. మన విద్యార్థి చదివెడి చరిత్రయందు కొంతభాగము మాత్రమే ఆతని కుపయోగకారిగ నున్నది. ఆ స్వల్ప భాగ మునుకూడ ఆతడు చక్కగ వినియోగించుకొనుట లేదు. సాంఘిక విజ్ఞానమును సంపాదించుట కావశ్యకమగు సాధ నము లాతనికి లభించుటలేదు. అంతేకాదు. సాంఘికవిజ్ఞాన మనగా నేమియోకూడ ఆతనికి తెలియదు. సాంఘిక విజ్ఞా నమునందలి యంశముల గ్రహించుటకై అత్యవసరములగు ప్రకృతిశాస్త్ర ధర్మములను మనవిద్యార్థి నేర్చుకొనుట లేదు.

మానవజీవితపు కార్యకలాపములలో తుట్టతుదివిభాగ మును గూర్చి యిప్పుడు విచారింతము. ఇయ్యది విరామ కాలములో మనకుల్లాసము కల్గించు విషయములకు సంబం ధించినది. ఆత్మసంరక్షణమునకును, జీవనోపాధిని సంపాదించు టకును, మాతాపితృధర్మముల నిర్వర్తించుటకును, సామా జిక రాజకీయ కార్యముల నెరవేర్చుటకును అవసరమగు విద్యను సంపాదించిన వెనుక వీనికి భిన్నమగు ఇతర లక్ష్య ముల సాధించుట యెట్లను సమస్య ఉత్పన్న మగుచున్నది. ప్రకృతి సహజమగు ఆనందము, సారస్వతము, లలిత కళల

మూలమున లభించిన లౌకికానందము మున్నగు వానిని సాధించు పద్ధతుల మన మెరుంగవలెను. జీవితసౌఖ్యముతో సన్నిహితసంబంధముగల యితర విషయములను చర్చించిన తరువాత ఈ యంశమును గ్రహించుటవలనను, ప్రతియం శము యొక్కయు విలువయెట్టిదని విమర్శించు చుండుట వలనను, మనస్సున కుల్లాసము కల్గించు కార్యక్రమమును మనము నిరసించుచున్నట్లు కొందరు భావింపవచ్చును. కాని యిట్లు తలంచుట వట్టి పొరపాటు. సౌందర్యోపాసనకు సంబంధించిన విజ్ఞానమును గౌరవించుటలో మే మెవ్వరికిని తీసిపోము. చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, కవిత్వము, ప్రకృతిసౌందర్యోపాసనము మున్నగు కళలు, లక్షణములు లేని యెడల జీవితములోని యందము చాలవరకు నశిం చును. సౌందర్యము నారాధించుటకై వలయు శిక్షణ మున్ముందు చాల ప్రాముఖ్యత వహింపగలదు. ఈ నాటి కంటె భావి మానవజీవితములో లలితకళల కెక్కుడు గౌర వము లభింపగలదు. మానవోపయోగము కొరకై ప్రకృతి శక్తుల జయించుటయు, వస్తూత్పత్తి సాధనముల నుత్తమ దశను చెందించుటయు, మానవుడు పడవలసిన శరీరకష్టము సాధ్యమైనంతవరకు తగ్గించుటయు, విద్యావిధానమును క్రమ పద్ధతులపై నడపుచు, జీవితసౌఖ్యమునకై వలయు క్రమ శిక్షణ సర్వసాధారణముగ నొసంగుటయు, మానవుడు మొదట సాధింపవలసిన విషయములు. ఆ లక్ష్యము సాధించిన

యెడల మానవున కెక్కుడు విరామము లభించును. అట్టి దశను పొందిన మీదట మానవుడు ప్రకృతిసౌందర్యమును, కల్పితసౌందర్యమును ఎక్కువగ నుపాసించుట తథ్యము.

సౌందర్యోపాసనము జీవితసౌఖ్యమునకు దోహద మొసంగునుకాని ఈ లక్షణము లేకుండ జీవితమునకు సౌఖ్యమే లేదనుట సత్యదూరము. కళోపాసన యెంత ముఖ్యమైనను, నిత్యజీవితమున కావశ్యకమగు విజ్ఞానము దీనికంటె ముఖ్య తరమైన దనుటకు సందేహములేదు. వ్యక్తి జీవితమును, సామాజికజీవితమును సృష్టించిన శక్తులే వాఙ్మయమును, ఇతర లలితకళలను సృష్టించుచున్నవి. పుష్పములం దిష్టము గల యాతడు ఆయా పువ్వులకొరకై మొక్కలను పెంచును. మొక్కయొక్క వ్రేళ్లును, ఆకులును, పూవును పెంపొందిం చుటయందు సహకారులగుచున్న కారణమున వానికికూడ అతడు ప్రాముఖ్యత నొసంగును. నిజముగ మన మాసించు వస్తువు పూవు కావున మొక్కయొక్క ఆకులు, వ్రేళ్ళకంటె దీనికి మన మున్నతస్థానము నొసంగుదుము. కాని ఆకులు వ్రేళ్ళ యం దంతర్గతమగు మహత్వ మధికతరముగనున్న యంశమును మనము గుర్తింపవలెను. ఏలనన పూవుయొక్క క్రమవికాసము వీనిపైననే ఆధారపడి యున్నది. పూవులను కోరువారు మొక్కను ఏపుగ పెంచవలెను. పూవుకొరకై తొందరపాటులో మొక్కనే నిర్లక్ష్యముచేయుట వివేకహీనత కాదా? మన మిప్పుడు విమర్శించుచున్న విషయముకూడ

నిట్టిదే. శిల్పము, చెక్కడపు పని, చిత్రలేఖనము సంగీతము, కవిత్వము మున్నగునవి నాగరకజీవన మను వృక్షమునకు పుష్పములవంటివి. నాగరక జీవనముకంటె తత్ఫలములగు కళలే యెక్కువ ముఖ్యమైనవని వాదముకొరకంగీకరించినను ఈ కళలను పెంపొందించుటకు మూలహేతువైన చేవ గల్గిన నాగరక జీవితము మొట్టమొదట నెలకొనియుండుట అత్యావసరము. కళల కాధారభూతమగు పరిణతజీవితమునకు మన మత్యున్నతస్థానము నొసంగవలెను.

మన విద్యావిధానమునందలి ముఖ్యలోప మిచ్చటనే కానవచ్చుచున్నది. ఇందు పూర్వపైగల మోహముచే మొక్కను నిర్లక్ష్యము సేయుచున్నారు. అందముకొరకై మన విద్యావిధానము దార్ఢ్యమును పోనాడుచున్నది. ఆత్మసంరక్షణము, జీవనోపాధి, పైతృకధర్మములు, సాంఘిక విజ్ఞానము మున్నగు నంశములగూర్చి మన విద్యావిధానములో సక్రమమగు శిక్షణ యొసంగబడుటలేదు. జీవనోపాధి కావశ్యకమగు జ్ఞానమును విద్యార్థి తన భావిజీవితములో తనంత తానే సంపాదింపవలసి వచ్చుచున్నది. సాంఘికవిజ్ఞాన విషయమున అప్రస్తుతమగు ననేకాంశములు బోధింపబడుచున్నవి. కాని లలితకళల విషయమున నత్యంతమగు శ్రద్ధను మన విద్యావిధానము చూపుచున్నది. ఆధునికభాషలను నేర్చుట వలన మనకు విజ్ఞానాభివృద్ధి కల్గుచున్నది. గ్రంథావలోకనము పఠనను, పండిత సమాగమము, విదేశగమనములవలన

మానవునకు పరిణతి సిద్ధించుచున్నది. కాని ఇట్లు పల్కుట వలన అతి ముఖ్యములగు నితరాంశముల నిర్లక్ష్యముచేయుట కూడునని యెంతమాత్రమును తలంపరాదు. ప్రామాణిక భాషల నభ్యసించుటచే నిర్దుష్టమగు శైలి యేర్పడును. రచనా విధానమున విన్నాణము పెంపొందును. కాని కన్న బిడ్డలను సక్రమ మార్గముల పెంచు విధానమును బోధించు జ్ఞానముకంటె ప్రామాణికభాషాభ్యాస మెక్కువ ఉపయోగ కరమని యెవ్వరును వాదింపజాలరు. ప్రాచీనభాషలయందలి కవితను చదువుటచే మనరుచు లున్నతస్థాయికి పోవచ్చును. కాని రుచుల యభివృద్ధి ఆరోగ్యసూత్ర విజ్ఞానమంతటి ముఖ్య విషయము కాజాలదు. కవిత్వము, లలిత కళలు మున్నగు నవి నాగరకతకు వన్నెపెట్టుటకు మాత్రమే ఉపయోగ పడును. కావున నాగరకతకు మూలమైన విద్యాబోధ, క్రమ శిక్షణ మున్నగువాని కియ్యవి లోబడియుండవలెను. జీవితము నందలి విరామసమయమున మాత్రము లలితకళ లుపయోగ పడును. కావున విద్యావిధానమున లభించు విరామకాల మున మాత్రమే వీనిని బోధింపవలసి యుండును.

విద్యా విధానములో ప్రథమదశనుండియును కూడ లలిత కళలకు స్థానము లభింపవలెను. కాని ఈ విజ్ఞానము ద్వితీయ శ్రేణిలో మాత్రమే చేరును. ఈ విభాగమునకు చెందిన విజ్ఞానమును సంపాదించుట కెట్టి జ్ఞానమావశ్యక మను విషయము నిప్పుడు మనము చర్చింపవలెను. ఇతః

పూర్వము తెలుపబడిన యంశమునే మన మిచ్చట కూడ ఉదహరింపవలసి యున్నది. అనగా లలితకళలకు కూడ శాస్త్రీయవిజ్ఞానమే మూలమైన దని తెలుపవలసియున్నది. కొందర కీ యంశ మాశ్చర్యకరముగ తోపవచ్చును. కాని శాస్త్రీయ విజ్ఞానము లేనియెడల నిర్దుష్టమగు సృష్టికాని, దాని యందమును గుర్తింపగల్గుట కాని సాధ్యముకాదు. సంకుచితార్థములో మనము శాస్త్రీయవిజ్ఞానముగా పరిగణించు చున్న యంశముల నుత్తమ కళాకోవిదు లెరింగి యుండక పోవచ్చును. కాని కళాభిజ్ఞులందరును తమ సూక్ష్మపరిశీలనా శక్తి వలనను, అనుభవము వలనను అనేకాంశముల నెరుంగ జాలుచున్నారు. ఈ యంశములే ప్రకృతి శాస్త్రముయొక్క ప్రాథమిక దశ యని తెలుపనగును. కాని కళాకారు లెరింగిన విషయములు పరిమితములు, గోపభూయిష్ఠములు ; కళా కారులు సృజించు వస్తువులన్నియు ఊహాప్రపంచమునందో, భౌతికప్రపంచమునందో నెలకొనియున్న భావములకును, దృశ్యములకును ప్రతిబింబములు. ఈదృశ్యములకును భావము లకును సంబంధించిన ధర్మములను చక్కగ నెరింగిన యాతడే నిర్దుష్టమగు కళను ప్రదర్శింపజాలును. కావున కళాకారుడు మొట్టమొదట ప్రకృతిధర్మముల నెరుంగవలయును. పై యంశములవలన శాస్త్రమునకును కళకును గల సంబంధము వ్యక్తమగుచున్నది

శిల్పవిద్య నభ్యసింపదలచిన వారికి మానవ శరీరమం దలి యెముకలు, నరములు, వానియునికి, ఏర్పాటు, కదలిక

మున్నగు విషయములు తెలిసియుండుట అవసరము. ఇయ్యది ప్రకృతిశాస్త్రములో నొక భాగము. ఈపాటి ప్రకృతిశాస్త్ర జ్ఞానమైనను లేనియెడల శిల్పి చక్కని చిత్రముల మలచ జాలడు. రేఖాగణితవిజ్ఞానము కూడ శిల్పికి అతిముఖ్యము. ఈ జ్ఞానము లేని శిల్పి మానవచిత్రములను సహజముగా చూప జాలడు. చిత్రలేఖనమునందు సైతము శాస్త్రీయవిజ్ఞానము తప్పక కావలయును. వివిధకోణములనుండి చూచి నప్పుడు ఒక వస్తు వెట్లు కానవచ్చునో తెలియకుండ చిత్తరువుల నందముగ వ్రాయజాలము. పిన్నవయస్సువారు వ్రాసెడి చిత్రముల పరిశీలింపుడు. శాస్త్రీయజ్ఞానము లేని కారణమున వారి చిత్రములు లోపభూయిష్ఠములుగ నుండును. కాని చిత్రకారునికి కావలసిన శాస్త్రీయజ్ఞాన మనుభవజన్యమైనది మాత్రమే యని మనము తెలిసికొనవలెను. చిత్రకళాపార గులును, రస్కిన్ మహాశయుడు మున్నగు కళావిమర్శకులును చిత్రకళను వృద్ధిపొందించుటకు సాధనము ప్రకృతి యందలి సహజత్వమును ప్రదర్శించు మార్గముల నభ్యసించుటయే యని వాక్రుచ్చుచున్నారు. శాస్త్రీయజ్ఞానము లేనియెడల ఎంతటి యనుభవశాలియును కూడ పొరపాట్లనుండి తప్పించు కొనజాలడు. ఒక ప్రత్యేకపరిస్థితియం దెట్టి దృశ్యముల ప్రద ర్శింపవలయునో యెఱుంగనిచో చిత్రకారు డందమగు చిత్ర మును సిద్ధముచేయజాలడు. వివిధదృశ్యముల స్వరూపమును నిర్ణయించుట కవసరమగు శాస్త్రజ్ఞానము చిత్రకారునికి

మిక్కిలి ముఖ్యమైనదని యిందువలన తేలుచున్నది. శాస్త్రీయ విజ్ఞానశూన్యుఁ డగు చిత్రకారుడు తేలికగ, దృశ్యాదృశ్యముగ చూపవలసిన వస్తువులను గాఢముగ, కొట్టవచ్చినట్లు చిత్రించి, చిత్తరువు నసహజముగ చేసివైచును. చిత్రకారుడు సహజప్రజ్ఞ కల్గియుండియు శాస్త్రీయవిజ్ఞానము లేనియెడల రాణింపజాలడు.

సంగీతమునకు కూడ శాస్త్రము యొక్క సహాయము తప్పక కావలెను. ఇందుల కెవ్వరును కూడ ఆశ్చర్యపడ నక్కర లేదు. భావగర్భితమగు సహజభాష నుత్తమస్థాయికి గొనిపోవుటయే సంగీతము. సహజభాషకు సమీపముగ నున్న పక్షముననే సంగీతము అందగించును. లేనిచో వికారముగ నుండును. భావానుగుణ్యముగను, భావసాంద్రత ననుస రించియు ధ్వని నారోహణావరోహణముల కావించుటవలననే సంగీతము నందలి మాధుర్య మేర్పడుచున్నది. స్వరమునందలి హెచ్చుతగ్గులు మన కిచ్చవచ్చిన చొప్పున కావించుటకు వలనుపడదు. ఒక ముఖ్యలక్ష్యమును సాధించుటకు — అనగా పదముల భావమును చక్కగ వ్యక్తపరచుటకు — ఆరోహణావ రోహణములు చాల అవసరము. వీనికి సంబంధించిన సూత్ర సముదాయమునే సంగీతశాస్త్రమని పేర్కొందుము. పై శాస్త్రనియమముల కనుగుణ్యముగ వ్రాయబడిన గీతములు, కీర్తనలు మాత్రమే సంగీత నామమున కర్హములు. సంగీత ప్రదర్శనము వలన మాత్రమే దీనిని ఋజువు పరచుటకు

సాధ్యపడును. ఈనాడు జానపదగీతములు కుప్పలు తిప్ప లుగ వినవచ్చుచున్నవి. వీనియందు సారస్య మించుకయు నుండదు. ఇవి శాస్త్రమునకు విరుద్ధములు. భావప్రేరేపణము కావించుట కసమర్థములగు సామాన్యాంశముల సంగీత ములో కూర్చుటకై ఈ గీతములు యత్నించును. ఇది శాస్త్రమునకు విరుద్ధము. భావమునకు సరిపడని లలితపదము లతో తాము తెలుపదలచిన యంశముల జోడించుట వీని యందలి రెండవ లోపము ఈ జానపదగీతములు ప్రకృతి విరుద్ధముగ నున్నవి. కావుననే ఇయ్యవి లోపభూయిష్ఠములు. ప్రకృతివిరుద్ధమగు సంగీతము శాస్త్రవిరుద్ధము.

కవిత్వమునకు కూడ పైయంశములే వర్తించును. భావము గంభీరముగను, ఉదాత్తముగను ఉన్నప్పుడు వాగ్ధో రణి మార్పునకు లోనగుట సహజము. సంగీతమునకును, కవిత్వమునకును కూడ ఇదియే మూలము. కవిత్వమందలి పదముల పొందిక, అందలి యుత్ప్రేక్షలు, అతిశయోక్తులు, వాక్యములందలి ఆకస్మికములగు పరివర్తనములు మున్నగు నవి మానవుడు భావోద్రేకమునకు గురియైనప్పుడు వాడు 'విశిష్టభాషకు ప్రతిబింబములు. భావశబలతకు లోనైన భాష యెట్టి మార్గముల నవలంబించునో ఆ సూత్రముల కవులు చక్కగ అవగాహన యొనర్చుకొనవలెను. భావశబలమగు భాషను అనుకరించి, ద్విగుణీకరించి వాడునప్పుడు సైతము కవి ఔచిత్యమునకు భిన్నముగ వర్తింపరాదు. తన సాధన

ముల నాతడు సంయమములేకుండ వాడరాదు. భావమునం దుద్రేకము సన్నగిల్లినప్పుడు కవి కవిత్వభాషను వాడరాదు. భావోద్రేకము పెరిగిన కొలదియు కవి తన భాషను ధారా ళముగ ప్రయోగింపనగును. భావోద్రేక మవధులను చేరి నప్పుడు భాష కూడ ఉత్తమస్థాయిని పొందవలెను. ఈ సూత్రములకు విరుద్ధముగ వ్రాయబడు కవిత్వము కేవల శబ్దా డంబరము మాత్రమే యగును. కేవల నీతి బోధకము లగు కార్యములందు పై సూత్రముల సంపూర్ణముగ ననుసరించు టకు వలనుపడదు. కవితాధర్మములను సంపూర్ణముగ నవ లంబించువారు మిక్కిలి అరుదు. కావుననే నిజమైన కవిత కూడ చాల అరుదుగ కానవచ్చును.

కళాకారుడు తాను చేపట్టిన కళకు సంబంధించిన సూత్రముల నెరింగిన చాలదు. తాను ప్రదర్శించిన కళను చూచినప్పుడు లేక వినినప్పుడు ప్రేక్షకుల, శ్రోతల మనస్సు లలో నెట్టి భావము కల్గునో తెలిసికొనుటకూడ ఆతనికి చాల అవసరము. ఈ యంశము మనస్తత్వశాస్త్రమునకు సంబంధించినది. ఏదైన నొక కళాఖండము ప్రేక్షకుల మన స్సులలో కల్గించు ప్రభావము ఆ ప్రేక్షకుల మనోవృత్తులపై ఆధారపడియుండును. మానవుల మనోవృత్తులయందు కొన్ని సామాన్యధర్మము లుండును. ఆ సామాన్యధర్మముల కను గుణ్యముగనే కళాసృష్టి సాగవలయును. అట్లు జరగినప్పుడే కళ ప్రజానీకము నాకర్షింపగల్గును. మనస్తత్వమును చక్కగ

గుర్తెరింగిననే కాని కళాకారుడు దానికి సంబంధించిన సూత్రముల నెరుంగజాలడు. ఏదైన నొక చిత్రము చక్కగ నున్నదా యని యెవరైన మిమ్ము ప్రశ్న వేసిరని తలంపుడు. ఆ చిత్రము ప్రేక్షకుల మనముల నెట్లు ప్రభావితము కావించిన దని దానియందలి యర్థము. ఏదైన నొక నాటకము మంచిదా కాదా యను జిజ్ఞాస ప్రారంభమైనదని యూహింపుము. ఆ నాటకము ప్రేక్షకుల దృష్టి నాకర్షించుటయందును, వారికి విసువుదల కలుగకుండ చేయుటయందును ఎంతవరకు ఫలప్రదమైనదని యీ జిజ్ఞాస కర్థము. ఒక పద్యభాగమును కాని, నవలను కాని, ఒక వాక్యమును కాని కూర్చునప్పుడు శ్రోతల మనస్సులలో అనుకూలభావము లెంతవర కేర్పడుచున్నవా యను నంశము ముఖ్యముగ గమనింపదగినది. తెలుపునట్టి విషయము వినువారి మనస్సునకు సూటిగ నాటునట్లు వ్రాయ గల్గుట ఉత్తమ రచనకు లక్షణము. ప్రతి కళాకారుడును తాను విద్యాభ్యాసము చేయు కాలమందును, తరువాతను కూడ తన కళాజీవితమునకు సంబంధించిన సామాన్యసూత్రముల ననేకముల గ్రహించును. వీని ననుసరించియే యాతని కళాసృష్టి సాగును. ఈ సూత్రముల యాంతర్యమును చక్కగ గ్రహించిన యెడల అయ్యవి మన తత్వశాస్త్రమునకు సంబంధించిన సూత్రములే యని మనము గ్రహింపజాలుదుము. ఈ మానసికధర్మములను, వాని యుపలక్షణములను చక్కగ గుర్తించినప్పుడే కళాకారుడు వాని కనుగుణ్యముగ వర్తింపగలడు.

శాస్త్రీయజ్ఞాన మున్నంతమాత్రమున నెవ్వడును కళా కారుడు కాజాలడు. భౌతికములును, కేవల భావాత్మకము లును అగు దృశ్యములకు సంబంధించిన సూత్రములను కళా కారుడు చక్కగ నవగాహనము కావించుకొనుట అతి ముఖ్యము. కాని సహజప్రజ్ఞ లేకుండ కేవలము వీనివలననే యెవ్వరును కళను సాధింపజాలరు. కవి, చిత్రకారుడు మున్నగు వారికి కల్గు ప్రజ్ఞ జన్మతః సిద్ధించును. ఈ ప్రజ్ఞ సాధనచే కల్గునది కాదు. కాని సహజప్రజ్ఞ యున్నంతమాత్రమున శాస్త్రీయజ్ఞానమును పూర్తిగ త్రోసిపుచ్చుటకు వలనుపడదు. సహజప్రజ్ఞ వలన మన మెన్నియో ఘనకార్యముల సాధింప వచ్చును. కాని పరిపూర్ణతను సాధింపజాలము. ఉపజ్ఞకును శాస్త్రమునకును సంయోగము కల్గినప్పుడే ఉత్తమ ఫలిత ములు సిద్ధించును.

ఉత్తమ మగు కళాసృష్టిని కావించుటకును, ప్రద ర్శించిన కళ నానందించుటకును కూడ శాస్త్రీయజ్ఞాన మావ శ్యకము. ఒక బాలునికంటె వయస్సువచ్చిన మానవు డొక కళాఖండము వలన నెక్కుడు ఆనందమును పొందగల్గుచున్నాడు. ప్రకృతియందును, జీవితమునందును ఇమిడియున్న సత్యముల నాతడు చక్కగ గ్రహించి యుండుటయే ఇందులకు కార ణము. ఒక చక్కని గీతము నందలి మాధుర్యమును విజ్ఞాన వంతుడగు నొక పురుషుడు తెలిసికొనినట్లుగ చదువు సంధ్యలు లేని మోటుమానిసి తెలిసికొనజాలడు. జీవితము నందలి వివిధ

దృశ్యములను, వివిధ కార్యకలాపములను విజ్ఞాని యగువాడు చూచియుండుటయే పై భేదమునకు కారణము. ప్రదర్శింపబడిన దృశ్యములను కొంతవరకు తెలిసికొనినయెడల మనకు పరిమితమగు నానందము లభించును. ఆ దృశ్యమును సంపూర్ణముగ నవగాహన మొనర్చుకొనిన యెడల మనకు సంపూర్ణమగు నానందము సిద్ధించును. కళయందు ప్రదర్శింపబడు ప్రతి నూతన సత్యమును, దానిని గ్రహింపజాలిన వారి కధికతరానందమును చేకూర్చును. ఆ సత్యమును గ్రహింపని యూతడా యానందమును పొందజాలడు. కళాకారుడు తన కళయం దెన్ని నూతన సత్యములను ప్రదర్శించిన నాతని కళ భిన్నభిన్న రుచులు, శక్తులుకల వారి కానందము కలుగ జేయును; భిన్నవిభిన్న భావముల రేకెత్తించును; అధికతరానందమును చేకూర్చును. కాని యానందమును పొందుటకు పూర్వము ప్రేక్షకుడు, శ్రోత, చదువరి మున్నగువారు కళాకారునిచే ప్రదర్శింపబడిన సత్యము నర్థము కావించుకొనవలెను. విషయములను గ్రహించుట యనగా శాస్త్రమును సాధించుటయే కాని వేరు కాదు.

సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము, శిల్పము మున్నగు కళలు శాస్త్రవిజ్ఞానముపై ఆధారపడి యున్నట్లు పైన తెల్పియున్నాము. అంతేకాదు. శాస్త్రమునందే కవితాలక్షణము లున్నవని తెలుపుటకు మేము సాహసించుచున్నాము. శాస్త్రవిజ్ఞానమును, కవితయును అన్యోన్య

విరుద్ధములని కొందరు తలంతురు. అది వట్టి భ్రమ. మనో
రంగమున కల్గు భావోద్రేకమునకును, కేవల జ్ఞానమునకును
భేదము కలదని యంగీకరింపవచ్చును. నిరంత రాలోచనము
వలన భావోద్రేకము క్షీణించును. అదే విధముగ నిరంతర
భావప్రాబల్యము విచారణాశక్తిని కుందువడ జేయును. ఈ
విధముగ నుపలక్షించినచో నొక విధమగు శక్తి వేరొకశక్తికి
ప్రతికూలమగుట సహజము. కాని శాస్త్రీయ విజ్ఞానమునందలి
యంశములలో కవిత (సౌందర్యము) లేదనియు, శాస్త్రీయ
విజ్ఞానాసక్తిని పెంపొందించుకొనుటవలన భావనాశక్తియు,
సౌందర్యపిపాసయు నశించు ననియు భావించుట తప్పు.
శాస్త్రీయవిజ్ఞానము లేనట్టివారు కన్గొనజాలని అనేక నూతన
సుందరదృశ్యములను, ఊహింపజాలని రమణీయభావములను,
శాస్త్రజ్ఞానము కలవారు కన్గొని ఆనందింపజాలుదురు. భూగర్భ
శాస్త్రము, అర్ణవశాస్త్రము మున్నగు విజ్ఞానశాఖలలో పరి
శోధన కావించువారికి నిరంతరము అతి సుందరములును,
నూతనములు నగు సన్నివేశములును ప్రత్యక్ష మగుచుండును.
గెటే మహాకవి జీవితమును శ్రద్ధగ పరిశీలించినచో కవితా
శక్తియు, విజ్ఞానాపేక్షయు, ఒకే వ్యక్తియం దిమిడి యుండ
వచ్చు ననుటకు తార్కాణము లభించును. ప్రకృతిని గాఢ
ముగ పరిశీలించిన కొలదియు తత్సౌందర్యము నెడల మనకు
గౌరవము హెచ్చునే కాని తక్కువ కాజాలదు. శాస్త్రీయ
జ్ఞానము లేనివాని కొక నీటిబిందువులో విశేష మేమియు

కానరాదు. నీటి బిందువులోని భిన్నవిభాగముల నొక విశిష్ట శక్తి సమైక్యపరచి యుంచుచున్నదనియు, ఆ శక్తిని విడుదల చేసినచో విద్యుత్ప్రకాశము కానవచ్చుననియు ఒక్క శాస్త్రజ్ఞునికి మాత్రమే తెలియును. మంచువాన కురియుచున్నప్పుడు సామాన్యమానవుడు దాని నుపేక్షాభావముతో చూచును. శాస్త్రజ్ఞుడు దుర్భిణీయంత్రసహాయమున నామంచుతునకలలో భిన్నవిభిన్నాకారములుగల సుందరస్ఫటికములగాంచి, వానికి ప్రకృతి యందలి యున్నతశక్తులతో సంబంధము కల్పించుకొనును. అతి ప్రాచీనమగు శిలలను గాంచి అజ్ఞాని యగువాడు స్తబ్ధముగ నూరకుండును. భూగర్భశాస్త్రవేత్త ఈరాతి యందు గల వివిధములగు పొరలు కొని సహస్రాబ్దములలో నేర్పడినవని యెరుంగగల్గును. ఆ జ్ఞాన మాశాస్త్రవేత్త హృదయాంతరాళమున కవితా తరంగముల నుప్పతిల్లజేయ దని పల్కుట కెవ్వరు సాహసింతురు! నిజమునకు మన పరిసరములందే యెంతయో కవితాసామగ్రి కలదు. కాని అజ్ఞానులగు వారికీ యంశము తెలియదు. క్రొత్త క్రొత్త మొక్కలను, పురుగులను సంపాదించి జాగ్రత్త చేయువానికి తన చుట్టు ప్రక్కల పెరుగు తీగలలోను డొంకలలోను సౌందర్యము కానిపించును. రకరకములగు రాళ్ళ నేరి తెచ్చుట కలవాటుపడిన బాలకునికి భూగర్భమునం దెట్టి సంపద దాగియున్నదో కొంతవరకైన గోచరించును. దుర్భిణీయంత్రముతో నీటి యందలి వివిధజీవముల కనుగొన గల్గినవాడే సముద్రము

యొక్క నిజమగు సౌందర్యము నానందింపజాలుము. మన పరిసరములందు అనగా భూమిపైనను, ఆకాశముపైనను అద్భుతావహములగు నెన్నియో యంశములు కానవచ్చు చుండగా ఎచ్చటనో చరిత్రయందలి ఒక మారుమూలవ్యక్తిని గూర్చియో, లేక ప్రాచీనకాలమునాటి ఏదో ఒక పద్యభాగ మును గూర్చియో తలలు పగులగొట్టుకొనువారి నేమన వల యునో తోచకున్నది. ప్రకృతి రచించిన మహాకావ్యముల నలక్ష్యము చేసి మానవనిర్మితములగు కావ్యముల పొంతకు పరువెత్తుట యేమంత వివేకమో యూహింపుడు.

సౌందర్యోపాసనమునకై శాస్త్రీయవిజ్ఞాన మావశ్యక మనియు, శాస్త్రీయసిద్ధాంతముల మూలముననే మనము కళా నిర్మాణముల సవిమర్శముగ నెరుంగజాలుదు మనియు తెలిసి కొని యున్నారము. శాస్త్రము కవితకును, కళకును సహాయక మైనది. అంతేకాదు. శాస్త్రములో కవిత ఇమిడియున్నది. శాస్త్రీయరంగములోనే కాక జీవితమందలి యితర రంగము లలో కూడ శాస్త్రీయవిజ్ఞానము చాల ముఖ్యమని మనము తెలిసికొనగలము.

వివిధవిషయములకు సంబంధించిన జ్ఞానము మనకు జీవిత నిర్వాహణమునం దెట్లు ఉపయోగకారి యగుచున్నదో తెలిసి కొని యున్నాము. ఆ విషయములు జీవితమునం దావశ్యక మగు క్రమశిక్షణ నొసంగుటలో యెంతవర కుపయోగపడు చున్నవో గ్రహించుట మన కిప్పుడవసరము. కాని దీనిని

గూర్చి దీర్ఘముగు చర్చను కావింపవలసిన యవసరము లేదు. ఈసందర్భమున నొక ముఖ్యమగు ప్రకృతిధర్మము గమనింప దగియున్నది. మనకు గల శక్తులను మిక్కిలి పొదుపుగ వాడు టకు తగిన వసతులను, అనుకూలతలను ప్రకృతి మాతయే కావించియున్నది. జీవితనిర్వహణమున కవసరమగు విజ్ఞాన మును సంపాదించుటకును, క్రమశిక్షణకై ఆవశ్యకమగు తరిఫీ దును పొందుటకును, మానవుడు వేరు వేరు యత్నముల చేయ నక్కరలేదు. ఈ రెండువిధము లగు శిక్షణలును మన కేక కాలముననే లభింపగలవు. ఒక పురుషుడు జీవిత సౌఖ్యము కొరకై ఏదైన నొకశక్తిని సాధింప దలచిన యెడల, తత్సం బంధములగు కార్యకలాపములలో పాల్గొనినపక్షమున ఆతని కా శక్తి లభించును. అందుల కొఱ కెట్టి కృత్రిమసాధనము లను అవలంబింప నక్కరలేదు. ఉదాహరణముగా అమెరికా లోని ఎఱ్ఱ ఇండియనుల గమనింపుడు. వారందరును అతివేగ ముగను, చురుకుదనముతోడను పరువెత్తి జంతువులను వేటాడ గలరు. ఈశక్తిని వీరు నిత్యము జంతువుల వేటను సాగించుట వలననే సంపాదించగల్గుదురు. నిత్యజీవితమునందలి యితర కార్యకలాపములవలన వారి శారీరికశక్తు లన్నియు సమాన ముగ వృద్ధిచెందును. జంతువుల వేటయం దీ యాదిమనివా సులు మిక్కిలి సున్నితమును, సూక్ష్మమును అగు పరిశీలనా శక్తిని ప్రదర్శింతురు. ఈసూక్ష్మగ్రహణశక్తి దీర్ఘమగు అను భవమువలన మాత్రమే కాని, ఇతర కృత్రిమసాధనములచే

లభింపదు. అతిదూరమునందున్న జంతువులను దూరదర్శినితో చూచినట్లుగ కనుగొని ఆస్ట్రేలియాఖండపు ఆటవికులు వాని వెంటనంటి తరిమి వేటాడుటయో లేక దాని నుండి తప్పించుకొని పారిపోవుటయో కావింతురు. బ్యాంకులలోను, ఇతర కార్యాలయములలోను పనిచేయు లేఖకులు దీర్ఘమగు అంకెల పట్టికలను సులభముగ కూడివేయుట మనము చూచుచున్నాము. ఈ పై రెంటికిని కూడ చిరకాలానుభవమే కారణము. నిత్యజీవితమున కావశ్యకములగు కార్యకలాపముల తరచు చేయుచుండుటచే మనకీ యనుభవము లభించును. కావున నిత్యజీవితమున కావశ్యకమగు పనిపాటల వలన మనకు క్రమశిక్షణకూడ తోడ్తోడనే లభించును. ఈ యంశ మందెంత సత్యము కలదో విచారింతము.

నేటి మన విద్యావిధానమునందు భాషల కధిక ప్రాధాన్య మొసంగు చున్నారు. భాషల నభ్యసించుట వలన జ్ఞాపకశక్తి వృద్ధిచెందు నని వీరివాదము. కాని జ్ఞాపకశక్తిని బలపరచుటకు సాధనము నూతన పదముల వల్లె వేయుట యొక్కటియే కాదు. శాస్త్రీయవిజ్ఞానము సంపాదించుటలో కూడ నీ శక్తి పెంపొందును. సూర్యకుటుంబమును గూర్చి కాని, నక్షత్రమండలమును గూర్చి కాని పఠించువారికి, వానికి సంబంధించిన వివరముల జ్ఞప్తియుంచుకొనుట యెంత కష్టమో బోధపడును. అనుదినమును రసాయనద్రవ్యముల సంఖ్య పెరిగిపోవు చున్నది. వీని పేళ్ళ నన్నిటిని జ్ఞప్తియుంచు

కొనుట యే మహాపండితునికో కాని సామాన్యులకు సాధ్యము కాదు. జీవితమునంతను అందులకై ధారపోసిన వారికి తప్ప వివిధ రసాయన ద్రవ్యముల సంపుటీకరణమును, వివిధ ద్రవ్యముల అన్యోన్యసంబంధమును తెలిసికొనుట దుస్సాధ్యము. భూతలముపైనను, భూగర్భము నందలి పొరలలోను గల దృశ్యముల నర్థముచేసికొని, వాని నన్నిటిని చక్కగ జ్ఞప్తి యందుంచు కొనుటకై భూగర్భపరిశోధకుని కనేక సంవత్సరముల కాలముపట్టును. పదార్థవిజ్ఞానశాస్త్రమునందలి ప్రతి శాఖయందును కూడ—అనగా ధ్వని, ఉష్ణము, కాంతి, విద్యుచ్ఛక్తి మున్నగు ఒక్కొక్క విభాగములో జ్ఞాపకము చేయవలసిన యంశముల గుర్తించిన యెడల ఎట్టి వారికిని బెదరు కలుగకమానదు. శారీరకశాస్త్రములను గూర్చి విచారించిన యెడల, అవి జ్ఞాపకశక్తికి కల్పించు పని ఇంకను మితిమీరి యుండును. మానవశరీరమునందు గల విభాగము లసంఖ్యాకముగ నున్నవి. వైద్యశాస్త్రమును పఠించు విద్యార్థి పీటని మరల మరల జపించినకాని అవి మనస్సునకు పట్టవు. వృక్షశాస్త్రజ్ఞుడు మూడులక్షల ఇరువదివేల సంఖ్యగల వేర్వేరు వృక్షములను, మొక్కలను జ్ఞప్తి యందుంచుకొనవలయును. జీవశాస్త్రజ్ఞునికి ఇరువది లక్షల వేరువేరు జీవజంతువులతో ఎల్లప్పుడును పని కల్గుచుండును. శాస్త్రీయ విషయము లనుదినము కూడ అపారముగ వృద్ధి చెందుచున్నవి. అందువలన శాస్త్రజ్ఞులు తమ తమ విజ్ఞానమును శాఖలుగను, ఉపశాఖలు

గను విభజించి ఒక్కొక్క విభాగమును మాత్రమే పఠించు టకై యత్నించుచున్నారు. ప్రతిశాస్త్రజ్ఞుడును తన శాస్త్ర విభాగమునందు మాత్రమే నిష్ణాతుడుకాగలడు. ఆ శాస్త్రము నందలి యితర విభాగములతో ఆతనికి సామాన్యపరిచయము మాత్రముండును. తనశాస్త్రముతో సంబంధముగల యితర శాస్త్రములతో ఆతనికి దూరపరిచయము మాత్రము కల్గును. కావున జ్ఞాపకశక్తిని క్రమశిక్షణకు లోను కావించి, అభివృద్ధి పరచుటకై సామాన్యముగ శాస్త్రవిజ్ఞానము కూడ ఎంతయో ఉపయోగకారి యగునని నిస్సంశయముగ తెలుపవచ్చును. బుద్ధిని తీవ్రతర మొనర్చుటలో శాస్త్రీయవిజ్ఞానము, భాషా విజ్ఞానమున కేవిధముగను తీసిపోదు. అంతే కాదు.

జ్ఞాపకశక్తిని వృద్ధి పొందించుటలో శాస్త్రపఠన మొసంగు శిక్షణ కేవల భాషాభ్యాసము వలన లభించు శిక్షణ కంటె శ్రేష్ఠతరమైనది. వివిధభావములు మన మనస్సునకు హత్తుకొని పోవలయుననినచో వానికి సన్నిహితమగు అన్యోన్య సంబంధముండవలయును. భాషాబోధ కావించు నప్పుడు తెలుపబడునట్టి విషయముల కిట్టి దగ్గర సంబంధముండజాలదు. వివిధపదములకును వాని యర్థమునకును చాల సందర్భము లలో ప్రకృతిసిద్ధమగు సంబంధముండుననుట నిజమే. ఈ పద ముల పుట్టుపూర్వోత్తరముల శ్రద్ధగ పరిశీలించినచో వీనికి మొదటినుండియును కూడ బాంధవ్యముండినట్లు మనము తెలిసికొనవచ్చును. శబ్దముల యన్యోన్య సంబంధమును విశద

పరచు శాస్త్రము శబ్దతత్వశాస్త్రము. కాని మనము సర్వ సాధారణముగ కావించు భాషాబోధనయందు పదములకును వాని యర్థమునకును గల అన్యోన్యసంబంధములు కాని, తద్విషయికమగు శాస్త్రీయసూత్రములు కాని విద్యార్థులకు విశదీకరింపబడవు. కావున శబ్దమునకును, దాని యర్థమున కును గల సంబంధము కేవలము యాదృచ్ఛికమను భావము విద్యార్థి మనస్సులో కల్గుచున్నది. కాని శాస్త్రీయవిజ్ఞానము నందు వివిధభావములకు కార్యకారణసంబంధముండి తీరును. ఈయంశమును సక్రమపద్ధతులపై బోధించినచో విద్యార్థులు దానిని చక్కగ గ్రహింతురు. భాషాభ్యాసము కావించు వారు కార్యకారణసంబంధములు లేని యంశముల నేర్తురు. శాస్త్రపఠనము చేయువారు కార్యకారణసంబంధము గల విషయముల గ్రహింతురు. భాషాభ్యాసము జ్ఞాపకశక్తిని మాత్రము బలపరచును. శాస్త్రాభ్యాసము జ్ఞాపకశక్తిని, వివేచనాశక్తిని కూడ పెంపొందించును.

భాషాభ్యాసముకంటె శాస్త్రపఠనము శ్రేష్ఠతరమగు మానసిక శిక్షణ నొసంగును. దీని వలన విషయనిర్ధారణ కావించు శక్తి యేర్పడును. సర్వసాధారణముగ మానవు లందరి యందును కూడ నిర్ధారణాశక్తి కుంటువడియుండును. ఇది యొక గొప్పలోప మని తెల్పుట కెట్టి సంశయమును లేదు. విషయనిర్ధారణమును కావించుట కావశ్యకమగు క్రమ శిక్షణను మన విద్యావిధానము కల్పించుటలేదు. అంతేకాదు

ఇట్టి క్రమశిక్షణ యొసంగబడుట లేదను యంశము కూడ మనలో పలువురకు తెలియదని మహావిజ్ఞాని యగు ఫారడే పండితుడు వాక్రుచ్చుచున్నాడు. శాస్త్రీయవిజ్ఞానము చక్కగ వ్యాప్తిచెందకుండుటయే దీనికి కారణమని యా విజ్ఞాని యభిప్రాయము. ఆతని యభిప్రాయము ముమ్మాటికిని సత్యము. మన పరిసరములలో కానవచ్చు దృశ్యము లొండొంటిపై యెట్లు ఆధారపడియున్నవో చక్కగ తెలిసికొన్నప్పుడే వివిధవస్తువులు, సంఘటనలు, వాని ఫలితములు మున్నగు వానిని గూర్చి సరియగు నిర్ణయముల కావించుకొనగల్గుదుము. శబ్దములను, శబ్దార్థములను ఎంతగ నేర్చినను వివిధ సంఘటనల కార్యకారణ సంబంధములను గుర్తింపగల్గు శక్తి యేర్పడదు. ప్రదర్శితమగు సంశయముల నుండి నిర్ణయముల కావించి. ఆ నిర్ణయముల సత్యాసత్యములను స్వపరిశీలనమువలనను, ప్రయోగముల వలనను కనుగొనుటచే నిర్ధారణాశక్తి వృద్ధిచెందును. ఇట్టి శక్తిని కల్గించుట శాస్త్రపఠనము నందలి ముఖ్య ప్రయోజనములలో నొకటి.

శాస్త్రాభ్యాసము మానసిక శిక్షణకే కాక నైతిక శిక్షణకై కూడ చాల ఉపయోగకారి యగును. భాషాభ్యాసము వలన మానవులయందు సహజముగ నెలకొనియుండు సాంప్రదాయగౌరవము, అధికారికశక్తుల యెడ మన్నన మున్నగు గుణము లింకను బలపడును. ఉపాధ్యాయులును, నిఘంటువులును ఈ పదము యొక్క అర్థ మిది యని శాసించి

చెప్పును. వ్యాకరణము భాషాసూత్రములను విధించును. విద్యార్థి ఈ యంశములు నిస్సంశయములని భావించి విశ్వసించును. కావున విధింపబడు శాసనముల నెట్టి యనుమానమును లేకుండ నమ్మునట్టి స్వభావము విద్యార్థియం దేర్పడును. సాంప్రదాయసిద్ధమగు ప్రతి యంశమును విచారణ లేకుండ అంగీకరించు అలవాటు విద్యార్థియం దేర్పడుట సహజము. శాస్త్రాభ్యాసమువలన నేర్పడు మానసికస్థితి యిందులకు పూర్తిగ భిన్నము. శాస్త్రము మానవుని విమర్శనాశక్తి కెల్లప్పుడును పని కల్పించుచుండును. అందలి సూత్రములను మనము పండితులనుండి అంధప్రాయముగ నంగీకరింప నవసరము లేదు. ప్రతివారికిని అందలి సత్యాసత్యముల తెలిసికొను స్వాతంత్ర్యము కలదు. అంతే కాదు. శాస్త్రాభ్యాసము కావించు ప్రతి విద్యార్థియు ఆ యా సూత్రములను గూర్చి తర్కించి తన నిర్ణయముల తాను కావించుకొన వలసి యుండును. శాస్త్రీయపరిశోధన యందలి ప్రతి యంశమును కూడ స్వబుద్ధిచే నిర్ణయించుకొనవచ్చును. ఏ విషయమును కూడ తాను స్వయముగ చూడకుండ నిజమని నమ్మవలసిన యావశ్యకత యాతనికిలేదు. ప్రదర్శితాంశములనుండి నిర్దుష్టమగు నిర్ణయముల కావించుకొను విద్యార్థిని ప్రకృతి యెల్లప్పుడును బలపరచుచుండును. ఈ విధముగ నాతనియం దాత్మవిశ్వాసము పెంపొందును. భావస్వాతంత్ర్యము నెలకొనును. ఇయ్యది మానవుని కావశ్యకమగు, ముఖ్యమగు

యోగ్యతలలో నొకటి. శాస్త్రాభ్యాసమువలన ఇతర నైతిక సద్గుణములు కూడ అలవడును. "స్వతంత్రమగు పరిశోధనను కావించు శాస్త్రజ్ఞునియందు పట్టుదలయు, ఆశయశుద్ధియు, నిష్కాలుష్యమును వృద్ధిచెందును. సత్యాన్వేషణపరుడగు వాని యందు నిరంతరకృషియు, ప్రకృతిచే వ్యక్తీకరింపబడు సత్యములను సవినయముగను, హృదయపూర్వకముగను అంగీకరించు మనఃప్రవృత్తియు పెంపొందును. శాస్త్రీయ రంగములో విజయమును సాధింపగోరువారియందీ క్రింది లక్షణములు తప్పక నెలకొని యుండవలెను. పరిశోధన వలన తేలిన యంశముల నాతడు మనఃపూర్వకముగ నంగీకరింపవలెను. సత్యదూరములని నిర్ణయమైన విషయములు తన కెంత ప్రీతికరములైనను వాని నాతడు విడచిపుచ్చవలెను. శాస్త్రీయ విజ్ఞానము నారాధించు ప్రతి అన్వేషకుని ఆంతరంగికజీవితమందును అసాధారణమును, ఉదాత్తమును అగు స్వార్థరహితత్వము కానవచ్చును" అని టిండాల్ పండితుడు అభిప్రాయపడుచున్నాడు.

శాస్త్రాభ్యాసమువలన ధార్మికవిజ్ఞానము కూడ లభించునని తెల్పుటకు మేము సాహసించుచున్నాము. ఈ యంశము పలువుర కాశ్చర్యము కల్గింపవచ్చును. అయినను ఇయ్యది ముమ్మాటికిని నిజము. శాస్త్రీయవిజ్ఞానము, ధార్మికజీవితము అను పదములను మే మతివిస్తృతమగు నర్థములో ప్రయోగించుచున్నాము. సంకుచితార్థములో వీనిని మేము వాడుట

లేదు. మతము పేరిట ప్రజానీకములో వ్యాపించియున్న మూఢవిశ్వాసములకు శాస్త్రీయవిజ్ఞానము బద్ధశత్రు వను మాట నిస్సంశయము. కాని యీ మూఢవిశ్వాసముల వెనుక మరుగుపడియున్న నిజమగు మతతత్త్వముతో శాస్త్రి విజ్ఞాన మున కెట్టి వైరుధ్యమును లేదు. ఈ నాడు సర్వసామాన్య ముగ వ్యాప్తియందున్న శాస్త్రీయభావములందు నాస్తికత నెలకొని యున్నదని మే మంగీకరింతుము. కాని యీ శాస్త్రీయ విజ్ఞానములో నిజమగు సత్తువ సున్న. గంభీరమగు శాస్త్రీయ విజ్ఞానములో ధార్మికతత్త్వమునకు భిన్నమైన యంశ మేది యును లేదు.

"సత్యమగు శాస్త్రీయవిజ్ఞానమును, సత్యమగు మత ధర్మమును అక్కచెల్లెండ్ర వంటివి. ఒకదానినుండి వేరొక దానిని వేరుపరచుటకై యత్నించినచో రెంటికిని నష్టము సంభవించుట తథ్యము. మతధర్మముల కనుకూలముగ నున్నంతవరకే శాస్త్రీయవిజ్ఞాన మభివృద్ధి గాంచగలదు. సక్రమములును, శాస్త్రీయములు నగు సిద్ధాంతములపై ఆధార పడియుండిన పక్షముననే మతధర్మములకు పెంపు గల్గును. మహనీయులైన తత్త్వవేత్తలు కన్గొనిన మహద్విషయములు కేవలము వారి మానసికశక్తుల వలన సాధింపబడినవి కావు. ధార్మికశక్తు లా మనస్సును నడపుటవలననే వారు మహా త్కార్యముల కావింపగల్గిరి. పట్టుదల, భక్తిశ్రద్ధలు, ఏకా గ్రత, స్వార్థరాహిత్యముల వలన వారు సత్యదర్శనము

కావింప గల్గిరి. కేవల బుద్ధిసూక్ష్మత వారి విజయములకు మూలము కాదు.” అని హాక్స్లీ పండితు డిటీవల నొక ఉపన్యాసపు టుపసంహారమున పల్కెను.

శాస్త్రీయవిజ్ఞానము మతధర్మమున కెంతమాత్రమును విరుద్ధము కాదు. అంతేకాదు. శాస్త్రీయవిజ్ఞానము నలక్ష్యము చేయుటయే మతవిరుద్ధము. మన పరిసరములందు గల ప్రకృతిని శ్రద్ధగ తెలిసికొనక పోవుటయే మతమున కపచారము. ఈ క్రింది సామ్యమును గమనింపుడు. ఒక మహాకవిని మీ రత్యంతము గౌరవింతురని భావింపుడు. ఆ కవిపుంగవుని కావ్యము లుత్తమోత్తమములైన కారణమున మీ రాతనికి నిత్యమును నమస్కరించుచు, ఆతనిని భూషణవాక్యములచే స్తోత్రము చేయుచుందురని భావింపుడు. కాని ఆతను వ్రాసిన గ్రంథముల పఠించి, అందలి ప్రాశస్త్యమును గ్రహించుటకై మీ రించుకయును యత్నము కావింపని యెడల మీ కా కవిశ్రేష్ఠునిపై గల గౌరవ మేపాటిదో ఇంచుక యోచింపుడు. సామాన్య మానవులు ప్రపంచమును గూర్చియు, తత్సృష్టికర్తను గూర్చియు అవలంబించు పద్ధతు లించుమించుగ నిట్టివే యని తెల్పుట అతిశయోక్తి కాదు ఈ విశ్వ మత్యద్భుతమైన దనియు, దీనిని సృష్టించిన పరమేశ్వరుడు వర్ణనాతీతు డనియు ఒకవంక పల్కుచు, సామాన్య మానవులా సృష్టిని కాని, సృష్టికర్తను కాని పరిశీలింపరు. సృష్టివైచిత్ర్యముల శ్రద్ధగ గమనించు శాస్త్రజ్ఞులను వీరు నిరసన

దృష్టితో చూచుచు, వారు వ్యర్థులను భావమును ప్రకటిం తురు. ఈ పద్ధతి యెంత సమంజసమో మీరే గమనింపుడు. కావున శాస్త్రీయవిజ్ఞానము నలక్ష్యము కావించుట మత ధర్మమునకు విరుద్ధమని మేము మరల తెల్పుచున్నాము. శాస్త్రీయవిజ్ఞానమును సాధించుట భగవత్సేవ యని వర్ణింప వచ్చును. ప్రకృతియందలి ఘనతను, దాని మూలమున ప్రకృతిని సృష్టించిన యీశ్వరుని మహాత్వమును శాస్త్రజ్ఞుడు గుర్తించుచున్నాడు. ఇయ్యది ప్రత్యక్షముగను, పరోక్షము గను కూడ భగవత్సేవ యని అందరును అంగీకరింపవలెను. శాస్త్రజ్ఞుడు కావించు భగవత్పూజ కేవలము బాహ్యాడంబ రము కాదు. అతడు తన దైహిక మానసిక శక్తులను, తన అమూల్యమగు కాలమును వ్యయపరచి పరమేశ్వరుని కొల్చుచున్నాడు.

మఱియొక విషయమునందు కూడ శాస్త్రీయ విజ్ఞా నము మతధర్మముల కత్యంత సన్నిహితముగ నున్నది. మన పరిసరములందు సంభవించు సంఘటనలన్నిటి యందును కొన్ని శాశ్వతసామాన్యధర్మములు కాన్పించునను యంశ మును శాస్త్రీయవిజ్ఞానము బోధించును. ఈ ధర్మములయెడ గౌరవమును, అచంచల విశ్వాసమును శాస్త్రీయవిజ్ఞానము కల్పించును. అనుభవము వలనను, నిరంతర పరిశీలనము వలనను వివిధసంఘటనల యందలి కార్యకారణభావమును, అవినాభావసంబంధమును, దుష్ఫలితములను, సత్ఫలితము

లను శాస్త్రజ్ఞుడు తెలిసికొనును. సామాన్య మానవులు తాము కావించు కృత్యములవలన మంచియో చెడుగో సంభవించునని ప్రాచీనాచారముల ననుసరించి స్థూలముగ నమ్మెదరు. ధర్మవిరుద్ధముగ వర్తించినను కూడ దుష్టపరిణామముల నుండి తప్పించుకొనవచ్చు నని వారు భ్రమపడుచుందురు. శాస్త్రజ్ఞు డట్లు కాక మనము కావించు కృత్యములందే మంచి చెడుగు లంతర్గర్భితములై యున్న యంశమును స్పష్టముగ తెలిసికొనును. దుష్కార్యములు కావించిన దుష్టపరిణామములు తప్పవని యాతడు గుర్తించును. మానవజీవితమును బంధించు సూత్రములు క్షేమంకరములును, అవిలంఘ్యములు నని శాస్త్రజ్ఞుడు గ్రహించును. ప్రకృతి సూత్రముల కనుగుణ్యముగ వర్తించినందువలన అధికతరానందమును, జీవిత విధానమునకు సంపూర్ణతయు సిద్ధించునని యాతని కెరుకపడును. కావున ప్రకృతి ధర్మముల గౌరవింపవలసినదిగా ఆత డెల్లప్పుడును బోధించును. అందులకు భిన్నముగా వర్తించిన నాతని కాగ్రహము కల్గును. ప్రకృతి సూత్రముల శాశ్వతత్వమును గుర్తించి, వాని ననుసరింపవలసిన యావశ్యకతను తరచు బలపరచుచుండుటచే శాస్త్రజ్ఞుడు నిజమైన యర్థములో ధర్మపరుడని పల్కుట యెంతమాత్రమును అతిశయోక్తి కానేరదు.

శాస్త్రవిజ్ఞానము మూలముననే మానవుడు స్వస్వరూపమును, సృష్టి రహస్యములను తెలిసికొన గల్గుచున్నాడు. శాస్త్రవిజ్ఞానము మానవుడు తెలిసికొనగల విషయముల

నన్నిటిని ఆతనికి తెలియజేయుటయేకాక, ఆత డెరుంగ గల్గిన విషయ సంగ్రహముయొక్క యెల్లలను స్పష్టముగ చూపును. సృష్టికంతకును మూలకారణమును, ప్రధమ శక్తిని తెలిసి కొనుట దుస్సాధ్య మను నంశమును శాస్త్రవిజ్ఞానము మన కెరుక పరచును. కాని యీ ఎరుక కేవల తర్కవాదముపై నాధారపడదు. అన్ని దెసలందును మన మేయే విషయముల తెలిసికొనగలమో వానిని మన కెరుక గావించి, ఆ హద్దులను దాటుట అశక్య మను సత్యమును మనంత మనమే తెలిసికొనునట్లు శాస్త్రవిజ్ఞానము కావించును. మానవ బుద్ధి కతీతమగు మహద్విషయముల ముందు, పరిమితమగు మానవుని ధీశక్తి యెంత అల్పమైనదో శాస్త్రవిజ్ఞానము మూలముగ తెలిసినట్లు మన కితర సాధనములవలన తెలియదు. అజ్ఞులగు సామాన్య మానవుల విశ్వాసములను, ఆచారములను శాస్త్రము సాధికారముగ తిరస్కరించును. కాని సృష్టి కంతకును మూలాధారమగు మహత్తరశక్తి మరుగుపరచు దుర్భేద్యమగు తెరముందట శాస్త్రజ్ఞుడు వినమ్రుడై తల వంచును. ఈ నమ్రతయు, అధికారమును కూడ సత్యములైనవి. శాస్త్రజ్ఞు డనగా కొలతలను కావించువారును, రసాయనద్రవ్యములను పరిశోధన చేయువారును, వివిధ జీవుల పట్టికలను సిద్ధముచేయువారును అని తలంపరాదు. సామాన్య సత్యముల మూలమున నున్నత సత్యములను, తన్మూలముగ నుత్తమోత్తమ మగు సత్యమును తెలిసికొనువారు నిజమగు

శాస్త్రజ్ఞులు. ప్రకృతి, జీవితము, మానవవిజ్ఞానముల మూల మున నవ్యక్తమగు పరబ్రహ్మపదార్థమును మానవుడు తెలిసి కొనజాలడు. అంతేకాదు. ఆ మహత్తరశక్తి మానవుని యూహాశక్తికి కూడ అతీతమైనదను విషయమును సక్రమ మగు శాస్త్రీయవిజ్ఞానమును సాధించిన యాతడే తెలిసికొన గల్గును.

కావున విషయపరిజ్ఞానముకొరకును, మానసిక శిక్షణ కొరకును కూడ శాస్త్రవిజ్ఞానము చాల యవసరమని మనము నిశ్చయింపవచ్చును. కేవలము పదముల యర్థము తెలిసి కొనుట కంటె వస్తుజాలము యొక్క ఆంతర్యమును గ్రహిం చుట యెక్కుడు ముఖ్యము. మానవుని మానసిక, నైతిక, ధార్మికశక్తుల నభివృద్ధి కావించుటకై మన పరిసరములలోని దృశ్యముల చక్కగ నవగాహన మొనర్చు కొనుటయే ఉత్తమ విద్యకు సరియగు సాధనము. వ్యాకరణ సూత్రముల వల్లె వేయుటవలనను, నిఘంటువులను కంఠస్థము చేయుట వలనను ఈ లక్ష్యమును సాధింపలేము.

ఎట్టి విజ్ఞానమును మనము సాధింపవలెనను సమస్యతో మన మీ ప్రకరణమును ప్రారంభించితిమి. ఏ విధముగ నాలోచించినను శాస్త్రీయవిజ్ఞానమే మన కత్యంతావశ్యక మైనదని ఇప్పుడు తెలిసికొన గల్గితిమి. ప్రత్యక్షమగు నాత్మ సంరక్షణము కొరకును, ఆరోగ్యమును కాపాడుకొనుటకును, జీవితమును రక్షించుకొనుటకును శాస్త్రవిజ్ఞానము ముఖ్యము.

పరోక్షముగ నాత్మసంరక్షణము కావించుకొనుటకు అనగా జీవనోపాధిని సంపాదించుటకు శాస్త్రవిజ్ఞాన మావశ్యకము. పైతృకధర్మములను సక్రమముగ నిర్వర్తించు మార్గముల చూపుటలో కూడ శాస్త్రవిజ్ఞానమే మనకు సహాయకారి యగుచున్నది. జాతీయజీవితము యొక్క పూర్వాపరముల చక్కగ గ్రహింపనినాడే పౌరుడునుకూడ తన ధర్మములను సక్రమముగ నిర్వర్తింపజాలడు. ఈ సందర్భమునందు కూడ శాస్త్రవిజ్ఞానమే మనకు చేయూత నొసంగును. ఉత్తమ కళావిర్భావమునకును, కళాప్రాశస్త్యమును గుర్తించుటకును ఆవశ్యకమగు శిక్షను శాస్త్రీయవిజ్ఞానము మాత్రమే మన కొసంగగలదు. మానసిక, నైతిక, ధార్మిక రంగములందు మనలను సుశిక్షితుల గావించుటకు కూడ శాస్త్రవిజ్ఞానమే యేకైక సాధనము. మరియొక క్లిష్టప్రశ్నకు కూడ మన కిప్పుడు సులభముగ సమాధానము లభించుచున్నది. జీవిత రంగములోని వివిధ కార్యకలాపముల విజయవంతముగ నొనర్పగల్గుటకై మనము వివిధ విద్యలను సాధింప నవసర ములేదు. విశాలమగు నర్థములో శాస్త్రీయవిజ్ఞానమును ఆర్జించిన పక్షమున మానవుడు వివిధ ధర్మముల నిర్వర్తిం చుటకు సమర్థుడగును. శాస్త్రీయవిజ్ఞానము సర్వమానవుల కును, సర్వదేశములందును కూడ ఉపయోగకారి యైనది. ప్రతి మానవుడును భౌతిక, మానసిక, సాంఘిక జీవితముల గూర్చిన యన్ని ముఖ్యాంశములను తెలిసికొనవలెను. జీవిత

విజ్ఞానమునకు మూలకందమగు శాస్త్రవిజ్ఞానము నెల్లవారును సాధించుట అత్యవసరము.

శాస్త్రీయజ్ఞానము వలన మానవజాతికి కల్గిన లాభము లింతింత యని వర్ణింపజాలము. శాస్త్రీయవిజ్ఞాన మభివృద్ధి చెందుట వలన ఆహారపదార్థముల యుత్పత్తి విస్తారముగ హెచ్చినది. అందువలన వేలాది ప్రజలు సుఖముగ జీవనము గడపజాలుచున్నారు. ఆటవిక ప్రజలవలె దిగంబరులై అచ్చటచ్చట నడయాడుచుండెడి అనాగరక జనులు నేడు శాస్త్రీయవిజ్ఞాన సహాయమున నాగరకులై, గొప్ప జాతులుగ నేర్పడి అనేకసౌఖ్యముల ననుభవించుచున్నారు. శాస్త్రీయ విజ్ఞానము వ్యాప్తి చెందుట వలననే మానవులు మూఢ విశ్వాసములను విడనాడి నాగరకులై మెలగుచున్నారు. ఇన్ని లాభములు మనకు చేకూరుచున్నను మన విద్యాసంస్థల యందు శాస్త్రబోధనకు తగిన గౌరవస్థానము లభింపకపోవుట ఆశ్చర్యకరమగు నంశము కాదా!

పై యంశముల నాలంకారికముగ ప్రదర్శింపవలయు నన్నచో నిట్లు వర్ణింపవలసియుండును. వివిధ విజ్ఞాన కుటుంబములో శాస్త్రీయవిజ్ఞానము ఇంటిపనుల నన్నిటిని చక్కబెట్టుచు నిరాడంబరముగ కాలము గడపు నొక కష్టజీవి. ఈ పడుచులోగల గొప్ప యోగ్యతను గుర్తించువా రరుదు. కష్టమగు పనుల నన్నిటిని ఇంటివారీమెకే అంటగట్టెదరు. ఆమె బుద్ధి కుశలత, కార్యానురక్తి, చాకచక్యముల వలన

కుటుంబములోని అందరి కష్టములను గట్టెక్కుచున్నవి. ఈబిడ ఇతరుల సౌఖ్యము కొరకై నిరంతరము కష్టించుచు శ్రమపడుచున్నను ఈమె మంచితనము నెవ్వరును గుర్తింపరు. గర్విష్ఠలగు నీమె సోదరీమణులు (ఇతర విజ్ఞానశాఖలు) నిజమైన యోగత్యలేకున్నను ఆడంబరముగ నొయ్యారము లొలుకబోయుచు విహరించుచుందురు. కాని ఈ నాటకము పరివర్తనఘట్టమును సమీపించుచున్నది. ఇప్పుడు వివిధ వ్యక్తుల స్థితి మార్పు చెందక తప్పదు. గర్వాంధలగు నీమె తోబుట్టువులకు అవమానము తప్పదు. లోకము వారిని అర్హస్థానము నంపుంచి, శాస్త్రవిజ్ఞానము నందలి సౌందర్యమును, యోగ్యతను గుర్తించి, ఆమెను అర్హరీతిని గౌరవించి తీరును.



# మానసిక విద్య

వివిధ కాలములలో సంఘమునందు నెలకొనియున్న పరిస్థితులకును, ఆయా కాలములందు ప్రచారములో నుండెడి విద్యావిధానమునకును సంబంధముండుట అనివార్యము. ఇయ్యవి సమాజమునుండి యుత్పన్నమగును. కావున వీని యందు సమానధర్మములు నెలకొనియుండుట సహజము. మతధర్మములను మనము శాసనరూపముగ నితర వ్యక్తుల నుండి స్వీకరించుచున్న కాలమునందు, చిన్నబిడ్డల విద్యా విధానములోకూడ శాసనప్రవృత్తియే విస్తారముగ కాన్పించె డిది. "మేము ప్రవచనము కావించు నంశముల మీగు శిరసావహించి తీరవలెను" అని మతాధికారులు ఆజ్ఞాపించు కాలమున, పాఠశాలలయందు కూడ ఇట్టి వాతావరణమే ప్రబలి యుండెను. ఇందులకు విరుద్ధముగ నిప్పుడు ప్రాటస్టెంటు మతవ్యాప్తి వలన మతవిషయములలో కూడ వ్యక్తులకు స్వతంత్రాలోచన కావించుకొనుటకు హక్కు లభించినది. వివేచనాశక్తి కిప్పుడు అర్హస్థానము లభించుచున్నది. దాని కంగభూతముగ పాఠశాలలలో నేడు విద్యాబోధ కావించు నప్పుడు విషయముల నన్నిటిని అర్థసహితముగ నేర్వవలయు నను సూత్రము వ్యాప్తిలోనికి వచ్చినది. రాజకీయ రంగ ములో నిరంకుశప్రభుత్వము నెలకొనియున్న కాలమందు

పాలకులు పాలితులకు కఠినమగు నాజ్ఞల నొసంగుచుండెడి వారు. దౌర్జన్యమును, భీతియు పరిపాలనకు మూలబీజము లుగ నుండెడివి. స్వల్పమగు నేరములకు కూడ మరణదండన విధింపబడెడిది. ప్రభువునెడ ద్రోహము తలపెట్టిన వాని యెడల ప్రభుత్వము క్రూరమగు ప్రతీకార విధానము నవలంబించుచుండెడిది. ఆ కాలమున పాఠశాలలలో కూడ క్రమ శిక్షణ మిక్కిలి కర్కశముగ నుండెడిది. విద్యార్థు లనేక నిర్బంధములకు గురికావింపబడు చుండిరి. ఏదైన నియమము నుల్లంఘించినచో విద్యార్థి కఠినదండన పాలగుచుండెను. కాని రాజకీయస్వాతంత్ర్యము హెచ్చి, వ్యక్తులపై విధింప బడిన నిర్బంధములు సడలి, శిక్షాస్మృతియందలి కాఠిన్యము తొలగిన తరువాత పాఠశాలలలోని క్రమశిక్షణ కూడ మార్పు నకు లోనై విద్యావిధానమునందు నిర్బంధములు లేకుండ బోధింపవలెనను భావము వ్యాప్తి చెందుచున్నది. బాల బాలికలకు కఠిన నియమములచే బాధింపక, వారిని విశేష ముగ శిక్షింపకుండ విద్యను నేర్పు పద్ధతులు వాడుకలోనికి వచ్చుచున్నవి. ఒకానొక కాల మందు మానవు డెన్ని సౌఖ్య ముల వదలుకొని జీవింపగల్గినచో నాత డంత ఘను డను భావము సమాజములో ప్రబలి యుండెను. అట్టి కాలములో చిన్నబిడ్డలు ప్రకృతిసిద్ధముగ కావించు పనులనన్నిటిని నిరు త్సాహపరచి, నిరోధింపవలెనను సూత్రము ప్రచారములో నుండెను. కాని ఇప్పుడట్లు కాక సౌఖ్యమును కోరుట మాన

వుని సహజప్రవృత్తి యనియు, అయ్యది అక్రమము కాద నియు ప్రజలందరును తలంచు చున్నారు. కార్మికులు పని చేయవలసిన కాలము తగ్గింపబడు చున్నది. ప్రజానీకమున కానందము కల్గించుటకై ప్రత్యేకపు టేర్పాట్లు కావింపబడు చున్నవి. ఇందులకు ఫలితముగ తల్లిదండ్రులు నేడు తమ బిడ్డల కోర్కెలను నెరవేర్చుట తప్పుకాదనియు, బాల బాలి కల ఆటపాటలను ప్రోత్సహింపవలెననియు, క్రమవికాసము చెందుచున్న బాలహృదయము నందలి కోర్కెలు తా మిది వరలో భావించినంత చెడ్డవి కావనియు గ్రహించుచున్నారు. ఒకానొక కాలమున వ్యాపారపరిశ్రమాభి వృద్ధులను గూర్చి ప్రజలలో వింత భావము లుండెడివి. ప్రభుత్వ సహాయము వలనను, ప్రభుత్వనిర్బంధముల వలన మాత్రమే వ్యాపా రము వృద్ధిచెందు ననియు, ఉత్పత్తిదారులు వాడవలసిన ముడిసరకులను, వాని లక్షణములను, వాని ధరలను ప్రభుత్వ మేర్పాటు చేయవలెననియు, విత్తము యొక్క విలువను కూడ ప్రభుత్వమే నిర్ణయింపవలెననియు, ప్రజానీకము తలంచు చున్న కాలములో శిశుహృదయమును మన యిచ్చ వచ్చిన చొప్పున మార్పు కావింపవచ్చునని తల్లిదండ్రులును, ఉపా ధ్యాయులును భావించుచుండిరి. సమస్త విషయములను ఉపాధ్యాయుడు విద్యార్థికి బోధించు ననియు, బాలకుని మనస్సు ఉపాధ్యాయుని బోధనల గ్రహించుట కేర్పడిన యొక తొట్టి యనియు; అధ్యాపకుడే విద్యార్థి కారాధ్యమగు

ధ్యేయమనియు నెల్లరును తలంచుచుండిరి. కాని ఈ స్వేచ్ఛా వ్యాపార యుగములో మనము కొన్ని నూతన సత్యముల తెలిసికొనగల్గుచున్నాము. ప్రపంచమందలి ప్రత్యంశ మం దును ఆత్మపరిపాలన కావించుకొను శక్తి ఇమిడి యున్నట్లు మనము నేడు తెలిసికొనగల్గితిమి. కార్మికులు, వ్యాపారులు, వ్యవసాయదారులు మున్నగు వారును, నౌకా యానము మున్నగు వృత్తులును ప్రభుత్వ నిర్బంధములచే కంటె స్వతంత్ర ముగనే యెక్కుడు అభివృద్ధిని చెందునని మనము తెలిసి కొన్నాము. అట్లే పరిపాలనాశక్తి ప్రజలలోడినుం పుట్టుకొని రావలెనే కాని దాని నితరులు నిర్బంధముచే ప్రజలలో కల్పింపజాలరనియు తెలిసికొనవలెను. అదే విధముగ శిశు హృదయము తనంత తాను వికాసము చెందునట్టి స్వభా వము కలది. అందుల కొక ప్రత్యేక విధానము కలదు. ఆ విధానమును మనము మార్పు చేసినచో బాలబాలికలకు హాని సంభవించుట తప్పదు. వికాసము చెందుచున్న శిశు హృదయముపై మన కృత్రిమ విధానముల బలవంతముగ రుద్దుట తప్పు. మానసికరంగములో కూడ అవసరములనుబట్టి అభిరుచు లేర్పడుచుండును. ఈ నియమముల నుల్లంఘించిన పక్షమున మానవునికి హానిసంభవించుట తప్పదు. పూర్వ కాలమున మన సమాజమునందు నెలకొనియున్న అవిలంఘ్య ములగు మతధర్మములు, కఠినమగు క్రమశిక్షణ, వివిధనిర్బం ధములు, సౌఖ్యముల యెడ వైముఖ్యము, మానవ నిర్మిత

మగు విధానముల యెడ అకుంఠిత విశ్వాసము, ప్రకృతిసిద్ధ మగు విధానములయం దవిశ్వాసము మున్నగు లక్షణములు ఆ నాటి విద్యావిధానమునందు ప్రతిబింబితములై యుండె డివి. ఇందులకు విరుద్ధముగ విశాలదృక్పథము గల నేటి మన రాజకీయ సాంఘిక సంస్థల యందలి తత్త్వమే మన విద్యా విధానములో కూడ కానవచ్చుచున్నది.

మత, రాజకీయ, విద్యా విషయములందు కల్గుచున్న మార్పులు వివిధ పరిణామములకు త్రోవదీసినవి. భావము లన్నియు ఏకాగ్రములై ఒకే ప్రమాణము నంగీకరించి నప్పుడు భిన్నపంథలకు తావుండదు. కాని భావ మాచార శృంఖలములనుండియు, ప్రమాణముల నిర్బంధము నుండియు విడివడిన తరువాత నయ్యది బహుముఖములుగ ప్రవహించును. ఇచ్చట భావవాహిని ఏ ముఖముగ కాక బహు ముఖములుగ నుండును. నేఁడు విద్యారంగమునం దిట్టి స్థితిగతులు నెలకొని యున్నవి. విద్యావిధానములో నుత్తమోత్తమ మగు పద్ధతి యేదియో మన మింకను పూర్తిగ కన్గొనలేదు. కావున వాదోపవాదములు జరుపుటవలన సత్యమున కెట్టి నష్టమును సంభవింపదు. వివిధ విద్వాంసులు ఈ విషయము నందలి వివిధ శాఖలలో పరిశోధన కావించుటకు గడంగిన పక్షమున నయ్యది మన యాదర్శప్రాప్తి కుత్తమసాధనము కాగలదు. ప్రతిపండితుడును ఉత్తమ విద్యావిధానము కొరకై అన్వే షణ సాగించుట ప్రారంభించిన పక్షమున నాతని కొక

నూతనవిధానము స్ఫురింపవచ్చును. ఆ నూతనవిధానము నందలి బాగోగులను గూర్చి తర్క-వితర్కముల కావించు కొని తుట్టతుద కాతడు తన పథకమును నిర్దుష్టము కావించు కొనును. తాను కన్గొనిన యంశములు సత్యగర్భితములనియు, ఇతరుల వాదములు నిరాధారములనియు భావించుట వలన నీపండితు డితర విద్వాంసుల వాదములను తీవ్రముగ ఖండించును. ఈ విధముగ పండితులలో వాదవివాదములును, తర్క-వితర్కములును కొంత కాలము సాగిన వెనుక సత్య స్వరూపము గోచరము కాజొచ్చును. పథకముల నాచరణలో పెట్టి నప్పు డందలి లోపములు వ్యక్తమగును; ఆ లోపముల సవరించుటకు మరల ప్రయత్నములును సాగును. ఈ కార్య క్రమమునందు బూటకపు పథకములు సమసిపోవును. సత్యము నిలువబడును. మానవ సమాజమునందు భావపరిణామ మెల్ల ప్పుడును మూడుదశలలో సాగును. మొదటిదశ యందజ్ఞాను లెల్లరును ఏకాభిప్రాయముతో వర్తింతురు. ఆదశ యం దజ్ఞా నమే సర్వత్ర వ్యాపించియుండును. రెండవదశ యందు సత్యా న్వేషణపరు లొండొరుల యభిప్రాయములతో నేకీభవింప జాలక వాదవివాదముల కావించు కొందురు. మూడవదశ యందు సత్యము గోచరించును. సత్యము సార్వజనీనమైన కారణమున ఆ దశయం దెల్లరును సామరస్యముతో ప్రవర్తిం తురు. ఈ దశలలో మూడవదశ యేర్పడుటకు రెండవదశయే కారణమని తెలుపనగును. ఈ రెండు దశలకును కార్య

కారణసంబంధము గలదు. ఈనాడు విద్యావిషయికమై చెల రేగుచున్న వాదోపవాదముల గూర్చి మనము కించ పడ నక్కరలేదు. ఏలనన వీనివలననే మానవుల కందరకును క్షేమదాయకమగు సత్యమార్గము దృగ్గోచరము కాగలదు.

గతించిన ఏబది సంవత్సరములలో విద్యావిషయిక మగు చర్చలు సాగినవి. మార్పులు సంభవించినవి. పాత మార్గములను విడనాడి ప్రజలు క్రొత్త మార్గముల నవలం బించుచున్నారు. వీనిని శ్రద్ధగ పరిశీలించిన యెడల నేటి భావము లేదిక్కునకు మొగ్గుచున్నవో తెలియనగును. భావ్యభి వృద్ధికి మనకు నూతనమగు బాటలు కానరా వచ్చును. కావున పూర్వకాలపు నాటి విద్యా విధానమును, ఆధునిక విద్యా విధానమును మన మించుక పరామర్శింతము.

సమాజములో కాని, ఇతర సంస్థలలో కాని ఒక లోపమును రూపుమాపుటకై మనము ప్రయత్నించిన యెడల అందులకు విరుద్ధమగు మరియొక లోప మందు తలచూపుట స్వాభావిక విషయము. ఒకానొక కాలమున శారీరకాభి వృద్ధియే అత్యంత ముఖ్యమని ప్రజలు భ్రమించు చుండిరి. ఆ భ్రమ తొలగిపోయిన వెనుక మనోవికాసమే విద్యావిధా నమునకు తలమానిక మను భావము సర్వత్ర వ్యాపించినది. తత్ఫలితముగ పసిబిడ్డలకు రెండు మూడేండ్లు నిండకుండగనే వారిచే పుస్తకములు పట్టించి, బలవంతముగ చదివించు నాచారము వాడుకలోనికి వచ్చినది. కాని ఈ పొరపాట్లను

సరిదిద్దుకొని, సరియైన పద్ధతులను మనము తెలిసికొన గల్గినప్పుడు పై రెండు భావముల సమ్మేళనమందే సత్య మిమిడియున్నదని తెలిసికొనజాలితిమి. అన్యోన్య విరుద్ధ ముగ కాన్పించిన యీ రెండు వాదములును సత్యమనెడి ఫలకమునకు రెండు ముఖములని మనకు తెలియవచ్చినది. ఉత్తమ విద్యావిధానములో శారీరక మానసిక వికాసములు రెండును కూడ సమానస్థానము నలంకరించును. శరీరము నకు కాని మనస్సునకు కాని మితిమీరిన పుష్టిని కల్గింప బూనుట నష్టదాయకము. శరీరము చక్కని స్థితియం దుండని పక్షమున నెవ్వడును కూడ జీవితరంగమున కార్యసిద్ధిని బడయజాలడు. ఎంతటి బుద్ధిశాలియును కూడ శరీరపాటవము లేకుండ లోకమున కుపకారి కాజాలడు. కాని శరీర మానసి కాభివృద్ధులలో నే యొక్కదానిని నిర్లక్ష్యము చేసినను అది బుద్ధి హీనతయే యగును. బాల్యమునం దసాధారణ ప్రజ్ఞను ప్రదర్శించువారు పలువురు వయస్సు వచ్చినమీదట మంద బుద్ధులైపోవుట మనము గాంచుచున్నాము. కావుననే "కాలమును వివేకవంతముగ వ్యర్థపుచ్చుటయే విద్యావిధా నములోని యొక ముఖ్యాంగము" అని తెలిసిన వారు పల్కుదురు.

వివిధ విషయములను ముఖపాఠము చేయుపద్ధతి లోప భూయిష్ఠ మైనదని ఇప్పుడు క్రమముగ నందరును గ్రహించు చున్నారు. అక్షరములు నేర్పు పద్ధతి యిప్పుడు మార్పునకు

లోనైనది. ఎక్కములను నేర్పుటలో కూడ నేడు ప్రదర్శ నాత్మకమగు మార్గము లుపయోగింపబడుచున్నవి. మాతృ భాషాబోధ యందు నేడు స్వాభావికమగు పద్ధతులు వాడ బడుచున్నవి. ప్రాథమికదశ యందు విద్యాబోధ చాలవరకు వాగ్రూపముగను, స్వభావసిద్ధముగను ఉండవలయును. ముఖ పాఠము చేయు పద్ధతిలో నొక గొప్ప లోపము కలదు. ఇందు గుర్తుల కధిక ప్రాధాన్య మొసంగబడుచున్నది. ఆ గుర్తులకు మూలములగు విషయము లలక్ష్యము చేయబడుచున్నవి. ఆ విధానములో పదములను సరిగ నుచ్చరించిన చాలును. వాని యర్థమును తెలిసికొనుట యంత ముఖ్యము కాదు. ఇందు బాహ్యరూపమున కంతరార్థము బలియై పోవుచున్నది. ఏదైన నొక పదార్థమును సూచించు గుర్తు పైననే మనము మన దృష్టిని నిరంతరము కేంద్రీకరించిన పక్షమున, ముఖ్య మగు పదార్థము విస్మరింపబడుట తటస్థించును. ముఖపాఠము చేయు పద్ధతిలోని ముఖ్యలోప మియ్యది యని నేడు తెలియ వచ్చినది.

ఆధునిక విద్యావిధానములో వివిధ సూత్రములను రోకటిపాటగ వల్లెవేయు పద్ధతి క్రమముగ తొలగిపోవు చున్నది. ఏదైన నొక విషయమునుగూర్చి మనము తెలిసి కొనదలిచిన యెడల మొట్టమొదట అందలి వివరములను, ఆ పైన ఆ వివరములలోని సామాన్య ధర్మములను గ్రహింప వలయును. ఇదియే సరియైన మార్గము. కేవలము సూత్రము

లను వల్లె వేయించిన యెడల, ఆ యంశము విద్యార్థి కవగత
మైనట్లు పరులకు భ్రమ కల్గును. కాని అయ్యది నిజముకాదు.
ఏదైన నొక విషయమును సవిమర్శముగ పరిశీలింపకుండ,
ఆ విమర్శయొక్క ఫలితమును తెలిసికొనుటవలన విద్యార్థికి
నిగూఢజ్ఞాన మేర్పడదు. జ్ఞాన సంచయము నందలి ముఖ్య
సూత్రములను గ్రహింపఁబూనినవారు వానిని స్వపరిశోధనచే
తెలిసికొనవలెను. సులభముగ సాధించిన యర్థమువలెనే
సులభముగ సాధించిన జ్ఞానము కూడ త్రుటికాలములో
మాయ మగును. మనము సంపాదించిన జ్ఞానమునకును మనము
నేర్చిన సూత్రములకును సంబంధము తెలిసికొన గల్గినప్పు
డా జ్ఞానము సుస్థిరముగ మన మనస్సునందు నెలకొని యుం
డును. లేనియెడల క్రమముగ నా జ్ఞానము మరపునకు
వచ్చును. కేవలము సూత్రములను వల్లెవేసిన యాతని కేదైన
నొక నూతన విషయ మెదురైనచో ఆతడు దానిని గ్రహింప
జాలక తబ్బిబ్బుపడును. విషయమందలి ఆంతరంగిక ధర్మము
లను గుర్తించిన యాతడు పాత సంగతుల వలెనే క్రొత్త
వానిని కూడ అవగతము కావించుకొనగలడు. సూత్రము
లను మాత్రము ముఖపాఠము చేసిన విద్యార్థి మనస్సులోని
జ్ఞాన నిచయము క్రమపద్ధతి లేకుండ చెల్లాచెదరగ నుండును
ఆంతరంగిక ధర్మముల గుర్తించిన యాతని మనస్సులోని
విజ్ఞానము సక్రమముగ నొకదానితో వేరొకటి జోడింపబడి
యుండును. ఈ రెండవ విధమగు జ్ఞాన సంచయము విద్యార్థి

కెల్లప్పుడును బాగుగా జ్ఞాపక ముండుటయే కాక, నూతన విషయముల పరిశీలించునప్పుడును, స్వతంత్రాలోచనము కావించునప్పుడును, ఆతని కుపయోగకారి యగును. ఏదైన నొక విషయమునకు సంబంధించిన విజ్ఞానమును సక్రమ పద్ధతులపై అమర్చి, దానిని మన ముపయోగించుకొని, ఇతరులకు ప్రదర్శింపగల్గిన నాడే, ఆ విజ్ఞానము మనకు పూర్తిగ వశపడినట్లు తెలుపనగును. లేనిచో ఆ విజ్ఞానము నిర్జీవమేకదా!

మనమిప్పుడు సూత్రములను కేవలము రోకటిపాటగ వల్లె వేయించుటకుమారు ఆ సూత్రములకు మూలభూతమైన సామాన్యధర్మముల విద్యార్థులకు బోధించు చున్నాము. అట్టివిధముగ కేవలము భావనాత్మకములైన యంశములను బోధించుటకు పూర్వము ఆ కఠినవిషయములకు పునాదియైన విషయజాలమును బాలుర కెరుకపరుప జూచుచున్నాము. ఈ కారణము వలన ఒకానొకప్పుడు విద్యారంభదశ యందే బోధింపబడుచుండెడి కొన్నియంశములను తరువాత దశలోనికి మార్చుట సంభవించినది. పసిబాలురకు వ్యాకరణమును బోధించు తెలివిమాలిన పద్ధతిని మన మిప్పుడు విడిచి పెట్టినారము. ఇదియే పై యంశములకు చక్కని నిదర్శనము. "వ్యాకరణము భాషను నేర్చుట కొక మెట్టు అని తలంచుట పొరపాటు. అయ్యది భాషాభ్యాసమునకు సంపూర్ణత కల్గించు సాధనము." అని యొక పండితుడు తెల్పుచున్నాడు. "వ్యాకరణము, వాక్యనిర్మాణక్రమము అనునవి కొన్ని

నియమముల సముదాయము మాత్రమే. ఇట్టి నియమములను వ్యవహారము నుండి మనము గ్రహించుచున్నాము. చిరకాలము భాషను పరిశీలించుట వలనను, వివిధాంశముల నొండొంటితో పోల్చుటవలనను మన మీ సూత్రనిష్పత్తి కావింప గల్గుచున్నారము.- వ్యాకరణ మనగా భాష యొక్క తత్వము — తత్సంబంధమగు శాస్త్రీయవిజ్ఞానము. ప్రకృతి సహజమగు ధర్మముల నవలంబించిన పక్షమున వ్యక్తులు కాని, జాతులు కాని శాస్త్రీయవిజ్ఞానమును మొట్టమొదట సాధింపజాలరు. వ్యాకరణములు వ్రాయుటకును, ఛందస్సును నిర్ణయించుటకును పూర్వమే జనులు చిరకాలము భాషను వాడుచు, అందు కవితను వ్రాయుచుండుట మనము గమనింపవచ్చును. అరిస్టాటిలు పండితుడు తర్కశాస్త్రమును వ్రాయుటకు పూర్వమే మానవులు తర్క-వితర్కములు చేయుచుండెడివారు." అని మరియొక పండితుడు వ్రాయుచున్నాడు. మొట్టమొదట భాషలు పుట్టినవి. ఆపైన వ్యాకరణములు వెలసినవి. అదే విధముగ మనము విద్యార్థులకు మొట్టమొదట భాషను నేర్పవలెను. ఆపైన వ్యాకరణ బోధను ప్రారంభింపవలెను. వ్యక్తులును, జాతులును, అభివృద్ధి చెందిన మార్గమును గ్రహించినచో వారెల్లరును పై సూత్రమును తప్పక అంగీకరింతురు.

విద్యారంగమందు పాతపద్ధతులు మారి కొత్తపద్ధతులు తలచూపుచున్న ఈ యుగములో ఒక ముఖ్య పరివర్తన

సంభవించినది. అయ్యది పరిశీలనాపద్ధతిని ప్రోత్సహించు నాచారము. పసిబిడ్డలు తమంత తాము ప్రతి వస్తువును పరిశీలించి చూచెదరు. దీని కొక యర్థమును, ఆశయమును ఉన్న యంశమును ఇటీవలనే పండితులు గ్రహింప గల్గినారు. పసిపాప లందరిలోను కానవచ్చు ఇట్టి చేష్టలను మన మొకానొకప్పుడు అర్థశూన్యమైన ప్రవర్తన యనియో, ఆట యనియో, లేక చిలిపితన మనియో భావించుచుంటిమి. కాని అయ్యవి వివిధ విషయిక మగు జ్ఞానమును సంపాదించుటకు మార్గ మనియు, మానవుడు ముందు ముందు సాధించెడి జ్ఞానమున కీ చేష్టలు పునాదివంటి వనియు మన మిప్పుడిప్పుడు గ్రహింప గల్గుచున్నాము. కావుననే మన పాఠశాలలలో పరిశీలనాత్మకములగు పాఠములకు తా వొసంగుచున్నారు. "పదార్థ విజ్ఞానశాస్త్ర మన్ని శాస్త్రములకును తల్లి వంటిది" అని బేకన్ మహాశయు డొకప్పుడు పల్కియుండెను. ఆ యంశ మిప్పుడు విద్యావిషయములలో పూర్తిగా అన్వర్థ మగుచున్నది. వివిధ వస్తువుల బహిరాకారమును, ఆంతరంగిక లక్షణములను చక్కగ గ్రహింపని పక్షమున, ఆ యా వస్తువుల గూర్చి మనము గ్రహించు విజ్ఞానము లోపభూయిష్ఠముగ నుండును. తద్విషయమై మనము కావించు ప్రయోగము లన్నియు నిరర్థకము లగును. మనము గావించు ఊహ లన్నియు తప్పుడుతడక లగును. జ్ఞానేంద్రియముల సుశిక్షితము కావింపని పక్షమున విద్యార్థి సంపాదించు జ్ఞానము చేవ

లేకుండపోవును. ఆతని జ్ఞానము జల లిపి వలె తాత్కాలికముగ పరిణమించును. ఇట్టి లోపములు విద్యావిధానములో నొక మారు ప్రవేశించినచో వానిని మార్చుట కెంతమాత్రమును సాధ్యము కాదు. బాగుగా చింతించిన పక్షమున పరిశీలనాశక్తి యెల్లవారికిని వారి వారి కార్యసిద్ధికొరకై చాల అవసరమని తెలియవచ్చును. పరిశీలనాశక్తి కళాకారులకును, శాస్త్రజ్ఞులకును, ప్రకృతిశాస్త్రవేత్తలకును మాత్రమే ఉపయోగకరమైనదని తలంపరాదు. వైద్యుఁడు రోగనిర్ణయము చక్కఁగ కావించుటకై ఆతనికి పరిశీలనాశక్తి కావలెను. అట్లే వాస్తుశాస్త్రజ్ఞుడు కూడ తన విద్యార్థిదశ యందు కొంతకాలము కర్మాగారములో గడపి పరిశీలనాశక్తిని వృద్ధి పొందించుకొనును. అదే విధముగ తత్త్వవేత్తయగువాడు వివిధ సంఘటనల సంబంధమును పరిశీలించి చూచును. సామాన్యు లీ యంశములను గ్రహింపజాలరు. కవియగు వాడు ప్రకృతి యందలి సౌందర్యమును పరిశీలించి యితరులకు చూపును. అంతకు పూర్వము దానిని గుర్తింపని వారు కూడ కవి చూపిన ప్రకృతి సుభగత్వమును గ్రహించి యంగీకరింతురు. కావున ప్రతి యంశమును గూర్చియు సంపూర్ణమును, విస్పష్టము నగు జ్ఞానము విధిగ కావలయునని మనము నిర్ణయింపవలయును. ఉత్తమమగు విజ్ఞానహర్మ్యమును సత్తువ లేని పదార్థములతో నిర్మించుట యెట్లు సాధ్యమగును?

కేవలము భావనాత్మకములైన మార్గములచే విద్యాబోధ కావించు పద్ధతి మారి, ప్రదర్శనాత్మకములగు మార్గముల

17

నవలంబించు విధాన మిప్పుడు వాడుకలోనికి వచ్చుచున్నది. ప్రకృతిశాస్త్రమందలి ప్రాథమిక పాఠముల నేర్పుట కీ ప్రదర్శ నాత్మక పద్ధతియే వాడబడుచున్నది. వస్తువుల యాకార మును, రుచిని, రంగును తెలిసికొనుటకు మార్గ మిదియే కదా! గణితమును బోధించుటలో నేడు మనము వాడుచున్న కట్టె పూసలు మొదలైనవి పై పద్ధతికి నిదర్శనములు. దశాంశ భిన్నముల బోధించు విధానములో కూడ ప్రదర్శనాత్మక మార్గము లవలంబింపబడుచున్నవి. మార్సెల్ అను విద్యా వేత్త మానములను బోధించు పద్ధతిని పూర్తిగా నిరాకరించి, గజములు, అడుగులు, పౌండ్లు, ఔన్సులు, గాలన్లు, క్వార్టులు మున్నగువాని సంబంధమును విద్యార్థులకు బోధించుటకై గజము, అడుగు బద్దలను, తూకపురాళ్ళను ఉపయోగించు చున్నాడు. భూగోళశాస్త్రమును, రేఖాగణితమును బోధిం చుటలో దేశపటములను, నమూనాలను ప్రదర్శించు పద్ధతి కూడ పై సూత్రము ననుసరించియే యున్నది. ఈ పద్ధతులను పరిశీలింపగా మన కొక యంశము తేటతెల్లమగును. జ్ఞాన సముపార్జనమునందు మానవజాతి యేయే దశలలో నుండి గడచెనో, ఆ దశల నన్నిటిని బాలకుడు గడువవలెనని నేటి విద్యాధికుల సిద్ధాంతము. వివిధ వస్తువుల పరిశీలనము వలన వాని సంఖ్య, ఆకారము, అన్యోన్యసంబంధము మొదలైన విషయములు తెలియవచ్చును. ఆయా వస్తువులను స్వాయ ముగ బాలుని ముంగట నుంచిన పక్షమున, ఆతడు వానిని

గూర్చిన సర్వవిషయములను గ్రహింపగల్గును. అనాదియందు మానవుల విజ్ఞాన మిట్లే వృద్ధిచెందెను. జ్ఞానమును సంపాదించుటకు మార్గాంతరము వేరొక్కటి లేదని మనము క్రమ క్రమముగా తెలిసికొనగలము. కేవలము ఊహాల యాధారముపై మన మేయంశమునైన బాలురకు బోధించిన యెడల అయ్యది ఆతని కర్థము కాజాలదు. కాని స్వయముగ పరిశీలనచే నా సత్యమును తెలిసికొనగల్గిన యెడల బాలకు డా యంశము నెన్నడును మరువజాలడు.

విద్యాబోధ విషయమై నేడు జరగుచున్న మార్పులన్నిటిలోను ఒకటి చాల ముఖ్యమైనది. బాలురకు బోధింపబడు విషయములు వారికి సంతోషదాయకములుగ నుండవలయును కాని బాధాకరముగ నుండరాదను సూత్రమును నేడెల్లరును గుర్తించుచున్నారు. బాలకు డాయా వయస్సులం దే యంశములయెడ అభిరుచి చూపునో అయ్యవి వాని మానసికశక్తుల యభివృద్ధికి దోహద మొసంగును. ఇతరము లా యభివృద్ధి కాటంకము కల్గించును. విద్యార్థి యేదైన నొక ప్రత్యేక విషయము నెడ శ్రద్ధను ప్రదర్శించుట ప్రారంభించినచో, వికాసము చెందుచున్న యాతని మనస్సు ఆ విషయమును గ్రహించి జీర్ణించుకొనుటకు తగిన స్థితికి వచ్చినదనియు; బాలుని మనోవికాసమున కా యంశ మావశ్యకమనియు మన మిప్పుడు గుర్తించు చున్నారము. అందులకు విరుద్ధముగ నొక బాలు డొక విషయమునెడ వైముఖ్యతను చూపుచున్న

పక్షమున నాతని మనస్సు ఆ విషయమును గ్రహింపజాలు నంతటి వికాసమును పొందలేదనియో, లేక ఆ విషయము ప్రద ర్శింపబడిన విధానము లోపభూయిష్ఠమైన దనియో మనము గ్రహింపవలెను. కావున ప్రాథమికదశయందు విద్య ఆట వలె నుండవలయుననియు, తదితర దశలలో కూడ విద్య బాలురయం దభిరుచి పుట్టించునట్లుగ ఉండవలెననియు విద్యా నిపుణులు తెల్పుదురు. విద్యాబోధయందు ఆటపాటలకు గల స్థానమును గూర్చి పండితులు తరచు నొక్కి పల్కుచుందురు. బాలగీతములు, దేవతలు మున్నగు వారిని గూర్చిన కథలు, మొదలైనవి బాలుర పాఠ్యప్రణాళికలో తప్పక చేర్పదగి యున్నవి. నానాటికిని మనము బాలబాలికల యభిరుచుల కనుగుణ్యముగ మన విద్యావిధానమును మార్చుకొను చున్నాము. బాలుర కీ విధమైన పద్ధతి రుచించునా రుచింపదా యని మనలో మనము తర్కవితర్కములు కావించుకొను చున్నారము. "సృష్టిలోని వైవిధ్యమును చూచుటకై బాలు డెల్లప్పుడును ఉత్సహించుచుండును. మన మా యుత్సుకతను ప్రోత్సహింపవలెను. దానిని తృప్తిపరచ వలెను. కాని తోడ్తోడనే బాలుని మానసికాభివృద్ధి కొరకై కూడ మనము యత్నింపవలయును." అని మార్సెల్ అను విద్యావేత్త నుడువుచున్నాడు. బాలునియందు విసువు జనించుటకు పూర్వమే మనము విద్యాబోధను విరమింపవలెనని యా విద్యానిపుణుడే మనల హెచ్చరించుచున్నాడు. విద్యాబోధ

ముందునకు సాగిపోయి ఉన్నతదశలందు ప్రవేశించినప్పుడు కూడ ఈ సూత్రమునే మనము పాటింపవలెను. పాఠశాల లందు విద్యాబోధ కావించునప్పుడు మధ్య మధ్య విరామము నొసంగవలయుననియు, విద్యార్థి విహారములను, ఆనంద సంధాయకములగు నుపన్యాసములను, బృందగీతములను ఏర్పాటు చేయవలయుననియు విద్యావేత్తలు తరచు పల్కు చుందురు. అందలి యుద్దేశ్యము విద్యాబోధయందు వీలైనంత వైవిధ్యమును కల్పించి బాలురకు, విసువు జనింపకుండ చేయుటయే యని మనము గుర్తింపవలెను. ఒకానొక కాలమునందు విద్యావిధానములో గల కర్కశత్వము, ఆనందము నెడ వైముఖ్యత యను లక్షణములు నేడు మాయమగుచున్నవి. రాజకీయరంగము నందువలెనే విద్యారంగములో కూడ మానవుని కానందము నొసంగ జాలిన పద్ధతులకు నేడు ప్రాముఖ్యత లభించుచున్నది. ఈ నూతన పద్ధతులను పరిశీలించిన పక్షమున మనము ప్రకృతిసిద్ధమగు విధానములకు చేరువగ వచ్చుచున్నట్లు తెలియ నగును. బాల్యదశ యందు పసిపిల్లలకు బలవంతముగ నెట్టి విద్యను బోధింపకుండుటయు, ఆదశ యందు బాలుర శరీరమును దృఢపరచి, వారి జ్ఞానేంద్రియములకు చక్కని శిక్షణ యొసంగుటయు ప్రకృతిసహజమగు విధానము నవలంబించుటకాక మరేమగును ? పాఠముల గ్రుడ్డిగ వల్లెవేయు పద్ధతిని విడనాడి వాగ్రూపముగను, ప్రదర్శనాత్మకముగను, ఆట పాటల మూల

ముగను విద్యను గరపుట కూడ పై సూత్రము ననుసరించియే యున్నది. కేవలము నియమావళిని బోధించుట మాని, ఆ నియమములకు మూలమైన విషయపరిజ్ఞానమును మనము నేడు బాలుర కందజేయుచున్నాము. బొమ్మల ద్వారా పాఠములను బోధించుచున్నాము. శాస్త్రీయవిజ్ఞానమును కేవలము మాటలచే కాకుండ ప్రయోగములు, పటములు మొదలైన వాని సహాయముతో అల్పవయస్కులకు కల్గించుచున్నాము. ఈ పద్ధతు లన్నియు ప్రకృతిసిద్ధమగు మార్గములని తెల్పుట కెంతమాత్రమును సందేహము లేదు. ఇంతే కాదు. విద్యను బోధించుటకై ఆనంద సంధాయకములగు మార్గముల కన్గొనునిమిత్తము నేడు సర్వవిధముల యత్నములు సాగుచున్నవి. ఇందలి యుద్దేశ్యము జ్ఞానమును సంపాదించుట విద్యార్థికి సంతోష హేతువుగ పరిణమింప జేయుటయే ప్రతిజీవి యందును ఆయా కాలములందు వివిధములగు కోర్కె లుత్పన్నమగును. భౌతిక మానసిక శక్తులను పెంపొందించుట కొరకై ప్రకృతిమాత జీవజంతువుల యం దిట్టి కోర్కెలను ప్రోత్సహించును. ఈ యంశమును గుర్తించి మన విద్యావిధానమును అల్పవయస్కులలో గల సహజ వాంఛల కనుగుణ్యముగ సంతరించుట మిక్కిలి యవసరము. మనము బోధించు విషయముల క్రమమును నిర్ణయించుట యందును, బోధనావిధానమును బాలుర యభిరుచులకు తగినటుగ సరిదిద్దుట యందును మనము శ్రద్ధ పూనవలయును.

ఇట్లు కావించిన యెడల మనము ప్రకృతి ధర్మముల ననుస రించినవార మగుదుము.

పైన తెలుపబడిన యంశములనే పెస్టాలజీ అను గొప్ప విద్యావేత్త మనకు బోధించినాడు. బోధనక్రమము నందును, బోధనాపద్ధతులందును మనము ప్రకృతి నియమముల ననుస రింపవలయుననియు, ప్రకృతిసిద్ధముగ సంభవించు మనో వికాసము ననుసరించియే విద్యావిధాన మేర్పడ వలయు ననియు, మానవునియం దణగియున్న శక్తు లొక ప్రత్యేక క్రమములో సహజముగ వృద్ధిచెందుననియు, ఈ శక్తులు వృద్ధిచెందుచున్న కాలమున మానవుని కొక ప్రత్యేకమగు జ్ఞానము లభ్యపడవలయు ననియు, ఆత డభిప్రాయ పడెను. బాలునియం దిమిడియున్న శక్తు లేయే క్రమములో వికసించు చున్నవో కన్గొని, వాని కవసరమగు జ్ఞానమును సమకూర్చుట మనధర్మము. పైన తెలుపబడిన యంశములెల్ల ప్రకృతి సహజమగు మార్గములో నొక భాగము మాత్రమే యని గుర్తింపవలెను. ఈ మార్గమందలి ముఖ్యమగు మరియొక సిద్ధాంతముకలదు. దానిని నేటి ఉపాధ్యాయులలో పలువురు సంపూర్ణముగ గ్రహింపలేకున్నారు. బాలుడు తనంతట తానే విద్యను సాధించుట కవకాశములు కల్పించుట యను నదియే ఈ ముఖ్యసూత్రము. ప్రకృతిశాస్త్ర విజ్ఞానము వ్యాపించుట వలన మనకు వివిధవస్తువుల తత్వము చక్కగ తెలియవచ్చుచున్నది. సృష్టి యందలి ప్రతి జీవి యందును

స్వయంసంపూర్ణత యను లక్షణము గర్భితమై యున్నట్లు మన మిప్పుడు తెలిసికొనగల్గు చున్నాము. మన జ్ఞానము వృద్ధియైన కొలదియు, ప్రకృతి ధర్మముల నడక నవరోధించుట అనర్థదాయక మను సంశయము స్పష్టముగ తెలియవచ్చుచుండును. వైద్యవిధానమునం దిప్పుడు రోగులపై మందులను కుప్పించు పద్ధతి మారిపోయి, మందులను మోతాదుగ వాడు పద్ధతి వాడుకలోనికి వచ్చుచున్నది. కొన్ని సందర్భములలో మందులే అవసరములేదను భావము కూడ వైద్యులలో పొడసూపుచున్నది. పసిబిడ్డల యంగములు చక్కగ వృద్ధిచెందుటకై వాని కెట్టి కట్లును అవసరము లేదు. కారాగారములందలి ఖైదీలను సరియైన మార్గమునకు గొనివచ్చుటకై వేరుగ నెట్టి క్రమశిక్షణయు అవసరము లేదు. తమ జీవనోపాధికొఱకై కష్టపడి వస్తూత్పాదనము కావించునట్లుగ వీరిని ప్రోత్సహించిన పక్షమున క్రమక్రమముగ నేరస్థులు సన్మార్గమునకు రాగలరు. విద్యావిధానమందు కూడ ఇంచుమించు ఇదే విధానము అవలంబింప దగినదని మా మతము. మానవుని బుద్ధి క్రమ క్రమముగ వికసించి పరిణతినిబొందు కాలమున ఆయాదశల కనుకూలమైన జ్ఞానమును వ్యక్తి కందజేయుచు, ప్రకృతిధర్మములకు లొంగి సంచరించుటయే ఉత్తమ విద్యావిధానము నందలి రహస్యము.

బాలురకు వివిధ విషయములను బోధించు అదనును గూర్చియు, బోధనా సందర్భమునం దవలంబింపవలసిన

విధానముల గూర్చియు, మనము ప్రకృతి కనుగుణ్యమగు మార్గముల నవలంబింపవలె ననుసూత్రమును ఏకాలమందును ఎవ్వరును కూడ పూర్తిగ తిరస్కరింపలేదు. ఉపాధ్యాయు లెల్లప్పుడును కూడ తమ బోధనాపద్ధతుల నీ సూత్రమున కనుగుణ్యముగ సరిదిద్దుచు వచ్చిరి. కాని ఈ సూత్రమును స్థూలరూపమునమాత్ర మంగీకరించుచు సూక్ష్మాంశములలో వారు దాని నుల్లంఘించుచుండెడివారు. బోధనావిధానమునం దొక విషయమును మాత్రము మనము ముఖ్యముగ గుర్తునం దుంచుకొనవలయును. ఏదైన నొక మహత్తరాంశ మును బాలురకు బోధించుటకు పూర్వము దాని కంగభూత ములైన వివరములను శ్రద్ధగ నేర్పి విద్యార్థుల మనస్సులకు పట్టునట్లు చేయవలెను. సులభమగు నంశములను బాలుడు చక్కగ గ్రహించి జీర్ణించుకొనిన వెనుక, క్లిష్టతరమగు భాగములను వానికి నేర్పవలయును. ఈ విధమున ప్రాతిపదికాంశములకును, తుట్టతుదిని ప్రతిపాదింపబడు నంశమునకును, సులభమగు భావములకును, క్లిష్టమగు భావములకును సంయోగ మేర్పడని యెడల బాలుని యందు పాఠ్యాంశముల యెడల అలక్ష్యమును, నిరాదరణయు జనించును. బాలుడు పాతవిషయములను, కొత్త విషయములను చక్కగ జోడించి వానికి సమన్వయము కల్పించుకొనని పక్షమున నాతడు చదివిన యంశము లన్నియు, నిరర్థకములును, మృతప్రాయములును అగును.

పై సూత్రములను తెలిసికొనిన వారిలో కొందరీ క్రింది విధమగు నాక్షేపణలు కావించవచ్చును. "పాఠ్యప్రణాళికను సిద్ధముచేయుట కొరకై మనము ప్రత్యేకముగ శ్రమపడవలసిన ఆవశ్యకత యేమి కలదు ? మనస్సు కూడ దేహమువలెనే ప్రకృతినిర్ణీతమగు నొక విధానము ననుసరించి వికసించుచుండుటయు, అయ్యది తనంత తాను వృద్ధి చెందుటయు, ఏదైన నొక ప్రత్యేక తరగతి జ్ఞానము మనస్సు యొక్క వికాసము కొరకై అవసరమైనప్పుడే ఆ జ్ఞానమును సంపాదింపవలయునను కోర్కె బాలురలో నుదయించుటయు, ప్రతిమానవుని హృదయమునందును సకాలమున తత్కాలమున కావశ్యకమగు జ్ఞానము కావలెనను కోర్కె తనంత తానే యుద్భవించుటయు, నిజమే మైన పక్షమున, మనము బాలుర విద్యావిధానములో జోక్యము కల్పించుకొనవలసిన యవసరమే యుండదుకదా ! అల్ప వయస్కులను ప్రకృతి యొసంగు క్రమశిక్షణకు లోనుకావించి మన మూరక చూచుచు నిలచుండి, వారంతట వారినే యేల విద్య నేర్చుకొననీయరాదు ? మనము మొదటి నుండి తుది వరకు ఒకే సిద్ధాంతము నేల యనుసరింపరాదు ?" ఈప్రశ్న కొంతవరకు క్లిష్టమైనదిగ కాన్పింపవచ్చును. పై విధమగు విమర్శనల కావించువారు బాలురను విచ్చల విడిగ యధేచ్ఛముగ సంచరింపనీయవచ్చునను వాదమునకు దారితీయుచున్నారు. కాని యెవ్వ రేమి వాదించినను ప్రకృతి ధర్మముల ననుసరించి

అల్పవయస్కులకు విద్యాబోధ కావింపవలెనను సూత్రము నిరర్థకమును, హాస్యాస్పదమును కాదు. మనస్సునకును దేహమునకును గల సామ్యముల నించుక పరిశీలింపుడు. ఒక ఉత్తమతరగతి ప్రాణి జీవితరంగములోనికి ప్రవేశించుటకు పూర్వ మయ్యది చాలకాలము వరకును ఆహారము, ఆత్మ రక్షణల కొరకై తన తల్లిదండ్రులపై ఆధారపడి యుండుట ప్రకృతిధర్మము. క్లిష్టమగు ఆకారము లేక, సులభముగ ఎదిగి సులభముగ ఆహారమును సంపాదించు మొక్కలకును, అట్లు కాక బీజములో నుండి క్రమక్రమముగ నెల్వడి, కాండము, శాఖోపశాఖలు, మున్నగు వానితో సంకీర్ణస్వరూపము గల్గి, చాలకాలము వరకును ఆహారమును తనలో తాను దాచి యుంచుకొనగల శక్తిగల్గిన వృక్షములకును గల భేదమును గుర్తింపుడు. జంగమ జీవులలో కూడ నీధర్మమే కానవచ్చుచున్నది. కొన్ని అల్పములగు క్రిములు తమ తల్లినుండి వేరు పడుటతోడనే తమంతతాము స్వతంత్రముగ జీవించుటకు సమర్థములగును. కాని మానవు డీ విధముగ జీవింపజాలడు. ఆతడు మాతృగర్భమునందే కొన్ని నెలలు గడపవలయును. ఆ పైన కొన్నినెలల వరకును ఆ జీవికి మాతృస్తన్యమే జీవనాధారము. పాలు విడచినను బిడ్డకు తల్లియే కొంతకాలము వరకును ఆహారము తినిపించును. బాలుడు కొంచెము పెద్దవాడైన తరువాత కూడ ఆతనికి తల్లిదండ్రు లాహారమును, ఉడుపులను, తదితరములగు అవసరములను సంపాదించి

యొసంగవలయును. సుమారు ఇరువది సంవత్సరముల వయస్సు వచ్చువరకును బాలుడు తన్ను తాను పోషించుకొను శక్తిని సంపాదింపజాలడు. దేహమునకు సంబంధించు పైయంశము లే మనస్సునకు కూడ వర్తించును. మానసికపోషణ విషయమున నుత్తమతరగతి: జీవులన్నియును, ముఖ్యముగ మానవుడును ప్రాథమికదశ యందు పరిణతి నొందినవారి సహాయము నర్థించును. చిన్నపాప తనంతట తా నొక చోటు నుండి వేరొక చోటునకు పోజాలదు. కావున నా పాప తన ఇంద్రియ జ్ఞానమును వృద్ధికావించుకొనుటకై ఆవశ్యకమగు వస్తుజాలమును కాని, పొట్ట నింపుకొనుటకై ఆహారమును కాని తనంతతాను సంపాదింప సమర్థుడుగ నుండడు. పసిబాలుడు తనకు కావలసిన యాహారమును తాను నందుకొనజాలనట్లే, వివిధవిషయములకు చెందిన జ్ఞానమును జీర్ణించుకొనజాలడు. ఉత్తమ జ్ఞానమును సాధించుటకు సాధనభూతమైన భాష నాతడు తన పరిసరములనుండి మాత్రమే నేర్చుకొనగలడు. ప్రాథమికదశయందు బాలునికి తల్లిదండ్రుల వలన కాని ఇతరుల వలన కాని సహాయము లభింపని పక్షమున నాతని యందభివృద్ధి కొరవడిపోవును. కావున అనుదినమును బాలుని కావశ్యకములగు విషయములను సక్రమముగ నేర్చి కూర్చి, వానిని తగువిధముగ సిద్ధపరచి, అదనుప్రకారము, ఆవశ్యకమగు పరిమితిలో వానిని ఆ బాలుని కందిచ్చిన పక్షమున ఆతని మనస్సు చక్కగ పుష్టిని చెందును. ఈసూత్రమే బాలుర

దేహపరిపుష్టికికూడ వర్తించును. బాలుర మానసిక దైహికా భివృద్ధి కావశ్యకములగు పరిస్థితులను కల్పించవలసిన బాధ్యత తల్లిదండ్రులపైననే నిలచియున్నది. పసిబిడ్డలకు ఆహారమును, దుస్తులును ఒసంగునప్పుడు తల్లిదండ్రులా బిడ్డల యందలి సహజ ప్రవృత్తుల నేవిధముగను ఆటంక పరుపరుగదా! అదే విధముగ మానసికాభివృద్ధియందు కూడ వికాసక్రమమును కాని, వికాసమార్గములను కాని మనము మార్పు కావింప యత్నింపకూడదు. పసిబిడ్డ లనుకరించుటకై ధ్వనులను, వారు పరిశీలించుట కొరకై వివిధవస్తువులను, చదువుటకై పుస్తకములను, పరిష్కరించుటకై సమస్యలను మనము పసి బిడ్డలకు సమకూర్పవలెను. దానికితోడు పరోక్షముగ కాని, ప్రత్యక్షముగకాని మనము వారిపై యెట్టి నిర్బంధములును కావింపక, వారి మనస్సు సహజమగు పద్ధతులపై వికాసము చెందుట కవకాశము కల్పింపవలెను. ప్రాథమిక దశయందు మానవుని మనస్సు సక్రమపద్ధతులలో వికాసము చెందుటకు తగిన పరిస్థితుల కల్పించుటయే విద్యావిధానము యొక్క ముఖ్యోద్దేశ్యము. కావున మనము పాఠ్యప్రణాళికలను సం పూర్ణముగ త్రోసిపుచ్చ నవసరములేదు. అంతే కాదు. ఉపాధ్యాయుని కార్యక్రమము కొరకై సువిశాలమగు రంగము ఏర్పడి యున్నది. ఆతడు చేతులు కట్టుకొని బొమ్మవలె నిలువ బడవలసిన ఆవశ్యకత లేదు.

ప్రకృతి ధర్మముల కనుగుణ్యముగ బాల బాలికలకు

విద్యాబోధ కావింపవలయునను సూత్రమును ప్రతిపాదించిన వాడు పెస్టాలజీ అను విద్యావేత్త. ఈ విద్యావిధానము ఆచరణలో విజయవంతము కాలేదనియు, ఈ నూతన పద్ధతులపై నడుపబడు పాఠశాలలలోని బాలకులు తమ చదువు సంధ్యల యెడ నెట్టి శ్రద్ధను చూపుచుండుట లేదనియు, వీరు (ఈ విద్యార్థులు) ఉత్తమ శ్రేణికి రాజాలకపోవుచున్నారనియు పలువురు విమర్శించుచున్నారు. కాని యిట్టి విమర్శనలకు వివరమగు సమాధాన మీయనవసరము లేదు. ఎంతటియుత్తమమగు సాధనమైనను అసమర్థుని చేతులలో పడి నిరర్థకమై పోవును. పెస్టాలజీ బోధించిన ఉత్తమములగు సూత్రములు అసమర్థులగు ఉపాధ్యాయుల పాలబడి నిరుపయోగములై పోవుచున్నవి. మిక్కిలి సరళములును, గతానుగతికములునగు విద్యాపద్ధతుల ప్రకారము బోధన కావించుటకు సామాన్యకౌశల్యముగల ఉపాధ్యాయుడు చాలును. కాని విద్యార్థుల మనస్సులందు గల వైవిధ్యము ననుసరించి వివిధ బోధనా పరికరములను వాడునట్టి ఉత్తమ విద్యావిధానమునందు ప్రజ్ఞావంతులగు ఉపాధ్యాయులుండుట చాల యవసరము. కేవలము వర్ణక్రమమును బోధించుటకును, ఎక్కములు వల్లెవేయించుటకును సామాన్యుడగు ఉపాధ్యాయుడు చాలును. కాని నూతన విధానముల ననుసరించి అల్పవయస్కులకు పాఠములు నేర్పుటకును, లెక్కలు చేయించుటకును, ఉపాధ్యాయునిలో కొంత వైశిష్ట్యతయుండవలెను.

ఆతఁడు బాలుర మనః ప్రవృత్తులను చక్కఁగ తెలిసికొనఁగల్గి యుండవలెను. పైన ప్రతిపాదింపబడిన నూతన విద్యా పద్ధతులను బాలుడు విద్యార్థిదశయందున్నంత కాలమును అమలు కావించునట్లు చేయుటకై ఉపాధ్యాయునిలో విచక్షణ నూతన విషయముల సృష్టించు ప్రజ్ఞ, బాలుర యెడ సాను భూతి, విమర్శనా శక్తి మున్నగు సద్గుణములుండవలయును. సంఘమునం దుపాధ్యాయునికి గౌరవస్థానము లభింపనంత కాలమును ఇట్టి బోధకులు మనకు చిక్కఁజాలరు. బోధనా తత్త్వము నెరింగిన ఉపాధ్యాయులు లభించినప్పుడే ఉత్తమ మగు విద్యాబోధసాగును. పెస్టాలజీ ప్రతిపాదించిన నూతన విద్యావిధానము నమలు కావించుటకై ఉపాధ్యాయుఁడు బాలుర మనస్తత్త్వమును చక్కఁగ గుర్తెరుంగవలయును. అట్టి ఉపాధ్యాయులు నేడు మనకు లభించుటలేదు. ఇక నూతన విద్యావిధానము విజయవంతమగుటకు సాధనమేది ?

పెస్టాలజీ మహాశయుడు ప్రతిపాదించిన సిద్ధాంతముల నమలు చేయుటయందు మరికొన్ని లోపములుకూడ సంక్ర మించినవి. ఆచరణయం దాతని సిద్ధాంతములు విజయవంత ములు కానందువలన ఆ లోపములు సిద్ధాంతమునందే కలవని కొందరు భ్రాంతి చెందినారు. కాని యిది సరికాదు. మొట్ట మొదటి ఆవిరియంత్రము చక్కఁగ పనిచేయని కారణము వలన ఆవిరియంత్రములు నిరర్థకములని వాదించుట అవివే కము కాదా ? పెస్టాలజీ సిద్ధాంతములను చక్కఁగ అర్థము

చేసికొనకుండ వాని నాచరణయం దిడి కార్యసిద్ధిని పొంద జాలని కొందరు అసమర్థుల అనుభవముల నాధారము చేసి కొని, పెస్టాలజీ సిద్ధాంతములనే నిందించుట యేమి న్యాయము? అంతే కాదు. పెస్టాలజీ సిద్ధాంతము మొత్తముమీద నిర్దుష్టమైనదే కాని అందలి వివరముల నాతడు చక్కగ నాలోచించినట్లు చెప్పుటకు వీలులేదు. కావున ఆచరణయం దాతని సిద్ధాంతములు పూర్తిగ ఫలవంతములు కాలేదు. పెస్టాలజీ యందద్భుతమగు విషయగ్రహణశక్తి యుండెను. కాని యాతడు తన సిద్ధాంతములయొక్క వివరములను గూర్చి సక్రమపద్ధతిపై యాలోచించినవాడు కాడు. గహనమగు నంశములు అతనికి మెరపు మెరసినట్లు అకస్మాత్తుగ నవగతమయ్యెడివి. స్టాంజ్ అను ప్రదేశమున అతడొక పాఠశాలను స్థాపించి దానిని విజయవంతముగ నడుపగలైను. అందు పుస్తకములు కాని, బోధనాపరికరములుకాని వాడెడివారు కారు. ఆకాలమందు పెస్టాలజీ తన విద్యార్థుల కాయా సమయములందెట్టి విషయములు బోధింపవలెనో, ఆ నూతన విషయములను వారంతకు పూర్వమే యెరింగియున్న యంశములతో నెట్లు జోడింపవలయునో తెలిసికొనుటపై దృష్టి నంతను కేంద్రీకరించెను. అతడు (పెస్టాలజీ) విద్యా విషయమునందు సాధించిన అద్భుతమగుప్రజ్ఞ సక్రమమగు నాలోచన వలన సిద్ధించినదికాదు. అతనికి బాలుర యెడల అపారమగు సానుభూతి యుండెడిది. కావున నాతడు వారికి చదువు

సంధ్యాల విషయమై యుండెడి కష్టములను సులభముగ గ్రహింపగలిగెడివాడు. కాని ఉజ్జ్వల నిమేషములలో తాను కన్గొనిన నూతన సత్యముల నాతడు చక్కగ జోడించి, అభివృద్ధి కావింప నసమర్థుడై యుండెను. కావున ఆ పనుల నాతడు తన సహాయకుల కప్పగించుచుండెను. పెస్టాలజీ శిష్యులు తమ గురువుగారి సిద్ధాంతములతో తమ యూహల కొన్నిటిని మేళవించి ఒక కలగూరగంపను సిద్ధము చేసెడి వారు. ఇం దర్థశూన్యములును, పరస్పర విరుద్ధములు నగు నంశములు పెక్కు లుండెడివి. బాలభవనము లందు విద్యాబోధ కావించు సూత్రముల నిర్వచించుటకై యాతడు మాతృబోధిని అను ప్రాథమిక పుస్తకమును సిద్ధపరచెను. ఇందు దేహమునందలి వివిధాంగములు, వాని స్థానము, ఒండొంటితో సంబంధము మున్నగు నంశములు వర్ణింపబడినవి. కాని పసిబిడ్డలకు చదువు నేర్పుటకై ఈ పాఠము లనుకూలముగ లేవని పల్కుట కెట్టి సందేహమును ఉండదు. ఇయ్యది బాలుర మనోవికాసమున కనుగుణముగ లేదు. భాషను నేర్పుటకొరకై పదముల యర్థమును, వాక్యనిర్మాణము మున్నగు వానిని గూర్చి యిందు కొన్ని అభ్యాసములు చేర్పబడినవి. ఇయ్యవి నిరర్థకములు. అంతేకాదు. వీని వలన బాలురకు చదువునెడ అనిష్టత కూడ జనించును. కాలము వృథాయగును. భూగోళశాస్త్రమునం దాతడు సిద్ధము కావించిన పాఠము లాతని విద్యావిధానము యొక్క ప్రాథమిక

సూత్రములకు విరుద్ధముగ నున్నవి. పెస్టాలజీ సిద్ధాంతముల ననుసరించి సిద్ధముచేసిన ప్రణాళిక లన్నియు అసంపూర్ణముగ నుండుటయో లేక పాతపక్కీలపై ఆధారపడియుండుటయో సంభవించినది. కావున పెస్టాలజీ ప్రతిపాదించిన మూలసూత్ర ములను మాత్రమే మన మంగీకరింపనగునే కాని అందలి వివ రములను మాత్రము విమర్శింపకుండ స్వీకరింపరాదు. అట్లు చేసిన పక్షమున మన విద్యాపద్ధతులు లోపభూయిష్ఠములును, నష్టదాయకములు నగుట తథ్యము. సాధారణ మానవులందరి యందును ఒక గొప్పలోపము తరచు కాననగుచుండును. ఎవడైన నొక మహనీయుడొక మహత్తర సత్యమును ప్రవచిం చినపక్షమున, ఆసత్యముతోపాటు ఇతరములగు ఆనుషంగిక విష యములను, పద్ధతులను కూడ వేదవాక్యములుగ నంగీకరించుట లోకములో పరిపాటి యైనది. ఇట్టి విషయములలో సామాన్య ప్రజలా మహనీయుని బోధనలను తమ విమర్శనకు లోను కావించుట కెంత మాత్రము నంగీకరింపరు. సిద్ధాంతము నందలి ప్రత్యక్షరమును కూడ వారు శిరసావహింతురు. బహిరాకారమును వారు అంతస్స్వరూపముగా భ్రమింతురు. అట్లు సంభవింపకుండునట్లు పెస్టాలజీ మహాశయుడు నిర్వచించిన ప్రామాణిక విద్యాసూత్రములను, వాని ఆచరణ కొరకై తదనంతర మేర్పడిన ఇతర వివరములను మనము స్పష్టముగ వేరుపరచవలెను. పెస్టాలజీ సిద్ధాంతములను మనము నిస్సంశయముగ నంగీకరింపవచ్చును. కాని ఆచరణయందలి

యితర పద్ధతులను మనము విమర్శనా దృష్టితో పరిశీలింప వలెను. విద్యావిధానమును, పద్ధతులను, బాలుర మనోవికాసము నందలి వివిధఘట్టములతోడను, వాని విధానముతోడను సమన్వయము కావించుటకు పూర్వము, బాలుర మనశ్శక్తులేవిధముగ వికసించునో వివరముగ తెలిసికొనుట చాల ముఖ్యము. ప్రస్తుతము మన కీవిషయమును గూర్చి స్థూలముగ కొన్ని విషయములు తెలిసియున్నవి. స్థూలరూపమున తెలిసికొన్న యీ యంశముల నభివృద్ధి పరచి, అందలి వివరములను పూర్తిగ తెలిసికొనవలెను. అప్పుడు మానసికశాస్త్రము మన కవగతమైనట్లు తెల్పుటకు సాధ్యమగును. ఆ శాస్త్రపు టాధారముపై బోధనా కళను పెంపొందింపనగును. మానసికశక్తు లేక్రమములో, ఏయేసంయోగములో వృద్ధిచెందునో తెలిసికొనిన మీదట, ఆ శక్తుల వికాసమున కుత్తమ మార్గముల మన మవలంబింపనగును. కాని యెల్లప్పుడును మనము ప్రకృతిధర్మములను గుర్తించి తదనుగుణముగ వర్తింపవలయును. ప్రస్తుత పరిస్థితిలో మన మవలంబించుచున్న బోధనాపద్ధతులు నిర్దుష్టములైనవని పల్కుటకు సావకాశములేదు.

పైన తెలుపబడిన యంశముల వలన పెస్టాలజీ మహాశయుని విద్యాసూత్రములును, వాని ఆచరణయు నెట్లున్నవో గ్రహింప గల్గితిమి. ఆచరణయందు పెస్టాలజీ విద్యావిధానము లోపభూయిష్ఠమై యున్నట్లు కూడ తెలిసికొన్నారము.

బోధనాపద్ధతులను చక్కబరచుటకై ప్రాథమిక మూలసూత్ర ముల మరల నిర్మాణము కావించుకొనవలె నని కొందరు పల్కవచ్చును. కాని అట్టి యవసరము మాకు కానవచ్చుట లేదు. ఇంతవరకును తెలిసికొనబడిన మూలసూత్రములు, పూర్వపు అనుభవముల సహాయముతో ఉత్తమ బోధనా పద్ధతులను మనము నిర్మించుకొన వచ్చును. ఈ మూల సూత్రముల నిచ్చట నిర్వచింతము. ఇంతకు పూర్వమే మనము వానిని అచ్చటచ్చట తెలిసికొంటిమి కాని వాని నిప్పుడు సక్రమముగా పేర్కొందము.

విద్యారంగమునందు మనము సరళ విషయములతో బోధనను ప్రారంభించి క్రమక్రమముగా క్లిష్టతర విషయము లకు సాగిపోవలెను. ఈ సూత్రము నుపాధ్యాయు లెల్లరును కొంతవరకు ఆచరణలోనైన అంగీకరింతురు. మన మనస్సు క్రమవికాసము చెందును. క్రమవికాసము చెందు ప్రతి సాధ నము వలెనే అయ్యది మొదట ఏకముఖముగ నుండి ఆపైన బహుముఖముగ వర్ధిల్లును. మన బోధనాపద్ధతులు మనశ్శక్తుల వికాసమును ఆచరణయందు ప్రతిబింబింప జేయును కావున ఆ పద్ధతులు కూడ క్రమక్రమముగ వృద్ధిని పొందవలయును. ఈ సూత్రమును చక్కగ అర్థము చేసికొనిన పక్షమున నిం దనేకాంశము లిమిడియున్నట్లు మనము తెలిసికొనగలము. బాలురకు విద్యాబోధ కావించు నవసరమందు మన మొక్క విషయముతో ప్రారంభించి క్రమముగ అధికాంశములను

నేర్పుటకై యత్నింపవలెను. అంతేకాదు. విద్యార్థి మనస్సు వికాసము చెందుచున్న కొలదియు, మనము పరిమిత విషయము లతో తృప్తిచెందక సమస్త విషయముల నేకకాలమునందే బోధించుటకై ఏర్పాట్లు చేయుట అవసరము. మొట్ట మొదట మనలో నిమిడియున్న కొన్నిశక్తులు మాత్రమే ప్రభోధితము లగును. క్రమక్రమముగ వివిధశక్తులు వికసించి, ఆపైన మన యందు అణగియున్న సమస్త ప్రజ్ఞలును ఒకేకాలమున పరిపక్వతను పొంది జీవి క్షీణించువరకును అదే ఉత్తమ స్థాయిలో నిలచిపోవును. కావున మనము బోధనావిధానము నం దొకటి రెండు అంశములతో కార్యక్రమమును ప్రారం భించి, క్రమక్రమముగ విషయముల సంఖ్యను హెచ్చించు టయే కాక వాని నన్నిటిని సంయోగపరచి ఒకే కాలమున విషయముల నన్నిటిని బోధించు పద్ధతిని అమలు జరుపవలెను. విద్యావిధానము పరిమితరూపముతో ప్రారంభించి సమగ్ర రూపమును దాల్చవలయును.

క్రమవికాసమును చెందు ఇతరశక్తుల వలెనే మనస్సు కూడ అనిర్ణీతదశ నుండి కాలక్రమమున నిర్ణీతదశను పొం దును. దేహమునందలి ఇతరాంగముల వలెనే మేధస్సు కూడ మానవునకు యుక్తవయస్సు వచ్చినప్పుడే పరిపక్వతను చెందును. మనస్సు పరిపక్వతను పొందని కాలములో మనము చేయు పనులు నిర్దుష్టముగ నుండనేరవు. ప్రాథమిక దశ యందు బాలుడు పలెకెడి పల్కులలో అర్థసంపూర్ణత కొరవడి

యుంచునట్లే, ఆతడు సాధించెడి విషయగ్రహణము కూడ అస్పష్టముగ నుండును. దృక్ఛక్తి సంపూర్ణముగ పెంపొందని కాలమున బాలుడు చీకటిని వెలుతురును మాత్రము గుర్తింపగలడు. క్రమక్రమముగ నాతడు వివిధవస్తువులను, వాని ఆకార భేదములును, వివిధ వర్ణములను, వానియందలి తరతమ భేదములను గుర్తింప సమర్థుడగును. అదే విధముగ క్రమవికాసమును చెందుచున్న మనస్సును, తదితర శక్తులును కూడ వివిధ వస్తువులను, వివిధ కార్యకలాపములను మొట్టమొదల స్థూలరూపమున మాత్రము గుర్తించును. ఆపైన వివిధ వస్తువుల విస్పష్టమగు ఆకారమును, ఆ యాకారమందలి సూక్ష్మ భేదములను బాలుడు కన్గొనజాలును. మన విద్యావిధాన మీ సామాన్య సూత్రమును దృష్టియందుంచుకొని వర్తింపవలయును. పరిపక్వతను పొందని మనస్సునందు నిర్ణీతమగు సూక్ష్మాంశముల పాదుకొల్పుట సాధ్యము కాదు. సాధ్యమైనను వాంఛనీయము కూడ కాదు. ఇట్టి సూక్ష్మాంశముల పొందుపరచిన పద సమామ్నాయమును మనము బాలురకు నేర్పవచ్చును. కాని అంతమాత్రముచే ఆ పదములలో నిమిడియున్న మహత్తరాంశముల బాలు డర్థము కావించుకొనినట్లు మనము భావింపరాదు. ఈ యంశముల గూర్చి బాలురను పరీక్షించిన పక్షమున వారి జ్ఞాన మేపాటిదో తెలిసిపోవును. ఇట్టి సందర్భములలో బాలురు తాము నేర్చుకొను పదముల యందలి భావ మెట్టిదో తెలిసికొననే తెలిసికొనరు.

భావమును వారొకవేళ తెలిసికొనినను అది ఛాయా మాత్ర ముగ వారికి తెలిసి వచ్చును. అనుభవములు వృద్ధియైన కొలదియు నిర్ణీతములగు భావము లేర్పడుట కవకాశము చిక్కును. పరిశీలనాశక్తి హెచ్చిన కొలదియు స్థూలదృష్టికి ఒకే విధముగ కాన్పించిన వస్తుజాలమునందు సూక్ష్మభేదము లును, విశిష్ట లక్షణములును కాన్పింపసాగును. ఒకే విధ మగు కార్యకలాపములు తరచు పునరావృత్తము లగుటవలన ఆ విధములగు పనులతో మనకు చక్కని పరిచయ మేర్ప డును. ఒక్కొక్క వస్తువునందును, క్రియ యందును గల సూక్ష్మ లక్షణములను, ఇతరములతో దానికి గల సూక్ష్మ విభేదములను, బాలుడు గుర్తింపజాలిననాడే అతడు ప్రౌఢ విద్యావిధానమునందలి నిర్వచనముల నర్థము చేసికొనగ ల్గును. కావున విద్యావిధానమునందు మనము మొట్టమొదట విషయ పరిజ్ఞానమును స్థూలరూపమున మాత్రమే బాలుర కందజేయ గలము. స్థూలమును అనిర్దిష్టమును అగు జ్ఞానము క్రమముగ సూక్ష్మమును, నిర్దిష్టమును అగును. వివిధానుభవముల మూల మున బాలుడు మొట్టమొదట తన జ్ఞానమునందు గల గొప్ప లోపములను, ఆపైన సూక్ష్మములగు లోపములను సవరించు కొనజాలును. బాలుని విషయగ్రహణశక్తి వృద్ధియైన కొలదియు, మనము వానికి శాస్త్రీయ సిద్ధాంతములను నేర్ప వచ్చును.

బోధనావిధానము నందు ఉపలక్షిత విషయములనుండి

యాకారమునందును, గుణగణములందును. మన పూర్వీకుల లక్షణములు తప్పక ప్రతిబింబించుచుండును. ఒక వంశము నందు చిత్తచాంచల్యమువంటి దుష్టలక్షణము లొకసారి కాన వచ్చిన పక్షమున నా వంశమునందలి యితరతరముల వారిలో కూడ అదే వయస్సునం దీలోపము కానవచ్చుచుండును. ఒక వ్యక్తిని మనము పరిశీలించినచో ఆతని యందు ఆతని ప్రాచీనుల లక్షణములు కొన్ని ద్యోతకము కావచ్చును, కొన్ని కాకపోవచ్చును. ఇందులకు కారణము లేకపోలేదు. వ్యక్తియందు సజీవులును, మృతులును అయిన అనేకులు వంశపురుషుల లక్షణములు సమ్మిళితములై యుండుటయే దీనికి మూలము. వ్యక్తుల మాట యట్లుండనిచ్చి జాతులను గూర్చి విచారింతము. అనేక తరములు గడచినను వేర్వేరు తెగలలోనుండు విశిష్టలక్షణములు నశించిపోక అట్లే నిలచి యుండును. ఈ వేరు వేరు తెగల యొక్క పూర్వీకు లొక ప్రత్యేకమగు వాతావరణమునందు నివసించిన కారణమున వారి యందు కొన్ని విశిష్టలక్షణము లేర్పడినవి. పరిసరము లా జాతియందలి యనేక తరముల వారి నదే విధముగ ప్రభావితము కావించిన కారణమున, అందలి యాధునికుల లో కూడ వారి ప్రాచీనుల లక్షణములు స్పష్టముగ కాన్పించు చుండును. ఈ విధముగ ఒక్కొక్క తెగ యందు కొన్ని లక్షణములు ప్రకృతిసిద్ధముగ నుండుట సంభవించును. ఫ్రాన్సుదేశపు బాలు నొకనిని నీ వెట్టి వాతావరణములో

పెంచినను, ఆతడు పెరిగి పెద్దవాడైనతరువాత ఫ్రెంచి పెద్ద మనుష్యుడే యగును కాని మరొక్కడుగ మారడు. పైన తెలుపబడిన వంశక్రమానుగతములగు లక్షణములు బాహ్య స్వరూపమునకును, బుద్ధికిని కూడ చెందును. దీని వలన మానవులెల్లరును తాము సంపాదించిన విజ్ఞానము నొక ప్రత్యేక పంథ ననుసరించి సాధించినట్లు తెల్లమగుచున్నది. కావున ప్రతి బాలుడును కూడ విద్యార్జనమున నదీమార్గమునే అవలంబించుట సుకరమైనదని నిర్ణయింపనగును. ఈ విద్యావిధాన క్రమము లోపభూయిష్ఠమేయగుగాక. కాని వ్యక్తి యెల్లప్పుడును జాతి యడుగు జాడల ననుసరించి పోవుట శ్రేయస్కరము. నిజమునకు మానవజాతి యీ నాటి వరకును సాధించిన యభివృద్ధియు విజ్ఞానమును క్రమబద్ధమగు మార్గము ననుసరించియే జరిగినది. నాగరకతా వికాసము నందలి వివిధ దశలనే విద్యా విధానములో కూడ అవలంబించుట వాంఛనీయము. జాతులలో వ్యక్తమైన క్రమవికాసము కొన్ని నిర్ణీతదశలలో జరగినది. అందులకు ప్రబలమగు కారణములు కలవు. ఈ కారణములు సంఘములకును వ్యక్తులకును కూడ సమానముగ వర్తించును. ఈయంశమునకు సంబంధించిన వివరముల పేర్కొనుట కిచ్చట తావు లేదు కాని ఒక విషయము మాత్రము గమనింపదగినది. ఒకానొక సంఘమునందలి మానవులెల్లరును కొన్ని తరముల వరకును ఒక ప్రత్యేకమగు వాతావరణములో నివసించి, అందలి వివిధదృశ్యము

లను, సంఘటనలను చిరకాలము పరిశీలించి, ఒండొంటితో పోల్చి, ప్రయోగములు సల్పి, జిజ్ఞాసకావించి, తుదకు కొన్ని సిద్ధాంతముల కావించుకొని వాని మూలమున విజ్ఞానమును పెంపు కావించుకొందురు. కావున పరిసరములకును మానవుని మేధస్సునకును ఒక ప్రత్యేకమగు సంబంధము కలదనియు, విజ్ఞానమును సాధించుటకు మన పూర్వీకు లనుసరించిన మార్గము తప్ప వేరొండు లేదనియు ఊహింపనగును. ప్రతి బాలుని మనస్సునకును, ఆతని పరిసరములకును గల సంబంధము కూడ ఆతని ప్రాచీనులకును వారి పరిసరములకును గల సంబంధము వంటిదే కావున, విజ్ఞాన సాధనమునకై ఆతనికి మార్గాంతరము లేదని స్పష్టమగుచున్నది. కావున ఒక జాతియొక్క విద్యావిధానమును నిర్ణయించు సందర్భమునం దా జాతియొక్క నాగరకతా విధానమును పరిశీలించుట తప్పని సరియగును.

పైన మనము తర్కించిన యంశముల మూలమున నొక సారాంశము తేలుచున్నది. విద్యయందలి ప్రతి విభాగమునందును కూడ ఉపలక్షితాంశములనుండి అనుపలక్షిత విజ్ఞానము నెడకు సాగిపోవలెను. మానవులు క్రమముగ అభివృద్ధిచెందుచున్న కాలములో వారు మొట్టమొదట కొన్ని కళలను సాధించి, ఆమీదట తత్సంబంధమగు విజ్ఞానమును రూపొందించిరి. వ్యక్తులైనను, సంఘములైనను ఉపలక్షితాంశములనుండి అనుపలక్షితములును, కేవలము ఊహ్యా

ములు నగు అర్థములవైపు సాగిపోవుట అనివార్యము. శాస్త్రము రూపొందుటకు పూర్వము అనుభవములును, తజ్జన్యమగు తాత్కాలిక నిర్ణయములును ఉండి తీరవలెను. శాస్త్రమనగా క్రమబద్ధమగు జ్ఞానము. కాని జ్ఞానమును క్రమబద్ధము కావించుటకు పూర్వము దానిని మనము సాధింపవలయును గదా! కావున మనము నేర్పునట్టి ప్రత్యంశమును కూడ మొట్టమొదట అనుభవపూర్వకముగ మనకు తెలియవలెను. అనుభవముల మూలమున ఒక విషయమును గూర్చి కొంత జ్ఞానమును సంపాదించిన మీదట జిజ్ఞాసను ప్రారంభింపవచ్చును. ఇందుల కీ క్రింది యుదాహరణముల నొసంగవచ్చును. మనము బాలురకు మొట్ట మొదట భాషను బోధించి ఆపైననే ఆతనికి వ్యాకరణ పాఠములు చెప్పుచున్నాము. తన యెదుట గల వస్తువులను చిత్రించు నేర్పును సంపాదించిన తరువాత విద్యార్థికి (దూరముందు అగపడు వస్తువులను తద్వత్తుగా వ్రాసెడు) చిత్రశాస్త్రము అనగా నేమో బోధించుచున్నాము. ఇట్లే ఇతరములగు ఉదాహరణముల కూడ ఈయవచ్చును.

ఈ వరకు తెలుపబడిన సామాన్య సూత్రముల నుండి మరియొక అంశము విస్పష్టమగుచున్నది. విద్యావిషయములలో బాలకుడు తనంత తాను అభివృద్ధిని సాధించు పద్ధతిని శక్తియైనంతవరకు ప్రోత్సహింపవలెను. ఇది చాల ముఖ్యమైన యంశము. విద్యార్థులు ప్రతి అంశమును తమంత తామే

పరిశీలించి, ఫలితమును గ్రహించునట్లు వారికి మార్గము చూపవలెను. ఉపాధ్యాయుడు వారికి సాధ్యమైనంతవరకు తక్కువ బోధింపవలయును. బిడ్డలు స్వయముగ అన్ని యంశములను కనుగొనవలయును. మానవజాతి తనంతతానే వివిధ విషయముల గ్రహించుచు అభివృద్ధిని సాధించినది. కావున ఉత్తమములగు ఫలితముల సాధించుటకై లేబ్రాయపు విద్యార్థులు కూడ ఇదే పద్ధతిని అవలంబించుట యవసరము. స్వయంశక్తిపై ఆధారపడిన మానవులకు జీవితరంగమున నెట్టి యఖండ విజయము లభించుచున్నదో గమనించిన పక్షమున నీయంశము స్పష్టమగును. సర్వసాధారణముగ పాఠశాలలలో నొసంగబడు శిక్షణను పొందిన వారికది యొక్కటియే విద్యార్జనమునకు సరియగు మార్గమనియు, బాలురు తమంత తామే విషయములను గ్రహించుట సాధ్యముకాదనియు భావింతురు. కాని ఆ యభిప్రాయము సరియైనదికాదు. శైశవదశయందు బిడ్డ తనచుట్టును గల అనేక వస్తువులను గూర్చి సంపాదించు జ్ఞానమును ఇతరుల సహాయము లేకుండగనే సంపాదించుచున్నది. అట్లే బిడ్డలు తమ మాతృభాష నితరుల సహాయము లేకుండ తమంతతామే నేర్చుచున్నారు. పాఠశాలలకు వెలుపల బాలురు ఎన్నో నూతన విషయములను, ఎంతో జీవితానుభవమును సాధించుచున్నారు. మన నగరవీధులలో దిక్కులేకుండ తిరుగుచుండు అనాధబాలురు పలువురు ఎట్టి పని యందైనను అసాధారణమగు సామర్థ్య

మును ప్రదర్శించుచుండుట గమనింపదగినది. ఈ నాటి మన పాఠ్యప్రణాళిక యందలి వివిధ విషయములను, ఇంతకు కఠిన తరమైన అనేక విషయములను స్వయంసహాయముచే నేర్చిన అనేకుల దృష్టాంతముల నుదహరింపగలము. కావున వివిధ విషయములను యుక్తకాలమందు, సరియైన పద్ధతిలో విద్యార్థి ప్రోల నిడిన పక్షమున, ఎంతటి సామాన్య బుద్ధి కౌశల్యము గలవాడును కూడ కష్టపడి స్వశక్తివలననే వానిని బాగుగా గ్రహింపగల్గును. ఇందులకు సందేహము లేదు. పసిబిడ్డలు నిరంతరమును వివిధవస్తువుల పరిశీలించి, పరిశోధించి, సత్యాంశముల గ్రహించుచున్నారు. వారు తరచుగ అతి సూక్ష్మమగు ప్రశ్నలను వేయుచుందురు. ఈ యంశముల దృష్టియం దుంచుకొనిన పక్షమున, ఆయాదశ కనుగుణాల మైన విషయజాలమును గూర్చిన విజ్ఞానమును బిడ్డ ఇతరుల సహాయము లేకుండ తనంత తానే సాధింపగల డనుట కెట్టి అభ్యంతరమును మనము చూపజాలము. మనము చిన్నబిడ్డల కేవేవో విషయములను బోధింప బూనుటకు కారణము మన తెలివితక్కువతనమే కాని బిడ్డల యజ్ఞానము కాదు. బిడ్డ తనంతతాను పరిశీలించి తెలిసికొనగల యంశములను తెలిసికొనకుండ మనము నిరోధించు చున్నాము. ఆ దశ యందు బిడ్డ తెలిసికొనజాలని యంశముల నాబిడ్డకు బలవంత ముగ బోధించుచున్నాము. కావున నా యల్పప్రాణి ఆ యంశముల యెడ అనిష్టత చూపుచున్నది. మనము కోరిన

విషయములను బాలుడు ఇష్టపూర్వకముగ నేర్చుకొనుట లేదను కారణమున ఆతనిని బెదరించియో, శిక్షించియో ఈ యంశముల నాతని మెదడులోనికి బలవంతముగ నింపుటకై యత్నించుచున్నాము. బాలుడు కోరునట్టి జ్ఞానమును మన మాతని కొసంగుట లేదు. ఆతడు గ్రహింపజాలని యంశముల నాతని నెత్తిపై మనము రుద్దుచున్నాము. ఈ కారణము వలన బాలునియందు బుద్ధిమాంద్యము ప్రవేశించి, జ్ఞాన సంపాదనము నెడల ఆతనికి విముఖత కల్గుచున్నది. మన మవలంబించిన తప్పుడు పద్ధతుల వలన బాలుని యందు మానసికమగు అలసత మేర్పడుచున్నది. అంతేకాదు. ఆయా విషయములను గ్రహింపజాలు బుద్ధిపరిపక్వత బాలునిలో పెంపొందుటకు పూర్వమే మన మా కఠిన విషయములను బాలునికి నేర్పబూనుచున్నాము. ఈ రెండు కారణములచే విద్యార్థి ఉపాధ్యాయుని సహాయము లేకుండ ఎట్టి యంశమును గ్రహింపజాలని స్థితికి వచ్చుచున్నాడు. దీనిని చూచి మనము ఉపాధ్యాయుని నిరంతర బోధన వలననేకాని తదితర విధముగ విద్యార్థి జ్ఞానము నార్జింపజాలడను తప్పుడు సిద్ధాంతమును కావించుకొనుచున్నాము. విద్యార్థి యందలి మానసిక దౌర్బల్యమును మనమే సృష్టించి, ఆదౌర్బల్యమునే మన తప్పుడు విద్యావిధానమున కొక కారణముగ మనము చూపుచున్నాము. విద్యాబోధనయందు దనుభవము సంపాదించిన వారెవ్వరును మేము సమర్థించుచున్న యీ

పద్ధతిని కాదనజాలరు. మనము విద్యావిధానము నందు ప్రకృతి యనుసరించు శిక్షణావిధానమును, మార్గములను అవలంబింపవలెను. ప్రాథమికదశయందును, ఉన్నతదశ యందును కూడ విద్యార్థి స్వయంసహాయముచే విషయ గ్రహణము కావింపగల్గునట్లు మనము నేర్పుతో చేయూత నొసంగవలెను. ఇట్లు చేయుటవలన విద్యార్థియందు మానసిక శక్తియు, చురుకుతనమును పెంపొందును.

ఇంత వరకును మేము ప్రతిపాదించిన విద్యావిధానమును పరీక్షించి అందలి మంచిచెడ్డలను గుర్తించుట కొక మార్గము కావలెను. సూచింపబడిన సామాన్యసూత్రములకును, వివరింపబడిన విద్యావిధానమునకును చక్కని సమన్వయము కుదిరినదా లేదా యని సంశయము కల్గినప్పుడు దాని నివారణకొరకు కొక్కటియే త్రోవగలదు. పై విద్యావిధానము విద్యార్థుల కానందము కూర్చుచున్నదా లేదా యను నంశమును మనము తెలిసికొనవలెను. మన తర్కవితర్కముల కంటె బాలుర మనః ప్రవృత్తులే ఈ సందర్భమున నెక్కుడు విశ్వసనీయములు. కావున పై విద్యావిధానము మన హేతువాదమున కెంత నిర్దుష్టముగ కానవచ్చినను, అయ్యది బాలురకు రుచింపని యెడల, లేక ఇతర విధానములింతకంటె వారికి (బాలురకు) ఆకర్షకములుగ నున్న పక్షమునను, మన మీ విధానమును త్రోసిపుచ్చవలెను. జ్ఞానమునకు సంబంధించినంత వరకు సామాన్యపరిస్థితులలో

బాలురు తమకు పుష్టిని కల్గించు విషయములను సంతోష ముతో స్వీకరింతురు. పుష్టిని కల్గింపని యంశములు వారి కనిష్టములుగా నుండును. ఈ సామాన్య సూత్రమును మన మంగీకరింపవచ్చును. నైతికవిషయముల మాట యెట్లున్నను జ్ఞానవిషయమునందును, అందును ముఖ్యముగ విద్యావిష యము నందును ఈ సూత్ర మన్వర్థ మగుచున్నది. బాలురు తరచుగ కొన్ని విషయముల యెడల ప్రత్యేకమగు అనిష్ట తను చూపుచుందురు. దీనివలన ఉపాధ్యాయుల కాగ్రహము కల్గుట పరిపాటిగ నున్నది. ఈ పరిస్థితికి మన మనుసరించు చున్న తప్పుడు విద్యావిధానమే కారణము. "ఎల్లప్పు డును చురుకుగ నేదో యొక పని చేయుచుండుట అల్పవయ స్కులగువారి సహజగుణమని నేను అనుభవమువలన తెలిసి కొన్నాను. అలసత వారి నైజమునకు విరుద్ధము. బాలుర యందు అలసత కానవచ్చిన పక్షమున నయ్యది విద్యావిధా నమందలి లోపములవలననో లేక శారీరకమైన యొక దోషమువలననో సంభవించును." అని ఫెలెన్‌బర్గ్ నకాం క్షించు చున్నాడు. తమశక్తుల నుపయోగకరములగు మార్గ ములలో వినియోగించుటవలన బాలుర కానందము లభిం చును. కావుననే వారు నిరంతర మేదో పనిలో నిమగ్నులై యుందురు. కాని ఉన్నతమగు కొన్ని మానసికశక్తులు కొన్ని జాతులలో పూర్తిగా వికసింపకపోవుట సంభవము. అట్టి శక్తులు జన్మతః కొందరియందు మాత్రమే నెలకొని

యుండును. సామాన్యులగువారు ఉత్తమమానసికశక్తిని చూపజాలరు. అందులకు కావలసిన పరిశ్రమను చేయజాలరు. ఈ యున్నత మానసికశక్తులు క్లిష్టములైనవి కావున విజ్ఞానాభివృద్ధియందలి తురీయ దశయందు మాత్రమే వీని యావశ్యకత కాన్పించును. విద్యార్థికి యుక్తవయస్సు వచ్చువరకును ఈ యున్నత శక్తులకు మనము పని కల్పింప నక్కరయుండదు. ఈ దశయందు మాత్రమే మానవుడు పరోక్ష లక్ష్యముల గుర్తింప సమర్థుడగును. ప్రత్యక్షమగు నానందము లేని కొరత నీ దశలో పరోక్షానందము తీర్పగలదు. తక్కువ స్థాయిలో నున్న శక్తుల కన్నిటికిని ప్రోత్సాహము కల్గించునది ఆ శక్తుల వినియోగము వలన జనించు నానందము మాత్రమే. ఈ శక్తులను ప్రోత్సహించుట కింతకు మించిన సాధనము మరొక్కటి యవసరములేదు. సామాన్యమానసిక శక్తులను బలపరచుట కీ సహజ సాధనము చాలని యెడల మన మనుసరించుచున్న విద్యాపద్ధతులలో నేదో యొక లోప మున్నట్లు గ్రహింపవలయును. విద్యావిషయములందు బాలుర కభిరుచిని ఆనందమును కల్గించుటకు కొన్ని మార్గములు కలవు.

పైన తెలుపబడిన యంశములు కేవలము సూత్రప్రాయముగ నిర్వచించిన చాలదు. ఆచరణయందవి యెట్లుండునో గ్రహించుట కూడ ముఖ్యము. కావున విద్యాబోధను

గూర్చి ఇచ్చట కొన్ని సూచనలను కావించెదము. సూత్ర నిర్వచనదశనుండి ఆచరణదశలోనికి మనము ప్రవేశింతము.

మానవుని జ్ఞానసంపాదనము శైశవము నుండియే ప్రారంభించునని పెస్టాలజీ మహాశయుడు తెల్పియున్నాడు. ఈ యభిప్రాయము నానాటికిని జనసామాన్యములో బల పడుచున్నది. మనము ప్రయత్నపూర్వకముగ నెట్టి ఏర్పా ట్లును చేయకపోయినను మానవుడు పిన్ననాటి నుండియు కూడ జ్ఞానమును సంపాదించుచుండునని సూక్ష్మపరిశీలనా శక్తిగల యెల్లవారికిని విదితము. బాలుడు విస్ఫారిత నయ నములతో తన చుట్టుప్రక్కలగల యన్ని వస్తువులను చూచుచుండును. ప్రతివస్తువును తాకును, ప్రతివస్తువును నోటిలో దూర్చుకొని పరీక్షించును. ప్రతిధ్వనిని మిక్కిలి ఆసక్తితో నోరు తెరచుకొని వినును. ఇయ్యది జ్ఞానార్జన మునకు మొదటిమెట్టు. క్రమక్రమముగ నా మానవుడు దృగ్గోచరముకాని గ్రహములను కన్గొనును. నూతన యంత్ర ముల నిర్మించును. అద్భుతముగ చిత్తరువులను చిత్రిం చును. చెవి కింపైన రాగములను కల్పించును. రూపకముల వ్రాయును. బాలుగ యందు దిమిడియున్న శక్తులు సమంత తామే వృద్ధినొందునని మనము గ్రహించినారము. శిశు వుల యందలి కార్యాసక్తి అనివార్యము. ఈ సందర్భము నందొక ప్రశ్న యుత్పన్నమగుచున్నది. శిశువు తన కార్యా సక్తిని చూపుటకై మార్గములను, అందులకు తగిన వస్తు

జాలమును అన్వేషించి, అందజేయు బాధ్యత మనపై కలదా లేదా? ఆ బాధ్యత మనము తప్పక నిర్వహింపవలెను. కాని పెస్టాలజీచే నిర్వచింపబడిన యీ సూత్రము నంగీకరించినంతమాత్రమున, ఆతని ఆచరణను కూడ మనము పూర్తిగా శిరసావహింపవలెనను నిర్బంధము లేదు. ఈ సందర్భములో పెస్టాలజీ కావించిన యొక సూచనను గమనింతము.

"బాలశిక్ష యందు వివిధ శబ్దముల యుచ్చారణను కూడ చేర్పవలయును. ప్రతి కుటుంబమునందును బాలబాలికలకు శైశవమునుండియు వీనిని నేర్పవలెను. నూతన పదములను నేర్చుకొనుచున్న బాలుడు వానిని మాటలుకూడ రాని పసిబాలునివద్ద నల్లెవేయుచుండవలెను. ఈ విధముగ వివిధశబ్దముల యుచ్చారణ పసిబాలుని మనస్సుపై హత్తుకొని పోవును." అని పెస్టాలజీ తెలుపుచున్నాడు.

మాతృబోధిని అను పేరిట నీతడు వ్రాసిన యొక పుస్తకమునందు శిశుబోధనము కొరకై కొన్ని సూచనలు కావింపబడినవి. దేహమునందలి వివిధాంగములు, వాని పేర్లు, ఉనికి, ఒండొంటితో సంబంధము, వాని సంఖ్య, లక్షణములు మొదలగు వాని నాతడిందు చేర్చియున్నాడు ఈ యంశముల నన్నిటిని జోడించి పరీక్షింపగా, మానసికాభివృద్ధి విషయమై పెస్టాలజీకి నిశ్చితాభిప్రాయములును నక్రమ విధానములును లేనట్లు తేలుచున్నది. శిశుబోధనముకొరకై

గూర్చి ఇచ్చట కొన్ని సూచనలను కావించెదము. సూత్ర నిర్వచనదశనుండి ఆచరణదశలోనికి మనము ప్రవేశింతము.

మానవుని జ్ఞానసంపాదనము శైశవము నుండియే ప్రారంభించునని పెస్టాలజీ మహాశయుడు తెల్పియున్నాడు. ఈ యభిప్రాయము నానాటికిని జనసామాన్యములో బల పడుచున్నది. మనము ప్రయత్నపూర్వకముగ నెట్టి ఏర్పా ట్లను చేయకపోయినను మానవుడు పిన్ననాటి నుండియు కూడ జ్ఞానమును సంపాదించుచుండునని సూక్ష్మపరిశీలనా శక్తిగల యెల్లవారికిని విదితము. బాలుడు విస్ఫారిత నయ నములతో తన చుట్టుప్రక్కలగల యన్ని వస్తువులను చూచుచుండును. ప్రతివస్తువును తాకును, ప్రతివస్తువును నోటిలో దూర్చుకొని పరీక్షించును. ప్రతిధ్వనిని మిక్కిలి ఆసక్తితో నోరు తెరచుకొని వినును. ఇయ్యది జ్ఞానార్జన మునకు మొదటిమెట్టు. క్రమక్రమముగ నా మానవుడు దృగ్గోచరముకాని గ్రహములను కనుగొనును. నూతన యంత్ర ముల నిర్మించును. అద్భుతముగ చిత్తరువులను చిత్రిం చును. చెవికింపైన రాగములను కల్పించును. రూపకముల వ్రాయును. బాలుని యందు దిమిడియున్న శక్తులు సమంత తామే వృద్ధినొందునని మనము గ్రహించినారము. శిశు వుల యందలి కార్యాసక్తి అనివార్యము. ఈ సందర్భము నం దొక ప్రశ్న యుత్పన్నమగుచున్నది. శిశువు తన కార్యా సక్తిని చూపుటకై మార్గములను, అందులకు తగిన వస్తు

జాలమును అన్వేషించి, అందజేయు బాధ్యత మనపై కలదా లేదా ? ఆ బాధ్యత మనము తప్పక నిర్వహింపవలెను. కాని పెస్టాలజీచే నిర్వచింపబడిన యీ సూత్రము నంగీకరించినంతమాత్రమున, ఆతని ఆచరణను కూడ మనము పూర్తిగా శిరసావహింపవలెనను నిర్బంధము లేదు. ఈ సందర్భములో పెస్టాలజీ కావించిన యొక సూచనను గమనింతము.

"బాలశిక్ష యందు వివిధ శబ్దముల యుచ్చారణను కూడ చేర్పవలయును. ప్రతి కుటుంబమునందును బాలబాలికలకు శైశవమునుండియు వీనిని నేర్పవలెను. నూతన పదములను నేర్చుకొనుచున్న బాలుడు వానిని మాటలుకూడ రాని పసిబాలునివద్ద వల్లెవేయుచుండవలెను. ఈ విధముగ వివిధశబ్దముల యుచ్చారణ పసిబాలుని మనస్సుపై హత్తుకొని పోవును." అని పెస్టాలజీ తెల్పుచున్నాడు.

మాతృబోధిని అను పేరిట నీతడు వ్రాసిన యొక పుస్తకమునందు శిశుబోధనము కొరకై కొన్ని సూచనలు కావింపబడినవి. దేహమునందలి వివిధాంగములు, వాని పేర్లు, ఉనికి, ఒండొంటితో సంబంధము, వాని సంఖ్య, లక్షణములు మొదలగు వాని నాతడిందు చేర్చియున్నాడు ఈ యంశముల నన్నిటిని జోడించి పరీక్షింపగా, మానసికాభివృద్ధి విషయమై పెస్టాలజీకి నిశ్చితాభిప్రాయములును సక్రమవిధానములును లేనట్లు తేలుచున్నది. శిశుబోధనముకొరకై

గూర్చి ఇచ్చట కొన్ని సూచనలను కావించెదము. సూత్ర నిర్వచనదశనుండి ఆచరణదశలోనికి మనము ప్రవేశింతము.

మానవుని జ్ఞానసంపాదనము శైశవము నుండియే ప్రారంభించునని పెస్టాలజీ మహాశయుడు తెల్పియున్నాడు. ఈ యభిప్రాయము నానాటికిని జనసామాన్యములో బల పడుచున్నది. మనము ప్రయత్నపూర్వకముగ నెట్టి ఏర్పా ట్లను చేయకపోయినను మానవుడు పిన్ననాటి నుండియు కూడ జ్ఞానమును సంపాదించుచుండునని సూక్ష్మపరిశీలనా శక్తిగల యెల్లవారికిని విదితము. బాలుడు విస్ఫారిత నయ నములతో తన చుట్టుప్రక్కలగల యన్ని వస్తువులను చూచుచుండును. ప్రతివస్తువును తాకును, ప్రతివస్తువును నోటిలో దూర్చుకొని పరీక్షించును. ప్రతిధ్వనిని మిక్కిలి ఆసక్తితో నోరు తెరచుకొని వినును. ఇయ్యది జ్ఞానార్జన మునకు మొదటిమెట్టు. క్రమక్రమముగ నా మానవుడు దృగ్గోచరముకాని గ్రహములను కన్గొనును. నూత్న యంత్ర ముల నిర్మించును. అద్భుతముగ చిత్తరువులను చిత్రిం చును. చెవి కింపైన రాగములను కల్పించును. రూపకముల వ్రాయును. బాలుని యందు దిమిడియున్న శక్తులు తమంత తామే వృద్ధినొందునని మనము గ్రహించినారము. శిశు వుల యందలి కార్యాసక్తి అనివార్యము. ఈ సందర్భము నం దొక ప్రశ్న యుత్పన్నమగుచున్నది. శిశువు తన కార్యా సక్తిని చూపుటకై మార్గములను, అందులకు తగిన వస్తు

జాలమును అన్వేషించి, అందజేయు బాధ్యత మనపై కలదా లేదా ? ఆ బాధ్యత మనము తప్పక నిర్వహింప వలెను. కాని పెస్టాలజీచే నిర్వచింపబడిన యీ సూత్రము నంగీకరించినంతమాత్రమున, ఆతని ఆచరణను కూడ మనము పూర్తిగా శిరసావహింపవలెనను నిర్బంధము లేదు. ఈ సందర్భములో పెస్టాలజీ కావించిన యొక సూచనను గమనింతము.

"బాలశిక్ష యందు వివిధ శబ్దముల యుచ్చారణను కూడ చేర్పవలయును. ప్రతి కుటుంబమునందును బాలబాలి కలకు శైశవమునుండియు వీనిని నేర్పవలెను. నూతన పదము లను నేర్చుకొనుచున్న బాలుడు వానిని మాటలు కూడ రాని పసిబాలునివద్ద వల్లెవేయుచుండవలెను. ఈ విధముగ వివిధశబ్దముల యుచ్చారణ పసిబాలుని మనస్సుపై హత్తు కొని పోవును." అని పెస్టాలజీ తెల్పుచున్నాడు.

మాతృబోధిని అను పేరిట నీతడు వ్రాసిన యొక పుస్తకమునందు శిశుబోధనము కొరకై కొన్ని సూచనలు కావింపబడినవి. దేహమునందలి వివిధాంగములు, వాని పేర్లు, ఉనికి, ఒండొంటితో సంబంధము, వాని సంఖ్య, లక్ష ణములు మొదలగు వాని నాత డిందు చేర్చియున్నాడు ఈ యంశముల నన్నిటిని జోడించి పరీక్షింపగా, మానసికాభి వృద్ధి విషయమై పెస్టాలజీకి నిశ్చితాభిప్రాయములును సక్రమ విధానములును లేనట్లు తేలుచున్నది. శిశుబోధనముకొరకై

మానసికతత్త్వశాస్త్రమే మార్గముల చూపుచున్నదో గ్రహింతము.

కాంతి, శబ్దము, నిరోధకశక్తి మున్నగు వానిని గూర్చి ప్రప్రథమమునుండియు శిశువునకు కొన్ని భావము లుండును. కాని ఆ భావములను మనము సుస్పష్టముగ గ్రహింపజాలము. బాలకుని యందు విషయగ్రహణశక్తి సక్రమముగ వృద్ధి యగునంతవరకును, ఆతడు తన మనస్సులో గల భావములను స్పష్టము కావించుకొని, అందలి వివిధ భాగములను నిరూపించుట సాధ్యము కాదు. వివిధవస్తువుల యాకార మెట్టిదో తెలిసికొనుటకు పూర్వము కాంతి, దాని లక్షణములు, దాని వివిధదశలను, నిరోధకశక్తి, దాని యందలి తరతమ భేదములను గుర్తించుట చాల అవసరము. దృశ్యవస్తువులను వివిధకాంతుల సహాయమున మనము చూడగల్గుదుమనియు, మూర్తములగు వస్తువులను వాని వాని నిరోధక భేదములచే కనుగొందుమనియు ఎల్లరకును తెలిసిన యంశమే. ఉచ్చరించుటకు సాధ్యముకాని కొన్ని ధ్వనులు సమకూడి ఉచ్చారణకు యోగ్యమగు ధ్వనులు, శబ్దములును ఏర్పడుచున్నవి. వీని నెరుంగువరకును శబ్దముల నుచ్చరించుట సాధ్యపడదు. ఈసూత్రమునే మన మితరాంశములకు కూడ వర్తింపజేయుచున్నాము. శిశువుల విద్యాబోధనకొరకై వివిధతరగతులు, వివిధలక్షణములు గల నిరోధక శక్తితో కూడిన అనేక వస్తువుల సమకూర్చవలయును.

వివిధలక్షణములు, హెచ్చుతగ్గులు గల కాంతిని శిశువులకు చూపవలెను. వివిధ స్థాయిలకు చెందిన అనేక శబ్దములు వారికి వినిపింపవలెను. ఈ విధముగ సులభవిషయములతో ప్రారంభించి శిశువును క్రమక్రమముగ గహనవిషయముల కడకు కొనిపోవలెను. ప్రతిబిడ్డయు తన ఆటవస్తువుల నన్నిటిని కొరికి చూచును. తన అన్న తొడుగుకొన్న కోటుపై గల రంగురంగుల గుండీలను తాకిచూచును. తన తండ్రి మీసములను పట్టిలాగును. గాఢమైన రంగులుగల బొమ్మలను ఆశ్చర్యముతో చూచి అవి అందముగా నున్నట్లు భావించును. మాటలు నేర్చిన తర్వాత అవి అందముగా నున్నట్లు పల్కును. తన దాది పల్కెడి పల్కులను విని ఆనందముతో నవ్వును. ఎవరైన మెటికలు విరచుకొనినను, ఏదైన నూతనశబ్దము చేసినను శిశువు మిక్కిలి ఆసక్తితో వినును. ఈ యంశముల గమనించినచో శిశువుల సహజప్రవృత్తులెట్లుండునో మనకు గోచరమగును. సర్వసాధారణముగ బిడ్డలను పెంచువారందరును ఈ సహజప్రవృత్తులను సంతోషపరుపజాలు పనులను చేయుచునే యుందురు. కాని ఈ యలవాట్ల నింకను బలపరచి వృద్ధిగావించుట చాల అవసరము. శైశవదశయందు మానవునిలో దాగియున్న శక్తులన్నియు బాగుగా వికసింప నారంభించును. ఈ శక్తుల వికాసమునకు పరిణామరూపమగు కార్యకలాపముల వలన శిశువున కెన్నియో నూతనాంశములు తెలియువచ్చును. ఇంతటి

జ్ఞానము మానవునకు మరేదశయందును లభింపదు. శైశవ దశయందు బాలకునికి మరేవిధమైన జ్ఞానమును అందజేయుట సాధ్యము కాదు. వివిధ వస్తువుల ఆకారము, స్వరూపము, వివిధ శబ్దములు మున్నగువానిని గూర్చి మాత్రమే ఈ దశయందు చిన్నబిడ్డ తెలిసికొనజాలును. కావున ప్రాథమిక దశయందు కర్మేంద్రియముల మూలమున తెలిసికొనజాలు నంశముల నన్నిటిని సవిస్తరముగ తెలిసికొనుటకు శిశువున కవకాశ మీయవలెను. ప్రతి చిన్నబిడ్డయు తన పరిసరములందు గల అన్ని క్రొత్త సంగతులను తెలిసికొనవలయు నని ఎంతో ఉవ్విళ్ళూరుచుండును. ఆ బిడ్డ కోర్కెలను సకాలమున తీర్చిన పక్షమున బిడ్డ ఆరోగ్యమును, స్వభావమును చక్కబడును. చిన్నపాపలకు విద్యను నేర్పుటను గూర్చి మరికొన్ని స్పష్టమగు సూచనలను కూడ మేము చేయగలము. కాని స్థలాభావము వలన నట్లు కావించుట లేదు. శైశవ దశ యందలి విద్యాపద్ధతులను గూర్చిన యీ సూత్రముల నుపాధ్యాయుడు జ్ఞప్తియం దుంచుకొనిన చాలును. మానవుని మనోవికాసము పరిణామమార్గము ననుసరించును. మనస్సు స్పష్టమగు విషయములనుండి అస్పష్ట విషయము వైపు సాగిపోవును. కావున పసిబిడ్డల జ్ఞానమును వృద్ధి పొందించుట కొరకై ఒండొంటికి సంపూర్ణముగ విభిన్నమగు వస్తువుల మొట్టమొదట వారి కందజేయవలెను. మిక్కిలి హెచ్చుస్థాయి చాల తక్కువ స్థాయి గల ధ్వనులను, ఒండొంటితో

చాల భేదముగల రంగులను, కాఠిన్యత, జిగి మున్నగువానిలో చాల తారతమ్యము గల వస్తువులను ప్రాథమికదశయందు పసిబిడ్డలకు లభింపజేయవలెను. ఆ భేదములను వారు గుర్తింప గల్గిన తరువాత క్రమక్రమముగ వాని స్థానమున ఇంచుమించు సమాన ధర్మములు గల వస్తుజాలమును వాడవలెను.

ఇప్పుడు వస్తు పాఠములను గూర్చి ఆలోచింతము: ఈ విషయమునకు సంబంధించినంతవరకు ప్రస్తుతము ఆచరణ లోనున్న పద్ధతులు సంతృప్తికరముగా లేవు. ఏలనన మానవ ప్రకృతికిని ఈ పాఠములను నేర్పు పద్ధతికిని చాల భేదము కాన్పించుచున్నది. మానవుని శైశవమందును ఆతడు పెరిగి పెద్దవాడైన తరువాతను జ్ఞాన సంపాదనము కావించు మార్గములు వేరు. ఈ పాఠములలో ననుసరించు మార్గములు వేరు. వస్తుపాఠములు నేర్పు పాఠ్యపుస్తకములలో ఒక వస్తువు బొమ్మను చూపి అందు బాలు డేయే యంశముల గుర్తింప వలెనో వ్రాయబడి యుండును. ఆవస్తువు యొక్క వివిధ భాగములు లక్షణములు వర్ణింపబడి యుండును. కాని యీ పద్ధతి సరియైనది కాదు. శైశవమందు మాటలు నేర్వని కాలమున పసిబిడ్డ తెలిసికొను అంశములన్నియు తనంతట తానే తెలిసికొనుచున్నది. వివిధవస్తువుల బరువు, కాఠిన్యత లను, ఆకారము రంగులలో వివిధవ్యక్తుల భేదములను, భిన్న భిన్న జంతువులుచేయు భిన్నస్వరములను ఆ బిడ్డ తనంత తానే గ్రహించును. అట్లే మానవుడు యుక్తవయస్సునను

పొందిన తరువాత ఆతనికి ప్రత్యేకముగ నే యుపాధ్యాయు డును ఉండడు. ఆ కాలమున నాతడు వివిధదృశ్యముల గాంచి, అందలి రహస్యములను స్వశక్తిచే నూహించుకొనవలెను. విషయగ్రహణమును సంపూర్ణముగను, నిర్దుష్టముగను కావింప గల్గు వ్యక్తులు మాత్రమే జీవితరంగమునందు కృతార్థులగుదురు. ఈ విధముగ శైశవమునందును, యుక్తవయస్సు వచ్చిన మీదటను మానవుడు జ్ఞానసంపాదనము కావించుటకు చేయు యత్నములందును, అనాదియందు అనాగరక మానవుడు నాగరక దశకు వచ్చునిమిత్తమై జ్ఞానసంపాదనము కావించిన కృషియందును స్పష్టమగు సామ్యము కానబడుచున్నది. అనగా ఈ రెండు అవస్థలయందును కూడ స్వప్రయత్నమే జ్ఞాన సాధనకు మార్గమగుచున్నది. అట్టి సందర్భములో కేవలము బాల్యదశయందు మాత్రము (అనగా విద్యార్థిదశయందు) జ్ఞానార్జనముకొరకై వేరొకమార్గము నేల అవలంబింప వలయునో తోచుటలేదు. విద్యను సాధించు విషయమునందు అన్నిదశలందును కూడ మానవుడొక్కే విధానము నవలం బింపవలెనని మా యుద్దేశ్యము. ప్రకృతి యిట్టి సరణినే యెల్లప్పుడును సమర్థించుచున్నది. కాని అజ్ఞానమువలనను, అహంకారమువలనను మన మీ విషయమును గ్రహింప జాలకున్నారము. బాలుర సహజవృత్తులను గమనింపుము. వారు విద్యార్జనము కావించునప్పుడు వారికి మన అన్ని విషయములందును పెద్దల సానుభూతి కావలయును. తండ్రి

తొడపై కూర్చుండి బిడ్డ తన ఆటబొమ్మ నాతనికి మాటి
మాటికిని చూపును. తన చిన్ని వ్రేళ్ళతో బల్లపై కొట్టి ఆశబ్ద
మును వినుమని మరల మరల తండ్రి వైపు తిరుగును. కొం
చెము ఈడు వచ్చిన పిల్లలు తల్లి కడకు తరచు పరుగెత్తుకొని
వచ్చి "అమ్మా! ఇదిచూడవే. అదిచూడవే యని ఆమెను
తరచు తొందరపెట్టుచుందురు." వివేకములేని తల్లు లిట్టి సం
దర్భములలో తమబిడ్డలపై కసరుకొనుట మనము చూచు
చుందుము. తమ దాదులతో కూడ విహారమునకుపోవు బిడ్డలు
రంగురంగుల పూవులనేరి తెచ్చి అవి యామెకుచూపి, ఆమెచే
కూడ అవి యందముగ నున్నట్లు చెప్పింపజూతురు. ఇదే విధ
ముగ ప్రతి బాలుడునుకూడ తనమాటలను ఓపికతో వినువా
రెవ్వరైన నున్నచో వారికి తానుచూచిన ప్రతివిషయమును
గొప్పగ వర్ణించి తెల్పును. ఇందువలన మనము విద్యావిషయ
ములందు అవలంబింపవలసిన మార్గములు స్పష్టమగుచున్నవి.
మనము బాల బాలికల సహజప్రవృత్తులను గుర్తించవలెను.
ప్రకృతి కనుకూలమగు విధానముల నవలంబింప వలయును.
వివిధవస్తువుల గూర్చి బాలుడు మనకు తెల్పు నంశములను
శ్రద్ధగా వినవలెను. బాలుడు తాను ఊహించుకొనిన అన్ని
విషయములను మనకు తెల్పుటకై ఆతనిని ప్రోత్సహింప
వలయును. అప్పుడప్పు డా బిడ్డ గుర్తింపని యంశముల
నాతని దృష్టికి తెచ్చుచుండవలెను. ఈ విధముగ మనము
వర్తించినచో బాలు రదేవస్తువును మరియొక పర్యాయము

చూచుట తటస్థించిన పక్షమున దానిని సమగ్రముగ పరిశీలింతురు. బాలురు స్వయంశక్తిచే జ్ఞానమును సంపాదించుట కొరకై వారికి మన మనేక నూతన వస్తువుల లభింపజేయవలెను. ఇట్లు బాలకునికి చేయూత నొసంగుట ఉపాధ్యాయుని విధి. బుద్ధిమంతురాలగు తల్లి యీ మార్గముచే తన బిడ్డల కెట్లు విద్య నేర్పునో ఇంచుక గమనింపుడు. ఆమె మొట్టమొదట వివిధవస్తువులను తన బిడ్డకు చూపి వాని యందలి లక్షణములను అనగా గట్టితనము, మెత్తదనము, రంగు, పరిమాణము, రుచి మొదలైనవాని పేళ్లను మాత్రమా బాలునికి తెల్పును. ఈ పదములను నేర్చుకొనిన తరువాత నాతడు ఆయావస్తువులను తల్లికి చూపి ఇది యెట్టిగా నున్నదనియు, అది మెత్తగా నున్నదనియు ఆమెకు తెల్ప జూచును. బాలుడు తెచ్చిన వస్తువులలో నేదైన విశేషలక్షణ మున్న పక్షమున దానికి తగిన పదమును తెల్పుచు తల్లి ఆ నూతన పదమును బాలు డీవరకే యెరింగియున్న మాటలంతో జోడించి ఉపయోగించును. బిడ్డలయం దనుకరణము కావించు సహజప్రవృత్తి యుండును. దాని ననుసరించి పాతమాటలను క్రొత్తమాటలను కూడ తనంత తాను వల్లెవేసి వాని నన్నిటిని చక్కగ నేర్చుకొనును. బాలుడు నూతన వస్తువులను గూర్చి తల్లికి తెల్పునప్పు డందుగల కొన్నిలక్షణముల నీవరకే యెరింగియుండియు సమయమునకు మరచిపోవచ్చును. అట్టి సందర్భములో తల్లి యాతని నుద్దేశించి "నీదగ్గరనున్న

వస్తువులో నీవు చెప్పినవి కాక మరేలక్షణములు లేవా?" అని ప్రశ్నించును. అప్పటికిని బాలుని కా విషయము తెలియక పోవచ్చును. కొంతకాలము ఆతని ఆలోచనకు అవకాశ మిచ్చి తల్లి యాతని కా సంగతిని తెల్పును. ఆతని అజ్ఞానమును చూచి ఒకింత నవ్వును. ఇదే విధముగ రెండు మూడు పర్యాయములు జరగిన తరువాత బాలుడు తా నేమి చేయవలెనో తెలిసికొన గల్గును. ఆతనివద్ద నున్న వస్తువునుగూర్చి ఆతనికి తెలిసిన యంశములకంటె తన కెక్కువ జ్ఞానము కలదని తల్లి చెప్పుసరికి బాలుని కభిమానము కల్గును. ఆత డా వస్తువును శ్రద్ధగ పరిశీలించును. ఇదివరలో తాను వినిన యంశముల నన్నిటిని ఆతడు నెమరుకు తెచ్చుకొనును. అప్పుడు తన నెదుర్కొనుచున్న చిన్నసమస్యకు ప్రత్యుత్తర మాతనికి గోచరమగును. అంతట బాలుని కత్యంతానందము కల్గును. తల్లి యాతని యానందము నెడ సానుభూతి చూపును బాలుడు తాను సాధించిన విజయమున కానందము ప్రకటించును. ఇయ్యది బాలు రందరియందును గల సామాన్య లక్షణమే. ఇట్టి యితర విజయములను సాధించు నిమిత్తము బాలుడు క్రొత్తవస్తువులను వెదుకబోవును. వానిని తన తల్లికి వర్ణించి తెలుపవలెనని ఆతని యుద్దేశ్యము. ఆతని మానసిక శక్తులు వృద్ధిచెందిన కొలదియు తల్లి వివిధవస్తువుల నూతన లక్షణముల నాతనికి తెలుపసాగును. గట్టితనము, మెత్తదనము అను లక్షణముల తరువాత గరుకుదనము, నున్నన అను

లక్షణములు తెలుపబడును. సహజమగు రంగులు పూత రంగులు వీని భేదము వివరింపబడును. సామాన్యస్వరూపముల తరువాత అపూర్వరూపములు ప్రదర్శింపబడును. ఈ విధముగ బాలుని మానసికశక్తి వృద్ధిచెందిన కొలదియు కఠినతర సమస్యలాతని కీయబడును. ఆతని పరిశీలనాశక్తి, జ్ఞాపకశక్తి మున్నగువాని కెక్కుడు పని కల్పింపబడును. జ్ఞానార్జనమునం దాతని యభిరుచి కుంటువడకుండుటకై తల్లి తన బాలునికి నూతన వస్తువుల చూపుచు నూతనానుభవముల కల్గించుచుండును. కాని ఆ బాలుడు గ్రహించుకొనదగిన యంశముల మాత్రమే ఆమె యాతనికి తెల్పును. బాలుడు పరిష్కరింపజాలిన సమస్యలను మాత్రమే ఆతనికి కల్పించి, తల్లి యాతని యానందానుభవమునకు మార్గములు సృష్టించును. ఇట్టి విధానముల నవలంబించి తల్లి తన కుమారుని యందు అతి బాల్యమునుండియు జరుగుచున్న ఆత్మపరిణామము అను వికాసమున కనుగుణ్యముగ వర్తించుచున్నది. సహజప్రవృత్తులచే ప్రేరేపితుడై బాలుడు తన ముంగట నెట్లు ప్రవర్తించుచున్నాడో అట్టి పద్ధతులచేతనే తల్లి యాతని కుత్సాహము కల్గించుచున్నది. తల్లి యవలంబించుచున్న యీ పద్ధతుల వలననే బాలునికి సంపూర్ణముగ పరిశీలనాశక్తి యలవడును. ఇట్టి పాఠములను బోధించుటలో వస్తుపరిశీలన గావించు నలవాటును బాలునకు కలుగజేయుటయే ముఖ్యోద్దేశ్యము. బాలుని కొక వస్తువుయొక్క లక్షణములను వర్ణించి

చెప్పి, వేరొక వస్తువును చూపుటవలన నెట్టి సత్ఫలితమును కలుగజాలదు. ఈ పద్ధతిని మన మవలంబించిన పక్షమున బాలుని పరిశీలనాశక్తి వృద్ధిచెందజాలదు. ఆతడు ఇతరులు పరిశీలించి తెలిసికొనిన యంశములను మాత్రము గ్రహింపజాలును. ఇట్లు కావించుట వలన బాలుడు స్వయంశక్తిచే విషయ గ్రహణము కావించు శక్తి వృద్ధిచెందుటకు నవకాశము క్షీణించును. ఆత్మ ప్రయత్నముచే జ్ఞానసంపాదనము కావించుటవలన కల్గు నానందము లేకుండపోవును. బాలునకు కుతూహలజనకముగ నుండవలసిన ఈ జ్ఞానార్జనము నీరసమును బడివారములుగ మారిపోవును. ఈ కారణములచే బాలుడు వస్తుపాఠములయెడ నిర్లక్ష్యభావమును, అసహ్యభావమును కూడ ప్రదర్శించుట సంభవించుచున్నది. అందువలన మూలకగ మేము పైన సూచించిన విధానముల నవలంబించిన పక్షమున బాలుని మానస్సునకు అవసరమగు పుష్టి లభించును. జ్ఞానమును సంపాదింపవలెనని సహజముగ నారికి గల కోర్కెలకు వారి సహజప్రవృత్తులును, ఉపాధ్యాయుని సానుభూతియు ప్రోత్సాహకారణము లగును. వీని సమ్మేళనమువలన బాలుని యందు శ్రద్ధ బాగుగ బలపడును. ఆతడు సంపూర్ణమును, విస్పష్టము నగు అనుభూతిని సంపాదించును. ఈ విధముగ విద్యార్థికి మొట్టమొదటనుండియు స్వప్రయత్నముచే జ్ఞానార్జనము కావించు నలవాటు కల్గును. జీవితరంగమునందు మానవుడీ విధానముచేతనే జ్ఞానమును సాధింపజాలును.

వస్తుపాఠములను బోధించు పద్ధతులు నేటివలె కాక నూతన మార్గముల నవలంబింపవలసియున్నది. వీనిని కొన్ని విషయములకు మాత్రమే పరిమితము కావింపక విస్తృత రంగమునకు వర్తింపజేయవలయును. ఈ పాఠములను కేవల ప్రాథమిక దశయందు మాత్రమే కాక, అనేక సంవత్సరముల వరకును కూడ బోధనా విధానములో చేర్పవలెను. ఇట్టి పాఠములను బోధించునప్పుడు బాలుని మన యింటి నాల్గుగోడలలో నిర్బంధించి యుంచరాదు. ఆతనిని పొలముల లోనికిని, పచ్చిక బయళ్ళలోనికిని, సముద్రతీరమునకును, కార్ఖానాలలోనికిని తీసికొనిపోయి ఆతనికి నూతనానుభవముల కల్గింపవలెను. ఇట్టి తర్ఫీదును కేవల బాల్యదశయందు మాత్రమే కాక బాలుడు పెరిగి పెద్దవాడగుచున్నప్పుడు కూడ ఈయవలెను. దాని వలన బాలుని పరిశీలనారంగము విస్తృతమై ప్రకృతిశాస్త్రభూములలోనికి కూడ ఆతడు వాహ్యాళికి పోవుట సంభవింపగలదు. ఇచ్చట కూడ మనము ప్రకృతివాదపు మార్గములనే యనుసరింపవలెను. నూతనమగు పుష్పములను కీటకములను చూచునప్పుడును, వివిధములగు నత్తగుల్లలు రాళ్ళు మున్నగువానిని సంగ్రహించునప్పుడును బాలునకు కల్గు నానందపరవశత నెట్లు వర్ణింపనగును ? ఇట్టివస్తువులను సేకరించుటలో బాలురు చూపు నుత్సాహమును మన సానుభూతిచే పెంపొందించిన పక్షమున వారీ యాటవస్తువులను సూక్ష్మముగ పరిశీలించి, వాని నిర్మా

ణమును, వాని లక్షణములను తప్పక గుర్తింతురు. ఎవరైన వృక్షశాస్త్రజ్ఞుడు తనతోపాటు పిన్నవయస్సుగల బాల బాలికలను వెంటబెట్టుకొని ఏదైన చిట్టడవికిగాని, మైదాన ములలోనికిగాని పోయినపక్షమున, నా యల్పవయస్కులు శాస్త్రజ్ఞుడు కావించు పరిశీలనయం దత్యంతాసక్తితో పాల్గొం దురు. వారు మిక్కిలి యుత్సాహముతో నాతని కొరకై క్రొత్త క్రొత్త మొక్కలను, ఆకులను తెచ్చియిత్తురు. ఆతడు వానిని పరీక్షించుచున్నప్పుడు తాము కూడ వాని యందు మిక్కిలి ఆసక్తిని చూపుదురు. ఆతనిపై ప్రశ్నల వర్షమును కురిపింతురు. ఇట్టి సందర్భములలో శాస్త్రజ్ఞుడు (బేకన్ పండితుడు చెప్పినట్లు) ప్రకృతిమాతయొక్క పరి చారకుడుగను, వ్యాఖ్యాతగను పరిణమించును. ప్రకృతిశాస్త్ర విజ్ఞానమును సంపాదించుట కిదియే సరియగు మార్గమను నంశము మనకప్పుడు తెలియవచ్చును. నిత్యజీవితములో మనము వాడునట్టి వస్తువు లక్షణములను స్థూలముగ గుర్తిం చుట యెరెంగినమీదట, బాలుడు తన యాటపాటల సమ యములలో కానవచ్చు నితర వస్తుజాలమును సంపూర్ణము గను సూక్ష్మముగను పరిశీలించుట కలవాటు పడునట్లు మన మాతనికి ప్రోత్సాహము కల్పింపవలెను. కాని యీ దశ యందు కూడ బాలుడు మొట్టమొదట సులభమగు లక్షణ ములను మాత్రమే పరిశీలింపవలయును. మొక్కలను పరీ క్షించునప్పుడు వాని పూవులయొక్క రంగులు, పుష్పదళముల

యాకారము, సంఖ్య, కాండము యొక్కయు ఆకుల యొక్కయు ఆకారము మున్నగువానిని గుర్తించవలెను. కీటకములను పరిశీలించునప్పుడు వాని రెక్కలు, కాళ్ళు, మీసములయొక్క సంఖ్య, కీటకముల రంగు మున్నగువానిని తెలిసికొనవలెను. బాలుడు పై విషయములను చక్కగ గుర్తించిన మీదట, ఒకదాని తరువాత మరియొకటి చొప్పున నూతనాంశముల నాతని దృక్పథమునకు తేవలెను. మొక్కలను పరీక్షించునప్పుడు పూవులలోని తొడిమలు, గర్భకేసరములు ఎన్నికలవు, పూవులు గుండ్రముగ నున్నవా, చతురస్రముగా నున్నవా, ఆకు లొండొంటి కెదురుగ మొలచి యున్నవా లేక ఒకటి విడిచి ఒకటి నున్నవా, ఆకులకు తొడిమ లున్నవా లేక రెమ్మలో నుండియే మొలచుచున్నవా, ఆకులు నునుపుగా నున్నవా, లేక వానిపై నూగు కలదా, ఆకులకు నున్నని యంచులున్నవా, వంపులున్నవా, లేక యవి సూచీ ముఖములుగ నున్నవా యను సమస్త విషయములను విద్యార్థి పరిశీలించి తెలిసికొనవలెను. కీటకములను పరిశీలించునప్పుడు వాని దేహమునందలి భాగములు, పొత్తికడుపులోని విభాగములు, రెక్కలయొక్క ఆకారము, కాళ్ళలో గల కీళ్ళు, దేహములోని వివిధాంగముల యాకృతి మున్నగువానిని తెలిసికొనవలెను. మొత్తముమీద బాలుడు నూతన వస్తువులను పరీక్షించునప్పుడు వానిలో గల విశేషముల నన్నిటిని కూడ ఒక్కటికూడ విడువకుండ వర్ణించి చెప్పగల్గునట్లు

ఆతనిని ప్రోత్సహించుటయే మన యుద్దేశ్యముగ నుండ వలెను. బాలుడు పెరిగి పెద్దవా డగుచున్న సందర్భమున, ఆత డింతకు పూర్వమే యెంతో యభిరుచితో పరిశీలించి జ్ఞానార్జనమునకు మూలముగ కావించుకొన్న మొక్కలను పెంచుటకై యాతనికి సదుపాయములు కల్పింపవలెను. ఈ సదుపాయము లాతనికి మన మొసంగిన బహుమానముగ నతడు భావించునట్లు చేయవలెను. అదే విధముగ తూనీగల యొక్క గ్రుడ్లను సంరక్షించి వానిని పెంచుటకై యవసర మగు సామానులను కూడ బాలుర కొసంగుచు, వారు వాని నొక బహుమానాకృతిగ తలంచునట్లు మనము మెలగవలెను. ఈ పురుగులు క్రమక్రమముగ పెరుగుచున్నప్పుడు బాలుడు వానిని చూచి మిక్కిలి యానందపడును. ఈ విధముగ మనము బాలునికి కొంతకాలము వరకును తర్ఫీదు నొసంగిన పక్షమున బాలురలో పరిశీలనాశక్తి వృద్ధిగాంచును. జీవ శాస్త్ర విజ్ఞానమున కిది ప్రథమ సోపానముగ పరిణమింపగలదు.

కాని మేము సూచించిన యీ కార్యక్రమము నిరర్థక మనియు, ఇట్లు కావించుటచే బాలబాలికల శక్తులును, కాలమును నిరుపయోగముగ వ్యయమగుననియు, అందులకు మారుగ వారిచే చూచివ్రాతను వ్రాయించుటయో, లేక మానములను వల్లింపజేయుటయో చేసిన పక్షమున వారికి ముందు ముందు అవి యుపయోగకరముగ పరిణమింపగల వనియు కొందరు విమర్శచేయవచ్చును. కాని విద్యనుగూర్చి

యిట్టి మూఢాభిప్రాయములును, సంకుచితభావములను ఇంకను ప్రబలియుండుట విచారకరము. ఎవరెన్ని చెప్పినను మేము మాత్రము మా విద్యావిధాన ముత్తమమైన దని ఘంటాపథముగ తెలుపగలము. దీనివలన విద్యార్థుల విషయ గ్రహణశక్తి చక్కగ పెంపొందును. అంతేకాదు. ఈ పద్ధతి వలన బాలబాలికలు అనేక నూతన విషయములను కూడ గ్రహింపజాలుదురు. ఏ కార్యాలయములోనో, లేక బ్యాంకులోనో వంచిన నడుమెత్తకుండ పగలంతయును బానిసల వలె పనిచేసి, కొన్ని రూకలను సంపాదించి వానితో పొట్ట పోసికొనుచు కాలము పుచ్చుటయే జీవిత పరమార్థమని తలంచువారితో మేము వాదింపదలంచుట లేదు. ఇట్టి వారికి బాహ్యప్రపంచమును గూర్చి యేమియును తెలియదు. గ్రామసీమలను గూర్చి కాని, అడవుల యందలి వింతలను గూర్చి కాని వారేమియు నెరుంగరు. ఇట్టి వారికి జీవనోపాధిని సంపాదించుట కుపయోగపడు విద్యయే విద్య. కాని విద్య వలన జీవనోపాధిని సంపాదించుట మాత్రమే కాక ఇతర లక్ష్యములను సాధించుట మన యుద్దేశ్యమైన పక్షమునను, మన చుట్టుప్రక్కలనుండు వస్తుజాలము కేవల ధనార్జనమునకు సాధనముగనే కాక ఇతర విధములుగ మనకు చూపట్టెడి యెడలను, విత్తసమాకర్షణమును, భౌతికవాంఛా పరితృప్తియు మాత్రమే మన జీవితలక్ష్యములు కాని యెడలను, కవిత్వము, లలితకళలు, విజ్ఞానము, తత్వశాస్త్రము

మున్నగునవి మన కానందమునుగూర్చ జాలినయెడలను, మనకు విద్యాస్వరూపము భిన్నముగ కాన్పించితీరును. ప్రతి బాలుని యందును బాలికయందును, ప్రకృతిసౌందర్యమును చూడవలెననియు, ప్రకృతి స్వరూపముల పరిశీలింపవలయు ననియు, సహజముగ నెలకొని యుండు కోర్కెలను పెంపొందించుట యవసరమని మన కప్పుడు గోచరించును. జీవిత పరమార్థము భౌతిక సుఖానుభూతి మాత్రమే యనియు, బాహ్య ప్రపంచ మెట్లున్నదియో అందేయే యంశములు కలవో తెలిసికొన నవసరములేదనియు, భావించు కేవల పాషండవాదులకు కూడ మేము తగిన సమాధానము నీయ గలము. జీవితసౌఖ్యముకొరకై జీవితసూత్రముల నెరుంగుట చాలముఖ్యముకదా! జీవితసూత్రము లనగా మన దేహము నందును మనస్సునందును జరుగుచుండు కార్యవిధాన ములును, మార్పులును మాత్రమే కాదు. మనయిండ్లలోను, వీధులందును, రాజకీయ వ్యాపార నైతికరంగము లందును, జరుగుచుండు నిత్యవ్యవహారములలో కూడ జీవితసూత్రము లిమిడియున్నవి. ఈ సూత్రముల నన్నిటిని చక్కగ గ్రహింపకుండ, వ్యక్తిజీవితము కాని, సామాజిక జీవితము కాని సక్రమముగ కొనసాగజాలదు. ఈ సత్యమును మనము విస్తృతపరచిన యెడల విశాలమగు ప్రాణికోటియందంతటను కూడ ఒకే విధమగు జీవితసూత్రములు వ్యాపించి యున్నట్లు గోచరమగును. మొట్టమొదట సామాన్యజీవముల

చక్కగ పరిశీలించిననే కాని సంకీర్ణజీవములలోని రహస్య ములను గుర్తించుట సాధ్యపడదు. ఈ యంశములను తెలిసి కొనిననాడు, బాలబాలికలు సహజప్రవృత్తులచే ప్రేరేపితులై విశాలప్రపంచమందలి వివిధ జీవములను, వివిధవస్తు సంఘా తమును పరిశీలించుచున్నప్పుడు వారిని మనము తప్పక ప్రోత్సహింపవలసిన యావశ్యకత చక్కగ తెలియవచ్చును. ఇట్లు వస్తుపరిశీలనము కావించుట వలన విద్యార్థులు తమ మనోరంగమునందు భావిజీవితమున కావశ్యకమగునట్టి ముడి పదార్థములను సేకరించుచున్నారని మనము గ్రహింపవలెను. మన జీవితవిధానమును విజయవంతముగ నడుపుకొనుట కావశ్యకములగు వైజ్ఞానిక సూత్రముల చక్కగ గ్రహించు టలో పై విజ్ఞానము చాల సహాయకారి యగును.

చిత్రలేఖనము విద్యావిధానములో నొక ముఖ్యాంగ మను విషయము నిప్పుడెల్లవారును గ్రహించుచున్నారు. మానసికశిక్షణను గూర్చి సక్రమమగు భావములు వ్యాప్తి చెందుచున్నట్లుగ ఇది యొక నిదర్శనము. ప్రకృతిమాత పదే పదే మన దృష్టికి తెచ్చుచున్న సత్యముల నిప్పుడు మన యుపాధ్యాయులు గ్రహించుచున్నారు. బాలురు తమ పలకల మీదనో, లేక కాగితముల మీదనో పరిసరములం దుం డెడి మనుష్యులను, ఇండ్లను, చెట్లను, జంతువులను చిత్రించు చుండుట మనము తరచుగ చూచుచుందుము. పిన్నవయస్సు గల బాలబాలికలకు బొమ్మలను చూచుట యనిన పర

మానందము. వారిలో ప్రకృతి సిద్ధముగ నెలకొని యుండు అనుకరణశక్తి వలన వారట్టివే బొమ్మలను తాము స్వయముగ చిత్రించుటకై యత్నింతురు. తమ యింద్రియముల మూలముగ నూతన జ్ఞానమును సంపాదింపవలెనని యల్పవయస్కులకు సహజముగ నుండెడి కోర్కె కిది యొక నిదర్శనము. దీనివలన బాలుర పరిశీలనాశక్తికి నిర్దుష్టతయు, సంపూర్ణతయు లభించును. తమకు కాన్పించిన వస్తువుల యందలి ప్రముఖలక్షణములను స్వయముగ గ్రహించియు, ఆ వస్తువుల చిత్రముల చిత్రించియు బాలురు మన సదభిప్రాయమును వడసి, ఆపైన పరిసవలన తాము పొందవలసిన లాభమును పొందుదురు.

ప్రకృతిమాత మనకు సూచించుచున్న ప్రకారము చిత్రలేఖనమును విద్యావిధానములో నొక భాగముగ నంగీకరించియు, చిత్రలేఖనమును బోధించుటకై మంచిపద్ధతుల నేర్పాటు చేసియు, ఉపాధ్యాయులు ప్రకృతితో సహకరించినచో మన విద్యావిధానము నేటికంటె నుత్తమముగ నుండెడిది. బాలుడు మొట్టమొదట నే చిత్రముల వ్రాయుటకు ప్రయత్నించునో గమనింపుడు. పెద్ద ఆకారములను చక్కని రంగులను, తనకు ప్రీతిదాయకములగు వస్తువులను, తన యానందమునకు మూలకారణులైన మానవులను ఆతడు చిత్రించును. [illegible] కుక్కలు మున్నగువానిలో కొన్ని విశిష్టలక్షణము లుండును. కావున బాలుడు వాని బొమ్మలను

గీయును. మన ఇండ్లు పెద్దగ నుండును; వానిలో వేరు వేరు భాగములు వేర్వేరు విధములుగ నేర్పాటైయుండును. కావున బాలుడు వాని పటములను కూడ గీయును. వీని యన్నిటిలోను బాలుని కెక్కుడు ఆనందము నిచ్చునవి రంగులు. రంగుల పెన్సిలు, కుంచెయు ఆతని కత్యంత ప్రియ వస్తువులు. అవిలేని పక్షమున బాలుడు కాగితము పెన్సిళ్ళతో సంతుష్టి చెందును. వస్తువులయొక్క రేఖాచిత్రములు వ్రాయుటలో ఆతని కెక్కుడు ఉత్సాహము లభింపదు. రంగులను పూయుట కొరకు సాధనముగ మాత్రమే ఆతడు వస్తువుల యొక్క బాహ్యాకృతిని గీయును. ఏదైన అచ్చుపుస్తకము లోని చిత్రములకు రంగులు వేయుటకై నీవు బాలుని కను మతి నొసంగిన పక్షమున నాతనికి కల్గు నానందమునకు మేర యుండదు. సర్వసాధారణముగ చిత్రలేఖనమును బోధించు నుపాధ్యాయులు బాలురకు మొట్టమొదట వారి కెంతమాత్ర మును అభిరుచి లేని గీతలను దిద్దించుటకై యత్నింతురు. కాని బాలురకు మొట్టమొదట బొమ్మలకు రంగులు పూయు టను నేర్పింపవలెనని మా భావము. ఇయ్యది పలువురకు హాస్యాస్పదముగ తోపవచ్చును. కాని ప్రకృతి కనుకూల మగు పద్ధతి యిదియే యని మా నమ్మకము. బాలుర మానసికప్రవృత్తులను చక్కగ గుర్తించినవారికి, వారి (అల్ప వయస్కుల) విద్యావిధానములో నేని కే యే స్థానము లభింప వలెనో మొదటినుండియు తెలియవలెను. మొదటినుండియును

కూడ బాలురచే నిజమైన వస్తువుల చిత్రములను మాత్రమే వ్రాయించవలెను. రంగులబొమ్మలను చూచుట యనిన పిన్నవారికే కాక పెద్దలలో పలువురకు కూడ నుత్సాహ ముండును. కావున కేవలము వస్తువుల యాకారమును గీయు కష్టసాధ్యమగు కళకు రంగుల నొక ప్రోత్సాహక సాధన ముగ నుపయోగింపవలెను. బొమ్మలకు రంగులు పూయుట యను భావియానందము నెరగా చూపి బాలురచే కష్టమగు బొమ్మల చిత్రముల గీయుట యను పనిని చేయించవలెను. వివిధ వస్తువులలోనుండు ఆకర్షకములగు లక్షణములను మొదట బాలు డనుకరింపవలెను. ఇందులకు మన మాతనికి ప్రోత్సా హము కల్పింపవలెను. కాలము గడచి, బాలు డెక్కు డను భవమును సంపాదించిన మీదట సూక్ష్మములును, ఎక్కువ ఉపయోగకరములునగు వస్తువులను కూడ చిత్రించుటకై ఆతడు కృషిచేయును. క్రమక్రమముగ బాలుడు నిజవస్తువుల పరిశీలించి వాని యనుకరణమును కావించు శక్తిని సంపా దించును. చిత్రలేఖనమునందు బాలుడు కావించు ప్రథమ ప్రయత్నములలో వస్తువుల యాకృతి మిక్కిలి యస్పష్టముగ కాన్పించును. ఇయ్యది పరిణామసిద్ధాంతమున తెలుపబడియే యున్నది. బాలుని ప్రథమ ప్రయత్నము లసంతృప్తికర ముగ నున్న కారణమున మనము వానిని నిర్లక్ష్యముచేయ రాదు. బాలుడు చిత్రించిన బొమ్మలెంత వికారముగనున్నను రంగు లెంతమోటుగ నున్నను మన మా చిత్రముల తృణీక

రింపకూడదు. ఇట్టి సందర్భములలో బాలుడు చక్కని బొమ్మలు వ్రాయుచున్నాడా లేదా యని మనము విమర్శింప నక్కరలేదు. ఆతని యందు గల శక్తులు వృద్ధిచెందుచున్నవా లేవా యను సంశయమును మాత్రమే మనము లెక్కింపవలెను. బాలుడు మొట్టమొదట తన వ్రేళ్ళను యదుపులోనికి తెచ్చుకొనవలెను. వస్తువుల పోలికలను స్థూల రూపముననైన గుర్తింపవలెను. ఈలక్ష్యములను సాధించుటకు మేము తెల్పిన పద్ధతులు సరియైన సాధనములు. ఏలననగా ఇవి ప్రకృతిసిద్ధములు. ఇయ్యవి బాలుని మనస్సునం దభిరుచిని కల్గించును. బాలుడు పిన్నవాడుగ నున్నప్పు డాతనికి సక్రమవిధానములపై చిత్రలేఖనమును నేర్పుట వలను పడదు. కాని ఈ కారణమువలన జ్ఞానమును సంపాదింపవలెనని బాలురలో నుండెడి సహజప్రవృత్తులను ప్రోత్సహించుటకై నిరాకరించుటకాని నిరోధించుటకాని కూడని పని. పై పద్ధతుల వలన బాలకుల ఇంద్రియజ్ఞానము సూక్ష్మతరమగును. వారికి తమ చేతివ్రేళ్ళు మున్నగు వానిని చక్కగ స్వాధీనపరచుకొనుట యెట్లో తెలియవచ్చును. బాలురకు చిన్నచిన్న కఱ్ఱ చెక్కల నిచ్చియు, లేక దేశపటముల నిచ్చియు వానిపై రంగులు పూయుడని ప్రోత్సహించిన యెడల వారికి రంగులలో గల భేదములు తెలియవచ్చును. వివిధవస్తువులు, దేశపటముల యొక్క స్థూలమగు నాకారములతో పరిచయ మేర్పడును. కుంచెను చేతితో చక్కగ

పట్టుకొని దానిని వాడుశక్తి యలవడును. పిన్నవారికి ప్రీతి కరములైన వివిధవస్తువులను సక్రమముగా మనము వారి కొసంగుచు పోయిన పక్షమున, వారు ఆయావస్తువులను స్థూలముగ చిత్రించు సామర్థ్యమును సంపాదింతురు. వీరికి చిత్రలేఖనమును నేర్పుట కుచిత వయస్సు వచ్చునప్పటికి వారి కా విషయములో కొంత సౌలభ్య మలవడి యుండును. ఈ విధముగ చిత్రలేఖనమును శీఘ్రతరముగ నేర్పవచ్చును. బాలునకును, ఉపాధ్యాయునకును కూడ చాలవరకు కష్టము తప్పును.

పైన మేము తెల్పిన యంశముల వలన అచ్చు పుస్తకముల నుండి బాలురు వివిధచిత్రముల ననుకరణచేయు పద్ధతిని మేము సంపూర్ణముగ ఖండించుచున్నట్లు చదువరు లూహించుకొనజాలుదురు. తిన్నని గీతలు, వంకర గీతలు జంటగీతలు మున్నగువానిని వ్రాయుట యను కఠినతరములగు నభ్యాసములను నేర్పుటతో చిత్రలేఖన విద్యను ప్రారంభించునట్టి పద్ధతిని మేము పూర్తిగా నిరసించుచున్నాము. అనేక రకముల గీతలు, కోణములు, వీనితో నేర్పడెడి బొమ్మలు మున్నగు వానిని చిత్రలేఖన విద్యకు ప్రాతిపదికగాను, ప్రారంభదశగాను చేయుటకై ఇటీవల కొందరు ప్రయత్నములు సల్పుచుండుట మాకు తెలియును. కాని ఇయ్యది మా కంగీకారము కాదు. భాషను నేర్పునప్పుడు మొట్టమొదట వ్యాకరణమును బోధించుట యెంతటి తప్పిదము

పద్ధతియో, చిత్రలేఖనమును నేర్పుటకై పైనచూపిన మార్గ ములనవలంబించుట యంతటి తప్పుడు మార్గము. ప్రత్యక్షానుభవము లేకుండ శాస్త్రీయసిద్ధాంతములను బాలునకు బోధించుట యెంతటి అవివేకమో పై పద్ధతి కూడ అంత అవివేకమైనదే. అయ్యాది విద్యావిధానమును తలక్రిందులు సేయుట వంటిది. తప్పటడుగులు వేయుచు నడకనేర్చుచున్న బాలునికి కాళ్ళలోనుండు యెముకలు, నరములు, మున్నగు వానిని గూర్చి యుపన్యసించుట యెంతటి సమీచీనమో, నూతనముగ నొక భాషను నేర్చువానికందలి భాషా విభాగములను, వాని ధర్మములను గూర్చి తెలుపజూచుట యంతటి అనాలోచితవిషయము. అదే విధముగ చిత్రలేఖనము నేర్చుకొను చిన్న బాలునకు వివిధరేఖల నామములను, కోణములను, వానిక సంబంధించిన శాస్త్రీయాంశములను తెలుపజూచుట తెలివిమాలిన పని. ఇట్టి శాస్త్రీయసూక్ష్మములు బాలుర కనవసరము. అసహ్యాకరము. ఇట్టి పద్ధతుల వలన విద్యయందు బాలుర కభిరుచి లేకుండపోవును. మేము తెల్పిన విధముగ చిత్రలేఖనమును సాధనచేసిన పక్షమున నీ శాస్త్రీయాంశములు తమంత తామే సులభముగ తెలినువచ్చును. తన పరిసరములలో పెద్దలు కావించుకొనెడు సంభాషణను విని బాలుడు కఠినపదముల యర్థమును తెలిసికొనజాలును. వాని కెట్టి శబ్దకోశముల యావశ్యకతయు నుండదు. అదే విధముగ నితరులు వివిధవస్తువులను, చిత్రపటములను, తాను

వ్రాసిన బొమ్మలను గురించి ప్రకటించెడి యభిప్రాయము లను వినుచుండినచో బాలునకు చిత్రలేఖనకళకు సంబంధించిన పదజాల మెట్టి కష్టమును లేకుండ అలవడును. ఆతడా పదముల సంతోషముతో నేర్చికొనును. అట్లుకాక నీవు వాని నాతనికి ప్రత్యేకముగ బోధింప జూచినచో నవి బ్రహ్మవిద్యవలె కష్టమైపోవును. బాలునికి వానియం దనిష్టత కల్గును.

అల్పవయస్కు లగువారు స్వయంశక్తిచేతనే జ్ఞానమును సంపాదించుటకై చేయు ప్రయత్నములను మనము ప్రోత్సహింపవలెనని యీవరకే తెలిపియున్నాము. చిత్రలేఖనమును నేర్పుటయందు కూడ బాలు రీ మార్గమునే యవలంబింపవలెను. ప్రథమమున వారి కొసంగబడు నవకాశముల వలన బాలురకు బొమ్మలు గీయుటలో చేయి కుదురుపడును. చిత్రమునం దుండవలసిన సామరస్యము కొంతవరకు తెలియ వచ్చును. పిమ్మట కొన్నింటి వస్తువులను సహజముగ నున్న పొడవులతో చిత్రించు నేర్పరితనము కొంచెము కొంచెముగ నలవడును. ఈ దశయందు బాలునకు దూరమునందుండు వస్తువుల పరిశీలించుట యందుగల శాస్త్రీయసిద్ధాంతముల బోధించుట ప్రారంభింపవలెను. ఈ పద్ధతి కొందరకు బెదురుకల్గింప వచ్చును. కాని అందుల కెట్టి యవసరమును లేదు. సామాన్యముగు బుద్ధికుశలత గల బాలబాలిక లీ విధముగు చిత్రలేఖనమును, అందలి శాస్త్రీయాంశములను గ్రహింపజాలుదురు. ఉదాహరణముగ నీ క్రింది ప్రయోగమును చేయుము. ఒక

బల్లపై ఒక గాజుపలకను నిట్టనిలువుగ నుంచుము. బాలుడు దాని కొకవైపున నిలుచుండవలెను. గాజుపలక కావల వైపున ఒక పుస్తకమునో లేక మరే వస్తువునో ఉంచుము. బాలు డొక దిశనుండి గాజుపలకలోగుండా పుస్తకమువైపు చూచును, దాని కొనలు తనకు కాన్పించకుండునట్లుగా చేయుటకై గాజుపలకపై సిరాబొట్లు పెట్టుచుపోవలెను. ఆ పని పూర్తియైన వెనుక ఆ సిరాబొట్ల నన్నిటిని కలుపుచు ఒక గీత గీయవలెను. ఇప్పుడు గాజుపలకపై గీయబడిన గీతలు పుస్తకముయొక్క ఆకారమును చూపును. కాని ఆ బొమ్మ ఒక ప్రత్యేక దృక్కోణమునుండి పుస్తకమును చూచునప్పుడది యెట్లు కాన్పించునో మాత్రము మనకు తెలుపును. బాలు డీ విషయమును గ్రహించును. గాజుపలకలో నుండి యావలి వస్తువును చూచుటకై ఆతడు ప్రయత్నించినప్పుడు ఆ వస్తు వాతనికి కాన్పించదు. కావున గాజుపలకపై ముద్రితమగు వస్తు స్వరూపమును, వస్తువుయొక్క నిజమైన స్వరూపమును ఒక్కటియే యను విషయము ఆతనికి స్పష్టమగును. ఈ నూతనసత్య మాతని కాశ్చర్యకరముగ తోచును. అందిమిడియున్న శాస్త్రీయసిద్ధాంత మాతనికి వ్యక్తమగును. ఒక చదునైన సమతలముపై ఒక పద్ధతిలో ఒక దిక్కుగ వ్రాయబడిన గీతలు, ఒక వస్తువుయొక్క నిజరూపము నందుగల మరికొన్ని గీతలకు ప్రాతినిధ్యము వహింపగలవు. నిజస్వరూపములో పొడవుగనున్న గీతలు బొమ్మలో పొట్టిగ

నుంచవచ్చును. కాని అందువలన రూపసామ్యము చెడిపోదు. ఈ వస్తువును వివిధదృక్కోణములనుండి చూచినప్పు డందలి కొన్ని గీతలు పొడవగును; కొన్ని పొట్టిగ కానవచ్చును; మరికొన్ని సంపూర్ణముగ మాయమగును. కొన్ని సందర్భములలో సమానాంతర రేఖలొండొంటిలో లీనమైపోవును. ఇదే విధముగ వస్తువులను దూరమునుండి చూచునప్పుడు వానిలో కాన్పించు రూపభేదముల నన్నిటిని బాలునికి తెలియజేయవచ్చును. చిత్రలేఖనమునందు బాలునికీ వరకే ప్రవేశమున్న పక్షమున నాతడు, వస్తువును చూచుచు వివిధ దృక్కోణములనుండి ఆవస్తువెట్లు కాన్పించునో తనంతతానే యెట్టి సహాయమును లేక వ్రాయగల్గును. ఈ పద్ధతి కాపీపుస్తకములలోని వరవడిని చూచి గ్రుడ్డిగ ననుకరించుటకంటె చాల మంచిది. ఇయ్యది బాలునకు సులభముగ తోచును. ఇయ్యది శాస్త్రీయమగు విధానము. ఇందువలన బాలురు వివిధ వస్తువులను వివిధ దిక్కులనుండి యెట్లు పరీక్షించి చూడవలెనో గుర్తింపజాలుదురు. వస్తుచిత్రముల వ్రాయుటయం దిమిడియున్న శాస్త్రీయసిద్ధాంతము కూడ ఆతని కవగతమగును. ఒకానొక వస్తువునకును మన కంటికిని నడుమ నుంపబడిన వస్తువుపై ఆవలివస్తువు ప్రతిఫలించిన విధమును రేఖారూపమున వ్రాయుటయే చిత్రలేఖనమందలి సిద్ధాంతము. ప్రప్రథమమునుండియు ఆచరణరంగమునందు చిత్రలేఖన సిద్ధాంతముల నెరింగినవానికి కాలక్రమమున వాని నూహారంగమున తెలిసికొనుట సులభసాధ్య మగును.

రేఖాగణితమునకు చెందిన ప్రాథమిక భావములను బాలునికి నేర్పుటకై ఒక విద్యావేత్త కావించిన సూచనలను మేమిచ్చట పొందుపరచుచున్నాము :

బాలుడు గణితమును నేర్చుకొనునప్పుడు ఘనచతురస్రము లనదగిన కట్టెదిమ్మెలను వాడుచుండును. రేఖాగణితమును నేర్పుటకై కూడ వీనినే ఉపయోగించుట మంచిది. ఇతరుల కీ పద్ధతి రుచింపకపోయినను, నేను ఘనపరిమాణములు గల ఆకృతులనే వాడుట మంచిదని సమర్థించెదను. ఇట్లు చేయుటవలన చుక్కలు, గీతలు, సమతలము మొదలగు కఠినవిషయములగూర్చి నిర్వచనము కావింపవలసిన యవసరము లేకుండపోవును. ఘనచతురస్రమునందు రేఖాగణితములో మనము నేర్పవలసిన ప్రాథమిక విషయములన్నియు నిమిడియుండును. రేఖలు, సమాంతర రేఖలు, కోణములు, సమానాంతర చతుర్భుజములు మున్నగు నాకృతులను మనమీ ఘనచతురస్ర మూలముగ బాలురకు చూపవచ్చును. ఈ ఘనచతురస్రముల మన మనేకవిధములుగ భాగింపవచ్చును. అంకెలను చదువుటకు సంబంధించిన లెక్కలను బోధించునప్పుడు మనము బాలునకు భిన్నములను, పూర్తి సంఖ్యలకును భిన్నములకును గల సంబంధమును బోధించియే యుందుము. ఆ విషయము లీ విధమున పునరావృత్తములగును. ఘనచతురస్రములను చూపిన తరువాత బాలునికి గోళములను చూపనగును. వానినుండి వలయము, వక్రరేఖలు

మున్నగు విషయముల నాతడు తెలిసికొనగల్గును. ఘనపరి మాణములు గల వస్తువుల నెరింగినమీదట బాలుడు, వాని స్థానమున సమతలము నూహించుకొనజాలును. ఈ యంశ మును సులభముగ బోధించుటకై యొక పద్ధతి నుపయోగింప వచ్చును. ఘనచతురస్రమును సన్నని భాగములుగ విభజించి ఒక కాగితముమీద నుంపుము. ఇప్పు డాతనికి కాగితముపై చతురస్రమును వ్రాయుట యనగా నేమియో తెలియ వచ్చును. ఇదే విధముగ నితరస్వరూపములను కూడ బాలు నికి బోధింపవచ్చును. గోళములను గూర్చిన విశేషాంశము లను కూడ ఆత డీ విధముగానే నేర్చుకొనజాలును. ఘనపు టాకారముగల వస్తువులకును, సమతలముపై ఆ యాకృతు లను చిత్రించుటకును గల సంబంధమును బాలు డిప్పుడు తెలిసికొనును. రేఖాగణితమునకు చెందిన మౌలికాంశము లాతని కిప్పుడు స్పష్టమగును. ఇకమీద నాతడు వానితో సులభముగ వ్యవహరింపగలడు. రేఖాగణితమునందలి వివిధా కృతులను బోధించు నిమిత్తమై కర్రతో నేర్పడిన చక్కలను బాలున కీయవలెను. కాగితముపై తన పెన్సిలుతో బాలుడు వానిచుట్టును గీత గీయును. అప్పు డాతనికి కాగితముపై చతు రస్రము, దీర్ఘచతురస్రము, తదితరములును, ఎట్లుండునో తెలియవచ్చును. ఈ బొమ్మలను గీయుటయందు బాలుడు కొంత యనుభవమును సంపాదించిన తరువాత, ఆత డా యాకృతిని దూరముగ నిడి దానిని చూచుచు, దాని బొమ్మను

వ్రాయుటకై యత్నించునట్లు మన మాతనికి ప్రోత్సాహము కల్పింపవలెను.”

పైన వర్ణింపబడిన విధముగ రేఖాగణితమునందలి వివిధాంశములను బాలునికి బోధించిన మీదట, తాను గీచిన బొమ్మలు నిర్దిష్టముగ నున్నవో లేవో తెలిసికొనుటకై బాలునికి ప్రోత్సాహము కల్పింప నగును. ఇట్లు చేయుట వలన బాలుని కొక నూతనమగు కార్యకలాప మేర్పడును. తాను పొంద దలచిన లక్ష్య మెంతటి కష్టసాధ్యమో ఆత నికి తెలియవచ్చును. రేఖాగణితము నాదిమదశయం దిండ్లు నిర్మించు కార్మికులు, ఇండ్ల కొలతలు, ఆవరణ కొలతలు మున్నగువానిని నిర్దిష్టముగ కావింపగల్గుటకై వాడియుండ వచ్చును. ఇందు కనుగొనిన సత్యాంశములను భావి యుప యోగమునకై వారు క్రోడీకరించి యుందురు. బాలురకు కూడ వివిధవస్తువులను కొలుచు సందర్భములోనే రేఖాగణి తాంశముల తెలుపుట సరియైన పద్ధతి. బాలురు తాము కట్టెడి అట్టలయిండ్ల కొరకై అట్టలను వివిధాకృతులలో కత్తి రింపవలసియుండును. లేక అందమగు ఆకృతులను వ్రాసి వానికి రంగు పూయవలసిన యవసర మేర్పడవచ్చును. లేక ఏవైన ఇతర పనులను బుద్ధిశాలి యగు నుపాధ్యాయుడు స్వయముగ నూహించి బాలురకు కల్పింపవచ్చును. కాని ప్రథమదశయందు బాలునికి అనాదియందు ఇండ్లుకట్టు పని వాండ్రకు కల్గిన పరిస్థితినే యేర్పడజేయవలెను. అప్పు

డా బాలుడు విశేషసాధనములు లేకుండ కేవలము తన యింద్రియముల సహాయమున తన లక్ష్యమును సాధింపజాలనని తెలిసికొనును. మరికొంత కాలము గడచి, బాలుని యింద్రియజ్ఞానము క్రమశిక్షకు లోనై వృద్ధిపొందినమీదట నాతడు వృత్తలేఖిని సహాయముతో తాను వ్రాసిన బొమ్మ చక్కగ నున్నదో లేదో పరీక్షించుకొనును. కాని ఇప్పుడు కూడ ఆత డూహాల ననుసరించియే తన పని నడుపుకొనుచుండును. మరికొంతకాలము వరకును విద్యార్థి నీయసంపూర్ణ దశయందే నిలిపియుంచి, అందలి లోపములను స్వకీయానుభవముచే ఆతడు తెలిసికొనునట్లు చేయవలెను. శాస్త్రీయములగు పనిముట్లు లేనందువలన నెట్టి చిక్కులు కలవో ఆతనికి స్పష్టపడవలెను. ఆత డా పనిముట్లను వాడుటకు తగిన యూహునకు రావలెను. జ్ఞానసంపాదనమునందు బాలునికి చక్కని యభిరుచిని కల్గించుటకును, కళలకు సంపూర్ణత కల్గించుటకే శాస్త్రము లేర్పడిన వను యంశమును విద్యార్థికి తెలియజేయుటకును ఇట్టి పద్ధతు లవసరము. రేఖాగణితమునందలి శాస్త్రీయాంశములను నేర్పుటకు పూర్వము బాలునికి కొంత ప్రాథమికశిక్షణ, అనుభవమును చాల ముఖ్యము. అవి సంపాదించిన మీదట నీ శాస్త్రముయొక్క ప్రాధాన్యతను విద్యార్థి గుర్తింపగల్గును. ఈ సందర్భమునందు ప్రకృతి కూడ మనకు సహాయపడుచున్న యంశము గుర్తింపదగినది. బాలురు కాగితములు కత్తిరించుట, బొమ్మలను చేయుట,

ఇండ్లను కట్టుట మున్నగుపను లనిన చాల ఉత్సాహమును
చూపుదురు. ఈ ఉత్సాహమునకు మనము ప్రోద్బలము
కల్గించినచో బాలురకు శాస్త్రీయము లగు నంశములు స్థూల
రూపమున తెలిసివచ్చును. శాస్త్రీయ పరికరములను చాక
చక్యముతో వాడు నేర్పు కూడ వారి కలవడును. ఇట్టి నేర్పు
పలువురయందు కొరవడియుండుట గమనింపదగినది.

బాలురయందు పరిశీలనాశక్తియు, నిర్మాణశక్తియు,
కొంతవరకు అభివృద్ధిచెందినమీదట రేఖాగణిత విజ్ఞానము
నందలి సమస్యల కన్వయము తెలిసికొనుపని నాతనికి కల్పింప
వచ్చును. కాని ఈ దశయందుకూడ బాలునికి శాస్త్రీయ
సిద్ధాంతముల గూర్చిన ప్రశంస యవసరములేదు. ఒక మెట్టు
నుండి విద్యార్థి వేరొక మెట్టునకు పోవుచున్న యీ దశలో
కూడ ఆతనికి బోధనాపద్ధతులలో నెట్టి మార్పును గాన్పింప
రాదు. చేయబడిన మార్పు యాదృచ్ఛికముగ సంభవించి
నట్లుగ బాలునికి తోపవలెను. రేఖాగణితమునకును, నిర్మా
ణాత్మకమగు పనులకును సంబంధమును యథాప్రకారము
గనే చూపుచుండవలెను. ఉదాహరణముగ బాలుగను అట్ట
ముక్కలతో నాలుగు త్రిభుజములవల్ల చేయుబడు ఘనాకృతిని
తయారు చేయవలసినదిగ పని కల్పింపవలెను. ఇందులకు ఆ
బొమ్మయొక్క ఒక నమూనాను కూడ విద్యార్థుల కొసంగ
వలెను. ఈ యాకృతిని సిద్ధపరచుటకై బాలుడు ఒకప్రత్యేక
స్థానములో నాల్గు సమబాహుత్రిభుజములను వ్రాయవలసి

వచ్చును. కాని వీనిని వ్రాయుటకు కావలసిన శాస్త్రీయ జ్ఞానము లేనందువలన ఆతడా త్రికోణములను వాని వాని స్థలములలో నిలువబెట్టి, వాని భుజము లొండొంటితో చక్కగ నమరకుండుట గమనించును. ఒక కోణము లోకచో కలియకుండుట కూడ ఆతడు తెలిసికొనును. ఈ దశయందు దాతనికి రెండు వృత్తములు గీసిన పక్షమున, మనకు కావలసిన త్రికోణముల నెట్టి కష్టమును లేకుండ నిర్దుష్టముగ వ్రాయవచ్చునని తెలుపవచ్చును. మొట్టమొదట తన పనిని చక్కగ సాధింపజాలకపోయిన కారణమున ఈ సూత్రనాంశము లాతనికి చాల ఉపయోగకరములని తెలియవచ్చును. రేఖాగణిత శాస్త్రమునకు సంబంధించిన సూత్రములు, తత్సంబంధమగు సమస్యల కన్వయము కన్గొనుటలో నెట్లు ఉపకరించునో బాలుని కొక పర్యాయము తెలిసివచ్చిన తరువాత, ఆ పని తా విషయమున సంపూర్ణమగు స్వేచ్ఛ నొసంగవలెను. ఒక సమ రేఖను రెండుగావిభజించుట, ఒక రేఖకు లంబమును గీయుట, చతురస్రమును వ్రాయుట, ఒక కోణమును విభజించుట, ఒక రేఖకు సమానాంతర రేఖను వ్రాయుట, ఒక షడ్భుజమును నిర్మించుట మున్నగు నితరసమస్యలు బాలు డోపికతో ప్రయత్నముచేసిన పక్షమున నాతనికి తప్పక సాధ్యపడును. ఇట్టి విజ్ఞానము లభించిన మీదట బాలుని ఒక మెట్టునుండి వేరొక మెట్టునకు క్రమక్రమముగా తీసికొని పోవలెను. విద్యార్థికి సమయోచితమగు సహాయమును మనము కావిం

చుచున్న పక్షమున ఆతడు తన కీయబడిన ప్రశ్నలకు తనంత తానే యుత్తరముల కన్గొనగలడు. పూర్వపద్ధతుల ప్రకారము విద్యాభ్యాసము కావించిన వారికి మేము కావించిన సూచనలయందు విశ్వాసము కుదురకపోవచ్చును. కాని ఈ పద్ధతులే ఉత్తమమైనవని ప్రకటించుటలో మాకెట్టి యనుమానమును లేదు. పై విధముగ రేఖాగణితమును నేర్చిన విద్యార్థులకీ గణితసంబంధములగు ప్రశ్నలలో నపరిమితమగు నభిరుచి కల్గుననియు, వారు తమపాఠశాలలలో నొసంగబడిన లెక్కలను మిక్కిలి యుత్సాహముతో చేయుటయేకాక, ఆటవిడుపు దినములలో కూడ తమకు కొన్ని సమస్యల నీయవలసినదిగా తమ యుపాధ్యాయులను కోరుదురనియు మాకు తెలిసినది. ఒక బాలికాపాఠశాలలోని కొందరు విద్యార్థినులిట్లు కోరినట్లు మాకు తెలియవచ్చినది. పై నిదర్శనముల వలన విద్యార్థులు స్వయంకృషిచే తమ జ్ఞానమును సంపాదించుకొనజాలుదురని మేము తెలుపగలము. నీరసముగను, అసహ్యముగను కాన్పించు విషయములనుకూడ బాలురు మిక్కిలి సంతోషముతోను, ఉత్సాహముతోడను నేర్చుకొనునట్లు చేయుటకై పైన వర్ణింపబడిన విధానము లెంతేని ఉపయోగకరములని మేము తెల్పగలము. ఈ పద్ధతులు ప్రకృతిసిద్ధములైనవి కావున విద్యార్థులకవి యెంతయో ఉపయోగకారులుగ నుండగలవు. ఇట్టి పద్ధతు

వాడుటవలన బాలుడు రేఖాగణితమును సులభముగ

నేర్చుకొనుటయేకాదు, ఆతని మానసిక ప్రవృత్తి కూడ సంపూర్ణముగ మారిపోవును. సామాన్యముగు పాఠశాలలలో విద్యాభ్యాసము కావించు బాలుర మనస్సులు కఠినసూత్రములను రోకటిపాటగ వల్లెవేయించుటవలన నేమి, మిక్కిలి విసువును కల్గించు నితర పద్ధతులవలన నేమి, తదితర కారణములవలన నేమి మొద్దువారిపోవును. ఆత డితరుల బోధనలను వినుచుండుటయే కాని తనంతతాను కృషిచేయుట కవకాశములు లేకుండపోవును. నూతన విద్యాపద్ధతులవలన నాతని మాంద్యము తొలగి, ఆతడు స్వయముగ నూతనాంశముల కన్గొనజాలును. తప్పుడు బోధనాపద్ధతులచే విద్యార్థులలో కల్గు నిరుత్సాహమిందుచే మాయమగును. ఉపాధ్యాయుడు చూపు సానుభూతివలన విద్యార్థియందు పట్టుదల హెచ్చును. ఆతడు విజయముల సాధించుట ప్రారంభించును. అప్పుడు విద్యార్థియొక్క ప్రకృతియందే ఒక విప్లవము బయలుదేరును. "నేను చేతకానివాడనుకాను. నేను కూడ పనులను సాధింపగలను." అను నాత్మవిశ్వాసము బాలునియం దుద్భవించును. ఒక విజయము తరువాత వేరొక విజయము లభించినకొలదియు నిరాశాభావము బాలుని హృదయము నుండి మాయమగును. అప్పుడు బాలుడు తాను చదువ వలసిన యితర విషయములకూడ ఆత్మవిశ్వాసముతో ప్రారంభించి తుదకు కృతకృత్యుడగును.

'విద్యావిధానములో పదార్థ విజ్ఞాన శాస్త్రము నొక

భాగముగ చేర్చుటవలన ప్రయోజనము' అను నంశముపై ప్రొఫెసర్ టిండాల్ ఒక యుపన్యాసమును నిటీవలనే కావించి యున్నారు. మేము పైన వివరించిన యంశములనే ఆయన తన యుపన్యాసమునందు పేర్కొన్నారు. ఆయన యభిప్రాయము చాల విలువ గలది. కావున దాని నిచ్చట మేము వివరించుచున్నాము.

"పైన వర్ణింపబడిన కాలమున నే నొక తరగతికి గణిత శాస్త్రము బోధింపవలసి వచ్చెను. అందు యూక్లిడ్ సిద్ధాంతములను, ప్రాచీనమగు రేఖాగణితమును బోధించుచు బాలుర యాలోచనాశక్తికి తరచు పని కల్పించెడివాడను. ఇందువలన నా విద్యార్థులకు గణితశాస్త్ర మనిన చాల అభిరుచి కలుగజొచ్చెను. నిత్యపాఠములలో వారి కర్థముకాని సమస్యలను బోధింపక, బాలురు స్వయంశక్తిచే దానికి ప్రత్యుత్తరముల కన్గొనవలె నని నేను ప్రోత్సహించెడివాడను. నేను కావించిన మార్పు వారి తొల్లింటి యలవాట్లకు భిన్నముగ నుండిన కారణమున ప్రప్రథమమున వారి కిది రుచించెడిది కాదు. అపరిచితులగు వారితో వ్యవహరింపవలసిన యావశ్యకత తమకు కల్గినట్లు వారు భావించెడివారు. కాని వారి ప్రతికూలభావము చిరకాలము నిలువలేదు. తాను మిక్కిలి ఓరిమిగలవాడను, పట్టుదలతో పనిచేసెడివాడ ననియు, అందువలన తాను తన సహోద్యోగులకంటె మిన్నగ నుండెడివాడ ననియు, మహావిజ్ఞాని యగు న్యూటను తరచు పలుకు-

చుండెడివాడు. అసాధ్య మను పదము కేవలము మూర్ఖులు మాత్రము వాడవలసిన దని మిరాబూ అను నొక రాజనీతిజ్ఞుడు తన సేవకుని మందలించుచు పల్కెను. నా విద్యార్థులలో నిరుత్సాహము ప్రబలియున్న సందర్భమున నే నీ యంశ ముల వారికి తెలిపి ప్రోత్సాహము కల్పించెడివాడను. ఈ యుత్సాహవాక్యములను వినుసరికి బాలుర ముఖములు వికసించెడివి. తమ శక్తి విషయమై గల వారి యనుమానములు పటాపంచ లయ్యెనని తెలుపజాలను. కాని తాము కావింప వలసిన పనిని పూనికతో నెరవేర్చుటకై వారు సంసిద్ధు లయ్యెడివారని నేను తెల్పగలను. వారి కనులలో నా కొక నూతనకాంతి కానవచ్చెడిది. తుట్టతుదకు వారు మిక్కిలి యానందముతో "అయ్యా! మా సమస్యను సాధించితిమి" అని పల్కెడివారు. ఈ బాలురను చూడగా చూడగా నాకు ఆర్కిమిడీస్ పండితుని బ్రహ్మానందము కూడ ఇదే తెగకు చెందినదని తలంపు గల్గెను. స్వశక్తియందు వారికి గల్గిన విశ్వాసము మిక్కిలి ఉపయోగకారి యైనది. ఈ యాత్మ విశ్వాసము కారణముగ నా తరగతిలోని బాలు రద్భుత మగు నభివృద్ధిని చూపసాగిరి. పాఠ్యగ్రంథములలోని సమస్య లను కాని, లేక ఇతర నూతనపుస్తకములలోని సమస్యలను కాని వారు సాధింపవచ్చునని నేను బాలుర కవకాశ మొసం గెడివాడను. కాని బాలు రెల్లప్పుడును పాఠ్యగ్రంథము నావల పెట్టి, తమ కీవరకు తెలియని నూతన పుస్తకములోని

సమస్యలనే ఎన్నుకొనెడివాఁడు. అవసరమైనప్పుడా విద్యార్థు లకు చేయూత నొసంగుటకై నే నెల్లప్పుడును సంసిద్ధుడనై యుండెడివాడను. కాని బాలురు నా సహాయమును స్వీక రించెడివారు కారు. స్వయంశక్తిచే సాధించిన విజయ మెం తటి మధురమైనదో వారింతకు పూర్వమే గుర్తించి యుండిరి. కావున నిట్టి యితర విజయములనుకూడ సాధింపవలె నని వా రాత్రపడుచుండెడివారు. మా విద్యార్థులు తమ సమస్యల కుత్తరములను గోడలమీదను, నేలములమీదను చిత్రిం చుట ప్రారంభించిరి. ఈ విధముగ నా బాలురకు గణిత శాస్త్రమునందు నిజమైన యభిరుచి కల్గినదని నాకు నిదర్శన పూర్వకముగ తెలిసి వచ్చెను. నాకు విద్యాబోధనయందు తగినంత అనుభవము లేదు. బోధనాసూత్రములను గూర్చి కూడ నా కంతగ తెలియదు. కాని స్వబుద్ధిచే ప్రేరేపితుడనై నే నొక నూతనమార్గము నవలంబించితిని. నా బోధనా రంగమునందు రేఖాగణిత మొక పాఠ్యవిషయము కాదు. ఆ శాస్త్రముద్వారా నా బాలుర కొక నూతన చైతన్యము నొసంగుటకై నేను యత్నించితిని. ఈ ప్రయోగము విజయ వంత మయ్యెను. నేను నిర్ణయించిన విధానము నవలంబించుటచే విద్యార్థుల మనస్సుల కుల్లాసమును, పుష్టియు కలుగసాగెను. వీరిని చూచుటవలన నా కపరిమితానందము కల్గెడిది.

విద్యార్థి స్వానుభవముతో సన్నిహితసంబంధము గల యిట్టి గణితశాస్త్రమును, తదితరములగు విషయములను చిర

కాలము వరకును బోధింపవలెను. శాస్త్రీయవిషయములు నిత్యజీవితమునం దెట్లుపయోగకారు లగునో తెల్పు పద్ధతులను కూడ చాల కాలమువరకును అవలంబింపవలయును. మొట్టమొదట సులభమగు నాకృతులను, ఆపైన క్లిష్టమగు నాకృతులను అట్టలతో చేయు పద్ధతిని బాలురకు పరిచితము కావింపవచ్చును. క్రమక్రమముగ నతిక్లిష్టములగు నాకారములను, వానికి సంబంధించిన సమస్యలను విద్యార్థుల దృష్టికి తేవలెను.

ఈ విధమగు నభ్యాసములను చాలకాలము వరకును చేయుచు పోయిన మీదట విద్యార్థి సశాస్త్రీయమగు రేఖాగణితమును గ్రహింప సమర్థు డగును. వస్తువులను, వాని పరిమాణములను గూర్చి తరచు ఆలోచించుచుండుట వలన, కొన్ని విధములగు నిర్ణయములను సాధించుటకై కొన్ని సూత్రము లావశ్యకములనియు, యూక్లిడు గ్రంథములోని నిదర్శనము లన్నియు తాను సాధింపవలసిన సమస్యలకు మార్గదర్శకము లనియు విద్యార్థి తెలిసికొనును. ఈవరకే ఆతని మానసికశక్తు లన్నియు సుశిక్షితములై యున్న కారణమున యూక్లిడు నందలి సిద్ధాంతములను విద్యార్థి సులభముగ గ్రహింప గల్గును. వాని యుపయోగమును కూడ ఆతడు చక్కగ గ్రహించును. ఇంతవరకును తాను అవలంబించుచున్న పద్ధతులు సక్రమమైనవే యని తెలిసికొన్నప్పు డాతని కానందము కల్గును. పూర్వానుభవము లేని విద్యార్థికి

యూక్లిడు సిద్ధాంతములలో నెట్టి రుచియు కాన్పింపదు. కాని మన విద్యార్థి వాని నుత్సాహముతో నేర్చుకొనును. తుట్టతుద కాతని యాలోచనాశక్తులు బాగుగా వృద్ధిచెంది, విద్యార్థి వివిధసమస్యలను తానే స్వయముగ వివరణ కావించి తెల్పుటకు సమర్థుడగును. ఇది యాతని బుద్ధివికాసమున కున్నతదశ యని తెలుపవచ్చును. ఇప్పుడు విద్యార్థి క్రమక్రమముగా రేఖాగణితములోని క్లిష్టమైన సమస్యలను స్వబుద్ధిచే సాధింపగల్గును. ఈ విధానమువలన విద్యార్థి మానసికశక్తులును, నైతికశక్తులును కూడ స్వయంకృషిచే వృద్ధిగాంచును.

విద్యావిధానమునకు సంబంధించిన సమస్త విషయములును గల గ్రంథమును వ్రాయుటకు మాకు సావకాశము లేదు. బాలుర యింద్రియశక్తులను, పరిశీలనాశక్తిని వృద్ధి చేయుటకై వస్తుపాఠములు, చిత్రలేఖనము, రేఖాగణితముల ద్వారా యెట్లు కృషి సలుపవచ్చునో సోదాహరణముగ మేము వివరించినారము. ఈ పద్ధతులను శ్రద్ధగ పరిశీలించిన పక్షమున మేము సులభవిషయములనుండి క్లిష్టవిషయములకును, స్పష్టమగు సంశయములనుండి యస్పష్టమగు సంశయములకును, సాకారములగు వానినుండి కేవలము ఊహ్యములగు విధానములకును, ప్రయోగాత్మకపద్ధతులనుండి కేవల సిద్ధాంతరంగమునకును, త్రోవ చూపినామని విజ్ఞులు తెలిసికొనగల్గుదురు. అంతే కాదు. విద్యావిధానము మానవ నాగరకతా విధానమునకు ప్రతిబింబముగ నుండవలయుననియు, అయ్యది

విద్యార్థికి సంతోషదాయకముగ నుండుట ముఖ్యమనియు
కూడ మేము తెల్పినారము. జ్ఞానార్జనము స్వయంకృషిపై
ఆధారపడవలెను. అది యాతని మనోవికాసముతో మేళ
వించవలెను. ఒకే విద్యావిధానములో నీ లక్షణము లన్నియు
నిమిడియున్న పక్షమున మా సూత్రములందలి సత్యాసత్య
ములు స్వయముగ వ్యక్తమగును. లోకుల కదియే సరియైన
విద్యావిధానమని తెలియవచ్చును. మేము సూచించిన విధాన
మునందు రెండు ముఖ్యాంశము లిమిడియున్నవి. ఈ విధానము
ప్రకృతిసిద్ధములగు సూత్రములపై ఆధారపడియున్నది. ఈ
విద్యాపద్ధతి అల్పవయస్కులగు వారి మనోరంగమున నా
యా కాలములలో కల్గు కోర్కెలను మన్నించుటయే కాక
వారికి స్వయంసహాయమును కావించుకొనుట కవకాశముల
కల్పించుచున్నది. ఈ విధముగ బాలునికి ప్రకృతిమాత
యొసంగు సహాయమును మనము బలపరచుచున్నాము. పై
కారణములచే మేము సూచించిన విద్యావిధానము సక్రమ
మైనదని మా విశ్వాసము.

ఇంతకు పూర్వమే విశదీకరింపబడిన రెండు ముఖ్యాం
శముల నిచ్చట పునశ్చరణ చేయవలసియున్నది. మనలో
పలువురము వాని నశ్రద్ధ చేయుచున్నారము. మానవుడు తన
శైశవమందును, బాల్యమందును, ప్రౌఢవయస్సునందును
కూడ తా నెరుంగవలసిన యంశములను స్వశక్తిచే సాధింప
వలెను. అదే విధముగ నీ జ్ఞానార్జనచేయు కాలమున విద్యార్థి

సంతోషముతోడనే విద్యను సాధింపవలెను. విద్యను నేర్పు
నప్పుడు బాలుని సులభవిషయములనుండి క్లిష్టవిషయము
లకును, నిర్దిష్టవిషయములనుండి అనిర్దిష్టవిషయములకును,
సాకారములగు నంశములనుండి ఊహ్యాంశములకును తీసికొని
పోవలయు ననునది మానసికశాస్త్ర సిద్ధాంతము. ఈ సిద్ధాంత
మును మనము సక్రమముగా ననుసరించుచున్నామా లేదా
యని తెలిసికొనుటకు మార్గ మొక్కటే గలదు. బాలుడు
స్వశక్తివలనను, సంతోషపూర్వకముగను, విద్యను సాధించు
చున్నయెడల సిద్ధాంతము లమలు కావింపబడుచున్నట్లు
మనము తెలిసికొనవలెను. పై సిద్ధాంతమునందు మనోవికా
సమునకు సంబంధించిన శాస్త్రీయాంశములను, ఆ వికాసము
నకై అనుసరింపవలసిన పద్ధతులను తెలిపియున్నాము. విద్యా
ర్జనయందలి వివిధదశలలో బాలుడు స్వశక్తివలననే ఒక
మెట్టునుండి వేరొక మెట్టునకు పోగల్గుచున్న పక్షమున నా
పాఠ్యక్రమము బాలుని మానసికాభివృద్ధి కనుగుణ్యముగ
నున్నట్లు ఊహింపవచ్చును. ఈ జ్ఞానసంగ్రహణము నాతడు
సంతోషపూర్వకముగ కావించుచున్న పక్షమున నాతని మనో
శక్తుల కనుచితమగు శ్రమ కలుగుటలేదని భావింపనగును.

విద్యావిధానమును బాలుని బుద్ధివికాసమున కనుగుణ్య
ముగ కావించుట వలన మన పాఠముల క్రమము చక్కగ
నుండుటయే కాక ఇతర లాభములు కూడ కలవు. ఈ విధ
ముగ నేర్పబడిన విద్య బాలకుని మనస్సునకు శాశ్వతముగ

హత్తుకొనిపోవును. స్పష్టముగ నుండును. ఇతరవిధానముల వలన నీ ఫలితముల సాధింపజాలము. బాలుడు స్వశక్తిచే సాధించిన జ్ఞానమును, ఆతడు స్వశక్తిచే పరిష్కరించిన సమస్యలును ఆతనితో ప్రత్యేకముగ కలిసిమెలసి పోవును. ఇతరము లట్లు కాజాలవు. ఇట్టి విజయములను సాధించునట్లు ప్రప్రథమమున బాలుని మనస్సునందు కల్గు సంచలనమును, ఏర్పడునట్టి యేకాగ్రతయును, విజయము సాధింపబడిన వెనుక కల్గు నానందాతిరేకమును, తెలిసికొనబడిన యంశములకు మన మనోరంగమున శాశ్వత నివాసము కల్పించును. ఒక ఉపాధ్యాయుడు బోధించిన విషయములుకాని, పుస్తకములో చదివిన యంశములుకాని మన మనస్సున కంతగా నాటి యుండజాలవు. ఏ కారణమువల్లనైన బాలుడు తాను తెలిసికొనదలచిన యంశమును తెలిసికొనజాలక పోయినను, ఆతని మానసికశక్తులుత్తేజితములై సూక్ష్మగ్రహణశక్తితో నలరారుచుండును. ఇట్టి పరిస్థితియం దుపాధ్యాయుడు ఒక సమస్యార్థము తెల్పిన పక్షమున బాలుడు దానిని సులభముగ గ్రహించి శాశ్వతముగ జ్ఞప్తియం దుంచుకొనగలడు. బాలుని స్వప్రయత్నము లేనప్పు డుపాధ్యాయు డొక యంశమును పదిసార్లు పునశ్చరణ చేసినను అది నిష్ప్రయోజనమే యగును. ఇట్టి క్రమశిక్షణవలన బాలుడు తాను సాధించిన జ్ఞానమును సక్రమవిధానముపై తన మనస్సునందు పొందుపరచుకొనును. ఈ విధముగ వివిధాంశములను నేర్చి, వానినుండి

నూతన సత్యములను గ్రహించినచో, అయ్యవి యాథార్థ
ముగ నూతనవిజ్ఞానమును సాధింపవచ్చును. నూతన సమస్య
లను పరిష్కరింపవచ్చును. నిన్నటిదినము మనము సాధించిన
సమస్యల పరిష్కారములు నేడు మనము పరిష్కరింపవలసిన
సమస్యలను మనకు విశదపరచును. స్వశక్తివలన సాధించిన
జ్ఞానము అతిశీఘ్రముగ మన కొక నూతనశక్తిని ప్రసాదిం
చును. మన ఆలోచనాశక్తిని తీవ్రతరము కావించును.
అట్లు కాకుండ కేవలము రోకటిపాటగ నేర్చుకొనిన విషయ
ములు మన మనస్సులో నొక మూల నిరర్థకముగ నొదిగి
పడియుండును. అంతేకాక నిరంతర స్వయంసహాయము వలన
వృద్ధిచెందు నైతికబలము కూడ గమనింపదగినది. మన భావి
జీవితములో కష్టముల నెదుర్కొను ధైర్యము, ఓరిమితోడను
ఏకాగ్రతతోను వర్తించుట, అపజయము కల్గినప్పుడు పట్టు
దలతో పునఃపునః ప్రయత్నములు సాగించు శక్తియు మనకు
కావలసిన సద్గుణములు. మేము చెప్పిన విధముగ బాలురు
తమ మానసికశక్తులను వృద్ధిపొందించుకొనిన పక్షమున పై
సద్గుణములు తప్పక అలవడగలవు. ఈ విధానము ననుసరించి
బాలురకు విద్య నేర్పుట సాధ్యమగు నంశమని మేము నొక్కి
చెప్పగలము. ఇయ్యది స్వానుభవముపై తెలిపిన విషయము.
ఈ యంశమునే పలువురు విద్యానిపుణులు నొక్కి చెప్పి
యున్నారు. "బాలుడు స్వశక్తిచే నేర్చుకొనిన యంశములు,
ఉపాధ్యాయుల మని రొమ్ములు విరచుకొని తిరుగువారు

బోధించెడి విషయముల కంటె ఎన్నోరెట్లు ఎక్కుడు ప్రశస్త మైనవి.” అని ఫెలెన్‌బర్గ్ అను విద్యానిపుణుడు తెల్పి నాడు. హొరేస్‌మాన్ అను నాతడు “దురదృష్టవశమున నిప్పుడు మనము విద్య యనగా కేవలము బోధించుట యని భావించుచున్నాము. అది తప్పు. విద్య యనగా మానసిక శిక్షణ” యని పల్కుచున్నాడు. “బాలుడు స్వశక్తిచే తెలిసి కొను విషయములు, ఇతరులు బోధించు విషయములకంటె బాగుగా గ్రాహ్యమగును.” అని మార్సెల్ పండితుడు వక్కా ణించినాడు.

విద్యార్జనము కావించు విధానము బాలున కానందము కూర్పవలయునను విషయమును విమర్శింతము. ఈ యానంద మునకు హేతువు, విద్యార్థి కెడనెడ లభించు బహుమతులు, పతకములు మున్నగు వానివలన కల్గునదికాదు. ఇందలి స్వయంసిద్ధమగు ప్రాశస్త్యమే ఈ యానందమునకు మూలము. ఈ సూత్రము ననుసరించి యల్పవయస్కులకు విద్య నేర్పిన నాడు, వారియందు జరుగుచుండు క్రమవికాసకార్యక్రమము నకు మన మవరోధములు కల్పింప నక్కరలేదు. అంతేకాక బాలురకు కొన్ని విశిష్టమగు లాభములు కూడ దీని వలన కల్గును. తరుణవయస్కులగు నందరిలోను ఆనందోత్సాహ ముల ప్రోత్సహించుట మన కందరకును కూడ సమ్మతమగు నాదర్శము. ఏదైన విషయము మన కుత్సాహమును కల్పిం చునప్పుడు మనము దాని యెడ శ్రద్ధ వహింతుము. అట్లు

కాక మనకు దానియెడ నుపేక్షయో, లేక నిర్లక్ష్యభావమో
కల్గిన పక్షమున మనము దానిని చక్కగ నెరవేర్పజాలము.
ఆనందముతో చదివి, విని, చూచినట్టి యంశములను మనము
బాగుగా జ్ఞప్తియం దుంచుకొనగలము. నిర్లక్ష్యభావముతో
నుపలక్షించిన వానిని బాగుగా జ్ఞాపకముంచుకొనజాలము.
మొదటి సందర్భమునందు కండ్లు, చెవులు మున్నగు నింద్రి
యములు తమ యెదుట ప్రదర్శింపబడిన యంశములను మెల
కువతో గ్రహించును. రెండవ పక్షమున నా విషయములం
దభిరుచి తగినంత లేని కారణమున, మన ఇంద్రియశక్తులు
వాని నశ్రద్ధగ నుపలక్షించుచుండును. అట్టియెడ నితర
విషయములు మన దృష్టి నెక్కుడుగ ఆకర్షించుచుండును.
మొదటి పరిస్థితిలో మన మనోరంగముపై నేర్పడిన ప్రతిబింబ
ములు స్పష్టముగ నుండును. రెండవ సందర్భమున నేర్పడు
ప్రతిబింబము లస్పష్టముగ నేర్పడును. ఏదైన నొకపని బాలుని
కనిష్టదాయకముగ నున్నప్పుడు దానిని చేయుటలో నాతని
శక్తులను సమీకరించుట దుస్సాధ్యము. కాని తోడ్తోడనే
నియమిత కార్యమును చేయనిచో నెట్టి దండన విధింపబడునో
యనుభయము కూడ బాలుని బాధించును. ఆభయ మాత
నికి గల సహజశక్తులను కూడ క్షీణింపజేయును. మొత్తము
మీద యే విషయముల చేయుటలో విద్యార్థి కానందము
కల్గుచున్నదో ఆ విషయములే ఆతనికి చక్కగ నలవడునని
యిందువలన తేలుచున్నది.

నిత్యమును బాలురకు నేర్పబడు పాఠములలో వారికి గల యభిరుచి, లేక నిర్లక్ష్యభావముల వలన కొన్ని ముఖ్యమగు నైతికఫలితములు కల్గును. ఒక బాలుడు నిత్యమును తన కభిరుచిగల విషయములను నేర్చుచు ఆనందముగ నున్నట్లును, వేరొకడు తనకు నేర్పబడు సంశములలో నెట్టి యభిరుచియు లేక, వాని యెడల నిర్లక్ష్యమును చూపుచు, గురువు యొక్క కోపతాపములు, బెదరింపులు, శిక్ష మున్నగువానికి గురియగుచు ఎల్లప్పుడును దుఃఖభాజనమైన జీవితమును గడపుచున్నట్లును భావింపుము. ఇందు మొదటి వాని స్వభావము మిక్కిలి బాగుపడును. రెండవవాని స్వభావమునకు నష్టము చేకూరును. జయాపజయములు మన మనస్సును ప్రభావితము కావించును. మనస్సుయొక్క స్థితివలన దేహము కూడ మార్పునకు లోనగును. నిత్యవిజయపరంపర సాధించువాని దేహారోగ్యమును, స్వభావమును కూడ నానాటికిని ఉత్తమదశను పొందుచుండును. నిరంతర పరాజయముల వలన మానవుడు శాశ్వతముగ చింతాక్రాంతుడగును. ఆతని యందు పిరికితనము హెచ్చును. ఆతని దేహమునందు కూడ దౌర్బల్య మేర్పడును. ఇందువలన పరోక్షమగు మరియొక ముఖ్యఫలితముకూడ కల్గును. బాలునికి నేర్పబడు పాఠములాతనికి సంతోషదాయకములుగ నున్నచో విద్యార్థికిని ఉపాధ్యాయునికిని గల సంబంధము స్నేహపూర్వకముగ నుండును. బాలుని కుపాధ్యాయునియందు గురి కల్గును. అట్లు

శాక నేర్పబడునట్టి యంశములు విద్యార్థి కసహ్యకరము లుగ నున్నచో గురుశిష్యుల నడుమ నిరంతర సంఘర్షణ ప్రబలును. ఉపాధ్యాయునికి బాలుని కడ నెట్టి పలుకుబడియు నుండదు. మానవుల కితరమానవులతో గల సంబంధములు వారికి లభించు నానందమునైనను, కల్గు దుఃఖమునైనను చాలవరకు ఆధారపడును. మనకు నిత్యమును దుఃఖము కల్గించువానిని మనము శత్రుభావముతో చూడకుండ నుండ జాలము. ఆతడు నిరంతరము మనయందు విచారభావమునే కల్గించుచున్నచో మన మాతని నసహ్యించుకొనుట అనివార్యము. ఇందులకు విరుద్ధముగ బాలురు కోరునట్టి యర్థముల సాధించుటయందు వారికి సాయపడువాడును, ప్రతి గడియ యందును వారికి విజయానందమును కల్పించు వాడును, ఎల్లప్పుడును వారికికల్గు కష్టములను దూరము చేయుటకును సానుభూతి చూపుటకును సంసిద్ధుడై యుండువాడును, వారి యభిమానమునకు పాత్రుడగును. అంతేకాదు. ఉపాధ్యాయు డెల్లప్పుడును విద్యార్థుల యెడల ప్రేమ సానుభూతులతో వర్తించుచుండిన యెడల బాలు రాతని యెడ ప్రేమను చూపకపోడంగుదురు. విద్యార్థులు గురువును తమ మిత్రునిగ భావించిన పక్షమున వారిపై నాతనికి లాభకరమును, బల వత్తరము నగు ప్రభావ మేర్పడును. గురువును విద్యార్థులు నిర్లక్ష్యభావముతో కాని, అసహ్యముతో కాని పరిగణించుచున్న పక్షమున కల్గుఫలితములు చాల నష్టదాయకములు.

ఈ యంశములను మనము చక్కగ గుర్తించిన పక్షమున, బాలురకు సంతోషదాయకమగు మార్గములవైననే విద్యను నేర్పవలెనను సూత్రమును తప్పక అంగీకరింతుము. ఈ విషయము లాచరణసాధ్యములా కావా యని యనుమానించు వారికి మా సమాధానమొక్కటియే: మేము తెల్పు నంశములు కేవల సిద్ధాంతముపైననే కాక ఆచరణపైకూడ ఆధారపడియున్నవి. పెస్టాలజీ కాలమునుండి నేటివరకు కూడ అనేకులు విద్యావేత్తలీ యంశమును పునరుద్ఘాటించినారు. ఈ సందర్భమున ప్రొఫెసర్ పిలాన్సుగా రిట్లు నుడువుచున్నారు. "బాలబాలికలకు క్రియవిధానముపై విద్యను నేర్పిన పక్షమున వారి కాటలయం దెంత సంతోషము కల్గునో చదువు నందు కూడ అంతే సంతోషము కల్గును. అంతేకాదు శారీరిక శక్తులకు చక్కని పరిశ్రమ కల్గినప్పుడు లభించు నానందము కంటె మానసికశక్తులకు సమంజసమగు వ్యావృత్తి లభించినప్పు డుత్పన్నమగు నానందము మిన్నదైనది."

జ్ఞానార్జనము స్వయంకృషివలన సంభవింపవలెననియు, అయ్యది ఆనందదాయకముగ నుండవలె ననియు పల్కుటకు మా కింకొక కారణముకూడ కలదు. విద్యావిధానమునం దిట్టి మంచిలక్షణము లున్నయెడల జ్ఞానార్జనము విద్యార్థిదశతో ముగిసిపోదు. విద్యార్జనము మనకు అసహ్యకరముగ నున్న పక్షమున తల్లిదండ్రుల నుండియు, ఉపాధ్యాయుల నుండియు నిర్బంధము తొలగగానే మన మా విద్యకు స్వస్తి చెప్పు

దుము. అట్లు కాకుండ మొట్టమొదట నుండియు జ్ఞానార్జనము మనకు సంతోషహేతువుగ నుండుచు వచ్చిన పక్షమున ఇతరుల పర్యవేక్షణము లేకుండగనే మనము విద్యావ్యాసంగమును సాగింతుము. ఇట్లు జరుగుట అనివార్యము. మానవుని సహజప్రవృత్తులలో నెట్టి మార్పులును సంభవించని పక్షమున మానవులు తమకు దుఃఖదాయకములుగ నుండినట్టి యంశముల నసహ్యించుకొందురు. తొల్లింటి కాలమున తమ కానందము గూర్చిన యంశములను సంతోషముతో జ్ఞప్తియందుంచుకొందురు. విద్యార్థిదశ కష్టములను తలంపునకు తెచ్చినచో విద్య మన కసహ్యకరమగును. విద్యాబోధన ఆనందదాయకముగ నుండియుండిన పక్షమున విద్య మనల నాకర్షించును. బాల్యదశయందు విద్యార్జన చేయునప్పుడు కష్టములకును, బెదిరింపులకును, కఠినదండనకును గురియైన వారును, విద్యను స్వప్రయత్నముచే నార్జించనివారును, తమ భావిజీవితమందు జ్ఞానార్జనకై యెంత మాత్రమును పాటు పడరు. సహజమగు పద్ధతులపై విద్య నేర్చినవారును, మానసికాభివృద్ధిదశల కనుగుణమగు విద్య నేర్చినవారును విద్యార్జన కాలమున తమ యభిరుచి కనుగుణమగు నూతనాంశములనే కాక, అనేక విద్యావిషయిక విజయములను కూడ సాధించిన వారును, విద్యార్జనమును తమ భావిజీవితమునందు కూడ సాగింతురు. స్వయంకృషిచే జ్ఞానము నార్జింపవలెనని బాల్యమునందు వారు తెలిసికొనిన సత్యమును జీవితాంతము వరకును వా రనుసరింతురు.

# నైతిక విద్య

మన విద్యావిధానములో నున్న యొక గొప్పలోప
మును మనము చూడజాలకున్నాము. బాలురకు బోధింప
వలసిన యంశములు, బోధనావిధానము మున్నగు వాని
యందు తగినంత యభివృద్ధి జరుగుచున్న యంశము నిజమే.
కాని వీని యన్నిటికంటె ముఖ్యమగు విషయము నెడ మన
ముపేక్ష వహించుచున్నాము. అంతే కాదు. ఆ యంశ మతిముఖ్య
మైనదను భావము కూడ మనలో కానవచ్చుట లేదు. బాల
బాలికలను భావిజీవితము కొరకై సంసిద్ధులను చేయుటయే
విద్యయొక్క ముఖ్యోద్దేశ్యమని తల్లిదండ్రులు, ఉపాధ్యాయు
లును కూడ అంగీకరించుచున్నారు. ఈ లక్ష్యమును దృష్టి
యందుంచుకొని బోధనాంశముల విలువను, బోధనా పద్ధ
తుల ప్రాశస్త్యమును మనము నిర్ణయించుచున్నాము. ఇది సమం
జసమగు పద్ధతి, కేవల ప్రాచీనవిజ్ఞానమునే కాక, విద్యార్థులకు
ఆధునిక భాషలను, శాస్త్రీయవిజ్ఞానమును అందజేయవలయు
నను వాదమునకు ఈ భావమే మూలము. మన ప్రస్తుత
విద్యావిధానము వలన బాలబాలికలు మున్ముందు సంఘము
నందును, పౌరజీవితమందును వారు నిర్వర్తింపవలసిన బాధ్య
తలను గుర్తించుటకు సావకాశము కల్గుచున్నది. కాని
మాతాపితృధర్మముల చక్కగ నెరవేర్చుటకై అవసరమగు

శిక్షణ వారికి లభించుటలేదు. జీవనోపాధిని సంపాదించుటకై మానవునికి ప్రత్యేకమగు శిక్షణ, తర్ఫీదును, అవసరమని మన మంగీకరించుచున్నాము. కాని సంతానమును సక్రమ పద్ధతులపై పెంచుటకు కొంత శిక్షణ, ప్రయత్నమును, అవసరమని యెవ్వరును గుర్తించుటలేదు. ఒక భద్రపూరుషుని కావశ్యకమగు నంశముల నన్నిటిని నేర్చుటలో శాలురు కొన్ని సంవత్సరములను వ్యయపరచుచున్నారు. అట్లే సమాజమునందును, ప్రత్యేక సమావేశములందును కావలసిన అలంకారిక విద్యలను నేర్చుటకై బాలికలు ఎంతో కాలమును వెచ్చించుచున్నారు. కాని మన బాధ్యతలలో నతి గురుతమమగు కుటుంబనిర్వాహణ మను బాధ్యతను సక్రమముగ నెరవేర్పగలందులకై మనము విద్యార్థులకు ఒకింత శిక్షణను కూడ నిచ్చుటలేదు. ఇట్టి బాధ్యతలను నెరవేర్పవలసిన యవసర మెవ్వరికిని కలుగుట కవకాశము లేదా? కాదు కాదు. నూటికి తొంబది మంది కిట్టి యవసరము కల్గును. ఈ బాధ్యతను నిర్వర్తించుట యంత సులభమైనదా? ఎంత మాత్రముకాదు. వయస్సు వచ్చినవారు నిర్వహింప వలసిన బాధ్యతలలో నియ్యది మిక్కిలి కష్టసాధ్యమైనది. స్త్రీ పురుషులు తమ స్వబుద్ధిబలననే మాతాపితృధర్మముల నెరవేర్చుటకు సమర్థులగుదురా? కాదు. ఈ ముఖ్యవిషయము నందు మానవుడు స్వబుద్ధిచే నన్నివిషయములను నేర్చుకొనగల్గునని యెవ్వరును అంగీకరింపలేదు. అంతేకాక ఈ

యంశము మిక్కిలి క్లిష్టమైనది. కావున కేవలము స్వబుద్ధిపై యాధారపడియుండి యెవ్వరును కూడ ఇందు సంపూర్ణముగ కృతార్థత నందజాలరు. కావున నీ ముఖ్యవిషయమును మన బోధనాంశముల పట్టిక నుండి తొలగింపవలసిన యవసరము మాకు గానరాదు. తల్లిదండ్రుల ఆనందము కొరకును, బిడ్డల యొక్కయు భావితరముల వారి యొక్కయు జీవితమును, యోగ్యతను సంరక్షించుటకును, మనము అల్పవయస్కుల శారీరక, మానసిక, నైతిక శిక్షణయందు సక్రమమగు పద్ధతుల నవలంబించుట చాల ముఖ్యము. ఈయంశమునుగూర్చిన బోధన యువతీయువకుల విద్యావిధానములోని తుట్టతుది దశయందు కావింపబడవలెను. మానవుడు శారీరకముగ పరిణతిని బొందినట్లుచూపు నిదర్శనము సంతానము. ఆ సంతానమును సక్రమవిధానముపై పెంచగల్గుటయే మానసిక పరిణతికి తార్కాణము. ఇప్పుడు మేము ప్రతిపాదింపబోవు చున్న 'విద్యావిషయిక సిద్ధాంతములు—ఆచరణ' అను నం శమునం దితరాంశములన్నియు చేరియున్న వనియు, విద్య కియ్యది మకుటమనియు మా దృఢవిశ్వాసము.

ఈ విధముగ బాలబాలికలు సంసిద్ధతను పొందని పక్షమున వారు భావిదశయందు తమ సంతానమును చక్కగ పెంచజాలరు. ఆ సంతానముయొక్క నైతికశిక్షణ లోపపూరితమై యుండును. బహుశః తల్లిదండ్రులలో పలువు రీ యంశమును గూర్చి చింతింపనే చింతింపరు. లేదా వారి భావన

లపరిష్కృతములును, అన్యోన్యవిరుద్ధములునై యుండవలెను. ముఖ్యముగ తల్లులు తమ బిడ్డలతో మెలగునప్పుడు, ఎట్టి ఆలోచనయు లేకుండ అప్పటికప్పుడు తోచిన విధముగ వ్యవహరించుచుందురు. ఇట్లు చేయుటలో తల్లిదండ్రులు తమ కృత్యములు బిడ్డల భావిక్షేమమునకు దారితీయునా లేదా యని సవిమర్శముగ చింతింపరు. తాత్కాలిక భావములకు వారు లొంగిపోవుదురు. ఆ భావములు మంచివే కావచ్చును. లేక చెడ్డవి కూడ కావచ్చును. తల్లిదండ్రుల భావోద్రేకము మార్పు చెందుటతో వారు తమ బిడ్డల యెడల ననుసరించు విధానములు కూడ మార్పు చెందుచుండును. తల్లిదండ్రులు తమ భావోద్రేకమును కొన్ని నిర్ణీత సిద్ధాంతములు, పద్ధతుల ప్రకారము మార్పు కావించినను ఆ మార్పు నేడు బిడ్డలకు క్షేమంకరముగ పరిణమించుటలేదు. ఏలనన వారవలంబించు పద్ధతులు విజ్ఞానముపై కాక అజ్ఞానముపై ఆధారపడియున్నవి. ఏవో తాతముత్తాతలనాటి పద్ధతులనో, తమ బాల్యమందలి సంఘటనలనో లేక దాదులు, సేవకులు అవలంబించిన మార్గములనో, ఈ నాటి తల్లిదండ్రులు తరచుగ తమకు మార్గదర్శకములుగ భావించుచున్నారు.

ఈ పరిస్థితులను శీఘ్రముగా మార్చుటకు వలనుపడదు. అనేకతరములు గడచిన కాని మానవసంఘములో అభివృద్ధి కాన్పింపదు. రాజ్యాంగవిధానములు క్రమవికాసము చెందినట్లే విద్యావిధానములు కూడ తమంత తాము వృద్ధి చెంద

వలెను. వానిని మన మొక్కనాటిలో సంసిద్ధము కావింప జాలము. విద్యావిధానములో జరుగు మార్పులు క్రమ క్రమ ముగ నేర్పడుననుమాట వాస్తవమే కాని, ఆ మార్పులను అమలులోనికి తెచ్చుటకై కొన్నిసాధనము లుండవలయును. ఆ సాధనములలో వాదోపవాదములుకూడ చేరియున్నవి.

పసిబిడ్డలందరును కూడ స్వతస్సిద్ధముగ మంచివారే యని ఒక ప్రముఖుడు తెల్పియున్నాడు. కాని మే మీ వాదము నంగీకరింపజాలము. జన్మతః మానవుడు చెడ్డవాడని మరికొందరుచేయు వాదమునందే యెక్కువ సత్యము కల దని మావిశ్వాసము. పసిబిడ్డలను చక్కని క్రమశిక్షణకు లోనుకావించిన యెడల వారిని త్రోవకు తీసికొనిరావచ్చు నను వాదము కూడ మాకు రుచింపదు. క్రమశిక్షణవలన బాలబాలికలలోనుండు లోపములను కొంతవరకు తొలగింప వచ్చును కాని పూర్తిగ రూపుమాప జాలము. మానవులు బూజుపట్టిపోయిన తమ ప్రాతభావములను, జీవిత విధానము లను విడనాడిన పక్షమున ప్రపంచమునందలి లోపము లన్నియు సమసిపోవునని షెల్లీ మహాకవి తాను రచించిన కొన్ని కావ్యములలో సూచించినాడు. మన విద్యావిధాన మాదర్శప్రాయముగ నున్నపక్షమున మానవులుకూడ ఆదర్శ ప్రాయులుగ మారిపోవుదురని పై వాక్యములోని భావము కావచ్చును. కాని మానవజాతి చరిత్రను నిష్పాక్షికముగ పరిశీలించినవా రీ యంశముల నంగీకరింపజాలరు.

విద్యావిధానము నందలి మార్పులపై పెద్ద పెద్ద యాసలు పెట్టుకొనినవారి యెడల మాకు సంపూర్ణముగు సానుభూతిగలదు. ఉత్సాహోద్రేకము మూర్ఖపుపట్టుదలగ మారిపోయినను దానివలన కొన్ని సత్ఫలితములు కల్గితీరును. ఇట్టి యుద్రేకము చాల అవసరమైనది. తీవ్ర రాజకీయ వాదులు తాము ప్రతిపాదించిన సంస్కరణలు దేశాభ్యుదయమునకు చాల యవసరమని దృఢముగ నమ్మెదరు. లేనిచో వారు తమ లక్ష్యములను సాధించుటకై కష్టములకు లోను కాజాలరు. త్యాగములను కావింపజాలరు. మద్యపానమే సర్వానర్థములకును మూలమని గాఢముగ నమ్మువాడు మాత్రమే మద్యపాననిరోధకప్రచారమును బాగుగా చేయజాలును. మానవసేవను కావించువారు కూడ ఇతరుల వలెనే కార్యవిభాగసూత్రము నంగీకరింపవలెను. ఆయా కార్యములను సక్రమముగ నెరవేర్పగలందులకై కార్యకర్తలు తమతమ సిద్ధాంతములను త్రికరణశుద్ధిగ నమ్మవలెను. అంతే కాదు. తమతమ కార్యవిధానముల కతిశయ ప్రాముఖ్యతను కూడ ఆపాదింపవలెను. కావున నూతన మానసిక నైతిక విద్యావిధానమువలన సంఘములోని సమస్త లోపములను దూరము చేయవచ్చునని భావించువారి యాశలకు కూడ కొంత విలువ కలదని మా నమ్మకము. ఇట్టి తీవ్రవాదుల యభిప్రాయములను మార్చుట మిక్కిలి కష్టసాధ్యమగు విషయము. లోకక్షేమమునకై పరమేశ్వరుడు చేసిన చక్కని యేర్పాట్లలో నిది యొక్కటి యని తెలుపవచ్చును.

ఒక విధముగు నైతిక శిక్షణావిధానము వలన బాల బాలికల నాదర్శ బాలబాలికలుగ చేయుట సాధ్యమే యను కొనుడు. తల్లిదండ్రు లందరికిని కూడ ఈ శిక్షణావిధానమును నేర్పితిమని తలంపుడు. అట్టి పరిస్థితియందు కూడ మన యాదర్శము సిద్ధింపదు. ఇట్టి ఆదర్శ నైతిక శిక్షణావిధానము నాచరణయం దిడుటకై పెద్దలందరియందును బుద్ధికుశలత, సద్వర్తనము, నిగ్రహము మున్నగు లక్షణము లుండవలెను. ఇట్టి లక్షణములు సార్వత్రికముగ నుండుట యరుదు. మన యిండ్లలో నుండవలసిన సత్ప్రవర్తన మున్నగువానిని గూర్చి తర్కించునప్పుడు లోపములును, చెడ్డగుణములును పసి బాలుర యందు మాత్రమే యున్నట్లును, పెద్దలలో నెట్టి లోటుపాట్లును లేనట్లును మనము వాదించుచుందుము. ప్రస్తుత కాలమున గృహనిర్వహణమునందేమి, రాజ్యపరిపాలనమందేమి సమస్తసద్గుణములును పాలకులయందే నెలకొని యున్నట్లును, సమస్తదోషములును పాలితుల పాలబడినట్లును కొందరు వాదించుచుందురు. విద్యావిషయికములగు సంశయములను గురించి విమర్శ కావించునప్పుడు తల్లిదండ్రు లాదర్శప్రాయులనియు, బిడ్డలు దోషులనియు మనము దృఢముగా నమ్ముచున్నాము. మనకు నిత్యవ్యవహారములందును, ఇతర రంగములందును కానవచ్చు మానవులలో పలువురు అనేక లోపములు కలవారే. అనుదినమును మనము వినుచుండు పుకారుల వలనను, స్నేహితులలో సంభవించు జగడముల వలనను,

దినాలా తీసినవారి వ్యాఖ్యానములవలనను, న్యాయస్థానముల లోని అభియోగముల వలనను, రక్షకభటశాఖవారి నివేదికల వలనను మానవులలో సర్వత్ర వ్యాపించియున్న స్వార్థపరత్వము, సాహసప్రవృత్తి, పశుత్వమును కొట్టవచ్చినట్లు మనకు కాన్పించుచున్నవి. కాని శిశుసంరక్షణా విధానమును విమర్శించునప్పుడును, పసిబిడ్డల దుర్వర్తనను ప్రతిపాదించునప్పుడును, దోషులగు పైపెద్దమనుష్యు లందరును కూడ తమ బాలబాలికలతో మెలగు సందర్భమున నిర్దుష్టవర్తనులై యుందురని భావింతుము. కాని ఇది యెంతమాత్రమును సత్యము కాదు. మన గృహములందు ప్రబలియుండు అరాచకమునకు ముఖ్యకారణము తల్లిదండ్రుల దుష్ప్రవర్తనమే యనియు, బాలబాలికల మూర్ఖత్వ మిందులకు హేతువు కాదనియు మేము విశ్వసించుచున్నాము. సదభ్యాసములును, సత్ప్రవర్తనయు గల మా పాఠకులవంటి ఉత్తమ మాతాపితరులు లేనేలేరని మేము వాదించుట లేదు. అట్టివారరుదుగ నుందురు. కొందరు తల్లులు తమ పసిబిడ్డలు పాలు త్రాగుట లేదని కోపగించి, ఆ బిడ్డలను కొట్టినంతపని చేయుదురు. ఇట్టి తల్లులు తమ బిడ్డల కెట్టి నైతికశిక్షణ నీయగలరు? తన పిల్లవాడు పొరపాటున చేతివేళ్ళను కిటికీ తలుపులో దూర్చి నలగగొట్టుకొనుచుండగా చూచి, పిల్లవాని చేతిని విడపించుటకు మారుగ కొందరు తండ్రులు తమ బిడ్డలను కొట్టుట కుపక్రమింతురు. ఇట్టి తండ్రులు తమ బిడ్డల

కేపాటి న్యాయపరత బోధింపగలరో యోచింపుడు. ఇట్టి తల్లిదండ్రు లెందరో మనలో కలరు. తమ కుమారుడు ప్రమాదవశమున నే కాలో విరుగగొట్టుకొని యింటికి రాగా కొందరు తల్లిదండ్రు లాతనికి చికిత్స చేయించుటకు మారు శాపనార్థముల నొసంగుట ప్రారంభింతురు. కాని యిట్టి సంఘటనలు సర్వసాధారణముగ సంభవింపవని మాకు తెలియును. ఇయ్యవి కేవలము పశుప్రవృత్తులు. కొన్ని జంతువులు తమలో బలహీనములును, రోగగ్రస్తములునగు జంతువులను కోపావేశముచే చంపివేయును. ఇట్టి ప్రవర్తన యుపాయాస్యమే కావచ్చును. కాని కొన్ని కుటుంబములలో నిట్టి పనులనుదినమును జరుగుచుండును. చిన్నబిడ్డ దేహములో అస్వస్థతగా నున్న కారణమున మారాము చేయునప్పుడు కొందరు తల్లిదండ్రులు ఆ బిడ్డను చెంప వాయగొట్టుదురు. తమ పసిపాపలు నడచునప్పుడు నేలపై పడిపోగా, కొందరు తల్లులాగ్రహపడి, బిడ్డలను తిట్టుచు మోటతనముగా వారిని లేవనెత్తుచుండుట మీలో నెందరో చూచియుందురు. ముక్కుపై కోపముగల యిట్టి తల్లులకును వారి బిడ్డలకును భావిజీవితమందు నిరంతర కలహములు సంభవించుటలో నాశ్చర్యమేమి? కొందరు తండ్రులు తమ బిడ్డలను చప్పుడు చేయవద్దని మిక్కిలి కఠినస్వరముతో శాసించుచుందురు. ఇట్టి తండ్రులలో తోటి మానవులయెడల నుండవలసిన సానుభూతి మాకు కానరాదు. మనము తరచుగ చిన్నబిడ్డలను నల్లరి

చేయకుండ కూర్చుండు డని యాజ్ఞాపించుచుందుము. చురుకు తనముగల ప్రతి బిడ్డకును ఈ నిర్బంధము చికాకు కల్గించి తీరును. రైలుబండిలో ప్రయాణము చేయుచున్నప్పుడు బాలురను కిటికీలోనుండి తొంగి చూడవలదని మనము తరచు ఆంక్ష పెట్టుచుందుము. బుద్ధిమంతులైన పిల్లవాండ్రు నూతన జ్ఞానమును సంపాదించుటయందు మన మీ విధముగ నిరోధ ములు కల్పించుచున్నామని యెరుంగవలెను. పై విధముగ వర్తించు పెద్దలును, తల్లిదండ్రులును తమ బిడ్డల యెడల సంపూర్ణమగు సానుభూతిని ప్రదర్శించుట లేదని నిస్సంశయ ముగ తెలుపనగును. బాలురకు చక్కని నైతికశిక్షణ నొసం గుటలో మనకు గల యవరోధములు కొంతవరకు తల్లిదం డ్రుల వలనను, కొంతవరకు చిన్నబిడ్డల వలనను కల్గుచున్నవి. తల్లిదండ్రులయందలి సుగుణ దుర్గుణములు రెండును కూడ వంశపారంపర్యముగ బిడ్డలకు సంక్రమించునని శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. మన ప్రాపంచిక జ్ఞానమును, మన సామె తలు మున్నగునవియు కూడ యంశమునే తెల్పుచున్నవి. కావున పసిబిడ్డలలో నుండు లోపములు తల్లిదండ్రుల లోప ములకు ప్రతిరూపములు. కాని తల్లిదండ్రుల గుణదోషములు యథాతథముగ బిడ్డలకు సంక్రమించునని తెల్పుటకు వలను పడదు. మన వంశములోని అతిప్రాచీనుల గుణావగుణములు కూడ మనలో ప్రవేశించి మన స్వభావమునందు సంకీర్ణతను కల్గించును. కావున తల్లిదండ్రులకును బిడ్డలకును గల సామ్యము

స్థూలమైనదికాని కేవల ప్రతిబింబరూప మగునది కాదు. సామాన్యులగు తల్లిదండ్రులలో పెక్కు లోపము లుండును. దుష్ట ప్రవృత్తులు నెలకొని యుండును. వారు వాని నణచు కొనుటకై ప్రయత్నింతురు. ముఖ్యముగ నా లోపము లితరు లకు కన్పింపకుండుటకై వారు ప్రయత్నింతురు. బహుశః ఆ లోపము లితర సద్గుణములచే కప్పబడిపోవచ్చును. కాని ఆ యవగుణము లుండుటలో నెంతమాత్రమును సందేహము లేదు. ఈ కారణముచే పసిబిడ్డల కాదర్శప్రాయముగు క్రమ శిక్షణ నొసంగుట అసాధ్యవిషయము. మన కుత్తమోత్తము లగు తల్లిదండ్రులు లభింపజాలరు.

బాలుర కుత్తమోత్తమమగు క్రమశిక్షణ నొసంగుట కవసరమగు పద్ధతులను మనము కనుగొనగల్గితిమని భావింపుడు; తల్లిదండ్రులు ఈ క్రమశిక్షణా విధానము నాచరణ యందిడుట కావశ్యకమగు పరేంగితజ్ఞానమును, సానుభూతిని, ఆత్మనిగ్రహమును సంపాదించుకొని రని తలంపుడు ; కాని అట్టి పరిస్థితిలోకూడ కుటుంబనిర్వహణవిధానమును సంపూర్ణముగ సంస్కరించుటకు వలనుపడదు. ఏలనన జీవితసంస్కరణ మన్నిరంగములందును ఒకే పర్యాయము సాగవలయును. విద్యావిధానము వలన మనము సాధింపదలచిన లక్ష్యము లెట్టివి ? బాలకుడు పెరిగి పెద్దవాడైన తరువాత నాతడు జీవితరంగమునందు జయప్రదముగ మెలగగల్గునట్లు ఆతనికి తర్ఫీదునిచ్చుట మన యాశయము. మానవుడు తనతోటి

వారితో చక్కగ మెలగుచు, తన పనులను కూడ కొన సాగించుకొనుచుండవలెనని మన యుద్దేశ్యము. ప్రపంచ ములో సుఖముగ జీవితయాత్రను నడుపదలచిన ప్రతి మానవు డును, ఈ నాటి ప్రపంచధర్మముల కనుగుణ్యముగ వర్తిం చుట మిక్కిలి ముఖ్యము. (ఇచ్చట మేము ధన సంపాదనను గూర్చి ప్రసంగించుటలేదు. కుటుంబనిర్వహణ కావశ్యకమగు జ్ఞానమును గూర్చి మేము చర్చించుచున్నాము.) ఆదర్శ ప్రాయమగు మన నైతికశిక్షణావిధానము వలన మన మొక యాదర్శవ్యక్తిని తర్ఫీదుచేసినామని తలంపుడు కాని ఆవ్యక్తి నేటి మన నిత్యజీవితమునందు సుఖముగ కాలక్షేపముచేయ గల్గునా? ఆతని ఋజుప్రవర్తనమును, ఆతని యున్నతాదర్శ ములును ఆతని సుఖజీవితమునకు ప్రతిబంధకములగును. ఆతని జీవితము దుర్భరమైపోవును. మన ఆదర్శ విద్యావిధానము వలన కొందరు వ్యక్తులకు చాల లాభము కలుగవచ్చును. కాని సమాజమునకుగాని, భావితరములవారికిగాని దీనివలన నెట్టి సత్ఫలమును చేకూరదు. ఇట్టి విద్యావిధాన మించుమించు నిరర్థకమేకదా! కుటుంబమునందును, జాతియందును నెలకొని యుండు ప్రభుత్వములో మానవసామాన్యములో గల గుణావ గుణములు ప్రతిఫలింపక తీరదు. ఒక కుటుంబములోనివారు కాని ఒక జాతివారు కాని యెట్టియోగ్యత కల్గియుందురో, అట్టి యోగ్యతయే కుటుంబముయొక్కయు, జాతియొక్కయు పరిపాలనానిర్వహణమునందు కాననగును. ఈ రెండింటి యం

డును కూడ వ్యక్తులయోగ్యత హెచ్చినకొలదియు పరిపాలనా విధానములోని స్థాయికూడ హెచ్చును. సామాన్య మాన వుని యంగలి యోగ్యతను పెంపుచెందించకుండ, మన కార్యనిర్వహణ విధానములలో నుదాత్తతను నెలకొల్పవలె నని యత్నించినచో దానివలన మంచిఫలితములు కల్గుటకు మాఱుగ దుష్ఫలితములు సంభవించును. మన ప్రస్తుతసమాజ వ్యవస్థయందు బాలబాలికలు తమ తల్లిదండ్రులయొక్కయు, ఉపాధ్యాయుల యొక్కయు కఠినప్రవర్తనకు గురి యగు చున్నారు. ముందు జీవితరంగమునందు వారెదుర్కొనవలసిన కాఠిన్య, కర్కశత్వములకీ కఠినప్రవర్తన వారిని సంసిద్ధుల కావించుచున్నట్లు మనము భావింపనగును. తల్లిదండ్రులును ఉపాధ్యాయులును బాల్యావస్థయందు బాలబాలికలను సంపూర్ణమగు సానుభూతితోను, న్యాయపరతతోడను పెంచినపక్షమున, ఆ బాలబాలికలు జీవితరంగమును ప్రవేశించిన వెనుక, అచ్చట నెలకొనియున్న స్వార్థపరత్వము మున్నగు దుర్గుణముల వలన మిక్కిలి బాధపడిపోవుదురు. ఇయ్యది ఒక పక్షమువారి వాదము.

"ఎట్టి నైతిక విద్యావిధానమును చిన్న బిడ్డల నాదర్శప్రాయులుగ చేయజాలదనియు, ఒకవేళ ఇట్టి ఆదర్శ విద్యావిధానమును మనము సిద్ధము చేయగల్గినను, అనేక లోపములు గల నేటి తల్లిదండ్రులు ఆ విద్యావిధానము నమలు కావింపజాలరనియు, ఈ ఆదర్శవిద్యావిధానమును కష్టము మీద

మన మాచరణయం దిడినను, అయ్యది నేటి దేశకాలపాత్ర
ముల కెంత మాత్రమును తగియుండదనియు, మీరు వాదించు
చున్నారు కదా! అట్లైన పక్షమున నేటి విద్యావిధానము
మార్చుట సాధ్యము కాదనియు, సాధ్యమైనను వాంఛనీయ
ము కాదనియు మీ వాదనయందలి యర్థమా?" అని కొందరు
మమ్ము ప్రశ్నచేయవచ్చును. కాని మా యుద్దేశ్య మది కాదు.
కుటుంబ నిర్వహణమునందు జరుగు మార్పులతో పాటు ఇతర
ములగు మార్పులుకూడ జరుగవలయునని మా యభిప్రా
యము. శిక్షణావిధానము నందలి పద్ధతులు క్రమ క్రమ
ముగా మాత్రమే మారవలెనని మా వాదము. బాలుర యం
దును బాలుర తల్లిదండ్రుల యందును, సమాజమునందును
కూడ నేడు కొన్ని గుణదోషము లున్నవి. జనసామాన్యము
యొక్క గుణగణములు వృద్ధిచెందినప్పుడే మన లక్ష్యములు
సాధించుట కనువుపడును. కావున ఆదర్శప్రాయములును,
ఉదాత్తములును అగు సిద్ధాంతముల నాచరణయం దుంచు
నప్పుడు ప్రస్తుతమానవుల స్వభావాదులగూర్చి చింతించి,
తదనుగుణమగు కొన్ని మార్పులు చేయకతప్పదు.

"కుటుంబమునందలి పసిబిడ్డలు మొన్నగువారి క్రమ
శిక్షణకొరకై ఆదర్శప్రాయ మగు విధానములను నిర్ణయింప
బూనుట నిరర్థకము. ప్రస్తుతకాలపు టవసరములకు మించిన
విద్యాపద్ధతులను వివరించుటయు, వాని కనుకూలముగ
వాదించుటయును కూడ నిరర్థకమే." అని కొందరు విమర్శ

కులు వ్రాక్రుచ్చవచ్చును. కాని ఈ సాధనము గాక సమంజ
సము కాదని మా యభిప్రాయము. సాంఘిక పరిపాలన
యందు ప్రస్తుత పరిస్థితులలో నా యభిప్రాయములు [illegible]
లాచరణయోగ్యము కాకపోవచ్చును. కాని సత్యమైన విధాన
మేదియో తెలిసికొనిన యెడల మనము ముందుముందు దానిని
సమీపించుటకై యిప్పటినుండియు ప్రయత్నములు సేయ
వచ్చును. లేనియెడల మనము తప్పుత్రోవలను ద్రొక్కు
ప్రమాదము కలదు. అదే విధముగ కుటుంబ పరిపాలనలో
కూడ మన యాదర్శ మేదియో స్పష్టముగ తెలిసికొనవలెను.
ఆదర్శము తెలిసిననాడు మనము క్రమక్రమముగ దానిని
సమీపించుటకై యత్నింపవచ్చును. ఆదర్శముల దృష్టియం
దుంచుకొనినందువలన మన కెట్టి నష్టమును సంభవింప నేరదు.
మానవులు వస్తుతః పూర్వాచారపరాయణులుగ నుందురు.
కావున సంఘమునందు మార్పులు మిక్కిలి తొందరగ సంభ
వించునేమో యని మనము భయపడనక్కర లేదు. ప్రకృతి
యందలి యొక ఉన్నతదశ సహజము కానంతవరకును మానవు
లా దశను చేరజాలరు. ఉన్నత స్థితి వారికి ధ్యేయముగ
మాత్ర ముండిపోవును. వా రా స్థితియందు ప్రవేశింపజాలరు.
సత్యవిషయము మనకు గోచరించినను, దాని నాచరణయం
దిడుటలో చాల ఆటంకములు కల్గును. కావున నెంతటి
మానవహితైషులకును, తత్త్వజ్ఞులకునుకూడ ఈ యాటంక
ముల తొలగించునంతటి యోపిక యుండుట కష్టసాధ్యము.

కావున మనము పసిబిడ్డలకు విద్య నేర్పు సందర్భమున నేవో
అసాధ్యములగు నాదర్శములవెంట పరుగులెత్తెడి ప్రమాద
మెంతమాత్రమును లేదు. ఏలనన బాలబాలికలను క్రమ
శిక్షణకు లోనుకావించుట సహజముగ చాలకష్టమైన పని.

ఉపోద్ఘాతపూర్వకమగు నీ చర్చ ముగిసిన వెనుక, బాల
బాలికల నైతికశిక్షణయందు మన కెట్టి ఆదర్శము లుండవల
యునో, వానిని సాధించుట కెట్టి మార్గము లవలంబింపవలెనో
యోజింతము. మొట్టమొదట మేము ఈ విషయమునకు
సంబంధించిన కొన్ని సామాన్యసూత్రములను చర్చింపదలచి
నారము. వీనిని పాఠకమహాశయు లోపికతో చిత్తగింతురు
గాత! ఆ పైన కుటుంబనిర్వాహణమునందు అనుదినము
నుత్పన్నమగు సమస్యలను తల్లిదండ్రు లే విధముగా పరిష్క-
రింపవలెనో చూపుటకై మేము ఉదాహరణల నొసంగెదము.

ఒకబిడ్డ పరుగెత్తుచు క్రింద పడిపోయినను, లేక ఏదైన
బల్లతో డీకొని తలకు గట్టిదెబ్బ కొట్టుకొనినను, ఆ యంశము
నా బిడ్డ చక్కగ జ్ఞప్తియం దుంచుకొని ముందుముందు
జాగ్రత్తగ నుండగలదు. ఇట్టి యనుభవములే మరల మరల
సంభవించిన పక్షమున ఆ బిడ్డకు చక్కని గుణపాఠము లభిం
చుటయు, ఆటపాటలలో నా బిడ్డ జాగ్రత్తగ మెలగనేర్చు
టయు సంభవించును. చిన్నబిడ్డ యేదైన వేడిలోహమును
ముట్టుకొనినను, లేక దీపపు మంటలో చేయి దూర్చినను,
లేక మసలుచున్న నీటి నొడలిపై పారపోసికొనినను ఒడలు

కాలి బొబ్బ లెక్కును. ఈ యనుభవమును బిడ్డ సులభముగ మరువజాలదు. ఇట్టి యనుభవములే రెండుమూడు పర్యాయములు సంభవించిన పక్షమున, ఒకరు చెప్పవలసిన యవసరము లేకుండ తనంత తానే ఆ బిడ్డ ప్రకృతిసూత్రముల కనుగుణముగ వర్తించుట కలవాటుపడును.

మేము చూపబోవు నంశములలో నైతికవిద్యకు సంబంధించిన శాస్త్రీయాంశములు, ఆచరణయు నిమిడియున్నవి. విమర్శనాదృష్టి లేనివారి కీ యంశములు మిక్కిలి సామాన్యమైనవిగ కాన్పింపవచ్చును. కాని వానిని చక్కగ పరిశీలించిన పక్షమున నం దెంతయో విశేషము కాన్పింపగలదు.

శారీరక విషయములలో మన మేదైన నొక ముఖ్యసూత్రము నుల్లంఘించిన పక్షమున తక్షణమే ఏదో యొక గాయము రూపమున దానికి తగిన శిక్ష తప్పక మనకు లభించును. ఇచ్చట నియమోల్లంఘనము, తత్ఫలితమును మిక్కిలి సులభమగు రూపములో మనకు కానవచ్చుచున్నవి. శారీరికమగు బాధయు, కష్టమును ఫలితముగా గల కార్యజాలమును మాత్రమే సామాన్యమానవుడు దుష్కార్యములుగ భావించుచున్నాడు. అట్లుకానివి సత్కర్మలుగ పరిగణింపబడుచున్నవి. శారీరకమగు సుఖదుఃఖములు కాక ఇతర ఫలితములు గల పనులనుకూడ మనము మంచివానిగను, చెడ్డవానిగను విభజింపవచ్చును. ఏదైన నొక పనివలన తక్షణమందును, భావియందును కూడ సత్ఫలితములు సంభవించిన పక్షమున నా

కార్యములు సత్కార్యము లనియు, దుష్ఫలితములు కల్గినచో
నవి దుష్కార్యము లనియు నైతికసిద్ధాంతములు శాసించు
చున్నవి. దీనికి మూల మేదియో మాత్రము తెలియరాదు.
మానవప్రవర్తననుకూడ, దానివలన కల్గు మంచిచెడ్డల పరిణా
మములచే సంఘము మంచిదనియో చెడ్డదనియో నిర్ణయించు
చున్నది. త్రాగుబోతుదనము చెడ్డదని మనము భావించు
చున్నాము. త్రాగుబోతులు తమ దేహారోగ్యమును చెడగొట్టు
కొని, నీతిబాహ్యములగు ననేక చెడ్డయలవాట్లకు లోనగు
చుండుటచే మన మిట్లు పల్కుచున్నాము. దొంగతనము
వలన దొంగకును, సొమ్ము నష్టపడినవానికిని కూడ సంతో
షమే లభించినపక్షమున దొంగతనము పాపకార్యముగ పరి
గణింపబడుట యెన్నడును తటస్థింపదు. సోదర మానవుల
యెడ ప్రేమతో మనము చేయు కార్యకలాపముల వలన
మానవులకు దుఃఖము సంప్రాప్తించినపక్షమున మన మట్టి
పనులను ఖండింతుము. వానిని సత్కార్యములని మన మెంత
మాత్రమును ప్రశంసింపము. శాసనసభలు, రాజకీయోద్య
మములు, సంఘ పునర్నిర్మాణోద్యమములు, వ్యక్తుల కార్య
కలాపములు మున్నగునవి సమాజమునకు సౌఖ్యము కల్గిం
చునా లేక హాని కల్గించునా యను విషయమును వార్తాపత్రి
కలును, ఇతర పెద్దలును కూడ ఎల్లప్పుడును విమర్శ చేయు
దురు. ఈ విధముగనే సమాజము మనముచేయు పనులలోని
మంచిచెడ్డలను నిర్ణయించుచున్నది. ఇతర విషయములలో

వలెనే శారీరక విషయములలోకూడ సంభవించునట్టి ఫలిత ములవలన కొన్ని పనులు మంచివనియు, మరికొన్ని కావనియు మనము నిర్ణయము కావించుచున్నాము.

శారీరక ధర్మముల నుల్లంఘింపకుండునట్లు సేయుటకై పెద్దలు పిన్నల కొసంగు శిక్షలయొక్క లక్షణముల గూర్చి యించుక చింతింపుడు. ఇచ్చట మేము శిక్ష యను పదమును వాడినాము కాని ఆ పదము సమంజసమైనది కాకపోవచ్చును. శిక్ష యను పదముచే మేము సూచించిన కార్యవిశేషము మానవుని దేహసౌఖ్యమునకు అననుకూలమగు పనులు చేయ కుండ నాపుదలచేయుటకై యేర్పడిన నిరోధకకృత్యములే కాని వేరుకావు. ఇయ్యవి నిజమునకు మనకు శ్రేయస్కర ములు. ఇట్టి నిరోధకములు లేనిపక్షమున దేహమున కెన్నియో గాయములు తగిలి తుద కది జీర్ణించిపోవును. ఈ శిక్షలయం దొక విశేషము కలదు. కొన్ని చెడ్డపనులు చేసినపక్షమున నిట్టి దుష్ఫలితములు సంభవించునని ఇవి సూచించుచున్నవి. పసిబిడ్డచేయు పనుల కివి అనివార్యఫలితములని మన మెరుంగ వలయును.

ఈ సందర్భములో మరియొక ముఖ్యమగు నంశమును జ్ఞప్తియం దుంచుకొనవలెను. మనకు లభించు శిక్ష మన ముల్లంఘించిన ధర్మమున కనుగుణ్యముగ నుండును. చిన్న తప్పుచేసినచో చిన్న శిక్షయు, పెద్ద తప్పుచేసినచో పెద్ద శిక్షయు లభించును. చిన్నపిల్లవాడు నడచుచు పొరపాటు

వలన గుమ్మము తగిలి పడిపోయినట్లు భావింపుము. అప్పు డాతనికి కొలదిపాటి గాయము తగులును. బిడ్డ ముందుముందు చాల జాగ్రత్త వహించునట్లుగా చేయుటకై ప్రకృతిమాత ఆతని యీ చిన్న తప్పునకు ఫలితముగ పెద్ద శిక్షను విధింపదు. బాలుడు స్వానుభవమువలన నేది పెద్దతప్పో, ఏది చిన్నతప్పో తెలిసికొనగల్గును.

మరియొక విశేషము. చిన్నబిడ్డ ఏదైన నొక చెడుపని చేసినయెడల దానివలన నిర్ణీతమగు దుష్ఫలితము కల్గును. అయ్యది నిస్సంశయముగ సంభవించును. వానినుండి తప్పించు కొనుట కెంతమాత్రమును అవకాశము లేదు. ప్రకృతి బెద రింపులతో నూరకుండదు. విధింపదగిన శిక్షను కఠినముగ, నెట్టిమాట పల్కు లేకుండ విధించి తీరును. ఒక చిన్నబిడ్డ గుండుసూదిని తనచేతిలో గ్రుచ్చుకొన్నయెడల తక్షణమే బాధ కల్గును. ఆ బిడ్డ ఆ పనినే మరల చేసినచో మరల బాధ కల్గును. ఇట్లు ఎన్నిపర్యాయములు గుండుసూదిని చేతిలో గ్రుచ్చుకొనిన అన్నిమారులును బాధకల్గి తీరును. జడప్రకృతి తో సంబంధించినంతవరకు ఇట్టి శిక్ష సక్రమముగ కల్గితీరును. క్షమార్పణవల్లను, ప్రార్థనలవల్లను ఇచ్చట ఏమియును లాభ ముండదు. ప్రకృతియొసంగు శిక్ష మిక్కిలి కఠినమైనది. కాని మనకు లాభదాయకమైనది. పసిబిడ్డ ఈ యంశమును కాల క్రమమున గ్రహించి, ప్రకృతి ధర్మముల నుల్లంఘింపకుండ జాగ్రత్తపడును.

ఈ సామాన్య ధర్మములలో మరియొక విశేషముకూడ కలదు. ఈ ధర్మములు మానవుని బాల్యావస్థకును, ప్రౌఢావస్థకును సమానముగ వర్తించును. స్వానుభవమువలన సంపాదించిన యిట్టి జ్ఞానమువలననే స్త్రీపురుషులు తప్పుపనులు చేయకుండ తప్పించుకొనగల్గుదురు. ఇంటివద్ద ఎట్టి విద్యావిధానము లేనప్పుడును, "ఈ పనులు చేయవచ్చును, ఈ పనులు చేయరాదు" అని తెల్పుటకై తల్లిదండ్రులుకాని గురువులుకాని లేనప్పుడును, మానవుడు స్వబుద్ధిచేతనే తనున్తా నొక క్రమశిక్షకు లోనుకావించుకొనును. బాలకుడు పెరిగి యౌవనావస్థయందు ప్రవేశించిన తరువాత ఏ విధమగు పనిపాటలును లేకుండ వ్యర్థముగ కాలము పుచ్చినను, లేక తన ధర్మములను అశ్రద్ధగకాని, తెలివితక్కువగకాని నిర్వర్తించినను దాని సహజమగు ప్రతిఫల మనతికాలములో నాతనికి కల్గితీరును. అతడు తన యుద్యోగమును కోల్పోయి దారిద్ర్యము ననుభవింపవలసి వచ్చును. అదే విధముగ తన కార్యాలయమునకుగాని, స్నేహితులవద్దకుగాని సకాలమునకు పోవు సదభ్యాసమును వృద్ధిపొందించుకొనని యాతని కనేకములైన ఇబ్బందులును, నష్టములును, అసౌఖ్యములును కల్గితీరును. ఒక వర్తకుడు తన కొనుబడిదారులవద్ద హెచ్చు మూల్యమును తీసికొనుట ప్రారంభించినచో అనతికాలములో ఆతని వ్యాపారము క్షీణించును. ఇయ్యది ఆతని యత్యాశకు నిరోధకము. అదే విధముగ ఒక వైద్యునివద్దకు పెక్కురు

రోగులు పోకుండినయెడల ఆతడు తగినంత శ్రద్ధతో పని చేయుచుండుట లేదని స్పష్టమగును. అందరిని నమ్మి అప్పు లిచ్చువాడును, జూదమువంటి వ్యాపారములలో పాల్గొనిన వర్తకుడును, చాల కష్టములకు లోనై, ఆ మీదట తొందర పడి యెట్టి పనియు చేయకూడదనియు, వ్యాపారములో చాల జాగ్రత్త నుండవలయు ననియు తెలిసికొందురు. ఈ విషయ ములు ప్రతి పౌరుని జీవితమునకును వర్తించును. "చేతులు కాలిన బాలుడు నిప్పును చూచి భయపడును." అని ఆంగ్ల మున నొక సామెత కలదు. దీనియందు రెండు ముఖ్యాంశ ములు మనకు ద్యోతకమగుచున్నవి. ప్రకృతిమాత మన కొసంగు క్రమశిక్షణమందును, సాంఘికముగ మనకు లభించు క్రమశిక్షణయందును ఎంతో సామ్యము కలదు. ఇట్టి క్రమ శిక్షణ మనకు చాల లాభదాయక మను విషయముకూడ ఇం దంగీకరింపబడుచున్నది. దుఃఖభూయిష్ఠములగు స్వాను భవములవలన తా మీవరకు అవలంబించుచున్న చెడ్డపద్ధతు లను విడిచిపెట్టినట్లుగ పలువురు మనతో నిత్యమును చెప్పు చుందురు. ఒకానొక పురుషుడు తనవద్దగల ధనమును విచ్చల విడిగ వ్యయము చేయుచున్నాడని తలంపుడు. అట్టివాని కెవ్వరెన్ని హితబోధలు కావించినను ప్రయోజనముండదు. కష్టములు బాగుగా నాటిన తరువాత కాని ఆతనికి జ్ఞానము రాదు. మూర్ఖత్వమునకు ప్రతిఫలమైన అనివార్యమగు కష్ట పరంపర ననుభవించిన తరువాత కాని మూర్ఖత సడలజాల

దని యిందువలన తేలుచున్నది. దుష్కృత్యములకు ప్రకృతి సిద్ధముగ లభించు శిక్షయే మిక్కిలి ప్రయోజనకారియైన దనియు, మానవనిర్మితమగు శిక్షావిధానము దీని స్థానమున నెలకొల్పుటకు వీలులేదనియు చెప్పవచ్చును. మన శిక్షాస్మృతియందలి శిక్షలవలన నేరములు రూపుమాయక పోవుటయే దీనికి తార్కాణము. నేరముల నరికట్టు నిమిత్తమై మనము సిద్ధపరచి అమలు కావించుచున్న శిక్షాస్మృతుల వలన, మనము కోరుచున్న సత్ఫలితము లెంతమాత్రమును కల్గుటలేదు. మనము విధించుచున్న శిక్షలు కృత్రిమమైనవి. కావున మానవ స్వభావమును సంస్కరించుటకు మారుగ నయ్యవి దుష్టప్రవృత్తుల నింకను బలపరచుచున్నవి. ప్రభుత్వేతర వ్యక్తులచే నెలకొల్పబడిన శిక్షణాకేంద్రములలో నేరస్థులను చక్కదిద్దుటకై మంచి యవకాశములు కావింపబడుచున్నవి. ఇచ్చట శిక్షావిధానము ప్రకృతిశిక్షావిధానమునకు మిక్కిలి చేరువగనుండును. దుష్కార్యములు చేయుటవలన కల్గు సహజమగు దుష్ఫలితములే ఇచ్చటి జనులకు లభించు శిక్ష. ఈ శిక్షణా కేంద్రములలో దోషియగు వాని స్వాతంత్ర్యము కొంతవరకు సంకుచితము కావింపబడును. ఆతడు తన పరిసరములందలి స్థితిగతుల గుర్తించి ఆత్మనిగ్రహముతో కాలముపుచ్చవలయు నని ఆతనికి ఆజ్ఞ ఈయబడును. దోషియగువాడు తన స్వాతంత్ర్యమును దుర్వినియోగము చేసి సంఘమునకు హానికల్గింపకుండ చేయుటకే ఈ

నిర్బంధములు కావింపబడినవి. మేము పైన తెల్పిన అంశ ములవలన రెండు ముఖ్యవిషయములు తేలుచున్నవి. పిన్న వారికి మనము వర్తింపజేయు క్రమశిక్షణా విధానము పెద్ద వారికి కూడ చక్కగ వర్తించును. దీని వలన మంచి ఫలిత ములు కల్గును. దోషులగు వారిని సంస్కరించుటకై మాన వులు నిర్మించు శిక్షావిధానము, ప్రకృతియొక్క శిక్షావిధా నమున కనుగుణ్యముగ నున్నపక్షమున అయ్యది ఫలవంత మగును. లేనిచో అది నిరర్ధకమగును.

నైతికవిద్యావిధానమునకు మూలసూత్రముగ నుండ దగిన యంశమును మన మిప్పుడు కనుగొన్నారము. ఈ విధా నము మానవుని శైశవావస్థయందును, ప్రౌఢదశయందును కూడ ఉపయోగకారి యని ఋజువైనది. అట్టి సందర్భ మున నీ పద్ధతి మానవుని బాల్యదశయందు మాత్ర మేల లాభదాయకముగ నుండజాలదు ? తల్లిదండ్రులు తమ బిడ్డ లకు ప్రకృతిధర్మములను చక్కగ నేర్పించి, ఆ ధర్మములను వారిచే ననుష్ఠింపజేయవలసినవారు. కావున బిడ్డలు చేయు నట్టి పనులకు ప్రకృతిసిద్ధములును, అనివార్యములును అగు ఫలితములు కల్గునట్లు చూచుట కూడ తల్లిదండ్రుల ధర్మము. బాలుడు చేసిన పనివలన కల్గుఫలితముల నిరోధించుట కాని, లేక వానిని పెంపుదలచేయుటకాని, లేక నిజమైన ఫలితముల స్థానమున కృత్రిమఫలితముల చూపుటకాని తల్లిదండ్రులు చేయరాదు. నిష్పక్షపాతబుద్ధిగల పాఠకులెల్లరును ఈ విధా నము నంగీకరింపగలరు.

మా యుద్దేశ్యములను వినిన తరువాత పాఠకులలో కొందర ిట్లు వాదింపవచ్చును. "ఇప్పుడుకూడ తల్లిదండ్రు లలో పలువు రీ విధానమునే అవలంబించుచున్నారు. తప్పుడు పనులు చేసిన బాలబాలికల కిప్పుడుకూడ ప్రకృతిసహజము లగు శిక్షలే లభించుచున్నవి. బిడ్డలు కావించిన నియమో ల్లంఘనమునకు ఫలితముగ తల్లిదండ్రులు నేడు వారిని చీవాట్లు పెట్టి దండించుచున్నారు. నైతికముగను, శారీరకముగాను బాలు డనుభవించు బాధ ఆతడు కావించిన దుష్కృత్య ముల ఫలితముకాదా?" ఈ వాదనయందు కొంత నిజము లేకపోలేదు. తల్లిదండ్రులకు కల్గు నాగ్రహము బిడ్డలు కావిం చిన యకృత్యములకు ప్రతిఫలమనుట నిర్వివాదాంశము. బిడ్డలు కూడనిపనులు చేసినప్పుడు తండ్రులు మిక్కిలి కోప గించి యొకప్పుడు బెదరింతురు. లేదా రెండు దెబ్బలు కొట్టు దురు. బాలురు చేసిన నేరమున కిది ఫలితమనుట కెట్టి సంశ యమును లేదు. కొంతవరకు ఈ శిక్షలు ప్రకృతిసహజము లగు శిక్షలని మే మంగీకరింతుము. కాని కొన్ని పరిస్థితులలో మాత్రమే యిట్టి శిక్షలను సక్రమమైనవానినిగ మే మంగీక రింపగలము. తల్లిదండ్రులలో తగినంత నిగ్రహశక్తి లేనప్పు డును, బిడ్డలు హద్దు మీరిపోయినప్పుడును ఈ విధానము సరి యైనదే కావచ్చును. సమాజములోని తండ్రులలో నధిక సంఖ్యాకులు నిగ్రహశక్తిలేనివా రైనచో నిట్టి పద్ధతులు వాడక తీరదు. సమాజమునందలి మానవులలో కల యోగ్య

తల ననుసరించియే వారి విద్యావిధానములును, రాజకీయాది సంస్థలును ఏర్పడునని మే మీవరకే తెల్పియున్నాము. అనాగరకులగు తల్లిదండ్రుల బిడ్డలు అనాగరకులుగనే ఉందురు. అట్టి బిడ్డలయెడ వారి తల్లిదండ్రు లనాగరకములగు పద్ధతుల నుపయోగించుట సహజవిషయము. తల్లిదండ్రులు విధించునట్టి క్రూరశిక్షల ననుభవించుట అట్టి బిడ్డలకు లాభదాయకమని తెలుపనగును. అనతికాలములో వా రొక అనాగరకసంఘమునందలి పౌరులుగ మారిపోవుదురు. అట్టివారికీ క్రూరపద్ధతులు జీవితనాటకమునకు నాంది వంటివి. నాగరకులగు ప్రజలు ఇందులకు విరుద్ధముగ వర్తింతురు. వారు తమ యసంతుష్టిని వెలిబుచ్చుటకై సౌమ్యములగు మార్గముల నవలంబింతురు. ఇది వారికి సహజ విషయము. వారి బిడ్డలు సహజముగ సత్ప్రవర్తనము కల్గియుందురు. కావున నా బిడ్డల కీ శిక్షలు చాలును. అందువలన తల్లిదండ్రులు తప్పుడుపనులు చేసిన తమ బిడ్డలను శిక్షించుటయందు సహజమగు పద్ధతులనే అవలంబించుచున్నా రని తెలుపవచ్చును. కుటుంబ నిర్వాహణమునందు సద్విధానము లవలంబింపబడుటలో ప్రకృతికూడ మనకు తోడ్పడుచున్నది.

ఇచ్చట రెండు ముఖ్య విషయముల గమనింపుడు. ఇప్పుడు మన మొక సంధికాలములో నివసించుచున్నాము. పాతక్రొత్త సిద్ధాంతములకును, ఆచరణలకును ఇప్పుడు నిరంతర సంఘర్షణ సాగుచున్నది. ఇట్టి సమయములో మన

మవలంబించు విద్యాపద్ధతులకును కాలమానపరిస్థితులకును వైరుధ్య మేర్పడుట కెంతయైన అవకాశమున్నది. పూర్వా చారపరాయణుల మూర్ఖవాదములకు చెవి యొగ్గి, కొందరు తల్లిదండ్రులు తమ బిడ్డలను కఠినశిక్షలకు గురికావింతురు. ఇట్టి పద్ధతులు తల్లిదండ్రులకు మనస్కరింపవు. వాని వలన దుష్ఫలితములు కూడ సంభవించును. మరికొందరు తల్లి దండ్రు లత్యుత్తమవిధానముల నవలంబింపవలెనను పేరాసచే నిందులకు పూర్తిగ విరుద్ధములగు పద్ధతుల నవలంబింతురు. మరియొక ముఖ్యవిషయమును కూడ మనము గమనింపవలెను. చిన్నబిడ్డలకు లభింపవలసిన క్రమశిక్షణ తల్లిదండ్రుల నిగ్ర హానుగ్రహములవలన లభించునట్టిదికాదు. తల్లిదండ్రు లీ విషయములలో జోక్యము కల్గించుకొనినను, కల్గించుకొనక పోయినను, వారు తమ యిష్టా నిష్టములను ప్రకటించినను, ప్రకటించకపోయినను, బాలురు కావించిన పనులవలన కొన్ని ఫలితము లనివార్యముగ, తుట్టతుదకు కల్గితీరును. ఈ ఫలిత ముల యనుభవమే బాలబాలికలకు క్రమశిక్షణ నిచ్చుటలో ముఖ్యవిభాగము. బాలబాలికలు కావించిన మంచి పనుల కును చెడుపనులకును తగు ఫలితములను నేడు తల్లిదండ్రులు కల్గించుచున్నారు. ఇచ్చట వారు ప్రకృతిమాత స్థానము నాక్రమించుటకై యత్నము సేయుచున్నారు. కాని తల్లి దండ్రుల శిక్ష లేక బహుమానము ననునవి లాభదాయక మును, సన్మార్గబోధకమును అగు ఫలితముల కల్గింపజాలవు.

ఆ లాభములను మనము ప్రకృతిమాత వలన మాత్రమే పొందగలము. ఇప్పుడు మేము కొన్ని ఉదాహరణల ద్వారా మాయుద్దేశ్యముల విశదీకరింపదలచినారము. వీని వలన ప్రకృతిసిద్ధమగు శిక్షయన నేమియో, కృత్రిమములగు శిక్షలనగా నేమియో తెలియువచ్చును. నిత్యజీవితమున కుప యోగకరములగు మరికొన్ని సూచనలు కూడ ఇం దిమిడి యుండును.

పిల్లలున్న ప్రతియింటి యందును కూడ వస్తువులు చిందరవందరగ పడిపోవుట సహజము. తల్లులును, ఇంటి లోని సేవకులును కూడ దీనిని బిడ్డలయల్లరి యని వర్ణింతురు. చిన్నబిడ్డలు తమ బొమ్మల పెట్టెలను తీసికొని ఆడుకొనిన తరువాత బొమ్మల నచ్చటచ్చట దిగవిడిచి పోవుదురు. తల్లియో తండ్రియో మనసుపడి తెచ్చిన పూలను బిడ్డలు క్షణ కాలములో త్రుంచి ప్రోవులుపెట్టుదురు. చిన్నచిన్న ఆడు బిడ్డలు తమ బొమ్మలకొరకై దుస్తులను సిద్ధము చేయుచు గదినిండ గుడ్డపీలికలు చిమ్మివేయుదురు. కాని ఇట్టి చెడ్డ అలవాట్లను మాన్పు విషయములో సరియైన పద్ధతులను మన మవలంబించుట లేదు, ఇట్టి అల్లరిపనులు చిన్నబిడ్డలకై ప్రత్యేకింపబడిన గదులలో జరిగినచో దాది పిల్లలపై విసుగు కొనుచు వివిధవస్తువులను చక్కగ నమర్చును. ఆఫీసు గదు లలో నిట్టి యల్లరిపనులు సాగినచో ఇంటిలోని పెద్దపిల్లలు కాని, ఇంటిదాసికాని ఆ స్థలమును చక్కబరచవలసివచ్చును.

కాని నిజముగ అల్లరిచేసిన బిడ్డలకు రెండుచీవాట్లు తప్ప మరేమియు శిక్ష లభింపదు. కొందరు బుద్ధిమంతు లిట్టి సందర్భములలో సక్రమములగు పద్ధతుల నవలంబించి, ఆ బిడ్డలచేతనే బొమ్మల నన్నిటిని పెట్టెలలో పెట్టింతురు. బట్టపీలికల నన్నిటిని ఏరునట్లు చేయుదురు. వస్తువులను చిందరవందరగ పారవేయుట వలన వానిని చక్కగ మరల అమర్చవలసిన శ్రమ యనెడి ఫలితము కల్గుచున్నది. ప్రతివ్యాపారస్తునికిని అతని దుకాణమునందును, ప్రతి ఇల్లాలికిని తన యింటి యందును ఇట్టి అనుభవము నిత్యమును కల్గుచుండును. భావిజీవితమునకై మానవుని సంసిద్ధుని చేయుటయే విద్య యొక్క ముఖ్యలక్ష్యములలో నొక్కటి యని మనము అంగీకరించుచున్నాము. కనుక తాము చేయుపనుల ప్రతి ఫలమును తామే యనుభవింపవలెనను సంగతిని బాలురు చిన్ననాటినుండియు తెలిసికొనవలెను. బాలునికి మొట్టమొదటి నుండియు ఈయబడిన నైతికశిక్షణ లోపభూయిష్ఠ మైన యెడల, మనము ఆతని (బాలకుని) పనులకు ప్రకృతిసహజ మగు పరిణామములను కలుగజేసినపక్షమున నాతడు (బాలకుడు) తిరుగుబాటు చేయవచ్చును. అట్టి సందర్భములో ఆతని అవిధేయతవలన సంభవించు దుష్ఫలితముల కా బాలుని పాత్రుని చేయవలెను. బాలుడు తన యాటవస్తువుల నింటినిండ చిందరవందరగ పారవేసియు, ఇంటినిండ బట్టతునకలను వెదజల్లియు, వానిని మరల జమచేయుభారమును మరియొకరి

పై త్రోసినాడు. అందువలన ఆ బాలుడు ముందుముందు ఇతరుల కిట్టి అసౌకర్యమును కల్గించు నవకాశము నాతని కీయ రాదు. మరియొక పర్యాయ మాబిడ్డ తన బొమ్మల పెట్టె నీయవలసినదని యడిగినప్పుడు తల్లి యిట్లు సమాధాన మీయ వలెను. "క్రిందటి పర్యాయము నీకు బొమ్మల పెట్టె నిచ్చి నప్పుడు నీవు బొమ్మల నన్నిటిని అచ్చటచ్చట పారవైచి నావు. వానిని జానకి ఏరి జాగ్రత్తపెట్టవలసివచ్చెను. ప్రతి దినము నీవు బొమ్మల నీవిధముగ నెచ్చట తోచిన నచ్చట పారవేయుచున్నచో వానినన్నిటిని జమచేసి మరల తీసికొని వచ్చుటకు జానకికి నిత్యమును తీరిక యుండదు. నే నా పని చేయలేను. నీవు ఆటలు ముగియగానే బొమ్మలను జాగ్రత్త పెట్టుకొనవు కావున నీకు బొమ్మలను ఇచ్చుటకు వీలులేదు." ఇది చిన్నబిడ్డ చేసినపనికి సరియైన ప్రతిఫలము. ఇందు సహజ మగు శిక్షలో హెచ్చుతగ్గులు కావింపబడలేదు. ఈ యంశ మును చిన్నబిడ్డ యెరుంగవలెను. బాలిక కత్యంతము బాధ కలుగు సందర్భములోనే శిక్ష విధింపబడును. క్రొత్తగ తన మనస్సులో జనించిన కోరిక తీర్చబడునని బాలిక యూహిం చుచున్న సందర్భములో ఆమె యాశ నిరాశ యగును. అప్పుడు మనస్సునకు గాఢముగ నొప్పి తగులును. ఆ నొప్పి ఆబిడ్డ భావిచర్యలను ప్రభావితము కావించును. ఇట్టి ప్రభా వమే మరలమరల మనస్సుపై పడినచో బాలికలో గల లోపములు సవరణ యగుటకు సావకాశ మేర్పడును. ఈవిధా

నమువలన బాలిక సకాలమందొక ముఖ్యమగు పాఠమును నేర్చుకొనును: ప్రపంచములో కష్టపడకుండ యెట్టి సుఖమును లభింప దను విషయమును బాలిక తెలిసికొనును.

మరియొక యుదాహరణమును గైకొందము. మా యెరుకలో కనకసుందరి యను నొక బాలిక యుండెడిది. ఆమె నిత్యమును తన యింటివారితో వాహ్యాళికి పోయెడిది. కాని యెన్నడునుకూడ ఆమె సకాలమునకు సిద్ధముగా నుండని కారణమున ఆమెకు నిత్యమును చివాట్లు సిద్ధించుచుండెడివి. కనకసుందరి ప్రతియంశము నందును మిక్కిలి కుతూహలము గలది. ఆమె యే పనిని చేకొనిన దానియందే నిమగ్నురాలై పోవుచుండును. కావున యింటిలోనివా రందరును వాహ్యాళికి పోవుటకై సిద్ధపడువరకును ఆమె తన పనిపాటలను మానెడిది కాదు. ఇంటిలోని ఇతర బాలబాలికలును, ఉపాధ్యాయినియు నిత్యమును కనకసుందరికొరకై వేచియుండవలసి వచ్చెడిది. తల్లి యామెను నిత్యమును తప్పకుండ చీవాట్లు పెట్టుచుండెడిది. కాని యీ మందలింపువలన యెంతమాత్రమును లాభము లేకపోయినను, కనకసుందరికి ప్రకృతిసహజమగు శిక్షను విధింపవలెనని తల్లి కెన్నడును తోచలేదు. ఇతరు లిట్లు చేయవలసినదిగా తల్లికి సలహా నిచ్చిరి. కాని దానివలన లాభము లేకపోయెను. సకాలమున పనులు చేయని యెడల మన కనేకనష్టములు సంభవించును. మనము పోవదలచిన రైలు దాటిపోవచ్చును; స్టీమరు అప్పుడే రేవునుండి

బయలుదేరి యుండుట తటస్థించును; మార్కెట్టులోని తాజా కూరలన్నిటిని ఇతరులు కొనివేసి యుందురు; లేదా నీవు పోయిన నాటకముహాలులోని మంచిసీట్లు అన్నిటిని ఇతరులు ఆక్రమించి యుందురు. ఇట్టి అననుకూలతలు సంభవింపకుండుటకొరకే మన మందరమును కూడ మన పనులను సకాలమున నెరవేర్చుచుందుము. పై యంశము వలన మన కొక నీతిపాఠము లభించుచున్నది. తనకు సంభవింపబోవు అననుకూలతను గుర్తించియే చిన్నబిడ్డలుకూడ వర్తింపవలెను. కనకసుందరి వాహ్యాళికి పోవు సమయము వచ్చుసరికి సిద్ధముగా నుండనిపక్షమున నామె యింటివద్దనే ఉండిపోవలెను. షికారుకు పోవుటకై ఆమె కవకాశము లభింపకూడదు. ఈ విధముగ నొకటి రెండు పర్యాయము లామె యింటివద్దనే దిగబడిపోయిన యెడలను, తన తోటి పిల్లలు హాయిగ ఊరి వెలుపల ఆడుకొనుచున్నప్పుడు తన కా యవకాశము లభింపకపోయిన యెడలను కనకసుందరి స్వభావములో మార్పు సంభవించుట కవకాశము కల్గును. తనకు మిక్కిలి ప్రీతికరమైన వాహ్యాళి తన అలసతవలన లేకుండ పోయినదని ఆమె గ్రహించును. ఏది యెట్లున్నను మేము సూచించిన పద్ధతివలన మంచి ఫలితములు సిద్ధించుట కెక్కుడు అవకాశము కలదు. అట్లుకాక నిత్యమును బిడ్డలను చీవాట్లు పెట్టుచుండినపక్షమున వారు మొండికెత్తిపోవుటయే కాని మరెట్టి ఫలితమును కలుగదు.

అదే విధముగ మిక్కిలి నిర్లక్ష్యస్వభావము కల కొం దరు పిల్లలు తమ యాటబొమ్మలను తరచు పోగొట్టుకొందురు. లేదా పగులగొట్టుదురు. దీని కొక్కటియే సరియైన శిక్ష యని మా నమ్మకము. పోయిన బొమ్మలు వారికి మరల ఈయ రాదు. జ్ఞానము వచ్చినవారి కీ యంశము బాగుగా తెలి యును. కావున వారు తమ వస్తువుల విషయమై యెక్కుడు శ్రద్ధ పూనుదురు. ఏదైన నొక వస్తువు పోయినచో దాని కొరత మనల మిక్కిలి బాధించును. దానిని మరల కొనవలె నన్నచో సొమ్ము వ్యయమగును. ఈ రెండు కారణముల వలనను పెద్దవారు తమతమ వస్తువులను జాగ్రత్తగ వాడు కొందురు. బిడ్డల యొక్క అనుభవములు కూడ ఇంచుమించు ఇట్టివిగానే ఉండవలయును. ఇప్పుడు మేము సూచించు కాలము శైశవావస్థకాదు. శైశవదశయందు చిన్నబిడ్డలు తమ చేతికందిన ప్రతివస్తువును తునకలు తునకలుగ చేసి పారవేసి ఆ వస్తువుల లక్షణముల కన్గొనజూతురు. ఈ కాలమునందు అజాగ్రత్తవలన కల్గు దుష్ఫలితముల నా బిడ్డ లింకను పూర్తిగ గ్రహింపజాలరు. కాని బిడ్డలు కొంత యెదిగిన తరువాత ప్రత్యేకముగ తమకు కొన్నివస్తువులుండుట యనగా నేమి యో దానివలన లాభము లేమియో గ్రహింపజాలుదురు. ఈడు వచ్చిన పిల్లవానికి తనకు ప్రత్యేకముగ నొక చాకు ఉండుటవలన లాభ మేమియో తెలియును. అట్టివాడు తన చాకును మోటపనులకై వాడి దానిని విరుగగొట్టినను, లేక

యొక్కడనో డొంకలలో తిరుగుచు బెత్తములను కోసికొనిన మీాదట చాకు నచ్చుటనే మరచిపోయిన యెడలను, తల్లిదండ్రులును, బంధువులును అతిగారాబముచేత వానికి తక్షణమే మరియొక చాకును కొని యిత్తురు. ఇట్లు చేయుటవలన బాలుని కొక చక్కని నీతిపాఠము లభించు నవకాశము పోవుచున్నదని వారు గుర్తింపరు. ఇట్టి సందర్భములలో తండ్రి కుమారుని పిలచి, "సొమ్ము వెచ్చించినకాని చాకు లభింపదు. కష్టపడినకాని సొమ్మును సంపాదింపజాలము. నిత్యమును నీవు చాకులను విరుగగొట్టుటయో, లేక పారవేయుటయో చేయుచున్నయెడల నేను నీకు క్రొత్త చాకులను తెచ్చి ఈయజాలను. నీవు ఇప్పటికంటె ఎక్కువ శ్రద్ధగ నీ వస్తువులను జాగ్రత్తపరచుకొనుచున్నట్టు నాకు నమ్మకము కుదిరిన తరువాత కాని పోయిన చాకుకు మారుగ మరియొకదానిని నీ కీయజాలను." అని స్పష్టముగ తెలుపవలెను. సొమ్ము ఖర్చుచేయు విషయములో కూడ నిట్టి క్రమశిక్షణనే బాలుర కొసంగుట చాల యావశ్యకము.

మేము మీా కిప్పుడు చూపిన యుదాహరణలు చాల సులభమైనవి కావున వానిని మేము గైకొన్నారము. ప్రకృతిసిద్ధమగు శిక్షలును, కృత్రిమము లగు శిక్షలును అనగా నేమియో మేము అందు చూపినారము. సహజమగు శిక్షలు మాత్రమే ఉపయోగకరము లని కూడ మేము వాదించుచున్నాము. కాని నేడు మనలో పలువురు కృత్రిమమగు శిక్షావిధాన

మునే అవలంబించుచున్నారు. మేము నిర్వచించిన సూత్రము నందలి సూక్ష్మములను, ఉన్నతతర ప్రయోజనములను విస్తరించుటకు పూర్వము, మా సూత్రమునందలి ప్రాశస్త్యమును చాలకుటుంబములలో అనుభవపూర్వకముగ నెట్లు ప్రజలు తెలిసికొనుచున్నారో పరిశీలించెదము.

మాచే నిర్వచింపబడిన సూత్రము ననుసరించిన పక్షమున కార్యకారణసంబంధముల గూర్చిన చక్కని జ్ఞాన మేర్పడును. పునః పునః ఇట్టి యనుభవములు సంభవించిన పక్షమున కార్యకారణభావములు సంపూర్ణముగను, విస్పష్టముగను ప్రజలకు తెలియవచ్చును. మనము చేయు పనులవలన కల్గు లాభనష్టములను స్వయముగ గుర్తించిననాడు మన ప్రవర్తన సక్రమముగ నుండును. కేవల మితరులు చెప్పిన మాటలను మనము నమ్ముచు వచ్చినచో మన ప్రవర్తన యంత నిర్దుష్టముగ నుండజాలదు. వస్తువులను చిందర వందరగ పారవేసిన పక్షమున వానిని మరల చక్కగ జమ చేయవలసిన కష్టము తనకు కల్గుననియు, సకాలమునకు తాను సిద్ధము కాని పక్షమున తనకు లభింపవలసిన యానందము లభింపదనియు, వస్తువుల నశ్రద్ధగ పారవైచినచో మిక్కిలి ఉపయోగకరములగు వస్తువులు తనకు లేకుండ పోవుననియు గ్రహించిన పిల్లవాడు తన పనులవలనకల్గు దుష్టపరిణామముల చక్కగ తెలిసికొనుటయే కాక కార్యకారణముల సంబంధమును బాగుగా అవగాహన చేసికొనును. పెరిగి పెద్దవా

మైన మీదట భావిజీవితమునం దాతని కిట్టి యనుభవములే కల్గిస్తును. ఒక పిల్లవాడేదైన నొక తప్పుపని చేసినప్పుడు తల్లిదండ్రు లాతనిని చీవాట్లు పెట్టికాని, లేక సందర్భము లేని మరియేదో శిక్ష నొసంగి ఊరకుండిన గాని రెండు విధము లగు నష్టములు సంభవించును. బాలు డీ విధమగు శిక్షల నెంత మాత్రమును లక్ష్యముచేయడు. మంచిపనులు, చెడ్డ పనుల వలనకల్గు పరిణామము లెట్టివో తెలిసికొను సదవకాశ మాతనికి లభింపకుండ పోవును. నిశితబుద్ధికలవా రందరును కూడ కృత్రిమమగు శిక్షలను విధించుటవలన కల్గు నష్టము లను చాల కాలమునకు పూర్వమే కన్గొనియున్నారు. చేయు బడిన చెడ్డపనికి సరియగు శిక్షను విధించుటకు మారుగ చీవాట్లు పెట్టుటకాని లేక ఇతర పద్ధతుల నవలంబించుట కాని చేసినచో సరియైన నైతికప్రమాణము లేర్పడవు. ఏదైన చేయకూడని పనిచేసిన పక్షమున తల్లిదండ్రుల యొక్కయు, ఉపాధ్యాయుని యొక్కయు ఆగ్రహమునకు గురికావలసివచ్చునను నొక భావము మాత్రమే విద్యార్థి యొక్క శైశవమందును, బాల్యావస్థయందును సర్వసాధా రణముగ నేర్పడు చున్నది. కావున తప్పుడు పనులకును, తల్లిదండ్రుల యాగ్రహమునకును ఆతడు కార్యకారణసంబం ధమును కల్పించుకొనుచున్నాడు. పిల్లవాడు పెరిగి సంప్రా ప్తవయస్కుడైనతరువాత ఆతనికి భయకారణమగు తల్లి దండ్రుల యొక్కయు, ఉపాధ్యాయుల యొక్కయు అధి

కారము తొలగిపోవును. అప్పుడు తప్పుడు పనులు చేయుటపై గల నిర్బంధములు కూడ చాలవరకు మాయమగును. చెడ్డపనుల వలన కల్గు సహజమగు దుష్పరిణామములను ఆతడు స్వానుభవమువలన తెలిసికొనవలసివచ్చును. ఇట్టి శిక్షావిధానమునందు గల లోపములను స్వానుభవము వలన తెలిసికొనిన యొకడు రీట్లు తెల్పుచున్నారు. "పాఠశాలల నుండి వెలువడిన యువకులందరును, అందును ముఖ్యముగ తల్లిదండ్రుల చెప్పుచేతలలో మెలగనివారు అన్నివిధము లగు దురభ్యాసములకును లోనగుదురు. సమాజములో ఎట్లు నడచుకొనవలయునో వారికి తెలియదు. సత్ప్రవర్తన యన నెట్టిదో వారెరుంగరు. వారి జీవితమునకు నైతికములగు పునాదులుండవు. ప్రపంచానుభవముచే సుశిక్షితు లగువర కును వారు సంఘమునకు ప్రమాద కారణముగ పరిణ మింతురు."

ప్రకృతిసిద్ధమగు క్రమశిక్షణయందు మరియొక మంచి లక్షణము కలదు. అది మిక్కిలి న్యాయబద్ధమైనది. బాలురు కూడ ఈ యంశము నంగీకరింతురు. తాను చేసిన చెడ్డపనికి సరియగు ప్రతిఫలమైన శిక్ష ననుభవించిన బాలుడు తన కన్యాయము జరగినదని యెన్నడును తలంపడు. కృత్రిమ మగు శిక్ష ననుభవించిన బాలుని భావములు వేరుగ నుం డును. ఈ విషయము పిన్నలకును పెద్దలకును సమానముగ వర్తించును. తన దుస్తుల విషయమై యెంతమాత్రమును

శ్రద్ధ వహింపని యొక బాలుని యుదాహరణమును గైకొనుడు. అతడు చెట్లను పుట్లను ఎక్కుచుండును. తన దుస్తులపై దుమ్ము, మట్టి పడినను ఆతడు లక్ష్యము చేయడు. అట్టి పిల్ల వానిని బాగుగా కొట్టినను, ఆతని కన్నము పెట్టుట మాని వేసినను, తన కేదో అన్యాయము జరిగినట్లాతడు భావించును. ఆ బాలుడు తనకు విధింపబడిన శిక్షనుగూర్చి యాగ్రహపడునే కాని, తాను చేసిన చెడుపనులను గూర్చి యాలోచింపడు. అట్టి బాలుని శిక్షించుటకు మారుగ ఆతడు చేసిన తప్పులను సవరించుకొనవలసినదిగా — అనగా మురికి బట్టలను ఉతుకు కొనుమనియో, చినిగిపోయిన బట్టలను తన చేతనైనట్లుగా కుట్టుకొనుమనియో మన మాతని నాజ్ఞాపించితిమని భావింపుడు. అప్పుడాతడు తాను పడుచున్న కష్టము స్వయం కృతాపరాధజన్యమని గుర్తించునుకదా! శిక్ష ననుభవించు చున్నంతకాలమును ఆతడు తాను చేసిన చెడు పనికిని, తా ననుభవించుచున్న శిక్షకును గల కార్యకారణ సంబంధమును గూర్చి యాలోచించుచునే యుండును. ఆతని కెంత యాగ్రహము కల్గినను, తా ననుభవించుచున్న శిక్ష న్యాయమైనదే యను భావ మాతని కించుమించుగ కల్గును. బాలుడు తన తప్పును గ్రహింపక తరచు తన దుస్తులను చించుకొనుచుండిన పక్షమున తండ్రి ప్రకృతిసహజమగు శిక్షణావిధానము ననుసరించి, మరల నిర్ణీతకాలము వచ్చువరకును ఆ బాలునికి క్రొత్త దుస్తులను కుట్టించి ఈయరాదు. ఈ నడుమ కాలమున పండుగ

పబ్బములును కాని, పొరుగూరికి ప్రయాణములు కాని సంభ వించిన పక్షమున సరియైన దుస్తులు లేనికారణమున బాలుడు వానియందు ఇతరులతోపాటు పాల్గొని ఆనందమును పొంద జాలడు. అప్పుడు తనకు కల్గిన శిక్ష కాతడు చాల చింత పడు ననుట తథ్యమేకాని తో స్త్రోడనే ఆత డా శిక్షకు కారణమును తెలిసికొని, అది తన యశ్రద్ధమూలముననే సంభవించినదని తప్పక గుర్తించును. ఈ విషయమును గుర్తించిన తర్వాత, తన అకార్యమునకును శిక్షకును గల సంబంధమును గ్రహించి, తన కన్యాయము జరిగిన దను భ్రమ నాతడు విడచిపెట్టును.

ఇట్టి శిక్షణా విధానము నవలంబించుట వలన తల్లిదం డ్రుల యొక్కయు బిడ్డలయొక్కయు మనస్సులలో చాల తక్కున యశాంతి కల్గును. బిడ్డలు చేసిన తప్పుపనుల వలన సహజముగ వారికి సంభవించు కష్టనష్టములకు మారుగ తల్లి దండ్రులు కృత్రిమములగు శిక్షలను వారికి విధించినపక్షమున రెండు విధములగు నష్టములు సంభవించును. బిడ్డలు కావించు చెడుగులను నివారించుటకై ప్రతి కుటుంబమువారును కొన్ని ప్రత్యేక నియమములను కావించుకొనవలసివచ్చును. ఈ నియ మము లాచరణయం దిడుటలో తమ గౌరవమును, హోదా యును ఇమిడియున్నట్లును, వాని నతిక్రమించుట తమ కగౌ రవ మనియు తల్లిదండ్రులు భావింప గడంగుదురు. నియమో ల్లంఘనము వారి కాగ్రహకారణ మగును. బిడ్డలు చేసిన తప్పుపనులను సరిదిద్దుటకై తల్లిదండ్రులు శారీరికముగ శ్రమ

పడవలసి వచ్చును. అదనపుఖర్చులకు లోనుకావలసివచ్చును. ఇందువలన వారి మనస్సునకు విశేషము క్లేశము సంభవించును. నిజమున కీ ఫలితముల ననుభవింపవలసినవారు చెడు పనులు చేసిన బిడ్డలే. కృత్రిమ శిక్షావిధానమువలన నష్టమునకు గురియగువారు తల్లిదండ్రు లొక్కరేకారు. అకృత్యములకు ప్రతిఫలముగ సంభవించు శిక్షలు మనకు వ్యక్తుల మూలముగ కాక ప్రకృతిమాత వలన లభించును. అందువలన మనకు కల్గు చికాకు తాత్కాలికముగను, స్వల్పముగను ఉండును. కాని తల్లిదండ్రులు స్వయముగ విధించిన శిక్షలు వ్యక్తుల మూలముగ సంభవించిన కారణమున బాలబాలికలకవి యెక్కుడు బాధ కల్గించును. ఆ శిక్షను వారు చాల దినముల వరకును మరువజాలరు. లోపభూయిష్ఠమగు నీ శిక్షావిధానమును మొట్టమొదట నుండియు అవలంబించినచో కల్గు దుష్ఫలితముల గూర్చి యించుక యోచింపుడు. అజ్ఞానము వలనను, అనుభవ శూన్యతవలనను బిడ్డలు చెడుపనులు చేసినప్పుడు, తత్ఫలితములను బిడ్డలకు చెందనీయకుండ తల్లిదండ్రులే యనుభవించినారని తలంపుడు. ఈ శిక్షలను ఒకవంక తా మనుభవించుచు, వేరొకవంక ఆ బిడ్డలు చేసిన అకృత్యములు వారికి (బిడ్డలకు) తెలియవచ్చుటకొరకై తల్లిదండ్రులు మరికొన్ని ప్రతిఫలములను వారి కంద జేయుచున్నారని యూహింపుడు. ఒకబిడ్డ మరగుచున్న నీరుకల యొక గిన్నెను కదలించి, ఆ నీటిని తన కాలిపై యొలుకబోసికొన

బోవునప్పుడు తల్లి యిష్టపడి ఆ నీటిని తన కాలిపై పడునట్లు చేసినట్లు భావింపుడు. అప్పు డామె కాలు బొబ్బలెక్కును. బిడ్డచేసిన చిలిపిపనికి ప్రతిఫలముగ తల్లి యొకదెబ్బ నా బిడ్డకు ప్రసాదించును. ఇదే విధముగ నిత్యము అన్ని యంశములలోను జరుగుచుండునని యూహింపుడు. అనుదినమును ఇట్టి సంఘటనలే జరుగుచుండినచో ఇరుపక్షములకును నానాటికిని కోపము హెచ్చిపోవును. ఇరువురును కూడ ఎల్లప్పుడును చీకాకు పడుచుండుట సంభవించును. బాలుర చిన్నతనమం దే శిక్షణా పద్ధతుల నవలంబింతురో, ఆ పద్ధతులనే బాలురు పెరిగి పెద్దవారగుచున్నప్పుడు కూడ తల్లిదండ్రులు ఉపయోగింతురు. పిల్లవాడు బుద్ధిపూర్వకముగ తన చెల్లెలి యాటబొమ్మను పగులగొట్టినప్పుడు తండ్రి కుమారుని రెండు దెబ్బలువైచి, కుమార్తె కొరకై తన సొమ్ము వెచ్చించి మరల ఆట బొమ్మను కొనును. ఇప్పుడు తండ్రి యేమిచేయుచున్నాడు? కుమారుడు చేసిన అకృత్యము వలన కల్గు సహజ ప్రతిఫలమును తా ననుభవించి, ఆతనికి కృత్రిమమగు శిక్షను విధించుచున్నాడు. ఇందువలన తండ్రి కొడుకు లిరువురకును కూడ అకారణముగ కోపావేశము కల్గుట తటస్థించును. ఇందులకు మారు పగిలిపోయిన బొమ్మను పిల్లవాడు తనవద్దకల సొమ్ము నుండి కొని ఈయవలసినదిగా తండ్రి నిర్ణయించినాడని భావింపుడు, అప్పు డిరువురకును కూడ తక్కువ మనస్తాపము కల్గును. పగిలిపోయిన ఆటబొమ్మను బాలుడు తన సొమ్ముతో

కొని ఈయవలెననియు, పైఖర్చులకై ప్రతిమాసమును ఆతనికి ఈయబడు సొమ్ములోనుండి బొమ్మఖరీదు మినహా యింపబడుననియు, తండ్రి నిర్ణయము చేసినచో తండ్రికిని కుమారునకును కూడ విశేషము ఆగ్రహము రాదు. జేబు ఖర్చులకై లభించుసొమ్ము తగ్గిపోయిన తరువాత కుమారుని మనస్సున కాప్రతిఫలము బాగుగా నాటగలదు. తనకు సంభవించిన శిక్ష న్యాయమైనదేయని యాతడు గుర్తింప జాలును. ప్రకృతి సహజములగుశిక్షల నందజేయు శిక్షణా విధానము మన మనస్సున కావేశము కల్గింపదు. దీనికి రెండు కారణములు: విధింపబడినశిక్ష న్యాయమైనదని మనము గుర్తింతుము. శిక్షవిధించునది పరోక్షమగు ప్రకృతికాని ప్రత్యక్షముగనున్న తల్లిదండ్రులుకారు.

మేము సూచించిన విధానమువలన మరియొక సత్ఫలితము కూడ కల్గితీరును. ఇప్పుడు తల్లిదండ్రులకును బిడ్డలకును పైమనస్యమునకు తక్కువయవకాశ ముండును. వారి సంబంధములు స్నేహపూర్వకములై యుండును. కావున తల్లిదండ్రులమాటలు బిడ్డలచెవి కెక్కుటకు మంచి వాతావరణ మేర్పడును. ఆగ్రహ మే కారణమువలన కల్గినను, ఎవ్వరి మూలముగ కల్గినను అది నష్టదాయకము. అందును ముఖ్యముగ తండ్రి కుమారుల కొండొరులపై కోపము వచ్చినచో అది యింకను నష్టహేతువు. కోపమువలన అన్యోన్యానురాగ బంధము క్షీణించును. అనురాగబంధము లేనినాడు వారి

కొండొరుల మాట యందు విలువ యుండదు. భావముల కును ఇష్టానిష్టములకును సన్నిహితసంబంధము కలదు. బాలురును, వృద్ధులును కూడ తమ కనిష్టహేతువులగు భావ ములతో సంబంధముగల యర్థములయెడ వైముఖ్యము వహింతురు. లేక ఒకానొకప్పుడు మన మొక వ్యక్తినికాని పదార్థమును కాని మిక్కిలి యభిమానముతో చూచినను, దానివలన మనకు బాధకల్గిననాడు, ఆ బాధయొక్క తీవ్ర తను బట్టి మన యభిమానబంధము కూడ సడలిపోవును. తల్లిదండ్రులు తమ బిడ్డలను తరచుగ కొట్టుచు, నిందించుచు నున్న పక్షమున వారికిని వారి సంతానమునకును సహజముగ నుండవలసిన యనురాగము క్షీణించును. బిడ్డ లెల్లప్పుడును అవిధేయులుగను, అసంతృప్తులుగను ఉన్నపక్షమున కొంత కాలమునకు తల్లిదండ్రులకు వారిపై విసువు జనించును. విసువు మరికొంత కాలమున కసహ్యతగ మారవచ్చును. కావున నిత్యమును తన్నుశిక్షించు తండ్రి యెడల కుమారు డలక్ష్యము చూపును. లేదా ఆత డనిన నసహ్యించుకొనును. ఇట్టి యుదా హరణముల నెన్నియైన చూపవచ్చును. అదే విధముగ తమ ప్రారబ్ధవశమున తమకు దుష్టసంతానము కల్గినదని బాధపడు తల్లిదండ్రులు కూడ అనేకు లుందురు. పై పద్ధతుల నవలం బించుటవలన తల్లిదండ్రులకును, బిడ్డలకును వైమనస్యము సంభ వించుననియు, అట్టి వైమనస్యమువలన మన నైతికజీవనము నకు తీరని యపకృతి కల్గుననియు యెల్లవారును గుర్తింప

జాలుదురు. కావున తల్లిదండ్రులు సాధ్యమైనంతవరకు బిడ్డలతో విరోధము సంభవించునట్టి కార్యములను చేయరాదు. వారు మేము ప్రతిపాదించిన ప్రకృతిసహజమగు శిక్షణా విధానము నవలంబించుట చాల అవసరము. అప్పుడు వారు దండవిధాయులుగ నుండవలసిన ఆవశ్యకత తొలగిపోవును. వారికిని వారి సంతానమునకును ఒండొరుల యెడ వైరభావ ముండుటకు అవసరము లేకుండపోవును.

అత్యంత సహజమగు పరిణామముల మాత్రమే కలుగ జేయునట్టి ఈ ప్రకృతిశిక్షణావిధానము దైవనిర్మితమని కూడ మా విశ్వాసము. ఈ విధానము బాల్యమునందును యౌవనమునందే కాక కౌమారావస్థయందు సైతము చాల ఉపకారి కాగలదు. ఈ శిక్షణావిధానములో నీ క్రింది మంచి లక్షణములు కలవు: మానవుడు తాను చేసిన పనులవలన కల్గు సత్ఫలితములను, దుష్పరిణామములను స్వానుభవముచే గుర్తించి, సత్కార్యములేవియో, దుష్కార్యము లేవియో తెలిసికొనగల్గును. బాలుని కేదైన బాధకాని నొప్పికాని కల్గినచో అది తాను చేసిన తప్పుపని వలననే సంభవించిన దనియు, ఆ శిక్ష న్యాయమైనదేయనియు, ఆతడు గ్రహించును. తనకు కల్గిన శిక్ష న్యాయమైనదని యెరుంగుట వలనను, శిక్ష ప్రకృతి శక్తుల మూలమున సంభవించుటవలనను, అందు వ్యక్తుల కెట్టిజోక్యమును లేక పోవుటవలనను, బాలుని కాగ్రహము కల్గుటకు అవకాశ ముండదు. ఈ సందర్భములో

తండ్రి స్వయముగ కుమారు నేవిధముగను శిక్షింపక తట స్థముగ నుండి పోవును. కావున ఆతని కెట్టి చికాకును కలు గదు. తండ్రికిని, కుమారునకును, అన్యోన్యవైషమ్యములు తొలగిపోవుటచే వారి సంబంధములు స్నేహార్ద్రములును, ప్రేమపూర్వకములుగను పరిణమించును. తండ్రి పల్కులు కుమారునిపై నెక్కుడు ప్రభావమును చూపగల్గును.

"ఎవ్వరైనను మిక్కిలి చెడ్డగ ప్రవర్తించిన పక్షమున నేమి చేయవలయును? ఉదాహరణమునకు ఒక బాలుడు చిన్న దొంగతనమును చేసినచో మన మీ శిక్షణావిధానము ననుసరించి యేమి చేయవలసి యుండును? అబద్ధము పల్కి నను, చెల్లెలిని కాని తమ్ముని కాని బాలుడు బాధించిన యెడలను మన మేమి చేయవలెను!" అని కొందరు ప్రశ్నింపవచ్చును.

పై ప్రశ్నలకు సమాధాన మిచ్చుటకు పూర్వము పరిస్థితుల యాదార్థ్యమును విశదీకరింపగల కొన్ని యంశముల పరామర్శింతము.

మా మిత్రుడొకడు తన బావ యింటిలో నివసించుచు, తన మేనల్లునికిని, మేనకోడలికిని విద్యను నేర్పు బాధ్యతను వహించెను. విద్యను నేర్పుటలో నాతడు మేము వర్ణించిన విధానమునే అవలంబించెను. కాని అందులకు మూల మాతడు విషయములను సవిమర్శముగ నాలోచించుట వలన కాదు. బిడ్డల యెడ నాతనికి గల సహజమగు సానుభూతియే అందు

లకు హేతువు. ఇంటిలో నున్నంతకాలమును ఆ బిడ్డ లాతనికి శిష్యులు. బయటికి పోయినప్పుడు వారాతనికి మిత్రులు. ఆతడు నిత్యమును వాహ్యాళికి పోయినప్పుడు వారాతని ననుసరించు చుండెడివారు. ఆతడు ,రకరకములగు మొక్కలను వెదకు చున్నప్పుడు వారాతనికి తోడ్పడెడివారు. ఆతడు వానిని పరీక్షించుచున్నప్పు డా బిడ్డలు తాము కూడ ఆ మొక్క లను జాగ్రత్తగ పరీక్షించెడివారు. ఈ విధముగ మేనమామ సాంగత్యము వలన వారికి వినోదమును, విజ్ఞానమును కూడ లభించుచుండెడివి. ఒక విధమున ఆ మేనమామ ఆ బిడ్డలకు మాతాపితరుల స్థానము నాక్రమించెనని చెప్పవచ్చును. ఈ యంశముల నన్నిటిని మా కొకనాడు వర్ణించి చెప్పి, ఆత డీ క్రింది విశేషములను కూడ తెల్పెను. ఒకనాడు సాయం కాలము మేనమామకు ఇంటిలోని మరియొక భాగములో నున్న ఒకానొక వస్తువు కావలసి వచ్చెను. ఆతడు దానిని తేవలసినదిగా తన మేనల్లునితో చెప్పెను. అప్పుడు ఆ పిల్ల వాడు ఏదో ఆటలాడుకొనుచున్నందువలన, మేనమామ చెప్పిన పని చేయుటకు నిరాకరించెననియో, లేక అనిష్టత చూపెననియో మాకు జ్ఞాపకము. మేనమామకు బాలుని నిర్బంధము చేయుట ఇష్టము లేనందువలన తానే స్వయ ముగ పోయి ఆ వస్తువును తెచ్చికొనెను. మేనల్లుని అవిధే యతవలన తనకు కల్గిన చికాకును ఆతడు తన చర్యలలో మాత్రము చూపెను. ఆ నాటి రాత్రి మేనల్లుడు యథా

ప్రకారముగ మామతో ముచ్చటించుటకై పోయినప్పుడు మామ వానియెడ విముఖతను చూపెను. తన మనస్సులో సహజముగ కల్గిన అసంతుష్టి నాతడు ప్రకటించెను. ఈ విధముగ మేనమామ మేనల్లుని కాతడు చూపిన ప్రవర్తనవలన కల్గుఫలితము తెలియజేసెను. ఆ మరునాటి ఉదయము మేనమామ లేచుసరికి మేనల్లుడు వేడిసీటిని తీసికొనిపోయి ఆయన కందిచ్చెను. మామగది సంతను కలయజూచి "మామయ్యా! మీకు మీ బూట్లు కావలెను కాబోలు" అని పల్కుచు పిల్లవాడు శీఘ్రముగా మేడమెట్లు దిగి వానిని తెచ్చుటకై పరుగెత్తెను. ఈ విధముగను, లేదితర విధములుగను, ఆ బాలుడు తన పశ్చాత్తాపమును ప్రకటించెను. తాను చేయుటకు నిరాకరించిన పనికి మారుగ ఇతరములగు సేవలను పెక్కింటిని మేనమామ కాతడు కావించెను. ఆతనియందలి సచ్ఛీలము దుర్గుణములను పూర్తిగ నణచి వేయగల్గెను. ఈ విధముగ బాలు డొక నైతికశక్తిని సంపాదింపగల్గెను. తన మేనమామ స్నేహానుభూతులు కోల్పోవుటయన నేమియో తెలిసికొనినందున, ఆ బాలు డా యభిమానమునకై తొల్లింటికంటె విశేషముగ పాటుపడసాగెను.

నేను వర్ణించుచున్న ఈ పెద్దమనుష్యుడు (మేనమామ) బిడ్డలతండ్రి యైనాడు. ఆ బిడ్డల నైతికశిక్షణ విషయమై ఆత డీవిధానమునే అవలంబించుచున్నాడు. దాని

వలన చక్కని ఫలితములు కల్గుచున్నవి. ఆత డెల్లప్పుడును తన బిడ్డలకు మిత్రునివలె వర్తించును. సాయంకాలము తండ్రి యింటిలో నుండును కనుక ఆ సాయంకాల మెప్పుడు వచ్చునా యని బిడ్డ లెదురు చూచుచుందురు. ఆదివారమునాడు దిన మంతయు తండ్రి యింటిలోనే ఉండిపోవును కావున వారి కమితానందము కల్గును. ఈ విధముగ తండ్రియందు బిడ్డల కమిత విశ్వాసమును, ప్రేమయు కలవు. కావున తండ్రికి వారిపై చాల పలుకుబడి యేర్పడినది. బిడ్డలు చేసిన పనుల యెడ తన సంతుష్టిని కాని, అసంతుష్టినికాని ప్రకటించి తండ్రి వారి నదుపాజ్ఞలలో పెట్టగల్గుచున్నాడు. తండ్రి యింటికి తిరిగి వచ్చినతరువాత ఆతనికి తన బిడ్డలలో నొకరు అల్లరి చేసినట్లు తెలియవచ్చినపక్షమున నాతడు వారియెడ వైము ఖ్యత వహించును. బిడ్డల చిలిపితనమున కిది సహజపరిణా మము. ఈ వైముఖ్యతయే, ఆ బిడ్డకు పెద్దశిక్ష. తండ్రి యీ విధముగ తన్ను పల్కరించి ముద్దులాడకపోవుట బిడ్డ కమిత దుఃఖమును కల్గించును. ఒడలిపై దెబ్బలు పడినప్పటికంటె ఈ సందర్భములో బిడ్డ ఎక్కుడుగ నేడ్చును. తా నింటిలో లేనప్పుడుకూడ బిడ్డ లీ నైతికశిక్షను తలంచుకొని భయపడు చుందురని పై పెద్దమనుష్యుడు మాతో పల్కినాడు. తమ ప్రవర్తన చక్కగ నున్నదా లేదా యనియు, తమ్మ్ గూర్చి తండ్రి కెట్టి రిపోర్టు చేయబడునో యనియు బిడ్డలు తమ తల్లిని తరచు అడుగుచుందురట. ఇటీవల ఈ బిడ్డ లందరిలో

పెద్దవాడు అయిదేండ్ల ఆతతాయి, తల్లిదండ్రులింటిలో లేన ప్పుడు తండ్రిపెట్టెలోనుండి మంగలికత్తిని బయటకు తీసి, ఒక తమ్ముని జుట్టును కొంత కోసివేసి, తన చేతిని గాయ పరచుకొని, పెద్ద అల్లరి చేసెను. సంపూర్ణారోగ్యము కల్గిన బిడ్డలప్పుడప్పు డివిధముగ జంతువులవలె జ్ఞానహీనులై వర్తిం చుట కద్దు. ఇంటికి రాగానే తండ్రికీ విషయము తెలియ వచ్చెను. ఆత డానాటి సాయంకాలమును, మరునాటి ఉదయ మునుకూడ ఆ అల్లరిపిల్లవానితో మాట్లాడలేదు. దానివలన పిల్లవాడు చాల బాధపడెను. తండ్రి విధించిన శిక్ష బాలుని మనస్సునకు బాగుగా నాటిపోయెను మరికొన్ని దినముల తరువాత ఒకనాడు తల్లి యెచ్చటికో పోవుచున్నప్పు డామెను పోవద్దని యీ బాలుడు బ్రతిమాలెనట. ఆమె యింటిలో లేనప్పుడు తొల్లింటివలెనే అల్లరిపనులు చేయవలెనని తనకు దుర్బుద్ధి పుట్టునేమో యని వాని భయమట!

"చిన్నబిడ్డలు పెద్దతప్పులను చేసినప్పుడు మన మేమి చేయవలసి యుండును?" అను ప్రశ్నకు సమాధానము నిచ్చుటకుపోద్ఘాతముగ మేమీ యంశములను తెల్పినారము. తల్లిదండ్రులకును బిడ్డలకును నడుమ నెట్టి సంబంధము లుండ వలయునన్న యంశమును విశదీకరించుట మా యాశయము. ఇట్టి సంబంధము లేర్పడిన వెనుక బిడ్డలుచేయు పెద్దతప్పులను సవరించుటకు మార్గము సుకరమగును. ఈ సందర్భములో మరియొక యంశమును గూర్చి కూడ హెచ్చరిక చేయవలసి

యున్నది. బిడ్డలకును తల్లిదండ్రులకును నడుమ చక్కని యనుబంధ మేర్పడుటకై మేము ప్రతిపాదించిన విధానమే సరియైనది. చిన్నపిల్లవా డేదైన తప్పుపని చేసినప్పుడు దాని వలన కల్గు సహజ ఫలితములను, బాధను ఆతడు (బాలుడు) అనుభవించునట్లు చేసిన పక్షమున, తండ్రికిని కుమారునికిని విరోధము తప్పును. బాలుడు తండ్రిని తనకు శత్రువుగ భావింపడు. ఈ యంశమును మే మీవరకే తెల్పినారము. మొట్టమొదటి నుండియు ఈ శిక్షణావిధానమునే సక్రమముగ నవలంబించుచు వచ్చిన పక్షమున తండ్రులకును, బిడ్డలకును చక్కని స్నేహభావము కుదురుట యెట్లు సంభవించునో చూపవలసియున్నది.

ఇప్పుడు సర్వసాధారణముగ బిడ్డలు తమ తల్లిదండ్రులను శత్రువులుగను, మిత్రులుగను కూడ భావించుచున్నారు. ఇతరులు తమయెడల చూపు ప్రవర్తనను బట్టియే బిడ్డలు వారిని తమకు మిత్రులుగనో, అమిత్రులుగనో పరిగణించుట సంభవించును. తల్లిదండ్రు లొకప్పుడు బిడ్డలకు లంచమిత్తురు; ఒకప్పుడు వారికొక్కల కవరోధములు కల్పింతురు; ఒకప్పుడు లాలింతురు; మరొకప్పుడు దూషింతురు; ఒకప్పుడు బుజ్జగింతురు; వేరొకప్పుడు బిడ్డల యెడ కాఠిన్యము వహింతురు. కావున బిడ్డలకు తమ తల్లిదండ్రుల యెడల అన్యోన్య విరుద్ధములగు భావము లేర్పడును. సర్వసామాన్యముగ తల్లులు తమ బిడ్డలతో "నేను నీకు మిక్కిలి హితురాలను" అని చెప్పి,

అంతటితో తనధర్మమును తానునిర్వర్తించినట్లు భావించును. బిడ్డ తాను తెల్పిన యంశమును నమ్మి తీరవలెను కనుక ఆత డట్లు చేసితీరు నని తల్లి భావించును. “నేను చేయున దంతయు నీమంచికొరకే. నీ కేది మంచియో నీకంటె నాకే బాగుగా తెలియును. నేను చేయుచున్న పనులు నీ మంచి కొరకే యని తెలిసికొను ఈడు నీకు రాలేదు. పెద్దవాడవైన తరువాత నేనిట్లు కావించినందులకై నీవు నాకు చేయెత్తి మ్రొక్కుదువు” అని నిత్యమును తల్లిదండ్రులు తమ బిడ్డల గూర్చి పల్కుచుండుట మనము వినుచుందుము. కాని ఈమధ్య కాలమంతయు పిల్లవాని కేదోయొక శిక్ష లభించుచునే యుం డును. ఆతడు తనకు మిక్కిలి యిష్టమైన పనులను చేయకుండ తల్లి నిషేధముల చేయుచుండును. నీ క్షేమముకొరకే నేనిట్లు చేయుచున్నానని తల్లి తరచుగ నోటిమాటగ ననుచుండును. కాని ఆమె చేయుపనులవలన బాలునికి కొంచెమో గొప్పయో బాధ తప్పక కల్గుచుండును. తల్లి దృష్టిపథమునం దనవరతము మెలగుచున్న తన (బాలుని) భావిక్షేమము నర్థము చేసి కొనజాలకయు, తల్లి ప్రవర్తనచే నా భావిశుభోదయ మెట్లు సాధింపబడునో గుర్తింపలేకయు, పిల్లవాడు తాత్కాలిక సంఘటనల వలన తన యభిప్రాయముల నేర్పరచుకొనును. తల్లి కావించు పనులచే తనకెట్టి యానందమును లభింపని కారణమున, ఆమె తన హితచింతకురాలను విషయ మాతని కనుమానాస్పదమగును. ఇందులకు భిన్నమగు పరిణామముల

నాశించుటకూడ తప్పేయని మామతము. ప్రతిబాలుడును తన కన్నెదుట గల సాక్ష్యముపై తన నిర్ణయముల కావించు కొనుటలో తప్పేమి కలదు? ఆతని కండ్లముందర జరుగు చున్న పనులన్నియు తల్లికి విరుద్ధముగానే ఉన్నవికదా! బహుశః అట్టి పరిస్థితులలో నున్న పక్షమున తల్లికూడ ఇంచు మించుగ నట్టి నిర్ణయములనే కావించుకొనును. ఉదాహరణ మునకు ఆ తల్లి పరిచితులలో నొకయామె, ఆమె (ఆతల్లి) తలపెట్టిన పనులన్నిటికిని అవరోధములు కల్పించి, తరచుగ ఆమెను చీవాట్లు పెట్టుచు, అప్పుడప్పుడు కొన్ని శిక్షలను కూడ ఆమెకు విధించుచుండునని భావింపుము. ఇట్టి కృత్య ముల నిరంతరము చేయుచు, నేను నీ మేలు కోరియే ఇట్లు చేయుచున్నానని పల్కు మిత్రురాలి పలుకులయెడ తల్లికే పాటి విశ్వాస ముండగలదు? తన కుమారుడు తనవలెకాక భిన్నముగ వర్తింపవలెనని తల్లి తలంచుట కెట్టి యాస్కా రము కలదు?

ఇందులకు భిన్నముగ తల్లి మేము ప్రతిపాదించిన విధానమునే మొట్టమొదటనుండియు అవలంబించుచున్నదని తలంపుడు. అప్పుడు తల్లి కుమారుని స్వయముగ శిక్షింపదు. అంతేకాక చెడుపనులుచేయువారిని ప్రకృతిమాత కఠినముగ శిక్షించునని ప్రప్రథమమునుండియు హెచ్చరిక నిచ్చుచు ఆమె (తల్లి) యాతనియెడ మిత్రత్వమును నెరపును. మేము ప్రతిపాదించుచున్న విధానము నెట్లు ఆచరణ యందిడ

వచ్చునో చూపజాలునట్టి యొక సామాన్యమగు నుదాహరణ
మును గైకొందము. సాధారణముగ చిన్నబిడ్డ లందరును
వివిధ ప్రయోగముల కావించుటకై యుత్సాహపడుదురు.
వారు స్వానుభవముచే విషయపరిశీలనము కావింతురు. ఈ
సహజప్రవృత్తి ననుసరించి యొకబాలుఁడు దీపమువద్దకుపోయి
కాగితపు ముక్కల నంటించి, వానిని చూచి యానందించు
చున్నాడని తలంపుము. ఇట్టి సందర్భములో వివేకహీనురా
లైన తల్లి పిల్లవాని యల్లరి మాన్పునిమిత్తమో, లేక వా
డొడలు కాల్చుకొనునేమో యను భయముచేతనో, అట్లు
చేయవలదని కుమారు నాజ్ఞాపించును. పిల్లవాఁడా మాట
విననిపక్షమున నామె యాతని చేతినుండి కాగితపు ముక్క
లను లాగుకొనును. ఇట్టి సందర్భమునందు వివేకవంతురాలగు
తల్లి బాలుడు కాగితపుముక్కలను కాల్చుచు ఆనందమును
పొందుటకు హేతు వాతనియందు సహజముగ నెలకొని
యుండు పరిశీలనాసక్తి యనియు, పరిశీలనాసక్తి వృద్ధినొందిం
చుట చాల యవసరమనియు గుర్తించి, ఈ విధముగ తనలో
తాను తర్కించుకొనును. "ఇప్పుడు నే నీబాలుడు చేయు
చున్న పని నాపితినా, ఆతని జ్ఞానసముపార్జనమున కవరోధము
కల్పించినదాన నగుదును. బాలు డొడలు కాల్చుకొనకుండ
నేను చేయగలను. కాని దానివలన ఫలితమేమి? ఇప్పుడు
కాకపోయిన మరొకపర్యాయమైన వా డొడలు కాల్చుకొని
తీరును. మంటవలన నెట్టి ప్రమాదము సంభవించునో స్వాను

భవముచే తెలిసికొనుట ఈతని భావిక్షేమమునకై చాల అవసరము. ప్రమాదకరమగు నిట్టి పనిని చేయవలదని యిప్పుడు నేను నిషేధించితినే యనుకొనుము. రేపాతనిని రక్షించుట కెవ్వరును లేని సందర్భములో ఈతడిట్టి ప్రమాదమందో, ఇంతకు మించిన ప్రమాదమందో చిక్కుకొనవచ్చును. నేను సమీపమందే యున్న ఈ సందర్భములో నీతని కేదైన యాపద తటస్థించిన పక్షమున, ఎక్కువ ప్రమాదము లేకుండ నేను వీనిని కాపాడగలను. ఇప్పుడే బాలుడు చేయుచున్న పనిని నేను నిషేధింపరాదు. ఏలనన ఈతడు కావించుచున్న ప్రయోగము స్వతస్సిద్ధముగ ప్రమాదభూయిష్ఠమైనదికాదు. అంతేకాదు. దీనివలన నాతనికి వినోదవిజ్ఞానములు రెండును సిద్ధించును. నేనిప్పు డీతని కాటంకములు కల్పించితినా యాతడు నాయెడల విరోధభావమును పూనుట తథ్యము. నా నిషేధాజ్ఞవలన ఆతనికి కలుగగల యెంతటిబాధనుండి ఆతనిని నేను రక్షించితినో అజ్ఞానియైన యీ బాలుడు గుర్తింపజాలడు. తాను చేయబూనిన పనిని నే నాపివేసితినని మాత్ర మాతడు జ్ఞప్తియం దుంచుకొనును. నేనే తనకు కల్గిన బాధకు కారణభూతురాలనని యాతడు చింతించును. తాను చేయుచున్న పనిలో నెంత ప్రమాదము దాగియున్నదో యాత డెరుంగజాలడు. కావున ఆ బాధ నిజమైనదికాదని యాతడు తలంచును. అజ్ఞాతమగు నొకబాధనుండి యీ బాలుని తప్పించుటకై ప్రయత్నించి, నేనీతని మనస్సు

నకు నిజముగ నాటునట్టి యొకబాధను కల్గించుచున్నాను. అందువలన నేను చెరుపు చేయుచున్నాననను ఒక భావ మాత నికి తప్పక కల్గితీరును. కావున నిప్పుడాతని నెదుర్కొను చున్న ప్రమాదమును గూర్చి యాతనికి హెచ్చరిక మాత్రము చేయవలెను. ఈతని కెట్టి గొప్ప విపత్తును రాకుండ కాపా డుట నా ధర్మము. ఇదియే ప్రస్తుతపరిస్థితిలో నుత్తమ మార్గము." ఈ నిర్ణయము ననుసరించి తల్లి తన కుమారు నుద్దేశించి "నాయనా! ఇట్లు చేయుటవలన నొడలుకాలు నట్టి ప్రమాదము కలదుసుమా!" యని హెచ్చరిక చేయును. కాని తల్లి మాటలను వినకుండ బాలుడు కాగితపు ముక్క లను కాల్చుచునే యున్నాడని భావింపుడు. అప్పుడాతని చేతులు కాలును. దానివలన నెట్టి ఫలితములు సంభవించు చున్నవో గమనింపుడు. ఈ బాలుడు స్వానుభవమువలన నొక ముఖ్యాంశమును తెలిసికొన గల్గినాడు. ఈత డీ జ్ఞానము నెంత శీఘ్రముగ సంపాదించిన నంత క్షేమంకరము. తాను చేయు పనియెడల నసంతుష్టి చూపుటయు, హెచ్చరిక నిచ్చు టయు కూడ తన క్షేమము నిమిత్తమే యని యాత డప్పుడు గుర్తింపజాలును. అప్పుడాతనికి తన తల్లికి తనయెడల నెట్టి ప్రేమ గలదో స్వానుభవముచే తెలియవచ్చును. ఆమె కావించు నిర్ణయములనెడ బాలునికి బాగుగా విశ్వాసము కల్గును. బాలు డప్పుడు తల్లి నితోధికముగ ప్రేమింప దొడగును.

కొన్ని ప్రమాదకరములైన కార్యముల వలన కాలు చేతులు విఱుగుట, లేక శరీరమునకు శాశ్వతముగు హానికల్గుట మున్నగునవి సంభవింపవచ్చును. అట్టి సందర్భములలో పసిబిడ్డలు చేయు పనులను బలవంతముగ ఆపివేయవలసి యుండును ఇట్టి ప్రమాదసమయములలో తక్క సామాన్యపరిస్థితులలో, చిన్న బిడ్డలకు నిత్యమును కల్గుచుండు అపాయములను మనంతట మనము తప్పించుటకు మారుగ, అట్టి అపాయములనుండి తప్పించుకొనవలెనని వారికి (బిడ్డలకు) సలహా యిచ్చుట యెక్కుడు వాంఛనీయము. ఇట్లు చేయుట వలన తల్లిదండ్రుల యెడల బిడ్డలకు గల ప్రేమ ఇప్పటి కంటె హెచ్చగును. జీవితము నందలి అన్నిరంగములలోను కూడ ప్రకృతి సిద్ధములగు పరిణామములే బాలబాలికలకు కల్గునట్లు మనము చూడవలయును. ఉదాహరణమునకు బాలురు బయట ఆట లాడుకొనునప్పుడును, ఇంటిలో వివిధ ప్రయోగములు చేయునప్పుడును వారికి గాయములు మున్నగునవి తగులవచ్చును. మనము వారి నా పనులను చేయనీయవలెను. కాని అట్టి పనులయందు గల ప్రమాదమును గూర్చి మాత్రము వారికి బాగుగా నచ్చచెప్పవలెను. ఇట్లు కావించిన యెడల తల్లిదండ్రుల స్నేహభావమునందును వారి మార్గదర్శకత్వమునందును బిడ్డలకు బాగుగా గురి కుదురును. మేము చూపుచున్న ఈ పద్ధతుల నవలంబించుటచే తల్లిదండ్రులకు బిడ్డలను శిక్షింపవలసిన అనిష్టధర్మనిర్వాహణము తప్పిపోవును.

అంతేకాదు. బిడ్డ లుత్సాహముతో చేయుపనుల నాపివేయ వలసిన యవసరము కూడ వారికి తప్పిపోవును. బిడ్డలను శిక్షించుట మున్నగు పనులవలన తల్లిదండ్రులకును వారి సంతానమునకును తగాదాలు సంభవించుచుండును. ఈ నూతన పద్ధతుల నవలంబించినచో వారి యన్యోన్యమైత్రివృద్ధి చెందును. ప్రస్తుత పరిస్థితులలో తల్లిదండ్రులు తమ బిడ్డలతో "మేము చేయునదంతయు మీ మంచికొరకే" అని తరచు చెప్పవలసి వచ్చుచుండును. కాని వారిచేత లిందులకు భిన్నముగ నున్నట్లు కాన్పించుచుండును. మేము సూచించిన మార్గముల నవలంబించినచో బిడ్డలు స్వానుభవముచే తల్లిదండ్రులు తమకు నిజమైన హితచింతకులని తెలిసికొందురు. అట్లు గ్రహించిన మీదట వారికి తల్లిదండ్రుల యందెక్కుడు ప్రేమయు, విశ్వాసమును కల్గును.

తల్లిదండ్రులకును బిడ్డలకును సహజము చక్కని స్నేహబంధమెట్లు ఏర్పడగలదో తెల్పినాము. బాలురు కాని, బాలికలు కాని పెద్ద తప్పులు చేసినపక్షమున, ఈ పద్ధతుల నెట్లుపయోగింపవలె నను ప్రశ్నకుసమాధానమును కన్గొందము.

ఇచ్చట ఒక ముఖ్యాంశము గమనింపదగియున్నది. మేము తెల్పుచున్న నైతిక శిక్షణావిధానము నవలంబించిన నాడు బాలబాలికలు పెద్ద పెద్ద నేరములను చేయనేచేయరు. చేసినను అరుదుగ చేయుదురు. బిడ్డలను కఠినమగు క్రమశిక్షణకు లోను కావించి, బాధించుటవలననే, వారి మన

స్సులలో తీవ్రమగు నసంతుష్టి జనించును. అందువలననే వారు చెడ్డగ ప్రవర్తింతురు. బిడ్డలను మనలనుండి దూరముగ నుంచుట వలనను, తరచుగ వారిని శిక్షించి వారి యెడ కాఠిన్యము వహించుటవలనను, మనయందు (తండ్రి బిడ్డల యందు) అన్యోన్య సానుభూతి నశించును. అన్యోన్య సానుభూతి లేనినాడు బిడ్డలు విశృంఖలులై నియమ విరుద్ధముగ వర్తింతురు. చిన్నబిడ్డలు తరచుగ ఒండొరులతో కొట్లాడుకొని, ఒకరి నొకరు క్రూరముగ బాధించుకొందురు. ఇయ్యది కొన్ని కుటుంబములలో పెద్దలు పిన్నల యెడల నవలంబించు కాఠిన్యతకు సహజపరిణామమే కాని వేరుకాదు. సర్వసాధారణముగ పెద్ద లెట్లు చేసిన పిన్నలట్లే చేయుదురు. ఒకరు తన్ను తిట్టి కొట్టినప్పుడా బాధనితరులకు కల్గించి తన బాధను బాపుకొను మనఃప్రవృత్తి పలువుర యందుండును. ఈ సహజప్రవృత్తియే మన బాలుర ప్రవర్తనకు హేతువు. మేము తెల్పుచున్న ప్రకారము చిన్నబిడ్డల యెడల యెక్కుడు ప్రేమను చూపి, వారి నెల్లప్పుడును సంతుష్టులుగ నుంచిన నాడు, వారొండొరులను తీవ్రముగను, తరచుగను బాధించుట సంభవింపదని మేము నిస్సంశయముగ తెలుపగలము. అబద్ధములు పల్కుట, దొంగతనములు చేయుట మున్నగు చెడ్డ అలవాట్లు కూడ ఇందువలన తగ్గిపోవును. ఇంటిలో తండ్రి బిడ్డల కన్యోన్య ప్రేమ లేనప్పుడు బిడ్డ లిట్టి నేరముల కావింతురు. ఉత్తమమగు నానందానుభ

భూతి కవకాశములు లేనివారు నీచమగు పనులకు గడంగి ఆనందమును సంపాదింతురు. పరిశీలనాశక్తి గల్గిన వారెల్ల రును మానవస్వభావమందలి యీముఖ్యలక్షణమును బాగుగ గమనింపగల్గుదురు. అన్యోన్యసానుభూతివలన సంభవించు నానందము లేనివారు స్వార్థభూయిష్ఠమగు నానందము కొరకై యత్నింతురు. తల్లిదండ్రులకును బిడ్డలకును నడుమ చక్కని స్నేహానుబంధ మేర్పడి యున్నపక్షమున, బిడ్డలెన్నడును స్వార్థపరతతో కూడిన నేరములను తరచుగ చేయరు.

ఎంతటి చక్కని క్రమశిక్షణ ప్రకారము పెంచినను చిన్నబిడ్డ లప్పుడప్పుడు తప్పులు చేయుచుందురు. అట్టి సందర్భములలో కూడ ప్రకృతిసిద్ధమగు పరిణామములను బిడ్డలకు వర్తింపజేయునట్టిపద్ధతి నవలంబింపవచ్చును. తండ్రి బిడ్డలకునడుమ మేము తెల్పిన ప్రేమానుబంధ మున్నపక్షమున ఈ శిక్షణావిధానము చాల లాభదాయక మగును. ఉదాహర ణమునకు దొంగతనముయొక్క ఫలితములగూర్చి యాలో చింతము. అవి ప్రత్యక్షములు, పరోక్షములు నని రెండు విధములు. న్యాయప్రకారముగ దొంగిలింపబడిన వస్తువును దానియొక్క యజమానికి తిరిగి ఈయవలెను. ఇది ప్రత్యక్ష ఫలితము. న్యాయపరుడైన ప్రతివ్యక్తియును కూడ దుష్కా ర్యముల దుష్టఫలితములను సత్కార్యములచే రద్దుచేయు టకై యత్నింపనగును. ప్రతి బిడ్డలతండ్రియు కూడ యీ పద్ధతిప్రకారము నడచుకొనవలెను. దొంగతనము జరిగి

నప్పుడు అపహృత వస్తువులు తిరిగి యజమానికీయవలెను. లేదా దానితో సమానమగు వస్తువు నీయవలెను. ఇట్టి నష్ట పరిహారమును కావించునప్పుడు బిడ్డలకు వాడుకగ నిచ్చు జేబుఖర్చునుండి యీ మొత్తమును తగ్గింపవలెను. తల్లిదండ్రులకు కల్గు కోపము, దొంగతనమువలన కల్గు పరోక్షపరిణామము. ఇది చాల ముఖ్యమైనది. నాగరకులైన తల్లిదండ్రులందరునుకూడ దొంగతన మొక నేర మని యంగీకరించి తీరుదురు. బిడ్డలు దొంగతనము చేసినప్పుడు తల్లిదండ్రుల కాగ్రహము కల్గుట అనివార్యమగు పరిణామము. "ఇట్టి సందర్భములలో తల్లిదండ్రులు బిడ్డలను కొట్టియో, తిట్టియో వారి యెడల తమకు కల్గిన అసంతుష్టిని ప్రకటింతురు. ఇది సర్వసామాన్యమగు పద్ధతి. మీరు సూచించెడి నూతన విధానములో విశేష మేమున్నది?" అని కొందరు ప్రశ్నింపవచ్చును. ఈ యంశము నిజమే. ఇట్టి పద్ధతిని స్వతస్సిద్ధముగ నందరును అవలంబింతురని మే మీవరకే అంగీకరించియున్నాము. నేడు కూడ కొన్ని విద్యావిధానములు తమంత తామే స్వక్రమ విధానములవైపు మొగ్గుచున్నవి. ఏదైన నకార్యము సంభవించినప్పుడు దాని సహజపరిణామముల తీవ్రతకూడ సంఘము యొక్క అవసరముల ననుసరించి మార్పు చెందుచుండును. అనవరతమును మనకు క్షేమమునే కూర్చు ప్రకృతిమాత ఇట్టి ఏర్పాట్లు చేయుచుండును. సంఘ మనాగరకస్థితి యందున్నప్పుడు తల్లిదండ్రుల యాగ్రహ మనాగరకములును,

కారములు నగు విధానములలో ప్రకటితమగును. అనాగ
రక సంఘములోని బిడ్డలుకూడ అనాగరకులుగనే ఉందురు.
సంఘము నాగరకదశయందు ప్రవేశించినప్పుడు బిడ్డలుకూడ
నాగరకులుగ నుండుట సహజము. అట్టి బాలురను మృదుతర
మగు శిక్షణావిధానముచే త్రోవకు తీసికొని రావచ్చును.
ఇట్టి సందర్భములలో తండ్రులు బిడ్డలకు విధించు శిక్షలు
కూడ సౌమ్యముగనే ఉండును. ఏది యెట్లున్నను మేము
ఒక ముఖ్యాంశమును ప్రతిపాదింపదలచినారము : తల్లిదండ్రు
లకును బిడ్డలకును నడుమ దృఢమైన ప్రేమానుబంధము నెల
కొని యున్నయెడల, ఆ తల్లిదండ్రుల యాగ్రహావేశము బిడ్డ
లను సరియైన త్రోవకు తీసికొనివచ్చుటలో చాల ఉపయోగ
కారి యగును. తప్పుపనులకు కల్గు సహజపరిణామములను
బిడ్డలకు వర్తింపజేయునట్టి క్రమశిక్షణావిధానమును మొదటి
నుండియు అవలంబించుచు వచ్చినపక్షమున, ఆ పద్ధతి బిడ్డలు
పెద్దతప్పులు చేసిన సందర్భములలోకూడ ఫలవంత మగును.
లోకవ్యవహారమును సూక్ష్మముగ పరిశీలించువారి కీయంశ
మున కనేక నిదర్శనములు లభింపగలవు.

మన మెవ్వరైన ఇతరుల కాగ్రహము కల్గు పనులను
చేసినామని తలంపుడు. ఆవలి పక్షమువారు మన కెంత
సన్నిహితులైన, మనము చేసినపనికై మనమంత హెచ్చుగ
మనస్సులో బాధపడుదుము. మన పనుల వలన నష్టమును
పొందినవాడు మనకు శత్రువైన పక్షమున, ఆతనికి కల్గిన

బాధవలన మనకు విచారముకల్గుటకు మారు, మనలో మన కొకవిధమగు నానందము కల్గును. ముఖపరిచయముకూడలేని యొక్కరి కేదైన బాధకాని, నష్టముకాని కల్గినచో మన మెక్కుడు విచారింపము. కాని మన కాప్తులగువారికే యీ బాధకల్గినచో మనకు కూడ విచారము కల్గుట అనివార్యము. దీనికి భిన్నమగు మరియొక విషయము నూహింపుడు. మన ప్రేమగౌరవములకు పాత్రుడైన యొక మిత్రునికి మనపై యాగ్రహము కల్గిన పక్షమున, దాని నొక గొప్ప యనర్థ ముగ భావించి, చాల కాలము వరకు విచారపడుదుము. అదే విధముగ తల్లిదండ్రులకును బిడ్డలకును నడుమగల సం బంధములు మొదటి నుండియును కూడ స్నేహపూరితములై యున్న పక్షమున, బిడ్డలు తమ తండ్రుల కసంతుష్టి కల్గినచో మిక్కిలి విచారపడుదురు. ఒక బాలునికి మొదట నుండియు తనతండ్రితో వైరభావమే యుండిన పక్షమున, తప్పుచేసిన సందర్భమున నా బాలునికి కల్గు ఆందోళన కేవల స్వార్థ పరతతో కూడియుండును. తండ్రి తన్ను ఎంత కఠినముగ శిక్షించునో యనియు, తనకు లభించుచున్న సౌకర్యములు తగ్గిపోవుననియు మాత్రమే ఆ బాలుడు భయపడును. తండ్రి పై రెండు విధములుగను కుమారుని శిక్షించిన మీదట, వారిరువురకును మొదట నుండియు గల అమిత్రభావము మరింత బలపడిపోవును. అందులకు విరుద్ధముగ మొదటి నుం డియు తండ్రి కుమారుని స్నేహప్రేమలతో పరిగణించుచు

వచ్చిన పక్షమున కుమారునికి తండ్రి యెడల భక్తివిశ్వాసములు కుదురును. అట్టి పరిస్థితులలో తండ్రి కాగ్రహము కల్గిన పక్షమున, కుమారుడు నిజముగ భయపడి తండ్రి కాగ్రహ కారణమైన దుష్కార్యములను ముందెన్నడును చేయడు. తండ్రికి కుమారునిపై గల పలుకుబడి అతనిని దుష్కార్యముల పొంతకు పోకుండ చేయుటయే కాక ఇతర విధములగు సత్ఫలితములనుకూడ కలుగజేయును. తనకు గౌరవపాత్రుడును, హితచింతకుడు నగు తండ్రియొక్క సద్భావమును గోల్పోయితినే యని కుమారుడు నైతికముగ పడు బాధ, కేవల భౌతికమగు శిక్షవలన కల్గు బాధకంటె చాల తీవ్రతరముగ నుండును. ఈ రెండు విధములగు శిక్షలును కూడ చక్కని ఫలితములకు దారితీయును. భౌతికమగు శిక్ష విధింపబడినప్పుడు బాలుని మనస్సులో భయమును ద్వేషభావము నుత్పన్నమగును. నైతికమగు శిక్షవలన నితర పరిణామములు సంభవించును. తండ్రికి కష్టము కల్గించితినే యని బాలుడు బాధ చెందును. అట్టి కష్టము కల్గించినందులకు నిజముగ పశ్చాత్తాపము చెంది, ఏతత్పాపపరిహారార్థము ముందు ముందు నిర్దుష్టమగు నడవడితో వర్తించి తండ్రి యనుగ్రహమును మరల సంపాదింపవలెనని ఆ కుమారుడు నిశ్చయించుకొనును. నైతిక మార్గముల నవలంబించుటవలన నుత్తమ భావములు ప్రదీప్తములై దుష్టకార్యముల నరికట్టును. స్వార్థపూరితములగు భావములు మనోరంగమున చెలరేగినచో,

మానవుడు దుష్కార్యములయందు ప్రవృత్తుడగును. కావున ప్రకృతిసహజములగు పరిణామములచే కార్యసాధనము కావించు శిక్షణావిధానము స్వల్పమగు నేరములకును, పెద్దనేరములకును కూడ సమానముగ వర్తించును. ఈ మార్గము నవలంబించినచో దుష్కార్యాచరణాసక్తి అణగిపోవుటయే కాదు, సంపూర్ణముగ రూపుమాసిపోవును.

క్రూరత్వమువలన క్రూరత్వమును, సౌజన్యతవలన సౌజన్యమును సిద్ధించు నను సత్యమును మనము గ్రహింపవలెను. ఇంతవరకును మనము కావించిన విచారమునందలి సారాంశ మిదియే. మనము బిడ్డలయెడ నిర్దయతో వర్తించినచో వారికి మనయెడల సానుభూతి యుండదు. అట్లు కాకుండ వారియెడ మనము సానుభూతిని చూపినచో వారు కూడ మనయెడల సుహృద్భావమును ప్రదర్శింతురు. నిరంకుశ ప్రభుత్వమును సాగించువారు తరచుగ కొన్నివిధములగు నేరముల నెదుర్కొని వాని నణచివేయవలసి వచ్చుచుండును. ఇట్టి నేరములకు నిరంకుశవిధానమే మూలమని యెరుంగవలయును. రాజ్యాంగవిధానమునకును, గృహనిర్వాహణమునకును కూడ ఈ సూత్రము సమానముగ వర్తించును. ఉదారబుద్ధితోడను, సౌజన్యముతోడను మనము మెలగిన పక్షమున అన్యోన్యవైరములకు తావు లేకుండ పోవును. ప్రజల నైతిక ప్రవృత్తు లుత్తమస్థాయిని చెంది, నియమోల్లంఘనము కావింపవలె ననెడి కోర్కెయే క్షీణించును. చాలకాలమునకు

పూర్వమే జాన్ లాకే మహాశయు డిట్లు వచించియున్నాడు. "విద్యావిధానమునందు విశేష కాఠిన్యము నవలంబించుట వలన లాభమునకు మారు నష్టమే హెచ్చుగ కల్గును. మనచే కఠినశిక్షల పాలైన విద్యార్థు లుత్తమపురుషులుగ మారుట చాల అరుదుగ మాత్రము కానవచ్చుచున్నది." పెంటన్ విల్ కారాగారములో మతబోధకుడుగ నుండిన రోజర్స్ అను నాతడు పై యభిప్రాయమును బలపరచినాడు. ఇచ్చట అల్పవయస్కులగు ఖైదీలలో కొరడాదెబ్బలవంటి కఠినశిక్షల ననుభవించినవారే, మరల మరల ఆ కారాగారమునకు తిరిగి వచ్చెడివారని పై మతబోధకుడు తెల్పియున్నాడు. మేము ఇటీవలనే ప్యారిసునగరమున నొక ఫ్రెంచి పెద్దమనుష్యురాలి యింటిలో బసచేయుట తటస్థించెను. దయార్ద్రబుద్ధితో ఇత రులను చూచుటవలన కల్గు సత్ఫలితములనుగూర్చి కొన్ని యంశముల నామె మాకు తెల్పినది. ఆ యింటిలోని ఒక పిల్లవాడెల్లప్పుడును అల్లరి చేయుచుండెడివాడు. వాని ఆగ డమువలన మాకు కల్గు ఇబ్బంది నుపేక్ష చేయవలసినదిగా మమ్ము ప్రార్థించుచు ఆమె యిట్లు తెల్పెను. "ఈ దుండగీడు ఇంటిలోను బడిలోను కూడ ఒకే విధముగ అల్లరి చేయు చుండును. కాని వీని నడవడిని సరిదిద్దుటకు మార్గాంతరము లేదు. వీని అన్న విషయములో అవలంబించిన పద్ధతినే వీనిని కూడ వంచవలయును. వీని అన్నను ఒక ఇంగ్లీషుబడికి పంపి నాము." ఈ పిల్లవాని అన్నను మొట్టమొదట ప్యారిసునగ

రములోని అనేక పాఠశాలలకు పంపిరట. కాని ఆతని దుండగములు యథాప్రకారముగనే సాగుచు వచ్చెనట. తుదకు ప్రాణము విసిగి కొందరు మిత్రుల సలహాపై వారా బాలుని విద్యాభ్యాసముకొరకై ఇంగ్లాండునకు పంపిరట. అత డింటికి తిరిగి వచ్చు సరికాతనిలో పెద్దమార్పు కల్గెను. ఇంతకుపూర్వ మా బాలు డెంత చెడ్డవాడో ఇప్పుడంత మంచివాడైనాడు ఇంగ్లాండు నందలి పాఠశాలలలో అమలునందున్న సౌమ్యమగు శిక్షణావిధానమే యిందులకు కారణమని ఆ పెద్ద మనుష్యురాలి యభిప్రాయము.

పై విధముగ విపులమగు చర్చ సాగించిన మీదట అందలి సారాంశమును ఇప్పుడు మీకు క్లుప్తముగ తెల్పెదము. చిన్న బిడ్డలు నైతికముగ చాల మంచివారుగ నుందురని యెన్నడును భావింపవలదు. పిన్నతనమందు ప్రతి మానవుడును కూడ అనాగరకునివలె దుష్టస్వభావమును ప్రదర్శించును. మన ప్రాచీను లెల్లరును కూడ ఇట్టి అనాగరకులే కాదా! కొంతకాలము వరకును మన యందరిలోను కూడ ఆదిమానవుల భౌతికలక్షణములును, మానసికప్రవృత్తులును కూడ బలముగ నుండును. కావుననే చిన్నబిడ్డలలో క్రూరత్వము, అబద్ధములాడుట, దొంగతనము చేయుట మున్నగు దుష్టలక్షణములు కాననగును. కాని వారు పెద్దవారైన కొలదియు ఎట్టి క్రమశిక్షణయు లేకుండగనే ఈ దుష్టత్వము తగ్గిపోవును. మన భౌతికలక్షణములలో కూడ నిట్టిమార్పులే

తటస్థించుచుండుట గమనింపదగినది. చిన్న బిడ్డలలో నెట్టి పాపము నుండదని పలువురు పల్కుచుందురు. ఇయ్యది కొంత వరకు నిజమే. వారి యందు పాపపూరితమగు జ్ఞానము కానరాదు. కాని దుష్టప్రవృత్తులు వారిలో తప్పక ఉండి తీరును. ఒక్క అరగంట కాలము చిన్న బిడ్డలతో గడపిన పక్షమున నిందలి సత్యము మీకె తెరుకపడగలదు. ఒంటరిగ నున్నప్పుడు బాలు రొండొరులయెడ చాల క్రూరముగ వర్తింతురు. కాని పెద్దవారియందీ ప్రకృతి కానరాదు. బాల్యము నుండియు మనము చిన్న బిడ్డలను యథేచ్ఛగ విడచిపెట్టిన పక్షమున వారి క్రూరప్రవృత్తులు మరింత హెచ్చిపోవును.

చిన్న బిడ్డల కొరకై అత్యున్నతమగు నైతికవిధానముల నిర్ణయించుటయు, ఆ యున్నతస్థాయిని చేరుటకొరకు వారిని ప్రోత్సహించుటకై ఏవేవో ఆశలను చూపుటయు వివేకమగుపని కాదు. ఈడునకు మించిన మానసికాభివృద్ధి నష్టదాయకమని ఇప్పుడించుమించుగ నందరును అంగీకరించుచున్నారు. అదే విధముగ వయస్సునకు మించిన నైతికాభివృద్ధి కూడ అనర్థహేతువని మనము తెలిసికొనవలసియున్నది. ఉన్నత మానసిక శక్తులవలెనే ఉన్నత నైతిక శక్తులు కూడ సంకీర్ణములు. అందువలన నవి మానవునికి పూర్తిగ వయస్సు వచ్చిన తరువాత కాని సంపూర్ణముగ వికసింపవు. ప్రాథమికదశయందే దీనికి విశేషమగు నుత్తేజము కల్పించిన పక్షమున భావిదశయందు మానవునికి నష్టము సంభవించును.

ఈ కారణము వలననే మనకు ప్రపంచమునందు కొన్ని విచిత్రవిషయములు కానవచ్చుచుండును. కొందరు బాలురు పిన్ననాడు చాల చక్కని నడవడి కల్గియుందురు. ఏకారణము వలననో కాని వారు పెద్దవారైనకొలదియు వారి యోగ్యత క్షీణించి, సామాన్య ప్రజల కంటె కూడ వారధోగతికి పోవుదురు. ఆదర్శప్రాయులగు మానవులు బాల్యదశయందు ఎట్టి విశేషమును లేక సామాన్యులుగ నుండుచువచ్చిరి.

కావున బిడ్డల నైతికాభివృద్ధి కొరకై అర్హములగు పద్ధతులను మాత్రమే అవలంబించి సామాన్యములగు ఫలితములతో మనము సంతృప్తిపడవలెను. ఉన్నత మానసిక శక్తులవలెనే ఉన్నత నైతిక శక్తులు కూడ క్రమ క్రమముగ వృద్ధిచెందును. ఈ యంశములను తెలిసికొనిన పక్షమున క్షణక్షణమును మన చిన్నబిడ్డలలో కాన్పించు నైతిక లోపముల యెడల మన మంతగా విసిగికొనము. అప్పుడు నీవు బిడ్డలను తరచు తిట్టుట, బెదరించుట, కొన్ని పనులు చేయరాదని నిషేధించుట మున్నగు అలవాట్లను మార్చుకొందువు. తమ బిడ్డ లాదర్శప్రాయులు కావలెనను కోర్కెతో తల్లిదండ్రులు పైవిధముగ ప్రవర్తించి, తమ కుటుంబరంగమునందు శాశ్వతమగు వైమనస్యమును పెంపొందించుకొందురు.

మేము సమర్థించుచున్న శిక్షణావిధానము నంగీకరించినవారు కుటుంబ నిర్వాహణమునందు విశాలహృదయముతో వర్తించుచు, చిన్నబిడ్డల నడవడి యందు చాల

తక్కువ జోక్యము కల్గించుకొందురు. బిడ్డలు తాము చేసిన పనుల వలన సహజముగ సిద్ధించు ఫలితములను పొందునట్లు శ్రద్ధ వహింపుము. ఇట్లు చేసినచో బిడ్డలపై అనవసరములగు నిర్బంధముల నుపయోగింపవలసిన యవసరము తప్పును. సామాన్యముగ తల్లిదండ్రు లీ తప్పును కావించుచుందురు. వీలైనంతవరకు బిడ్డలు ప్రకృతి సహజమగు శిక్షణావిధానము ప్రకారము పెరుగునట్లు ఏర్పాట్లు చేయుము. నీ వందులకు భిన్నముగ వర్తించిన పక్షమున సహజముగ మృదుస్వభావము గల బాలురలో అసహజమగు సద్వర్తన మభివృద్ధి చెందును. స్వతంత్రస్వభావముగల బాలురలో తల్లిదండ్రుల యెడల వైరభావ మేర్పడి వారి నైతికజీవితము భగ్నమగును.

మన బిడ్డలు చేయు పనులకు ప్రకృతిసహజములగు ఫలితములను మాత్రమే అందజేయుటకు ప్రయత్నించిన పక్షమున మన కోపతాపము లదుపులో నుండుట కవకాశ మేర్పడును. తమకు కోపము వచ్చినప్పుడు, దానిని తమ కిచ్చ వచ్చినచొప్పున బిడ్డలయెడ ప్రదర్శించుటయే నేటి మన తల్లిదండ్రు లవలంబించుచున్న నైతికశిక్షణా విధానము. నిజమునకు నేరములుకాని చిన్నతప్పులను తన బిడ్డలు చేసినప్పుడు తల్లి చాల చికాకుపడి వారిని తిట్టుటయో, బెదరించుటయో, లేక నాల్గు దెబ్బలను తగులనిచ్చుటయో కావించుచుండును. ఇట్టి సందర్భములలో తల్లి తన భావోద్రేకము నణచుకొన

జాలక, దానికి వశపడి, ఆగ్రహమును ప్రకటించుచున్న దే కాని నేరముచేసిన బిడ్డలకు లాభదాయకమగు పద్ధతుల నవలంబించుట లేదు. కాని బిడ్డ లేదైన తప్పుపని చేసినప్పుడు ఆ దుష్కార్యమునకు సహజమగు ఫలిత మేదియో, ఆ ఫలితమును నేరస్తుని కెట్లు కల్గింపవలెనో నిర్ణయించుటకై ఇంచుక వ్యవధి యున్నపక్షమున, మన భావోద్రేకము నణచుకొనుటకవకాశము లభించును. ముందువెనుకలు చూడని పిచ్చికోపముపశమించి, నీ భావములకు కొంత స్వస్థత చేకూరును. అప్పుడు భావోద్రేకముచే తప్పుడు పనులు చేయుటకు నీ కవకాశ ముండదు.

కాని కేవల ముద్రేకశూన్యునివలె వర్తించుటకూడ అంత సమంజసము కాదు. బిడ్డలు తప్పుపనులు చేసినప్పుడు వానివలన సహజముగకల్గు పరిణామములు వారిని చక్కదిద్దు ననుట సత్యమే కాని వారి పనులయెడల నీవు ప్రదర్శించు నిగ్రహానుగ్రహములు కూడ బిడ్డల కార్యములకు సహజ పరిణామములనియు, వారిని సరియైన త్రోవకు తెచ్చుటకై అవి (నీ నిగ్రహానుగ్రహములు) కూడ ముఖ్యసాధనములనియు గ్రహింపవలెను. బిడ్డలను పెంచుటలో అవలంబింపవలసిన నైతికశిక్షణా విధానమునందు తల్లిదండ్రు లాగ్రహావేశపరవశులై బిడ్డలకు విధించునట్టి అసహజశిక్షలకు మారుగ, ప్రకృతిమాత శాసించిన సహజమగు శిక్షలను విధింపవలె నని మే మింతతడవును వాదించుచున్నాము. ప్రకృతిసహజమగు

శిక్షల స్థానమున మన కృత్రిమశిక్షల నుపయోగింపరాదు. కాని మొదటి విధముగ శిక్షలతోపాటు రెండవవానిని కూడ వాడుటను మేము నిషేధింపలేము. ముఖ్యముగ శిక్షను పూర్తిగ త్రోసిపుచ్చి రెండవతరగతి శిక్ష నుపయోగింపరాదు. కాని ముఖ్యమైన శిక్షకు మద్దత్తుగా రెండవవిధపు శిక్షనుకూడ తగుమాత్రముగ వాడవచ్చును. బిడ్డల దుష్కార్యములచే నీకు కల్గిన కోపవిచారములను నీ మాటలవలనను, చేతలవలనను ప్రకటింపవచ్చును. కాని అవివేకముగ నెట్టి పనిని చేయరాదు. నీకు కల్గెడి ఆగ్రహముయొక్క లక్షణములు నీ స్వాభావముపై ఆధారపడి యుండును. కావున ఆ యాగ్రహ మిట్లుండవలెనని నిర్ణయింపబూనుట నిరర్థకము. ఏది యెట్లున్నను నీ కాగ్రహము కల్గినప్పుడు దానిని సక్రమరూపములోనికి గొనివచ్చుటకై తప్పక ప్రయత్నము చేయవలెను. ఆగ్రహాధిక్యత, ఆగ్రహము యొక్క కాలపరిమితులను గూర్చి మిక్కిలి జాగ్రత్తపడవలెను. అతి సర్వత్ర వర్జయేత్తని పెద్దలు చెప్పుదురు. సర్వసాధారణముగ తల్లు లొకవంక తమ బిడ్డలను శిక్షించుచు, వేరొకవంక వారిని బుజ్జగించుచుందురు. ఇట్టి భావదౌర్బల్యము నెన్నడును ప్రదర్శింపరాదు. కాని బిడ్డలపై చిరకాలము వరకును కోపము పూనియుండుట కూడ అవివేకము. అట్లు చేసిన యెడల నీస్నేహభావము లేకుండ మనుటయే వారికి సహజపద్ధతి యగుటయు, నీకు వారిపై పలుకుబడి లేకుండపోవుటయు తటస్థింపవచ్చును. కావున

ఆదర్శప్రాయుడగు తండ్రి, బిడ్డలు చేయు పనులయెడల తన భావముల నెట్లు, ఎంత వరకు ప్రదర్శించునో, అట్లే నీవు కూడ ప్రవర్తించుట నేర్చుకొనుము.

ఆజ్ఞల నరుదుగ నీయవలెను. ఇతర విధానములు నిరర్థకమైనప్పుడు మాత్రమే ఆజ్ఞల నీయవలెను. తరచుగ నాజ్ఞల నిచ్చువారు తమ సౌకర్యమును గూర్చియే కాని తమ బిడ్డల సౌకర్యమును గూర్చి ఎక్కుడుగ నాలోచింపరు. అనాగరక సంఘములలో ఆజ్ఞల నుల్లంఘించువారిని తప్పక శిక్షింతురు. ఆజ్ఞోల్లంఘనములో నెట్టి పాపమును లేకపోవచ్చును. కాని అది రాజాజ్ఞలకు వ్యతిరేకము. ఆయనపై తిరుగుబాటు. ఇదే విధముగ అనేక కుటుంబములలో పెద్దలు పిన్నవారిని తమ యెడల అవిధేయత చూపించినంత మాత్రమున శిక్షింతురు. ఆ యవిధేయతలో నెట్టి పాపకార్యాచరణము నిమిడియుండనక్కరలేదు. తరచుగ మన పెద్దలు పిన్నలను చూచి "నేను చెప్పినట్లు చేయవుకాదూ! మంచిది. నీచేత ఈ పని చేయించి తీరెదను. అప్పుడు నే నెవరనో నీకు తెలియగలదు." అని ఈ విధముగ అహంకారముతో కోపవాక్యములు పలుకుచుందురు. ఇట్టి పలుకులలో ఎదుటి వారిని లొంగదీయ వలయునను పట్టుదలయే ప్రకటితమగును కాని బిడ్డల క్షేమము కొరకై పాటుపడునట్టి లక్షణము లేవియు కానరావు. ఈ పద్ధతికిని, అవిధేయత ప్రదర్శించిన పాలితుని దండించి తీరవలెనని పట్టుపట్టెడి నిరంకుశప్రభువు

ప్రవర్తనకును విశేషము భేదము కానరాదు. దయార్ద్ర హృదయుడగు శాసనకర్తవలె సత్స్వభావము గల తండ్రి కూడ నిర్బంధము నుపయోగించుట కంగీకరింపడు. అతడు నిర్బంధము లేకుండగనే తన పనులను సాగించును. శాసనేతర విధానములచే తన పని నెరవేరగల్గిన పక్షమున నాతడు కార్యనిర్వహణమునకై శాసనముల కావింపడు. శాసన నిర్మాణ మనివార్యమైనప్పుడె దాని కందులకై విచారించును. తన్ను తాను శాసించుకొనుటయే రాజకీయరంగమునందు త్తమోత్తమ విధానము. ఇయ్యది విద్యావిషయములకు కూడ వర్తించును. ఈ యుత్తమ సూత్రము నంగీకరించిన తల్లి దండ్రులు తమ యధికారగర్వమును కర్తవ్యనిర్వహణాసక్తిచే నణచుకొని, సాధ్యమైనంతవరకు చిన్నబిడ్డలు తమ్ము తామే శాసించుకొను పద్ధతులను వారికి నేర్పుదురు. అనివార్య పరిస్థితులలో మాత్రమే వారు నిరంకుశ పద్ధతుల నవలం బింతురు.

ఆజ్ఞల నిచ్చునప్పుడు మాత్రము నిశ్చితములును, సమంజసములు నగు ఆజ్ఞల నొసంగుము. పరిస్థితిని మార్గాంతర ములచే చక్కబెట్టుటకు సాధ్యముకాని పక్షమున నీ ఆజ్ఞను ప్రకటింపుము. ఒకమారు ఆజ్ఞ నొసంగిన తరువాత దానికి విరుద్ధముగ వర్తింపకుము. నీవు చేయదలచిన పనిని గూర్చి లెస్సగ చింతింపుము. ఫలితముల గూర్చి శ్రద్ధగ యోచిం పుము. ఆ యాజ్ఞ నమలుపరచు నంతటి మనోదార్ఢ్యము నీకు

కలదో లేదో నిర్ణయించుకొనుము. తుట్టతుదకు ఆజ్ఞాప్రక టనము కావించిన తరువాత, ఏది ఎట్లైనను సరియే దానిని నితరులు మన్నించునట్లు శ్రద్ధ వహింపుము. జడప్రకృతి విధించు శిక్షలవలె నీ శిక్షలు కూడ అనివార్యములై యుండ వలయును. కాలుచున్న బొగ్గును చిన్న బిడ్డడు స్పృశించినను అది యాతని చేతిని కాల్చును. ఆతడు దాని నెన్ని పర్యా యములు తాకిన అన్ని పర్యాయములు ఆతని చేయి కాలి తీరును. కావున ఆ బిడ్డ కొన్ని దినముల తరువాత నిప్పును తాకరాదని తెలిసికొనును. నీ యాజ్ఞలలో నే విధమగు మార్పును లేకుండ, అచంచలముగ నున్నపక్షమున—అనగా నీవు చేయవలదని నిషేధించిన పనులను బిడ్డలు చేసిన యెడల జడప్రకృతి యాజ్ఞల నుల్లంఘించిన సందర్భములందువలెనే వారికి తీవ్రమగు శిక్ష తప్పకుండ కల్గిన పక్షమున—వారు ప్రకృతిమాత యాజ్ఞలనువలెనే నీయాజ్ఞలను కూడ గౌర వించి తీరుదురు. నీయాజ్ఞల యెడ బిడ్డల కిట్టి గౌరవము కుది రిన పక్షమున కుటుంబసంబంధమైన పెక్కు చికాకులు తొలగి పోవును. అన్యోన్యవిరుద్ధముగ వర్తించుట విద్యారంగము నందొక పెద్ద పొరపాటు. న్యాయప్రధానశాఖయందు లోప ములు సంక్రమించిన పక్షమున సంఘములో నేరములు హెచ్చిపోవును. అదేవిధముగ నీవు శిక్షలను విధించుట యందు నిశ్చితముగను, క్రమబద్ధముగను వర్తింపని యెడల, నీ కుటుంబములో నియమోల్లంఘనము విస్తారముగ హెచ్చి

పోవును. కొందగు తల్లులు దుర్బలహృదయులుగ నుందురు. వారు తమ బిడ్డలను తరచు బెదరింతురు కాని ఆ బెదరింపులు వట్టి మాటలుగనే ఉండిపోవును. వా రనాలోచితముగ నియమముల గావించుకొని, అందులకై తరువాత చాల పశ్చాత్తాపము చెందుదురు. ఇట్టి ఒకే నేరమున కొకమారు కఠిన శిక్షను విధింతురు; వేరొక మా రా నేరము నుపేక్ష చేయుదురు. ఇట్లు చేయుటలో వారు తాత్కాలికభావములకు లొంగిపోవుదురు. ఇట్టి తల్లులు తమకును, తమ బిడ్డలకును ముందు ముందు ఎన్నో అనర్థములను తెచ్చిపెట్టుకొందురు. బిడ్డల కామెయెడ నెట్టి గౌరవప్రపత్తులును ఉండవు. భావో ద్రేకము నణచుకొనజాలని తన దౌర్బల్యము నామె వారికడ ప్రదర్శించుచున్నది. ఆ దౌర్బల్యమే వారి కాదర్శము కా గలదు. తప్పు చేసినను శిక్షనుండి తప్పించుకొనవచ్చు నను విశ్వాసము నామె వారియందు కల్గించుచున్నది. ఈ విధ ముగ అనేక కలహముల కామె దారి కల్పించుచున్నది. ఈ కలహములవలన ఆమె స్వభావమునకును, బిడ్డల స్వభావ మునకును కూడ తీరని యపకారము జరగును. ఇట్టి తల్లి, బిడ్డల మనస్సులలో నైతికమగు అరాజకత్వమును కల్పిం చును. భావి జీవితమునందు చాల బాధకరములగు అనేకాను భవములకు గురియైనతరువాత మాత్రమే వారు సక్రమమగు నైతికపథమును గుర్తింపజాలుదురు. కుటుంబ నిర్వాహణములో క్రమహీనమగు సౌజన్యపద్ధతులకంటె క్రమబద్ధమగు క్రూర

విధానమే శ్రేయస్కరము. సాధ్యమైనంతవరకు నిర్బంధపద్ధతుల నవలంబింపవలదని మేము తెలుపదలచినారము. కాని నిరంకుశముగ వర్తించుట తప్పనిసరి యైనచో, నిరంకుశవిధానమును సంపూర్ణముగ నవలంబింపుము.

స్వయంశక్తిచే జీవితయాత్రను గడపగల్గునట్లు విద్యార్థుల సరిదిద్దుటయే క్రమశిక్షణయొక్క ఉద్దేశ్యము. అంతే కాని వారితరులపై నాధారపడునట్లు చేయుట మన యాశయము కాకూడదు. నీ సంతానము తమ జీవితమంతయు సేవకావృత్తియందే గడపవలసినట్లు విధినిర్ణయ మని భావింపుము. అట్టి సందర్భములో బాల్యము నుండియు వారిని సేవకావృత్తికొరకై సంసిద్ధుల కావింతువు కదా! అట్లు కాకుండ మన బిడ్డలు కాలక్రమమున స్వతంత్రులై ఎవ్వరి మార్గదర్శకత్వమును లేకుండ స్వతంత్రముగ జీవింపవలసి యుందురు. కావున బాల్యమున, నీ చెప్పుచేతలలో నున్నంత కాలమును వారి కాత్మసంయమమును నేర్పవలయును. ప్రస్తుతము మన దేశము (ఇంగ్లాండు) నందు నెలకొనియున్న సాంఘిక పరిస్థితుల కనుగుణముగ నుండునట్లు, మనము బాలబాలికలకు ప్రకృతిసహజపరిణామములపై ఆధారపడిన క్రమశిక్షణావిధానమును వర్తింపజేయవలెను. జమిందారీవిధానము అమలులో నున్న యుగములో ఉన్నత తరగతులవారి యాగ్రహము సామాన్యజనుల కొక గొప్ప ఆపదవలె కానవచ్చుచుండెను. ఆ కాలములో బిడ్డలను చిన్నతనమునుండియు

కూడ తల్లిదండ్రుల యాగ్రహమునకు వెఱచి పనిచేయు వారినిగ పెంచవలసి వచ్చెడిది. కాని ఈ కాలమునందలి ప్రజ లెవ్వరిని చూచి భయము చెందనక్కరలేదు. నేడు మానవునకు కల్గు మంచిచెడ్డలు చాలవరకు ఆతడు చేసిన కార్యములకు ప్రతిఫలములే కాని వేఱుకావు. కావున నేడు బాలుడు మొట్టమొదటనుండియు స్వానుభవముచే తాను చేయు పనులలోని మంచిచెడ్డలను గుర్తించు నైపుణ్యము నలవరచుకొనవలెను. బాలుడు తాను చేయుచున్న పనుల మంచిచెడ్డలను తనంత తాను గుర్తింపగల్గుచున్నాడని నమ్మకము కుదురగానే, తల్లిదండ్రులు బిడ్డపై తమ యధికారము తగ్గించుకొనవలెను. శైశవావస్థయందు ప్రతి జీవియెడలను మనము నిరంకుశత్వము పూనవలసియుండును. మూడేండ్ల పిల్లవాడు వాడియైన మంగలికత్తితో నాడుచున్నప్పుడు, అందలి బాగోగులను సహజపరిణామములచే వాడు తెలిసికొనగలడని భావించి యూరకుండుట యెంత మాత్రమును సమంజసముకాదు. ఏలనన దీని పరిణామములతి ప్రమాదభూయిష్ఠములు కావచ్చును. కాని బాలుని బుద్ధి వికసించినకొలదియు, ఆజ్ఞల నొసంగి జోక్యము కల్పించుకొనవలసిన అవకాశములు తగ్గిపోవలెను. బాలునికి యుక్తవయస్సు వచ్చుసరికి జోక్యము కల్గించుకొను పద్ధతి పూర్తిగ ఆగిపోవలయును. ఒకదశకును వేరొక దశకును నడుమనుండు అంతర్దశ ప్రమాదములతో కూడినది. కుటుంబరంగము

సందలి నిర్బంధవాతావరణమునుండి బాలుడు ప్రపంచమందలి స్వచ్ఛంద వాతావరణములో ప్రవేశించునప్పటి అంతర్దశ మిక్కిలి ప్రమాదభూయిష్ఠమైనది. కావుననే మేము ప్రతిపాదించిన పద్ధతుల నవలంబింపవలెనని మే మింతగ వాదించుచున్నాము. ఈ పద్ధతి ననుసరించిన పక్షమున బాలునియం దాత్మనిగ్రహాశక్తి వృద్ధిచెందును. ఆత్మనిగ్రహము నవలంబింపవలసిన యావశ్యకత క్రమముగ మాత్రము హెచ్చును. ఎవ్వరి సహాయమును లేక తనంత తానే నిగ్రహముతో ప్రవర్తింపవలసిన స్థితి క్రమక్రమముగ నేర్పడిన యెడల మానవుడు తన బాల్యమునందు గృహవాతావరణమున గల సార్వత్రిక నిర్బంధములనుండి విడివడి తనంత తానే వ్యవహారముల నడపుకొనవలసి వచ్చునట్టి యుక్తవయస్సులో ప్రవేశించు కాలమున ఆతని కెట్టి నష్టములును, ప్రమాదములును సంభవింపవు. మార్పు లాకస్మికముగ సంభవించినప్పుడు మాత్రమే ప్రమాదములు సంభవించును. రాజ్యాంగ నిర్వాహణ విధానముయొక్క చరిత్రను నీవు సూక్ష్మరూపములో నీ కుటుంబరంగమునందు ప్రదర్శింపుము. రాజ్యాంగనిర్వాహణమునందు మొట్టమొదట అవసరమైనప్పుడు నిరంకుశపద్ధతులను వాడుచు రావలెను. క్రమక్రమముగ పాలితుని స్వాతంత్ర్యము నంగీకరించు నియమబద్ధమగు రాజ్యాంగవిధానము నమలు చేయవలెను. క్రమశః పాలితుని స్వాతంత్ర్యము విస్తరింపవలయును. తుట్టతుదకు తల్లిదండ్రులు తమ యధికారములను పూర్తిగా వదలుకొనవలెను.

నీ బిడ్డలు స్వాతంత్రబుద్ధిని విస్తారముగ ప్రదర్శించినచో నీవు విచారింప నవసరము లేదు. ఆధునిక విద్యావిధానములో నిర్బంధపద్ధతులను తగ్గించి వేయుటవలన ఇట్టి పరిణామములు సంభవించినవి. మనము బాలబాలికల యొక్క నిరంకుశ విధానము నవలంబించుట తగ్గించిన కొలదియు, వారు తమ స్వాతంత్రము విషయమై యెక్కువ పట్టుదలను చూపుట తటస్థించును. ఈ రెండు పరిణామములును కూడ మేము ప్రతిపాదించుచున్న నూతన శిక్షావిధానమును మనము క్రమముగ నంగీకరించుచున్నట్లు సూచించుచున్నవి. ఈ విధానములో చిన్న బిడ్డలు తాము చేసిన పనుల యొక్క సహజపరిణామముల ననుభవించి, ముందు ముందు తామెట్లు చరింపవలెనో తెలిసికొందురు. పురోభివృద్ధి గాంచుచున్న మన సంఘమునం దిట్టి సంఘటన లనివార్యములు. స్వాతంత్ర్యాభిమాని యగు నాంగ్ల బాలుడే అనతికాలములో స్వాతంత్ర్యాభిమానియగు నాంగ్లపౌరుడుగ మారుచున్నాడు. మొదటిస్థితి లేనినాడు రెండవ పరిణామము సిద్ధింపజాలదు. పదిమంది జర్మను బాలురను అదుపులో నుంచుట సులభము కాని ఒక్క ఆంగ్ల బాలుని వంచుట కష్టమని జర్మను దేశపు ఉపాధ్యాయులు పల్కుదురట. జర్మను బాలురలోని అత్యంత సాధుత్వమును, జర్మను ప్రజలలోని దాసత్వప్రవృత్తిని అలవరచుకొనుట మనకు శ్రేయోదాయమగునా? లేక మన బాలురు ముందు ముందు స్వతంత్ర లక్షణములు కలవారుగ

నగుటకై మనము యత్నింతమా? ఇది విచారింపదగిన యంశము. మనము రెండవ మార్గమునే యెన్నుకొనిన పక్ష మున మన విద్యావిధానములో మార్పులు వచ్చితీరవలెను.

సరియైన మార్గమున విద్యను గరపుట సులభమును, సరళమునైన పనికాదు. ఇది మిక్కిలి సంకీర్ణమును, కష్ట సాధ్యమునైనది. పెద్దలు చేయవలసిన అతికష్టమైన పను లలో నిది యొకటి. ఎప్పటి కెట్లు తోచిన నప్పటి కట్లు ప్రవ ర్తించుచు కుటుంబనిర్వాహణము కావించుట మూఢులును, అపరిష్కృతబుద్ధులును కూడ చేయజాలుదురు. చీవాట్లు పెట్టుట, చెంపదెబ్బలు కొట్టుట మున్నగు శిక్షలను విధించుట ఎట్టి విజ్ఞానమును లేని మొఱటు వారికి కూడ సాధ్యమగు పనియే. పశువులు కూడ ఇట్టి శిక్షణావిధానము నవలంబిం చును. కుక్కపిల్ల తన్ను విస్తారముగ వేధించిన పక్షమున తల్లి కుక్క గుఱ్ఱుమనుచు దానిని (కుక్కపిల్లను) కొరికి నంత పనిచేసి తన యాగ్రహమును ప్రకటించును. ఇట్లు కాకుండ నాగరకమును, సమంజసమునగు శిక్షణావిధానమును నీవు అవలంబింపదలచినచో, ఆలోచనా శక్తికి కొంత పని కల్పింపవలసియుండును. అందులకై కొంత పరిశీలన, ఉపా యము, ఓరిమి, ఆత్మనిగ్రహము కావలయును. మనమిప్పుడు కొన్ని పద్ధతుల నవలంబించిన పక్షమున భావిజీవితమునందు దీని వలన నెట్టి పరిణామములు కల్గునని యెల్లప్పుడును చిం తించుచుండవలెను. అంతే కాదు. బిడ్డలెట్టి పనులుచేసిన

(ఆ పనులు మంచివి కావచ్చును లేదా చెడ్డవి కావచ్చును) వానికి సంపూర్ణముగ ననురూపములగు ఫలితములే వారికి చెందునట్లు నీవు తగిన యేర్పాట్లు చేయవలెను. అట్టి పని మును బిడ్డలు చూపు ప్రవర్తనకు హేతువు లేమై యుండునని విచారింపవలెను. ఒక్కొక్క సందర్భములో బిడ్డలు మంచి పనులను చేయుదురు. కొన్ని సందర్భములలో వారు చేయు పనులు పై చూపులకు మంచివిగనే కాన్పింప వచ్చును. కాని ఆ కార్యములకు మూల మధమప్రవృత్తులు కావచ్చును. వీనిని నీవు చక్కగా విమర్శించి గుర్తింపవలెను. ఒక్కొక్క మారు బిడ్డలు కొన్ని తెలిసియు తెలియని పనులను చేయు దురు. వాని నవిధేయతగ భావింపరాదు. బిడ్డల మనస్సు లలో లేని దుష్టభావములను వారికెన్నడును ఆరోపింపరాదు. ఇట్టి బలమైన తప్పులు చేయకుండునట్లు పెద్దవారెల్లప్పుడును జాగ్రత్త పడుచుండ వలయును. ప్రతి బిడ్డ యొక్క స్వభావమునకును అనువుగ నుండునట్లు నీవు నీ పద్ధతు లను మార్చుకొనవలెను. బిడ్డల యొక్క స్వభావములు నూతన దశయందు ప్రవేశించినప్పుడు తదనుగుణముగ నీ పద్ధతులలో మరింత మార్పును గొనివచ్చుటకై నీవు సిద్ధపడి యుండవలయును. కొన్ని శిక్షణాపద్ధతుల వలన నీవు కోరిన సత్ఫలితములు చాలకాలము వరకును కాన్పిం పవు. అట్టి సమయములలో నీవు విశ్వాసమును కోల్పో వక సక్రమమగు శిక్షణను ఓరిమితో నవలంబించుచు

రావలెను. కొందరు బిడ్డలు కొంతకాలమువరకును తప్పు మార్గములలో శిక్షణ నందియుండవచ్చును. అట్టివారి యెడల నుత్తమ శిక్షణాపద్ధతులను ఫలవంతము కావించుటకొరకై నీవు ఎక్కుడు కాలమును వ్యయపరుపవలసివచ్చును. ఎక్కుడు పట్టుదలను ప్రదర్శింపవలసి వచ్చును. విద్యారంగమునందు మొట్టమొదటనుండియు సక్రమములగు పద్ధతులనే అవలంబించుచు వచ్చినను సక్రమవాతావరణమును సృష్టించుట కష్టసాధ్యము. అట్టి పరిస్థితులలో లోపపూరితమగు స్థితిని సరిదిద్ది సక్రమమార్గమునకు గొనివచ్చుట కష్టతరము కాదా? తరచుగ నీవు బిడ్డలయొక్క భావములను నీ భావములను కూడ విమర్శకు లోనుకావించుచుండవలెను. నీ మనస్సునకు ఎడనెడ తట్టునట్టి యూహాలలో నేవి బిడ్డల క్షేమకాంక్షపై ఆధారపడి యున్నవో, ఏవి నీ స్వార్థపరత, అలసత్వము, అధికారకాంక్షల వలన నుద్భవించుచున్నవో ఎప్పటికప్పుడు నిర్ణయించుకొనుచుండవలెను. ఈ దుష్ప్రవృత్తులను గుర్తించి నంతమాత్రమున లాభములేదు. వానిని నీ వణచివేయవలయును. ఒకవంక నీవు నీ బిడ్డలకు విద్య నేర్పుచు, వేరొక వంక ఉత్తమమగు శిక్షణను నీ యంతట నీవే పొందవలెను. నీ బిడ్డల యందును, నీయందును, ప్రపంచమందును ప్రతిఫలించుచున్న మానవస్వభావమును, తల్లక్షణములను నీవు చక్కగ గుర్తింపవలెను. మిక్కిలి క్లిష్టమైన ఈ కృషి నీ మానసికశక్తులకు బలము చేకూర్చును. నీ వెల్లప్పుడును

నీయందుగల ఉత్తమభావములకు మాత్రమే స్వాతంత్ర్య మొసంగి దుష్టభావములను నిరోధింపవలెను. ఇయ్యది నీవు పొందవలసిన నైతికశిక్షణ. మాతాపితృధర్మములను సక్రమ పద్ధతులపై నిర్వర్తించుటవలననే మానవునియొక్క మాన సికశక్తులు పరిపూర్ణదశను పొందును. కాని ఈ సత్యము నెల్ల వారును నేడు గుర్తించుట లేదు. మానవ హృదయమందు నెలకొనియుండు బలవత్తరమగు ప్రేమానుబంధముల వలననే మనము మనల నుత్తమమగు క్రమశిక్షణకు లోనుకావించు కొనుచున్నాము. లేనిచో నియ్యది మన కలవడదు. ఈ పద్ధతి యెంత శ్రేష్ఠమైనదో వేరుగ తెలుపనక్కరలేదు.

మేము వర్ణించుచున్న ఆదర్శప్రాయమగు విద్యావిధా నమును కొందరు సంశయాత్మకదృష్టితో నుపలక్షింతురు. మరికొంద రిది తెలిసికొని నిరుత్సాహము చెందుదురు. ఇం దిమిడియున్న ఉత్తమాదర్శములను గుర్తించి కొంద రిదియె సక్రమ విద్యావిధాన మని యంగీకరింతురు. ఈ విద్యావిధా నము కేవల ముద్రేకపరులును, సహృదయత లేనివారును, దూరదృష్టివిరహితులు నగువారి కుపయోగపడదు. మానవ స్వభావమునందలి యుత్తమగుణముల నలవరచుకొన్నవారికి మాత్రమే యిది సరిపడును. కావున నీ విద్యావిధానము బాగుగా అభివృద్ధిగాంచిన సంఘమునకు మాత్రమే సరిపడున దని యెరుంగవలయును. ఇందలి పద్ధతుల నమలు కావిం చుటకై ఎంతో కష్టపడవలయును; ఎంతో స్వార్థరాహిత్య

మును చూపవలెను. అందువలన తాత్కాలికమును, శాశ్వతమును అగు సౌఖ్యములు రెండునుకూడ సిద్ధించు నని బుద్ధిమంతులు గుర్తింపగలరు. దుష్టమగు విద్యావిధానము వలన రెండు విధములగు చెరుపులు కల్గును. తండ్రియు, బిడ్డయు కూడ దానివలన చెడిపోవుదురు. సక్రమమగు విద్యావిధానము రెండు విధముల మేలు చేయును. దానివలన శిక్షణ నొసంగువారును, శిక్షణ పొందువారును కూడ ఉత్తమస్థితికి రాగలరు.



# శారీరక శిక్షణ

సంపన్నులగు గృహస్థుల యిండ్లయందును, సంతల లోను, గ్రామపు రచ్చచావిడులందును, సమావేశమగు ప్రజలు సాధారణముగ రాజకీయవిషయములను, ఆపైన పశువుల పెంపకమును గూర్చియు చర్చింతురు. వేట ముగించుకొని ఇంటికి తిరిగి వచ్చుచు, పెద్దలు గుఱ్ఱముల పోషణ, వానిలోని ఉత్తమ అధమ జంతువుల విభాగమునుగూర్చి మాట్లాడుకొనుట వాడుక. ఇక మైదానములలో వాహ్యాళికి పోయినవారు కుక్కలలోని వేర్వేరు తెగలనుగూర్చి తప్పక విమర్శ కావించుకొందురు. ఆదివారమునాడు చర్చినుండి మరలివచ్చుచు గ్రామములందలి వ్యవసాయదారులు ప్రప్రథమమున ఫాదిరీదొర ఉపన్యాసమందలి బాగోగులను గూర్చి తర్కింతురు. ఆపైన వాతావరణము, పంటలు, పంటల నిలువలు మున్నగు విషయములు వారి సంభాషణయందు దొరలిపోవును. ఆమీదట పశువులగ్రాసము, వివిధతరగతుల గ్రాసములలోని లాభనష్టములును చర్చకు వచ్చును. గొఱ్ఱెల కాపరులు, పందుల కాపరులును తమ తమ యధీనమందున్న జీవములను తామెట్లు పెంచుచున్నదియు ఒండొరులతో చెప్పికొందురు. ఈ జంతువుల నే విధముగ పెంచిన నేమి ఫలితములు సంభవించునో వారి చర్చలవలన తేలును. జంతువుల పెంపకమునుగూర్చి వా రెట్లు శ్రద్ధవహింతురో దీనివలన

వ్యక్తమగును. కుక్కలు, గుఱ్ఱములు, పాడిజంతువులు, గొఱ్ఱెలు మున్నగువాని పోషణనుగూర్చి చర్చించువా రొక్క గ్రామీణులు మాత్రమే కారు. పట్టణములలోనుండు సామాన్య కుటుంబీకులు తమ యిండ్లలో కుక్కలను పెంచుదురు. సౌఖ్యప్రియులగు వయసుకాండ్రు గుఱ్ఱపు పందెములలో పాల్గొందురు. వయస్సు ముదిరిన పెద్దలు పల్లెలలో తమకుగల వ్యవసాయమునుగూర్చి తరచు చింతించుచుందురు. వీరును, మన దేశమునందలి ఇతర ప్రజ లనేకులును కూడ పశువుల పుట్టుక, వాని పెంపకము, వాని శిక్షణ, మున్నగు విషయములలో చాల అభిరుచి చూపుదురు.

భోజనానంతరము కాని, తదితర సందర్భములందు కాని బిడ్డలను పెంచు విధానమునుగూర్చి యెవరైన చర్చింపగా మీరు విన్నారా? కలయింటి గృహస్థుడు నిత్యమును తన గుఱ్ఱముల శాలలోనికి పోయి, దాని పరిస్థితిని, గుఱ్ఱముల పెంపకమునుగూర్చి పరీక్షించును; ఆమీదట తన యింటికి చెందిన ఆవులు, గొఱ్ఱెలు మొదలగువానిని చూచుకొని వాని సంరక్షణనుగూర్చి పశుపాలకుల కాజ్ఞలిచ్చును. కాని శిశుగృహములోనికి పోయి బిడ్డల కెట్టి యాహార మే సమయములం దిచ్చుచున్నారో, ఆ గృహముయొక్క ఆరోగ్యస్థితి యెట్లున్నదో తెలిసికొనుటకై ఆతడు యత్నింపడు. వ్యవసాయము, జంతువులవేట మున్నగు విషయములకు సంబంధించిన పుస్తకము లాతనివద్ద తప్పక ఉండును. అందలి విశే

షములనుకూడ ఆ భద్రపురుషుఁ డెరింగియుండును కాని బిడ్డలను శైశవమునందును, కౌమారమందును పెంచవలసిన విధానమునుగూర్చి గ్రంథముల చదివినవారు మనలో నెందరుందురు? పశువులకు తెలికపిండి, చొప్ప, ఎండుగడ్డి మున్నగువానిని తినిపించినచో కలుగు లాభనష్టములగూర్చి ప్రతి రైతునకును, ప్రతి భూస్వామికిని కూడ తప్పక తెలియును. కాని పెరుగుచున్న బిడ్డల కెట్టి యాహార మీయవలెను, వివిధములగు నాహారములందలి లక్షణము లేవి యని తెలిసికొనినవారు మిక్కిలి అరుదుగ నుందురు. ఎవ్వరి నిత్యవ్యవహారములను చూచుకొనుటలో వారు నిమగ్నులై ఈ గ్రామీణులు బిడ్డల పెంపకమునుగూర్చి శ్రద్ధవహింపరని కొందరు సమాధానము చెప్పవచ్చును. కాని యిది సత్యదూరము. పట్టణవాసులలో కూడ పలువురకు గుఱ్ఱము మేత మేయగానే దానికి పని కల్పింపకూడదని తెలియును. వీరందరును బిడ్డల తండ్రులు కావచ్చును. కాని తమ బాలబాలికల భోజనమునకును వారి చదువుసంధ్యలకును నడుమ తగినంత విరామ సమయము లభించుచున్నదా లేదా యని చింతించువా రొక్కరును ఉండరు. ఇట్టివారిని మనము నిలువదీసి పరీక్ష చేసినయెడల బిడ్డల పెంపకము తమకు సంబంధించిన విషయము కాదనియు, ఈ శాఖ కేవలము స్త్రీలకు మాత్రమే చెందినదనియు, మనకు ప్రత్యుత్తరము లభించును. శిశుసంరక్షణ యను విషయము మగవారి హోదాకు తగినపని కా దను భావ మీ ప్రత్యుత్తరమునం దిమిడి యుండును.

పరంపరగ మనలో ప్రబలియున్న భావముల సట్లుండ నిచ్చి నిజస్థితి నించుక విమర్శింతము. ఉత్తమతరగతి వృషభ ముల పెంపకమును గూర్చి విద్యావంతులగువారు తమ యమూల్యమగు కాలమును వెచ్చించి యాలోచింతురు. కాని చక్కని బిడ్డలను పెంచుట యనుపని తమ దృష్టి నాకర్షిం చుట కనర్హమైనదని వారు భావింతురు. ఇక తల్లు లన్ననో వారికి కొంత భాషాజ్ఞానము, సంగీతము, కుట్టుపని మొదలగు కొన్ని పై మెరుగు విద్యలు మాత్రము అలవడియుండును. ఏవో తాతలనాటి మూఢవిశ్వాసములను పట్టుకొని ప్రాకులాడు దాదులు ఈ తల్లులకు సలహాదారులు. వీరిరువురును కలసి బిడ్డల ఆహారము, దుస్తులు, శరీరవ్యాయామము మున్నగు వానిని నిర్ణయింతురు. ఇది యిట్లుండగా, వీరి తండ్రులు పందులకు తగినంత పుష్టిని కల్గించుట యెట్లను విషయమును గూర్చి పుస్తకములు, మాసపత్రికలు చదువుచుందురు; వ్యావ సాయదారుల సమావేశములలో పాల్గొందురు; వివిధములగు ప్రయోగములను చేయుదురు; చర్చలను సాగింతురు. డెర్బీ పందెములలో బహుమానమును సంపాదింపగల గుఱ్ఱమును పెంచుటకై ప్రాకులాడువారు పెక్కండ్రు కలరు. కాని ఒక కలియుగభీముని పెంచుటకై యత్నించువారు తక్కువ. మనము ఇతరజీవుల సంతానమును సక్రమముగ పెంచుటకై యెంతో కృషి సల్పుదుము. కాని మన బిడ్డల పోషణ విష యమై తగినంత శ్రద్ధ పూనుటలేదు. ఇది యెంత శోచనీయ మగు విషయము ?

మనము బిడ్డల పెంపకమును గూర్చి చూపు నిర్లక్ష్య భావము కేవలము హాస్యాస్పదమేకాదు. అది చాల నష్ట దాయకమైనది. బుద్ధిమంతుడగు నొక గ్రంథకారుడు తెల్పి నట్లు ప్రతిమానవుడునుకూడ మొట్టమొదట దృఢగాత్రుడుగ నుండి తీరవలెను. దృఢగాత్రులగు మానవులతో కూడిన సంఘమే అభివృద్ధిని గాంచజాలును. మానవుల శక్తిసామ ర్థ్యములును, కష్టసహిష్ణుతయును మనకు కేవలము యుద్ధ కాలమందే కాక ఇతర సమయములలో కూడ అవసరము. దేశమందలి కార్మికుల బలసంపద మన వ్యాపారాభివృద్ధికి మూలహేతువు. గడచిన శతాబ్దులలో మన దేశవాసులు శారీరక శక్తిసామర్థ్యములలో మరెవ్వరికిని వెనుకబడి యుండ లేదు. కాని ముందుముందు మనకొక కఠినపరీక్ష యాసన్నమై యున్నది. ఆధునికయుగములో వివిధజాతులకు నడుమ సాగు చున్న పోటీలో ఎంతటి యుత్తమ శారీరకశక్తులును కూడ మన యవసరములను తీర్పజాలకున్నవి. ఈనాటి అవిరళ కార్యభారమునకు తట్టుకొనజాలక అనేకులు తమ యారో గ్యమును భగ్నము కావించుకొనుచున్నారు. ఈ కార్య భారముయొక్క తీవ్రత ఇట్లే ముందుముందు కూడ ఉండ గలదని తోచుచున్నది. అట్టి పరిస్థితిలో ఎంతటి దృఢగాత్రు లును కూడ నేటి అమిత పరిశ్రాంతికి తాళజాలరు. కావున బిడ్డలను పెంచునప్పుడు, వారు భవిష్యజ్జీవితమం దెదుర్కొన బోవుచున్న పోటీలో నెగ్గుటకై వలయు మానసిక శక్తులను,

ఆధునికయుగములో మన శరీరమునకు సంభవించు రాటు పోటులను సహించుకొనగల్గు శరీరదార్ఢ్యమును, వారికి కలుగజేయు విధముగ వర్తించుట చాల ముఖ్యము.

అదృష్టవశమున బిడ్డల శారీరకశిక్షణ యను విషయము మనలో పలువురు బుద్ధిశాలుల దృష్టి నాకర్షించుచున్నది. వార్తాపత్రికలలో నీ యంశమును గూర్చి చర్చలు సాగు చున్నవి. శారీరకశిక్షణ కొరకై ప్రత్యేకపాఠశాలలుకూడ నెలకొల్పబడుచున్నవి. కావున నీ యంశమునుగూర్చి చర్చ కావించుట యావశ్యకమని వేరుగ తెలుపనక్కరలేదు.

ఆధునిక విజ్ఞానముచే కన్గొనబడిన సత్యములను శిశు గృహములకును, పాఠశాలలకును వర్తింపజేయుట చాల యవ సరము. నేడు మనము ఎద్దులను గూర్చియు, గొఱ్ఱెలను గూర్చియు శాస్త్రప్రయోగశాలలలో తర్కవితర్కములు సాగించుచున్నాము. ఇట్టి విచారమునే మనము మన బిడ్డలను గూర్చి కూడ జరుపుట చాల యవసరము. గుఱ్ఱములు మొద లగు జంతువుల పెంపకము ముఖ్యముకాదని మా యుద్దేశ్య మెంతమాత్రమును కాదు. కాని వాని పోషణను గూర్చి శాస్త్రరీత్యా కొన్ని ముఖ్యాంశములు కన్గొనబడినవి. ఆ యంశ ములు చాల ఉపయోగకరములని ఆచరణవలన తెలియ వచ్చినవి. ఈ శాస్త్రీయాంశములను జంతువులకు వలెనే మానవులకు కూడ వర్తింపజేయవలెనని మా యభిప్రా యము. ఈ విధముగ జంతువులను మానవులను ఏక సూత్ర

మున గ్రథించి ప్రసంగించుట కొందరికి ఆశ్చర్యమును, మరి కొందరి కాగ్రహమును కల్గింపవచ్చును. కాని మానవుడు కూడ ఇతర జంతువులవలెనే కొన్ని జీవధర్మములకు లోనై యున్నాడు. ఇది నిర్వివాదాంశము. దీనిని మన మంగీకరింపకతప్పదు. సామాన్య జీవజంతువుల యందును, మానవుల యందును, అనుదినము సాగుచుండు కొన్ని భౌతిక క్రియావిశేషములు సమానములు. వీనిని నిర్ణయించు సూత్రములలో కూడ సమానత చూపట్టుచున్నది. ఈయంశమును శారీరశాస్త్ర పండితులును, రసాయన శాస్త్రవేత్తలును కూడ ఏకగ్రీవముగ నంగీకరించుచున్నారు. ఈ విషయము నంగీకరించుటచే కొంత లాభము కూడ కలదు. ప్రకృతి పరిశీలనము వలనను, ప్రయోగముల మూలమునను జంతువులను గూర్చి మనము తెలిసికొన్న శాస్త్రీయ సూత్రములను, మానవుల ఉపయోగము కొరకై కూడ వాడవచ్చును. జీవశాస్త్ర విజ్ఞానమునందలి ప్రాథమిక సూత్రములను మానవుని బాల్యకౌమారము లందాతని శరీరపోషణకై యెట్లు వర్తింపజేయనగునో యించుక విచారింతము.

మన సాంఘికజీవితమునందు క్రమవిధానము ప్రకారము కొన్నిమార్పులు జరుగుచుండుట మీరు చూడవచ్చును. విప్లవములు సంభవించిన తరువాత నిరంకుశ ప్రభుత్వములు నెలకొనును. ప్రజలు కొంతకాలము ప్రాచీనాచారముల పట్టుకొని ప్రాకులాడిన వెనుక సంస్కరణ యుగము

ప్రారంభమగును. జనులు నీతినియమములు లేకుండ యథే చ్ఛగ కొంతకాలముపుచ్చి, ఆ పైన అత్యంతనియమబద్ధ మగు జీవితము నవలంబింతురు. వ్యాపారరంగములో వర్త కులు కొన్ని సంవత్సరములు విచ్చలవిడిగ సొమ్ము పెట్టుబడి పెట్టి, వ్యాపారము చేయుదురు. ఆ పైన తమ వ్యాపార మును చాల వరకు తగ్గించుకొందురు. వస్త్రాద్యలంకారము లలో కూడ సౌందర్యోపాసకుల భావము లొక కొననుండి వేరొక కొనకు ఊగుచు, మార్పునకు లోనగు చుండును. క్రమప్రకారము జరగుచుండు ఈ మార్పులు మన యాహార విధానమునకు కూడ వర్తించునని తెలుపనగును. ఒకానొక ప్పుడు మన దేశములో ప్రజలు ఆహారపానీయముల విషయ ములో నమితత్వమునకు దాసులై యుండెడివారు. ఇప్పుడా యలవాట్లు మారి మితాహారము, మితపానము, శాకా హారము, మద్యపాననిషేధము మున్నగు భావములకు వ్యాప్తి హెచ్చుచున్నది. బహుశః ఒకప్పుడు మనలో ప్రబలి యుం డిన నియమహీనతయెడల ఈ నూతన పద్ధతులు నిరసన తెల్పు చున్నవి కాబోలు. ప్రాప్తవయస్కులగువారి జీవితవిధా నములో వచ్చిన మార్పుతోపాటు బాలబాలికల జీవితవిధాన ములో కూడ మార్పు సంభవించుచుండును. మన తండ్రుల తరములో బిడ్డల కెంత యెక్కువ ఆహారము నిచ్చిన నంత మంచిదను భావము వ్యాపించియుండెను. ఇప్పటికిని కూడ వ్యవసాయదారులును, మారుమూల గ్రామములలో నివసించు

వారును తమ బిడ్డలకు సాధ్యమైనంతవరకు మెక్కపెట్టవలె నని చూచుచుందురు. ఇది మన సాంప్రదాయము యొక్క ప్రభావము. కాని విద్యాధికులగు వారిలో సీపక్షతుల యెడల వైముఖ్యము ప్రబలినది. వారిలో నియతాహార సిద్ధాంతములు వ్యాప్తిచెందినవి. వీరు తమబిడ్డల కధికాహారము నిచ్చుటకు మారు కావలసిన యాహారమును కూడ ఇచ్చుట మానినారు. గడచిన తరములో ప్రబలియున్న కేవల పశుజీవితమునెడ వీరికి గల విరోధభావము స్వానుష్ఠానములో కంటె బిడ్డలను పెంచెడి విధానములో నెక్కుడుగా ప్రదర్శిత మగుచున్నది. వారి వైరాగ్యభావములకు వారి జఠరాగ్ని యొక్క యడ్డంకిగ పరిణమించుచున్నది. కాని చిన్నబిడ్డల కొరకై నియమముల కావించునప్పుడు దాని కెట్టి నిరోధమును లేదు.

అమితాహారమును, అల్పాహారమును రెండును కూడ నష్టదాయకములే. కాని యీ రెండింటిలో అల్పాహారమే యెక్కుడు నష్టమును కల్గించును. ఎన్నడైన నొక పర్యాయము మితమును దాటి భుజించినను దానివలన కల్గు దుష్ఫలితములను సులభముగ దూరము చేయవచ్చును. కాని సరియైన యాహారము లేకుండుటచే కల్గు నష్టములను పూరించుట కష్టసాధ్యమని యొక శరీరశాస్త్రజ్ఞుడు పల్కుచున్నాడు. అంతే కాదు. మన ఆహారవిషయములో నితరు లెవ్వరును తెలివి తక్కువగ జోక్యము కల్పించుకొనని పక్షమున, అమిత భోజనమున కవకాశములు చాల తక్కువ గలవు. అమితా

హారము పెద్దలలోనే కాని పిన్నవారిలో తరచు కానరాదు. స్వాభావముచే బిడ్డలు తిండిపోతులు కారు. వారికి జిహ్వాచాపల్యము కూడ మెండుగ నుండదు. వారిని పెంచు పెద్దవారే బిడ్డల యధికాహారమునకు బాధ్యులని పై శాస్త్రజ్ఞుడు వాక్రుచ్చుచున్నాడు. బిడ్డలకాహారము స్వల్పముగా నీయవలెనని వాదించువారి పరిశీలనాశక్తి లోపభూయిష్టమనియు, వారి వాదములు దుర్బలములనియు చెప్పక తప్పదు. రాజ్యాంగ విధానములో కొందరు పాలకు లవసరమును మించిన నిర్బంధముల విధింతురు. అట్లే శిశుగృహములో కూడ జరుగుచుండును. బిడ్డలపై విధించు అనావశ్యకమగు నిర్బంధములలో వారికి తగినంత యాహార మీయకపోవుట యనునది ఒకటి.

"అయినచో బిడ్డలను వారి యిష్టమువచ్చినట్లు తిన నీయవచ్చునా? అల్పవయస్సు గలవారిని వారి కిష్టమైన వస్తువుల యథేచ్ఛముగ తిననిచ్చినచో వ్యాధులు తప్పక సంభవించును. అయినను వారిని విచ్చలవిడిగ ప్రవర్తింప నీయనగునా?" అని కొందరు ప్రశ్నింతురు. దీని కొక్కటియే సమాధానము. సృష్టియందలి తక్కువ జీవములకు ఆకలియే మార్గదర్శకముగ నుండును. చిన్నబిడ్డలకును, రోగులకును, వివిధప్రాంతములలో నివసించు వివిధజనులకును, ఆరోగ్యవంతులగు ప్రాప్తవయస్కు లందరికిని కూడ ఆకలియే మార్గమును చూపునట్టిది. కావున చిన్నబిడ్డలకు కూడ నియ్యదియే మార్గదర్శిని యని మా భావము. ఇతర జీవుల

విషయములో విశ్వాసపాత్రమగు నీ శక్తి ఒక పెద్దల విషయ ములో అన్యథా వర్తింపదు కదా !

మేము తెల్పిన అంశములకు విరుద్ధమైన విషయము లను కొందరు తెల్పగలరు. వారికి మా వాదన రుచింపదు. వారు తెల్పగల విషయములను మేము త్రోసిపుచ్చ దలచుట లేదు. అన్యోన్యవిరుద్ధమైన యీ పరిస్థితిని మేము సమర్థింప గలము. ఆహారవిషయములో కఠిన నిర్బంధములను విధింప వలెనని వీరి యభిప్రాయము. ఇట్టి నిర్బంధ విధానము వలన కొన్ని సందర్భములలో నమితత్వము సంభవింపవచ్చును. ఇయ్యది పై నిర్బంధవిధానమునకు ప్రతిఫలము. ఇంద్రియ ప్రవృత్తుల నత్యంతము నిరోధించుటచే కొన్ని సందర్భములలో వికృత పరిణామములు సంభవింపవచ్చును. చిన్నతనములో మిక్కిలి కట్టుదిట్టములందు పెరిగినవారిలో కొందరు పెద్ద వారైన తర్వాత విచ్చలవిడిగ ప్రవర్తింపసాగుదురని తరచుగ లోకులు చెప్పుకొనుచుందురు. ఇందు నిజము లేకపోలేదు. కొన్ని మఠములలో సన్న్యాసినులు కొంతకాలము వరకును మిక్కిలి నియమబద్ధమగు జీవితమును గడపి ఆ పైన కేవల పశుధర్మముతో ప్రవర్తించిన దుష్టసంఘటనలు మాకు తెలియవచ్చినవి. సహజమగు కోర్కెలను చిరకాలము వరకును అణచి యుంచుటచే నయ్యవి మిక్కిలి దుర్దమరూప మున ప్రత్యక్షమగును. చిన్నబిడ్డల సహజమగు కోర్కెలను, వాని యెడ మనము నెరపు నడవడిని కొంచెము పరికింపుడు.

సాధారణముగ చిన్న బిడ్డలందరికిని తీపివస్తువులనిన ప్రాణము. ఈ కోరిక కేవలము జిహ్వా చాపల్యము వలన సంభవించున దని మనలో పలువురు భావింతురు. ఇతర కోరికల వలెనే దీనిని కూడ తొలగించవలెనని కూడ మనము తలంతుము. కాని రీశరశాస్త్రవేత్తలు మనవలెకాక ప్రకృతి కావించిన ఏర్పాట్లలో నేదో యొక వైశిష్ట్యత యుండునని యూహించి బాలబాలికలు తీపివస్తువుల యెడల చూపునట్టి మోజున కితరకారణములుండవచ్చునని తలంతురు. దీనిని గూర్చి పరి శోధన జరిపిన మీదట వారి యూహలు నిరాధారములు కావని ధ్రువపడును. మన దేహములో నిరంతరము జరుగు చుండు భౌతికకార్యకలాపములలో చక్కెర చాల ముఖ్య పాత్ర వహించును. చక్కెరయును, కొవ్వు పదార్థములును తుట్టతుదకు మన దేహములో భస్మముగా మారును. తత్ఫ లితముగ దేహములో నుష్ణతయుత్పన్నమగును. మనము భుజించు పదార్థములన్నియు మొట్టమొదట చక్కెరగమారి ఆ పైన నుష్ణమును కల్గించు నాహారముగ పరిణతి నొందును. చక్కెర యుత్పత్తి మన దేహములోనే జరుగుచుండును. ఆహారము జీర్ణమగునప్పుడు పిండి పదార్థములు చక్కెరగ మారుటయేగాక, కార్జ్యము నందు కూడ ఆహారములోని వివిధవస్తువులు చక్కెరగ పరిణమించునని నిరూపింపబడినది. దేహమునకు చక్కెర చాల యవసరము. కావున ఇతర పదార్థములు లభింపనప్పుడు నత్రజనసంబంధమైన పదార్థ

ముల నుండి మన శరీరయంత్రము చక్కెర నుత్పత్తికావించు కొనును. ఉష్ణోత్పాదకమగు చక్కెర యనిన చిన్న బిడ్డలకు ప్రాణము. క్రొవ్వు పదార్థము లనిన వారికిష్టముండదు. (ఈ పదార్థములు భస్మముగా మారునప్పు డెంతయో ఉష్ణము వ్యయపడిపోవును) ఈ రెండు లక్షణములను జోడించి చూచిన యెడల మనకొకసత్యము తేటపడును. బిడ్డల దేహములలో క్రొవ్వు పదార్థములను హరించుకొనుశక్తి పరిమితమైయున్న కారణమున వారు చక్కెర కొరకై విశేషము ప్రాకులాడె దరు. క్రొవ్వుపదార్థముల వలన సంభవించు నష్టమును చక్కెర పదార్థముల మూలముగ మన దేహము పూర్తిచేయుచున్న దని యెఱుంగనగును. శాకామ్లముల యెడ బిడ్డలకు చాల ప్రీతి. వారన్నివిధములగు పండ్లను ప్రీతితో తిందురు. మరే పండ్లను లభింపని యెడల వారు పచ్చికాయలను, వగరు పిందెలను కూడ ఆరగింతురు. ధాత్వామ్లముల వలెనే శాకామ్లములు కూడ దేహమునకు పుష్టినొసంగును. మిత ముగ స్వీకరించిన పక్షమున నయ్యవి మనకు లాభమును కూర్చును. అంతేకాదు. ఈ ఆమ్లములను వాని సహజ రూపములో మనము గ్రహించినచో నితర సుగుణములు కూడ కల్గును. చక్కగ పండిన పండ్లను తినుటవలన మలవిస ర్జనము సులభమగును. వైద్యు లీ యంశము నంగీకరించి యున్నారు. బాలబాలికలకు గల సహజమైన కోర్కెలను, మనము వారియెడ ననుసరించు విధానమును ఇంచుక పోల్చి

చూడుడు. తీపివస్తువుల యెడలను, పండ్ల యెడలను అల్ప వయస్కులకు సహజముగ గల ప్రీతి వారి శారీరకధర్మము లపై ఆధారపడియున్నది బిడ్డలను పోషించువారీ కోర్కె లను నిర్లక్ష్యము చేయుటయే కాక కొన్ని సందర్భములలో వానిని నిషేధింతురు. ఉదయము రొట్టె, పాలు, తేసీరు, రాత్రి యందు రొట్టె, వెన్న, మాత్రమే బిడ్డల కాహారముగ నొసంగబడును. ఈ పద్ధతిలో ఏ కొంచెము మార్పు కల్గినను, ఇంత కంటె రుచికరమగు నాహారము వారికి లభింపదు. బిడ్డలకు రుచికరమగు నాహారము నొసంగుట అనవస రము, తప్పు అని మన పెద్దలు భావించుచుందురు. దీని వలన కల్గు పరిణామముల గమనింపరు. పండుగ పబ్బము లలో వివిధ భక్ష్యము లింటిలో తయారైనప్పుడును, ఎవ్వ రైన పెద్దలు వారికి జేబు ఖర్చులకై పైకము నీయగా మిఠాయి అంగడి వారి స్వాధీనమైనప్పుడును, లేదా ఎవ్వరి దైన పండ్ల తోటలోనికి వారికి ప్రవేశము లభించిన పక్షము నను, చిరకాలము నుండి అణగియున్న బాలుర కోరికలొక్క సారిగ విజృంభించును. అప్పుడు వారు మితిమీరి మెక్కు దురు. మరునాటి నుండి తమ యాహారనియమము మరల ప్రారంభమగును కావున బాలురు అట్టి సందర్భములలో వెనుక ముందులు చూడక పొట్టనింపుకొందురు. దీని వలన తాత్కాలికముగ వారి జీర్ణశక్తి చెడిపోవును. అప్పుడీ పెద్దలు మరల జోక్యము కల్పించుకొని బిడ్డలను వారి యాకలి తీరు

పరకును తిననిచ్చుట తప్పని శాసనము కావింతురు. అసహజ మగు నిర్బంధముల వలన సంభవించు దుష్పరిణామములను చూపి, ఇంకను నిర్బంధముల విధింపవలెనని పేరు వాదింతురు. ఈ పద్ధతి చాల అనర్థదాయకమైనదని మా విశ్వాసము. బిడ్డల శరీరస్వాస్థ్యము కొరకై వారికి కొన్ని రుచికరములగు పదార్థములు తప్పక కావలెను. వారికి నిత్యమును ఈ పదార్థముల నిచ్చుచు వచ్చినచో వారెన్నడును మితిమీరి తినరని మా నమ్మకము. ప్రస్తుత పరిస్థితులలో బిడ్డలు తమ కవకాశము లభించినప్పుడెల్ల తిండిపోతులై వర్తించుచున్నారు. ఆహారముతోపాటు చిన్నబిడ్డలకు ఫలములను కూడ ఇచ్చుట మంచిదని వైద్యులు తెల్పుచున్నారు. ఒక భోజనమునకు వేరొక భోజనమునకును నడుమ ఫలములను భుజింపరాదు. పెద్దలీ సూత్రము ననుసరించి వర్తించిన పక్షమున బిడ్డలు కసుగాయలను భక్షించుట సంభవింపదు.

ఆహార విషయములో బిడ్డల యాకలి ననుసరించి వర్తించుటయే సమంజసము ఇందులకు విరుద్ధముగ వాదించు వారి భావనలు సహేతుకములు కావు. అంతే కాదు. ఈ యంశమునందు బిడ్డల యాకలికంటె విశ్వాసపాత్రమగు మరి యొక సాధనము లేదని మా నమ్మకము. బిడ్డల కోర్కెలకు మారుగ తల్లిదండ్రులు తమ నిర్ణయముల నమలు చేయుట నేడు వాడుకగనున్నది. దీనికేపాటి విలువగలదో చూడుదము. భోజన సమయమున హారలాలు మరికొంచెము ఆహారము

కావలె నని కోరినప్పుడు తల్లియు, దాదియు, ఆ కోర్కెను మన్నింపరు. వీరి నిర్ణయముల కేమి యాధారముకలదు? ఆత నికి కావలసిన యాహారము నాతడు భుజించినట్లు తల్లి భావించును. కాని ఆ భావన కేమి హేతువులు కలవు? బిడ్డయొక్క అవసరములను గుర్తించుట కామె కేవైన యలౌకిక శక్తు లున్నవా? లేనిచో నిట్టి విషయముల నామె యెట్లు నిర్ణయింపగలదు? మన శరీరమునకు కావలసిన యాహారము యొక్క పరిమాణ మనేకాంశములపై నాధారపడియుండును. ఉష్ణోగ్రత, వాతావరణములోని తేమ, గాలి యందలి విద్యుత్ప్రసారము, బాలుడు కావించిన శారీరక కష్టము, అంతకు పూర్వము చేసిన భోజనములోని ఆహారపు పరిమితి అందలి దార్ఢ్యము, ఇదివరలో స్వీకరింపబడిన ఆహారము జీర్ణమైన విధానము మున్నగు అనేక విశేషముల నీ సందర్భమున గమనింపవలసియుండును. ఇన్ని వివిధకారణముల సమ్మేళనము కావించి ఒక నిర్ణయము కావించుట కామె కెట్లు సాధ్యమగును? మేమొక పెద్దమనుష్యు నెరుంగుదుము. ఆత డున్నతమగు విగ్రహమును, దృఢశరీరమును కలవాడు. ఆతని యైదేండ్ల కుమారుడు కూడ తండ్రివలెనే యెత్తరి. దృఢకాయమును, మిసమిసలాడు ముఖమును, మంచి చురుకుదనమును కలవాడు. తండ్రి ఈ పిల్లవానిని గూర్చి ఇట్లు తరచు చెప్పుచుండెడివాడు. "వీనికింతయాహారము కావలెనని నిర్ణయించుటకు నా కెట్టి సాధనములును లేవు. ఈతని కీపాటి

ఆహారము చాలునని నేను నిర్ణయించితినా అది కేవలము ఊహామాత్రమే యగును. నా యూహ ఒప్పు కావచ్చును లేదా తప్పు కావచ్చును. ఊహాలపై నాకు విశ్వాసము లేదు. కావున వానికిష్టమైనట్లు వానిని భుజింపనిచ్చెదను.”
ఈ తండ్రి యవలంబించిన పద్ధతుల పరిణామముల గుర్తించిన వారందఱి వివేకమును తప్పక అంగీకరింతురు. తమ బిడ్డల యాహార పరిమితిని గూర్చి తమంతతాము కఠిన నియమముల కావించు తల్లిదండ్రులకు శరీరశాస్త్ర విజ్ఞానము లేదనియే చెప్పవలెను. నిజమగు శాస్త్రీయవిజ్ఞానము కలవారొకింత జంకుతోడనే ప్రవర్తింతురు. తెలిసినవాని గర్వము కంటె తెలియనివాని గర్వముహెచ్చు. ప్రకృతిమాత మన క్షేమమును దృష్టియందుంచుకొని ఉత్తమములగు కొన్ని ఏర్పాట్లను కావించినది. అయ్యవి నిర్దుష్టమైనవి. ఇక మన నిర్ణయములన్ననో అవి లోపపూరితములు. కావున జీవశాస్త్ర సిద్ధాంతముల నెరింగినవారు ప్రకృతినియమములనే ఎక్కుడుగ నమ్ముదురు.

బిడ్డలకు తినిపించు ఆహారపరిమాణముమాట యట్లుండనిచ్చి ఆహారపు లక్షణముల నాలోచింతము. ఈవిషయములో కూడ మనలో పలువురు బిడ్డలపై అనవసరమగు నిర్బంధముల విధించుచున్నారు. అల్పవయస్కులగు వారికి తక్కువ అహారమును అల్పమగు నాహారమును ఇచ్చుట మంచిదని సాధారణముగ నందరును భావించుచున్నారు.

మాంసాహారము చిన్నబిడ్డల కనవసరమని కూడ వీరు తలం తురు. ఖర్చు తక్కువ యగునను భావముతో సామాన్య కుటుంబీకులు ఈ పద్ధతుల నవలంబించుచుందురు. తమకోర్కెల కనుగుణ్యముగ తమ భావముల వారు సరిదిద్దుకొందురు. మాంసమును కొనుటకై తగిన వసతి లేని తల్లిదండ్రులు, మాంసాహారము పిన్నవారికి మంచిది కాదని బోధించు చుందురు. మొట్టమొదట పిన్నవారి బాధనుండి తప్పించుకొనుటకై యొకసాకుగ నుపయోగపడిన ఈ వాదము మరికొంత కాలమున కొక సిద్ధాంతముగ మారును. కాని ధనవంతులగు వారు కూడ ఈ పద్ధతినే అవలంబించుచున్నారు. అధిక సంఖ్యాకుల యాచరణయు, దాదుల సలహాయు ఇందులకు ముఖ్య కారణములు. గతించినతరమున ప్రబలియున్న అమితత్వమున కిది విరుద్ధపరిణామమనికూడ చెప్పవచ్చును.

కాని యీ విశ్వాసమున కేదైన నిజమగు హేతువు కలదేమో యని ఆలోచించినచో అట్టి దేదియును కానరాదు. దుస్తులు మిక్కిలి బిగువుగ ఒంటి కంటిపెట్టుకొని యుండవలెనని అనేక శతాబ్దులుగ ప్రజలు భావించుచు వచ్చిరి. మాంసాహారము పనికిరా దనువారిది కూడ యిట్టి మూఢవిశ్వాసమే. పసిబిడ్డల కుక్షియందు కండరముల పటుత్వము తక్కువగ నుండును. వారికి మాంసాహారమును మెత్తని గుజ్జుగ మార్చునంతటి శక్తి లేకపోవచ్చును. కాని అం దెట్టి పీచుపదార్థమును లేనియెడల వారికికూడ మాంసమును తినిపింపవచ్చును.

బిడ్డలకు రెండు మూడు సంవత్సరముల యీడు వచ్చుసరికి వారికి కండరముల శక్తి బాగుగా వృద్ధిచెందును. అట్టివారికి మాంసాహారము కూడదను నిషేధము వర్తింపదు. ఈడు వచ్చిన తరువాతకూడ మాంసాహారము లేనట్టి బాలురకు కల్గు నష్టము స్పష్టముగ కానవచ్చును. ఈ విషయమునందు శాస్త్రనిర్ణయము ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగ నున్నది. బిడ్డల కీయబడు ఆహారము పెద్దల యాహారముకంటె పుష్టికరమైనదిగ నుండవలెనని వైద్యులును, శరీరశాస్త్రవేత్తలును కూడ ఏకగ్రీవముగ పల్కుచున్నారు.

మే మిట్టి నిర్ణయమును కావించుటకు తగిన హేతువులు కూడ గలవు. యుక్తవయస్సు చెందినవారి దేహమునందును, చిన్నబిడ్డల దేహమునందును జరగుచుండు భౌతిక కార్య కలాపముల గుర్తించినచో, చిన్నబిడ్డలకు పెద్దలకంటె పుష్టి కరమగు నాహార మెందులకు కావలయునో స్పష్టపడును. మన మాహార మెందులకు తీసికొందుము? అనుదినమును మన దేహాయంత్ర మరిగిపోవుచుండును. కండరములకు కల్గు పరిశ్రాంతివలనను, మానసిక కృషివలన నరములపై పడు భారముచేతను, తదితర విధములుగను దేహము క్షీణించును. సత్త్వమును కోల్పోయిన పేశీజాలమునకు మరల బలము కూర్చవలెను. నిరంతరము సాగుచున్న శక్తిప్రసారమువలన మన దేహములో నుష్ణత తగ్గిపోవుచుండును. భౌతిక కార్య కలాపము యథాప్రకారముగ సాగుచుండుటకై మన దేహ

ములో తగినంత యుష్ణత ఉండవలెను. మన దేహమునుండి వెడలిపోయిన యుష్ణమును పునః సృష్టింపవలెను. ఈ యుష్ణో త్పాదనము కొరకై మన శరీరమందలి కొన్ని ద్రవ్యములు భస్మములుగా మారుచుండును. అనుదినమును సంభవించు చున్న తరుగుదలను పూడ్చుటకును, నిత్యావసరములకై కావలసిన యుష్ణమును కల్గించుట కింధనముల సంపాదించుట కును, యుక్తవయస్సు కలవా రాహారమును గైకొనవలెను. ఇక చిన్నబిడ్డల విషయము నాలోచింపుడు. అతడుకూడ తన పనిపాటలవలన కొంత శక్తిని కోల్పోవును. చిన్నబిడ్డ లెల్ల ప్పుడును ఏదో యొక పని చేయుచునే యుందురు. కావున పెద్దవా రెంతశక్తిని కోల్పోవుదురో ఇంచుమించు అంతశక్తిని పిన్నలుకూడ కోల్పోవుచుందురు. వారి యీడును, శరీర దార్ఢ్యమును పట్టి చూచినచో ఈ నష్టము గురుతరమైనది. చిన్నపిల్లల దేహమునుండి కూడ ఉష్ణము వెలుపలికి పోవు చుండును. పెద్దవారి దేహముకంటె చిన్నబిడ్డల దేహములో నధికభాగము చలిగాలికి వివృతమై యుండు కారణమున వారి దేహమునుండి నష్టమగు ఉష్ణత హెచ్చుగ నుండును. కావున పెద్దవారికంటె చిన్నబిడ్డలకు ఉష్ణత కల్గించు నాహా రముయొక్క ఆవశ్యకత హెచ్చు. చిన్నపిల్లవాడు మరే పనులు చేయకున్నను, సహజముగనే ఆతనికి ఆతని శరీర పరి మాణముకంటె హెచ్చు ఆహారము కావలయును. పుష్టి హెచ్చుగ నుండవలెను. దేహయంత్రమును బాగుచేయుట

కును, తగినంత ఉష్ణత నుత్పత్తి చేయుటకును, క్రొత్త పేశీ జాలములను పెంచుటకును ఆహార మావశ్యకము. ఈ యవసరముల నన్నిటిని తీర్చుట కవసరమగు ఆహారము లభించి నప్పుడే దేహము దృఢపడును. బాలుడెదుగును. కావలసిన యాహారము లభింపకున్నను బిడ్డ యెదుగవచ్చును. కాని నష్టపడిన బలము మరల సమకూడని కారణమున దేహము రోగగ్రస్తము కావచ్చును. పెద్దజీవములకును, చిన్నజీవములకును ఒక ముఖ్యమైన భేదము కలదు. దేహ నిర్మాణమునకై వినియోగపడు శక్తి, దేహమునుండి నష్టమగు శక్తి, వీని సంబంధసామ్యము పిన్నలయందును, పెద్దలయందును భిన్నముగ నుండును. ఇందు పిన్నలకు చాల అనుకూలత కలదు. కావుననే వారి దేహములు చక్కగ పెరుగును. చిన్నబిడ్డల పెంపకము విషయములో మన మెంత యవివేకముగ ప్రవర్తించినను దేహమునుండి నష్టమగు శక్తికంటె, దేహ నిర్మాణమున కుపయోగపడు శక్తియే హెచ్చుగ నుండును. కాని వారికి తగినంత యాహారము నొసంగనియెడల, వారి శరీరవికాసము కుంటుపడును. అట్టియెడ శరీరయంత్రము సంపూర్ణత నొందజాలదు. క్రమముగా వికాసము చెందుచున్న దేహమునకాహారముయొక్క ఆవశ్యకత ఎంత ఘనమైనదో గమనింపుడు. బడికిపోవు బిడ్డ లనుదినమును హావురు హావురు మనుచు వృకోదరులవలె యింటికి తిరిగి వత్తురు. ఇంతటి యాకలి మానవునకు జీవితములో మరే దశయందును ఉండదు. అంతే

కాదు. వారి కతి శీఘ్రముగనే మరల ఆకలి వేయజొచ్చును. బిడ్డల కాహారావశ్యకత యెంత హెచ్చుగ నుండునో చూపుటకు మరియొక నిదర్శనము చూపెదము. కరవులు సంభవించినప్పుడు మొట్టమొదట ప్రాణముల గోల్పోవువారు చిన్నబిడ్డలే.

పెద్దవారికంటె చిన్నబిడ్డలకే పుష్టికరమైన ఆహార మెక్కుడుగ కావలయునని ఇప్పుడు తెలియవచ్చినది. కాని ఆ యాహార మెట్లుండవలెను? వారికి నీరసమగు వస్తువుల నెక్కుడు మొత్తములో నీయవలయునా, లేక బలకరమైన యాహారమును మితముగ నొసంగవలయునా యను సంశము విచారింపదగినది. కొన్ని ఔన్సుల బంగాళా దుంపలు తినుట వలన దేహమునకు కలుగు పుష్టి అంతకంటె పరిమాణములో తక్కువగనున్న రొట్టెవలన లభించును. మాంసాహారమును రొట్టెకంటె కూడ తక్కువ మొత్తములో తీసికొనవచ్చును. అందువలన దేహమునకు సమానమగు పుష్టిలభించును. ఆహారమందలి బలవర్ధకలక్షణములు తక్కువమైన కొలదియు, భుజింపవలసిన మొత్తము హెచ్చును. దినదినప్రవర్ధమానులగు పిన్నలకు పెద్దవారు తినునంతటి బలకరమగు నాహారమునైన ఈయవలెను. లేదా సారహీనమైన యాహారము నెక్కుడు మొత్తములోనైన నొసంగవలెను. కాని యీ రెండవ పద్ధతివలన వారి జీర్ణకోశముపై యెక్కుడు భారము పడును.

పై ప్రశ్నలకు సమాధానము స్పష్టముగ కాన్పించు చున్నది. తినిన యాహారమును జీర్ణించుకొనుటలో మనశక్తి హెచ్చుగ వ్యయపడకు పక్షమున నయ్యది దేహము బలపడు టకును, ఇతర కార్యములకును ఉపయోగపడును. జీర్ణకోశ మును, ప్రేవులును తమ తమ పనులను చక్కగ నెరవేర్చు టకై యెంతయో రక్తప్రసారమును, నరముల బలిమియు కావలసియుండును. సుష్టుగ భోజనము చేసిన తరువాత దేహ మునం దొకవిధమగు నలసత జనించుట యెల్లవారు నెరింగిన యంశమే. ఆహారము జీర్ణమగుటకై ఈ సందర్భములో రక్త వ్యయ మగుట వలనను, నరములశక్తి వినియోగపడుటవలనను ఇట్టి స్థితి సంభవించుచున్నది. దేహమందలి శక్తి యీవిధ ముగ వ్యయపడినప్పుడు, ఇతర భౌతిక కార్యకలాపములు నెర వేరజాలవు. మన కావశ్యకమగు పుష్టి, బలకరమగు తక్కువ ఆహారమునుండి లభించినచో జీర్ణకోశమున కెక్కుడు పని కలుగదు. ఆహారములో తగిన చేవ లేనియెడల దాని మొత్త మును హెచ్చింపవలసియుండును. అప్పుడు జీర్ణకోశమున కెక్కువగ పనిచేయవలసివచ్చును. జీర్ణకోశమున కెక్కుడు పనికల్గినయెడల నది దేహమునకు నష్టము కూర్చును. చిన్న బిడ్డలకీ నష్టము కల్గినచో వారు తగినంత చురుకుగ నుండక పోవుటయో, లేక చక్కగ నెదుగకుండుటయో సంభవిం చును. కావున చిన్నబిడ్డల కీయబడునట్టి ఆహారము పుష్టి కరముగను త్వరితముగ జీర్ణమగునట్టిదిగను కూడ నుండ వలయునని సారాంశము తేలుచున్నది.

బాలబాలికలను కేవలము శాకాహారముపై పెంచుట అసాధ్యవిషయముకాదు. మన సంఘము నందలి యున్నత తరగతులలో చాల మంది తమ బిడ్డలకు చాలవరకు శాకాహారమునే ఇత్తురు. అయినను ఈ బిడ్డలు చక్కగ ఎదిగి, ఆరోగ్యవంతులుగ కానవచ్చుచుందురు. కూలి నాలి చేసికొని జీవించువారి బిడ్డలకు మాంసాహారము వాచవికైన లభింపదు. కాని వారు కూడ ఆరోగ్యముగ పెరిగి పెద్దవారగుదురు. పై యంశములచే ఋజువగుచున్నట్లు కానవచ్చెడి విషయము లెంత మాత్రమును నిజముకాదు. బాల్యమునందు ఆలుగడ్డలు (బంగాళాదుంపలు), రొట్టె, మున్నగు వానిని మాత్రమే ఆహారముగ స్వీకరించిన వారు వయస్సు వచ్చిన మీదట సంపూర్ణ మగు శారీరక వికాసమును పొంద జాలరు. ఇంగ్లాండు దేశములోని భూస్వాములను, వ్యవసాయ కూలీలను, ఫ్రాన్సు దేశమందలి ఉన్నత తరగతుల వారిని, తక్కువ తరగతుల వారిని పోల్చి చూచిన యెడల కేవల శాకాహారుల పక్షమేమంత బలముగ కానరాదు. మేము కేవల మాకారపుష్టిని గూర్చి ప్రసంగించుటలేదు. దేహదార్ఢ్యమును గూర్చి కూడ మనము చింతింపవలసియున్నది. పై చూపులకు నిజమగు సత్తువకల దేహమును, దుర్బలమయ్యు నిగనిగలాడు దేహమును, సమానముగనే కానరావచ్చును. సూక్ష్మదృష్టిలేనివారికి నిండైన బుంగదేహమును, చక్కని దృఢకాయమును ఒకే రీతిగ చూపట్టవచ్చును. కాని యిట్టి

వారికి పోటీ యేర్పడినప్పుడు నిజస్థితి తెలియవచ్చును. సం ప్రాప్త వయస్కులగు వారిలో స్థూలత్వము దౌర్బల్యసూచకము. శరీరకష్టము హెచ్చైన కొలదియు దేహము కృశించి తేలికపడును. కావున పుష్టికరమగు నాహారము లేని బాలకులు చూపులకు బాగుగనే కాన్పించినను మనము భ్రమకు లోనుకారాదు. మనము దేహపరిమాణమునే కాక దేహపాటవమును కూడ గమనింపవలెను. శాకాహారులును, మాంసాహారులును, అగు బిడ్డలలో ఈ భేదము స్పష్టముగా కాన్పించును. భౌతిక మానసిక శక్తులు రెండింటియందును కూడ పేదయగు వ్యవసాయదారుని బిడ్డ కంటె ధనికుడగు భూస్వామితనయుడు శ్రేష్ఠుడుగ నుండును.

మనము వివిధ తరగతుల జంతువులను, వివిధజాతుల వారిని, లేక ఒకే తరగతికి చెందియు భిన్నవిభిన్నములగు నాహారములతో పెరిగిన జంతువులను పోల్చిన యెడల నొక ముఖ్యమగు సత్యము నీకు తెలియవచ్చును : మానవుని దేహదార్ఢ్యము అతడు తినునట్టి ఆహారము యొక్క బలవర్ధకగుణములపై ఆధారపడియుండును.

ఉదాహరణముగ నొక ఆవును, గుఱ్ఱమును పరీక్షింతము. ఆవులు విశేషము సత్తువలేని గడ్డిని తినును. గడ్డి యొక్క మొత్తము హెచ్చుగ నుండును. కావున దానిని జీర్ణించుకొనుటకు జీర్ణకోశము ఎక్కువగ పనిచేయవలసి వచ్చును. ఆవు యొక్క దేహముతో పోల్చి చూచినచో

దాని వివిధాంగములు చాల పెద్దవి. కావున నీబరువును మోయుట గోవునకు భార మనిపించును. దేహభారమును మోయుటయందును, తినిన ఆహారమును జీర్ణించుకొనుట యందును ఆవు యొక్క శక్తి చాలవరకు వ్యయపడిపోవును. కావున గోవు విశేషము చురుకుగ నుండదు. గుఱ్ఱముయొక్క ఆకారనిర్మాణము ఇంచుమించు ఆవు వలెనే ఉండును. కాని అది తినునట్టి ఆహారము ఇంకను బలకరమైనది. గుఱ్ఱము యొక్క దేహము, కుక్షి, ఇతరాంగములు – వీనికి చక్కని సామరస్య ముండును. బరువైన దేహమును మోయుట, హెచ్చు మొత్తపు టాహారమును జీర్ణించుకొనుట యను భారము గుఱ్ఱముపై పడదు. కావున గుఱ్ఱము వేగముగ పరుగెత్తగలదు. చురుకుగ తిరుగగలదు. కేవలము గడ్డి, ఆకులు మున్నగు వానిని తిని జీవించు గొఱ్ఱెలు మందముగ, స్తబ్ధముగ నుండును. ఇందులకు మారుగ మాంసాహారము పైననో, సులభముగ జీర్ణమగు ఇతర ఆహారములపైననో జీవించు కుక్కలు చాల చురుకుగ నుండును. ఏదైన జంతు ప్రదర్శనశాలలోనికి పోయి అచ్చటి వివిధ జంతువుల పరీక్షింపుడు. మాంసభుక్కులైన జంతువులు తమ బోనులలో మిక్కిలి చురుకుగ తిరుగుచుండుటయు, శాకాహారమును గ్రహించు ఇతర జంతువులు మందముగ నుండుటయు నీవు చూడగలవు. బలవర్ధకగుణములు హెచ్చుగ కల ఆహారమును భుజించు జంతువులలో చురుకుపాలు హెచ్చుగ నుండునని ఇందువలన స్పష్టముగ తెలియవచ్చుచున్నది.

వివిధ జంతువులలో కానవగు నీ విభేదములు ప్రకృతి సిద్ధములనియు, అయ్యవి భుజించు నాహారముతో నేవి కెట్టి ప్రసక్తియును లేదనియు కొందరు వాదింపవచ్చును. కాని ఇది సత్యదూరము. ఒకే జాతి జంతువులలో గల విభేద ములే యిందులకు తార్కాణము. గుఱ్ఱములలో గల వేర్వేరు తెగలను గూర్చి ఇంచుక విమర్శింపుము. మన బండ్లను లాగు నట్టి గుఱ్ఱములు పెద్దపొట్టలతో, మందముగ నిరుత్సాహముగ కానవచ్చును. ఇందులకు భిన్నముగ వేటయందును పందె ములయందును పాల్గొను గుఱ్ఱములు సన్నని నడుము కల్గి మిక్కిలి చురుకుగ నుండును. బండి గుఱ్ఱముల యాహారము కంటె, పందెపు గుఱ్ఱముల, వేట గుఱ్ఱముల యాహారము చాల బలకరమైన దను నంశమును గుర్తునందుంచుకొనుము. అప్పుడు నిజస్థితి నీ కవగత మగును. ఇదే విధముగ వివిధ మానవుల స్థితిగతుల పరామర్శింతము. ఆస్ట్రేలియా, ఆఫ్రికా ఖండములలో నివసించు అనాగరక ప్రజలు కాయలు, దుం పలు, నత్తలు, పురుగులు మొదలైన బలహీనమైన యాహా రమును వాడుదురు. కావున వారు బాన కడుపులు, దుర్బల మగు కండరములు కలిగి, మరుగుజ్జులవలె నుందురు. ఈ ఆటవికులు మాంసాహారులగు ఐరోపాదేశీయులవలె కష్టమున కోర్చి పని చేయజాలరు. శరీరబలమునందు వారితో పోటీ పడజాలరు. అడవి జాతులలో బలాఢ్యులగు వారిని గూర్చి యించుక చింతింపుము. కాఫరులు, ఉత్తర అమెరికా ఇండి

యనులు, పాటగోనియనులు మొదలైన వారు మాంసా హారులైన కారణముచే వారు బలాఢ్యులై యుందురు. అల్పాహారమును భుజించు హిందువులు బలకరమగు నాహారమును గ్రహించు నాంగ్లేయునికి అనాయాసముగ లొంగి పోవుచున్నారు. ఈ హిందువు లాంగ్లేయుల కంటె భౌతిక మానసిక శక్తులలో దుర్బలులు. ప్రపంచచరిత్రను సమీక్షించిన పక్షమున నాహారపుష్టి గల జాతులు బలాధికులుగను, అధికారులుగను ఉండుచు వచ్చినట్లు తెలియనగును.

మేము కావించుచున్న యీ వాదము క్రింది యంశము వలన ఇంకను బలపడుచున్నది. ఒకే జంతువునకు బలకరమగు నాహార మిచ్చినప్పుడు అది బాగుగా కష్టించి పని చేయుగల్గును. నీరసమగు నాహారము నిచ్చినచో అది చక్కగ పనిచేయజాలదు. గడ్డి తినుటవలన గుఱ్ఱములును, ఇతర జంతువులును ఒడలు చేయుచచ్చును. కాని వానికి నిజమైన బలము రాదు. పందెపు గుఱ్ఱములకును వేటగుఱ్ఱములకును కేవలము గడ్డిని మేతగ నిచ్చుటవలన నవి బలహీనములగును. బలకరమైన యాహారము నిరంతరము వాడుచుండుటవలన దేహమునకుపుష్టియు, చురుకుదనమును సిద్ధించును. ఒక మధ్యతరగతి గుఱ్ఱమునకు నిత్యము బలమైన యాహారము నిచ్చుచు వచ్చినచో, అయ్యది తక్కువతరగతి మేతను తినునట్టి ఉత్తమాశ్వముతో కూడ పోటీ చేయజాలును. ఈ విషయమును కూడ శ్రద్ధగ నాలోచింపుడు. గుఱ్ఱములచే హెచ్చు

పనిని చేయించ వలసి వచ్చినప్పుడు యజమానులు వానికి ఓట్సు ధాన్యమునకు మారుగ ఓట్సు గింజలను తినిపింతురు. ఈ గింజలు మాంసవృద్ధిని కావించును.

మేము ప్రతిపాదించిన యీ యంశము మానవులకు చక్కగ వర్తించునని తెల్పుటకు మరియొక నిదర్శనము చూపెదము. మేము బలాఢ్యులగు మల్లులు, వస్తాదులు మున్నగువారిని గూర్చి చర్చించుట లేదు. సామాన్యులగు కార్మికులను గూర్చి మేము ప్రసంగించుచున్నాము. అయో మార్గములను నిర్మించు బ్రిటిషు కంపెనీలలో పనిచేయు కార్మికులు మాంసాహారులు. ఇతర ఐరోపా కంపెనీలలో పని చేయువారు తక్కువ తరగతి యాహారమును భుజింతురు. కావున వీరు బ్రిటిషు కార్మికులవలె తగినంత శక్తి సామర్థ్యములతోడను, ఓరిమితోడను పనిచేయజాలరని స్పష్టముగ తెలియవచ్చినది. పనితనములోని భేదములు జాతి విశేషములపై ఆధారపడినవి కావు. ఇందులకు మూలము ఆహార భేదము మాత్రమే. ఏలననగా ఐరోపా రైల్వే కంపెనీలలోని కార్మికులు బ్రిటిషు కార్మికులవలె పుష్టికరమగు నాహారమును స్వీకరించుట ప్రారంభించిన నాటినుండియు వారు కూడ మిక్కిలి సమర్థతతో పనిచేయుచుండినట్లు మేము తెలిసికొనినారము. మాంసాహారమును విసర్జించి, శాకాహారమును స్వీకరించుటవలన దేహదార్ఢ్యమును, మానసిక శక్తులను కూడ క్షీణించును.

చిన్నబిడ్డల కీయవలసిన యాహారమును గూర్చి మేము కావించిన ప్రతిపాదన, పై నిదర్శనములచే బలపడుచున్న దని మా విశ్వాసము. నీరసమగు నాహారమును భుజించు బాలురు ఒడ్డు పొడవులలో నితరులవలె కాన్పించుచున్నను వారికి తగినంత నరముల పటుత్వ ముండజాలదు. చిన్న బిడ్డల కాకారపుష్టియే కాక సరియైన దేహదార్ఢ్యము కూడ కావలెనన్నచో వారి కుత్తమమగు నాహారము నొసంగ వలెను. భౌతికముగాకాని, మానసికముగాకాని విశేషము కష్టము చేయనక్కరలేని బాలబాలకలకు తగినంత సత్తువ లేని యాహారము నొసంగినను అది వారి యవసరములకు సరిపడునేమో కాని అనుదినము ప్రకృతిసిద్ధముగ నష్ట మగు చుండెడి భౌతికశక్తులను మరల సంపాదించుటయే కాక, శారీరకముగను, మానసికముగను చేయు పరిశ్రమచే దేహమునకు సంభవించు నష్టమును పూరించుకొనవలసిన బిడ్డలు ఉన్నత తరగతి యాహారమును తప్పక తీసికొనవలసి యుండును ఇట్టి యాహారము బిడ్డలకు లభింపనిచో వారి శరీరపుష్టియో, చురుకుదనమో క్షీణించును. లేనిచో వారి మానసికబలము కుంటువడును. ఆ యా బిడ్డల శరీరధర్మమును బట్టియు, లేదా, ఇతర పరిస్థితులను బట్టియు నష్టము చేకూ రును. కార్యకారణసంబంధముల చక్కగ గుర్తింపజాలిన బుద్ధిమంతు లెల్లరును మా వాదమును తప్పక అంగీకరింతురు.

ఆహారమును గూర్చిన యీ చర్చను ముగించుటకు

పూర్వము ఉత్తమాహారము నందలి మరియొక లక్షణమును గూర్చి తెలుపవలసియున్నది. అయ్యది వివిధత్వము. నేడు బాలురకు సర్వసాధారణముగ నొసంగబడు ఆహారము లోప భూయిష్ఠమై యున్నదని మాయభిప్రాయము. వారి యాహార ములో మార్పు అనునది ఇంచుకుంచు ఉండనే యుండదు. ఇయ్యది ఆరోగ్యసూత్రములకు విరుద్ధము. మధ్యాహ్నభోజన సందర్భమున వారి యాహారములో తరచుగ తగినంత మార్పు చూపట్టుచుండును. అనుదినమును ఈ యాహార ములో కొంత నూతనత్వము కాన్పించుచుండును. కాని ప్రాతఃకాలభోజనములో మాత్రము దినములు, వారములు, సంవత్సరములు గడచినను ఎట్టి మార్పును ఉండజాలదు. వారి కనుదినమును రొట్టె, పాలు, లేక ఓట్సు పిండితో సిద్ధ మైన గంజియో ఆహారముగ లభించుచుండును. సాయంకా లమునందు మన బిడ్డలకు మరల ప్రాతఃకాల భోజనమే వేరొక రూపములో దర్శన మొసంగును. మరియొకమారు వారికి రొట్టె పాలు లేక రొట్టె వెన్న, తేనీరును ఆహారముగ నొసం గుట వాడుకగ నున్నది.

ఈ పద్ధతి ఆరోగ్య సూత్రములకు భిన్నము. నిత్య మును తినునట్టి యాహారము నెడ ఒక విధముగ విసువు జనిం చును. క్రొత్తవంటకములు జిహ్వకు తృప్తికల్గించును. ప్రజా సామాన్యమునందు ప్రబలియున్న యీ భావము లర్థశూన్య ములు కావు. పై సూత్రము నంగీకరించిననాడు మనము మన

యాహారములో తరచుగ మార్పు కావించుచు దేహారోగ్య మును కాపాడుకొన గల్గుదుము. ఎంతటి మంచి యాహార మైనను సరియే అది మన దేహయంత్రము యథాప్రకారము చక్కగా పనిచేయుటకు కావలసిన ద్రవ్యములను తగునంత పరిమాణములోను తగిన స్వరూపములోను ఈయగల్గుట అసంభవము. ఈ యంశ మనేకప్రయోగములచే నిర్ధారణ కావింపబడినది. కావున దేహస్వాస్థ్యమునకును, అభివృద్ధికిని ఆవశ్యకమగు పదార్థములు సమానమగు పాళములో లభిం చుటకొరకై మనము తినునట్టి ఆహారములో తరచు మార్పు చేయుట చాల ఆవశ్యకము. జిహ్వకు మిక్కిలి ఆనందదాయక మగు నాహారమును భుజించుటవలన నరముల కుత్తేజము కల్గును. గుండెకాయ ఎక్కువ చురుకుగ పనిచేయును. రక్త ప్రసారము వేగముగ సాగజొచ్చును. ఇందువలన ఆహారము చక్కగ జీర్ణమగుటకు సావకాశము లభించును. ఈ సూత్ర ములు మానవులకును, తిర్యగ్జంతువులకును కూడ సమాన ముగ వర్తించును. కావుననే జంతువుల కొసంగు మేతలో తరచు మార్పు కావించు పద్ధతిని నేడు అవలంబించుచున్నారు.

ఆ యా కాలములందు మనము వాడునట్టి యాహార ములో మార్పు కావించుటతోపాటు, అనుదినమును మనము స్వీకరించు నాహారములో కూడ వైవిధ్యమును ప్రవేశపెట్టుట చాల వాంఛనీయ మని ఇందువలన తేలుచున్నది. ఇట్లు చేయుటవలన దేహనిర్మాణమున కావశ్యకమగు ద్రవ్యములు

సరియైన నివృత్తిలో లభించుటయేకాక శరములకు కల్గు ప్రోద్బలమువలన ఆహారము చక్కగ జీర్ణమగును. మా వాదమును బలపరచుటకై మీకు చక్కని నిదర్శనమునుకూడ ఈయగలము. క్రైంచివారి విందులలో పాల్గొనువా రందరును సుష్టుగ కడుపునిండ భుజించియు, ఆ యాహారమును సులభముగ జీర్ణము కావించుకొనగల్గుదురు. ఇందులకు కారణము అందు వాడబడు భిన్న విభిన్న పదార్థములే. ఒకే విధమగు పదార్థముతో వండిన వంటకము లెంతశ్రద్ధగ తయారుచేయబడినను, అవి యంత సులభముగ జీర్ణము కానేరవు. పశువుల పెంపకమునుగూర్చి ఇటీవల వెల్వడిన కొన్ని పుస్తకములను శ్రద్ధగ పరిశీలించినచో మా వాదమున కింకను బలము చేకూరును. పశువుల కొసంగబడు నాహారములు వివిధపదార్థములతో సమ్మిళితములై యుండవలెను. ఇట్టి సంపుటీకరణము వలన జీర్ణకోశము తన పనిని చక్కగ చేయగల్గును. మేము కావించిన యీ సూచన కేవలము లాభదాయకమే కాదు. అయ్యది పశువుల యభివృద్ధికొరకై విధిగ నవలంబింపవలసిన దని జంతుశాస్త్ర నిపుణులు తెల్పుచున్నారు.

చిన్నబిడ్డలకు ప్రతిభోజనమందును వివిధ పదార్థముల వడ్డింపవలెననియు, తరచుగ భోజనమందలి వ్యంజనములలో మార్పు కావింపవలెననియు, మేము కావించిన సూచనకు పలువు రభ్యంతరము తెలుపవచ్చును. ఈ యుద్దేశ్యమును కొనసాగించుటకై మన మెంతయో కష్టపడవలసివచ్చునని

వారు వాదింపవచ్చును. కాని చిన్నబిడ్డల మానసికాభివృద్ధి కొరకును, వారి భావ్యభివృద్ధి కంతకును మూలమైన దేహ పుష్టికొరకును మన మెంతటి కష్టమునకైన సిద్ధపడవలెను. పశువులను పెంచుటయందు ఎంతో తాపత్రయపడువారు తమ బిడ్డల క్షేమముకొరకై ఇంచుకకష్టమును సహించుటకై యేల వెనుదీయవలెనో మా కర్థమగుట లేదు.

మేము ప్రతిపాదించిన సిద్ధాంతము నవలంబింపదలచు వారికి మే మొక్క హెచ్చరిక చేయదలచినాము. ఎట్టి మార్పును కూడ అకస్మాత్తుగ చేయరాదు. ఏల ననగా చాల కాలము వరకును నీరసమగు నాహారమునే భుజించుచు వచ్చి నచో దేహము బలహీనమగును. అట్టి సందర్భములో మిక్కిలి పుష్టికరమగు నాహారమును జీర్ణముచేసికొను శక్తి ఆ వ్యక్తి కుండజాలదు. పుష్టికరమగు నాహారము లభింపక పోవుటయే కొన్నిసందర్భములలో అజీర్ణవ్యాధికి మూల హేతువుగ పరిణమించును. ఈ యంశము జంతువులకు కూడ వర్తించును. దూడలకు కొంతకాలము వరకును వెన్నతీసి వేయబడిన పాలనుకాని, విరుగుపాల పై నీటిని కాని ఆహార ముగ నిచ్చుచు వచ్చినచో వాని కజీర్ణవ్యాధి సంభవించును. కావున దేహయంత్రముయొక్క దార్ఢ్యము తక్కువగనున్న కాలమున, తక్కువతరగతి ఆహారము నుండి మేలిరకపు టాహారమునకు మార్పుకావించుటలో, మార్పును క్రమ క్రమముగ కావింపవలయును. దేహయంత్రము బలపడు

చున్నకొలదియు పుష్టికరమగు నాహారపు మొత్తమును పెంచుచు పోవలెను. బలవర్ధకాహారము నొసంగుటలో మితమును దాటిపోవు ప్రమాదము చాలకలదు. కడుపు నిండినట్లు తోచగానే భోజనమును విరమింపవలెను. ఏ మొత్తపు నాహారముచే నిట్టి సంతృప్తి కల్గునో అదియే యుక్తమగు భోజనము. ఇట్టి సంతృప్తిని పుష్టిలేని భోజనము కల్గింపజాలదు. అట్టి యాహారము కడుపు పగులునట్లు తిన్నను ప్రయోజనములేదు. అనాగరకజాతులలో జీర్ణకోశములు స్థూలముగ నుండును. నాగరకజాతులలో జీర్ణకోశములు చిన్నవిగ నుండుటయే కాక క్రమక్రమముగ నింకను సూక్ష్మతరములు కావచ్చును. కాని ప్రతిప్రాణియు తీసికొను ఆహారము ననుసరించి దాని జీర్ణకోశము చిన్నగనో పెద్దగనో ఉండుట తటస్థించును. పైయంశముల నెల్ల సమగ్రముగ నాలోచించిన మీదట మే మీక్రింది నిర్ణయముల కావించుకొన గల్గినారము: చిన్నబిడ్డల కొసంగబడు నాహారము బాగుగా పుష్టికరమై యుండవలెను. ప్రతిభోజనము నందును, అనుదినమును ఆహారములో మార్పు కల్గుచుండవలెను. ఆహారము బిడ్డలకు కడుపు నిండునట్లుగ ఈయవలెను.

ఆహారవిషయమునందు వలెనే దుస్తులనుగూర్చి కూడ మనవారు కొంత లోభత్వమును చూపుచున్నారు. ఈ యంశములోకూడ వైరాగ్యప్రవృత్తి తొంగిచూచుచున్నది. శారీరకవాంఛలను వీలైనంతవరకు నిర్లక్ష్యము చేయవలెనను

నొక భావము మనవారిలో వ్యాపించియున్నది. ఈ భావము లను సూక్ష్మీకరించిన పక్షమున నీ క్రింది సిద్ధాంత ముత్పన్న మగుచున్నది. ఇంద్రియేచ్ఛలు మన జీవనవిధానమునకు మార్గదర్శకములు కావనియు, అవి మన నెల్లప్పుడును తప్పుడు మార్గములలోని కీడ్చుచుండు ననియు, ఈ బుద్ధిమంతులు వాదింతురు. ఇది చాల పొరపాటు. ప్రకృతిసిద్ధముగ మనలో నెంతయో మంచి యిమిడియున్నది. మన దేహమునకు సంభవించు రుగ్ణతలు శారీరకవాంఛలను ధిక్కరించుటవల ననే కాని, అనుసరించుటవలన సంభవింపనేరవు. ఆకలి లేనప్పుడు భుజించుటవలన అనారోగ్యము సిద్ధించును కాని ఆకలి వేయుచున్నప్పుడు ఆహారమును స్వీకరించుటవలన నట్లు సంభవింపదు. దాహము కల్గినప్పు డుచితమగు పానీయమును స్వీకరించుట తప్పుకాదు. కాని అట్టి వాంఛ లేనప్పుడు త్రావుట దోషము. పరిశుభ్రమగు గాలిని పీల్చుటచే యెల్ల వారికిని ఆనందము చేకూరును. ఇం దెట్టి దోషమును లేదు. కాని ఒకవంక మన యూపిరితిత్తులు నిరాకరించుచుండగా, దుర్గంధభూయిష్ఠమగు గాలిని పీల్చుట నష్టదాయకము. చిన్న బిడ్డల నడవడిని చూచిన పక్షమున ప్రకృతి వారిని చురుకుగ నాడుకొనునట్లు ప్రోత్సహించునని తెలియవచ్చును. ఈ విధముగ వర్తించుటచే బిడ్డల కెట్టి నష్టమును చేకూరదు. కాని ప్రకృతిసిద్ధమగు కోర్కెలను మన్నింపకపోవుటవలన నష్టము తప్పక చేకూరును. సహజమును, ఆనందదాయకము నగు

మానసికకృషి వలన నష్టము సంభవింపదు. కాని మెదడు వేడి యెక్కి, శిరోవేదన ప్రారంభమై, దేహము విశ్రాంతిని కోరు సందర్భమున బలవంతముగ పనిచేయుటవలన లోతైన నష్టమును కల్గించును. శారీరక కష్టము మన కానందదాయకపుగను, లేదా అధమపక్షము అనిష్టముగ లేకుండినప్పుడును, ఒడలువంచి పనిచేయుటచే హాని కలుగదు. కాని దేహము వివశమై విశ్రాంతిని కోరుచున్నప్పుడు కాయకష్టము చేయుట కూడని పని. చిరకాలమువరకును నియమవిరుద్ధములును, అనారోగ్యకరములును అగు జీవితములను గడపినవారి ప్రాకృతిక వాంఛలు సన్మార్గదర్శకములు కావనుట నిజమే. అనేక సంవత్సరముల కాలము ఇంటి నాల్గుగోడల నడుమనే నివసించుచు, దేహకష్టమన నేమియో యెరుగక, నిరంతరము మానసిక కష్టము చేయుచు, క్షుత్ప్రేరేపణచే కాక గడియారపు గంటల ప్రకారము భోజనము చేయుట కలవాటుపడిన వారికి కల్గు కోర్కెలు సక్రమములైనవి కావు. అవి అక్రమములైనవి. ఈ అసాధారణ స్థితిగతులు ఆరోగ్యనియమములను చిరకాలము వరకును ఉల్లంఘించుటచే సంభవించినవి. వారు బాల్యమునుండియు దేహపాలకుని యాదేశముల నుల్లంఘించుచు వచ్చినకారణమున ఆ యధికారి బెదరిపోయినాడు. లేనిచో నాతడు వారికి సక్రమమగు ప్రేరేపణలచే సరియైన త్రోవనే చూపుచు వచ్చెడివాడు.

మనకు మార్గదర్శకములగు ప్రేరేపణలలో శీతోష్ణ

ములు గణింపదగినవి. బిడ్డల కీయబడు దుస్తులు వారిని శీతో ష్ణములనుండి రక్షింపజాలనియెడల నయ్యవి నిరుపయోగ ములు. బాలురను కష్టసహిష్ణువులుగ కావింపవలయు నని సామాన్యులు పల్కు పలుకు లర్థశూన్యములు. ఇట్టి ప్రయ త్నముల వలన బాలబాలికలు పలువురకు ప్రాణాపాయము సంభవించును. అట్టి ప్రమాదమును తప్పించుకొని బయట పడినవారు తమ దేహారోగ్యమును శాశ్వతముగ కోల్పోవు దురు. లేదా వారు తగినంత యెత్తుగ పెరుగక దుర్బలు లగు దురు. ఇట్టి వారల దుర్బలాకారమును, వారికి తరచు సంభ వించు రుగ్మతలను చూచినచో నెంతటి మూర్ఖులైన తల్లి దండ్రులకును కూడ జ్ఞానము వచ్చునని యొక వైద్య మహా శయుడు పల్కుచున్నాడు. శీతోష్ణముల నిర్లక్ష్యము చేసి యెదుర్కొనుట వలన బాలుర దేహము దృఢపడునని వాదించు వారు కేవలము మిడిమిడి జ్ఞానము కలవారు. పేదరైతుల బిడ్డలు ఒడలినిండ యెట్టి దుస్తులును లేకుండ ఆరుబయళ్ళలో నాడుకొనుచుందురు. అయినను సర్వసాధారణముగ పేదవారి బిడ్డ లారోగ్యవంతులుగ నుండుట మనము చూచుచుందుము. దీనిని గమనించి ఈ విధముగ శీతాతపముల నలక్ష్యము చేయుట వలననే వా రారోగ్యవంతులుగ నున్నారని ధనా ఢ్యులు భావింతురు. కాని ఇది చాల తప్పుటూహ. ఇట్టి తప్పుటూహల నాధారముగ చేసికొని పలువురు ధనాఢ్యులు తమ బిడ్డల కొడలు నిండని దుస్తుల నిచ్చుచుందురు. ఊరి

వెలుపల నిరంతరమును ఆటలాడుచు కాలముపుచ్చు నీపేద బాలురకు గల అనుకూలపరిస్థితులు ధనికుల బిడ్డల కుండవు. బీదపిల్లల కాలమంతయు ఇంచుమించు ఆటలయందే గడచును. దినమంతయు వారు పరిశుభ్రమగు గాలిని పీల్చుచుందురు. విశేషము మానసికపరిశ్రమ చేయుటవలన వారి దేహములు దుర్బలములగుట కనకాశముండదు. కావున వారి దేహము లారోగ్యవంతములుగ నుండును. వా రనుభవించు ఆరోగ్య భాగ్యము శీతోష్ణముల నలక్ష్యము చేసి తిరుగుటచే లభించి నదికాదు. ఈ విధముగ నారోగ్యసూత్రముల నతిక్రమించి నను, వారికి గల ఇతర అనుకూలతలు వారి యారోగ్యమును సంరక్షించుచున్నవని మనము గ్రహింపవలెను. ఏది యెట్లు న్నను దేహమునందుగల వేడిమిని మనము కోల్పోయినచో నయ్యది తప్పక నష్టమును చేకూర్చును.

దేహము దృఢమై శీతోష్ణముల భరించుటకు సమర్థమైయున్న పక్షమున, మన శరీరమునం దొక విధమగు కాఠిన్యత పెంపొందుననుట నిజమే కాని ఈ కాఠిన్యత దేహముయొక్క పెంపును ఆటంకపరచును. ఈ యంశము మానవుల యందును, పశువుల యందును కూడ ద్యోతకమగుచున్నది. షెట్లండు గుఱ్ఱములు తీవ్రమగు శీతాతపబాధను సహింపగలవు. కాని అవి దక్షిణప్రాంతములందలి గుఱ్ఱముల ఒడ్డు పొడవులు లేక కుఱుచబారియుండును. స్కాట్లండు నందలి పర్వతప్రాంతములలో మిక్కిలి చలిగనుండుటచే

అచ్చటి గొఱ్ఱెలు ఇంగ్లాండు నందలి శ్రేష్ఠపు వాతావరణ
ములో పెరుగు జంతువులవలె నెత్తుగను, దృఢముగను ఉండ
నేరవు. ఉత్తర దక్షిణ ధ్రువప్రాంతములలో నివసించు మాన
వులలో ఇతరప్రాంతములలోని జనులలో గల దేహసౌష్ఠ
వము కానరాదు. లాప్‌లాండ్ నివాసులును, ఎస్కిమోలును
పొట్టిగనుందురు. అత్యంత శీతలప్రాంతములలో నెట్టి దేహా
చ్ఛాదనమును లేక నగ్నముగ సంచరించు అనాగరకులు
మిక్కిలి కుఱుచగను, వికృతాకారులుగను ఉందురు. వీరిని
చూచినచో వీరు కూడ మనవలెనే మానవులా యను సం
శయ మెల్లవారికిని కల్గితీరునని ప్రసిద్ధ జీవశాస్త్రవేత్తయగు
డార్విన్ మహాశయుడు తెల్పుచున్నాడు.

ఉష్ణాధిక్యత జీవులను శుష్కింపజేయుననియు, అందు
వలన మానవులు కుఱుచబారుట సంభవించుననియు ప్రకృతి
శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. ఇర్వురు ప్రాణులకు ఆహారా
దులు సర్వవిధముల సమానముగ నుండినను, మిక్కిలి వేడిమికి
లోనైన జీవి భౌతికముగ పెంపొందకుండుట అనివార్యము.
వాతావరణమునందు నెలకొనియున్న శక్తులవలన మన దేహ
ములోని వేడిమి తగ్గిపోయి శరీరము చల్లబడుచుండును. ఈ విధ
ముగ నష్టమైన యుష్ణతను మరల సంపాదించుటకై మనము
భుజించు నాహారములో కొంత భాగము నిరంతరము భస్మము
గా మారుచుండును. దేహము నుండి నష్టమగుచున్న ఉష్ణత
హెచ్చైనకొలదియు, దానిని మరల పూర్తి కావించుటకై,

పానము తినునట్టి ఆహారములో నధికభాగము భస్మమును
సిద్ధము కావించుటలో వినియోగపడవలెను. కాని మన జీర్ణ
కోశముయొక్క శక్తి పరిమితమైనది. దేహమునందలి ఉష్ణ
తను సంరక్షించుట యందును, క్రొత్త వేడిమిని కల్గించుట
లోను, మన జీర్ణకోశముయొక్క శక్తులన్నియు వ్యయపడి
పోయిన యెడల, అయ్యది దేహపరిపుష్టికై ఆవశ్యకములగు
ద్రవ్యముల సృష్టించుటలో వెనుకబడియుండుట అనివార్య
ఫలితము. దేహయంత్రమున కింధనప్రాయ మగు నాహారము
మరియొక కార్యకలాపములో విశేషముగ నిమగ్నమై యుం
డగా దేహము పెంపుదల చెందుటకు నావకాశమేది? అట్టి
పరిస్థితులలో దేహము కుఱుచబాఱుటయైన జరగును. లేక
దార్ఢ్యమునైన గోల్పోవును. లేదా ఈ రెండు అనర్థములును
కూడ మానవునకు సంభవింపవచ్చును.

కావున దుస్తులకు చాల ప్రాముఖ్యత కలదు. "దేహ
మునం దుష్ణము నుత్పన్నము కావించుటకై ఆహారమునకు
మారుగ మనము దుస్తులను చేర్చవచ్చును." అని యొక
విజ్ఞాని పల్కుచున్నాడు. చక్కని దుస్తులను ధరించుటచే
మన దేహమందలి వేడిమి నష్టపడదు. కావున ఉష్ణమును
కల్పించుటకై క్రొత్త యింధనముల యావశ్యకత యుండదు.
వేడిమిని కల్పించుటకై మన దేహయంత్రమునకు విశేషము
శ్రమపడవలసిన యావశ్యకత తొలగినందువలన దేహమున
కవసరమగు నితర పదార్థముల నుత్పత్తి చేయుటలో మన

శారీరకశక్తులు వినియోగము కావచ్చును. జంతుపోషణ కావించువారి యనుభవమువలన మా సిద్ధాంతము బలపడు చున్నది. మిక్కిలి శీతలబాధకు గురియైన జంతువులు దేహము నందలి క్రొవ్వునో, కండరముల బలమునో, దేహమునందలి సత్తువనో కోల్పోవును. పెరుగుచున్న పశువులు మిక్కిలి చల్లని వాతావరణములో జీవించుట సంభవించిన పక్షమున వాని శారీరకాభివృద్ధియైన కుంటుపడును. లేదా వానికి అద నముగ నాహారమునైన ఈయవలసియుండును. వేటగుఱ్ఱముల దేహస్థితిని చక్కగ కాపాడుటకై వానిని వెచ్చని తబేలా లలో కట్టివేయుట యవసరమవి ఒక నిపుణుడు తెల్పు చున్నాడు. పందెపు గుఱ్ఱములను పెంచువారుకూడ ఈ సూత్రమునే అవలంబింతురు.

జీవశాస్త్రజ్ఞులు నిర్వచించినట్టియు, వ్యవసాయదా రులు, ఆటగాండ్రు మున్నగువా రంగీకరించినట్టియు ఈ సూత్రము చిన్నబిడ్డలకు చక్కగ వర్తించును. శీఘ్రముగా నెదుగుచున్న చిన్నబిడ్డలకు శీతలబాధ చాల నష్టదాయకము. ఫ్రాన్సుదేశమున చలికాలమున పసిబిడ్డ లనేకులు మరణిం తురు. బెల్జియము రాజ్యములో జనవరి నెలయందు (చలికా లము) పసిపాపలు పల్వురు మరణింతురనియు జూలై నెల (వేసవి) లో మరణించు బిడ్డలసంఖ్య అందు సగము మాత్రమే ఉండుననియు ఒక అధికారి తెల్పుచున్నాడు. అత్యంత శీతల మైన రష్యాదేశములో పసిపాప లసంఖ్యాకముగ మరణింతురు.

ఈడువచ్చిన బాలబాలికలు కూడ తగినంత దేహదార్ఢ్యము లేనికారణముచే శీతలబాధకు లొంగిపోయి మృత్యువాత బడుదురు. కష్టభూయిష్ఠములగు దండయాత్రలలో అల్పవయస్కులగు సైనికులు పలువురు మరణింతురు! దీని ఫలితార్థము స్పష్టముగ తెలియవచ్చుచున్నది. మేమీవరకే తెల్పిన విధముగ అనేక కారణములవలన పెద్దవారి దేహములకంటె చిన్నబిడ్డల దేహములనుండి ఉష్ణత హెచ్చుగ నష్టపడిపోవుచుండును. ఇయ్యది వారికి చాల నష్టదాయకము. అల్పవయస్కుల దేహపరిమాణదృష్ట్యా పరీక్షించిన పక్షమున అనుదినమును వారి దేహమునుండి వెలువడు అంగారకామ్లము వారి దేహమునకు రెండంతలు స్థూలత్వముగల దేహమునుండి నిజమునకు వెల్వడవలయును. అల్పవయస్సుగల జంతువులయెడ కూడ నీయంశము వర్తించును. కావున చిన్నబిడ్డల దేహములో పెద్దల దేహములోకంటె రెండు రెట్లు అంగారకామ్లము ఉత్పన్నమగును. శరీరమునం దుత్పన్నమగు వేడిమికిని అంగారకామ్లమునకును సన్నిహితసంబంధము కలదు. కావున పసివారల దేహములో నితరములగు లోపము లేవియును లేకున్నను సహజముగ వారి కొక అననుకూలత యేర్పడి యున్నది. వయస్సు వచ్చినవారికంటె చిన్నబిడ్డలు తాము తినెడి యాహారములో నత్యధికభాగమును శరీరమునందలి యుష్ణతను కాపాడుటకై వెచ్చింపవలసినవా రగుచున్నారు.

బాగుగా వయస్సు వచ్చినవారి దేహమునుండి వేడిమి విశేషముగ నష్టముకాదు. అనుదిన శారీరక వ్యాపారమువలన కొల్ది నష్టమే కాని వారికి భౌతికముగ మరే నష్టమును ఉండదు. అయినను పెద్దలెవ్వరును కాళ్ళకును, చేతులకును, మెడకును తగినంత సంరక్షణ లేకుండ చలిగాలిలోనికి పోవుటకు సాహసింపరు. ఇట్టి పరిస్థితిలో చిన్నబిడ్డలను చలిగాలిలో తిరుగనిచ్చుచు వారికి దేహమునిండు బట్టల నొసంగకపోవుట యెట్టి వివేకమో మా పాఠకు లూహించుకొనగలరు. దేహమునం దుష్ణత నుత్పన్నము కావించుటకై వినియోగపడు ప్రతి తులము ఆహారమును, శరీరపుష్టిని కల్గించు విషయమున కేవలము నిరర్థకమైపోవు చున్నట్లుగ మనము గ్రహింపవలెను. వెచ్చని దుస్తులు తొడుగుకొనకుండ చలిలో తిరుగుటవలన సర్వసాధారణముగ సంభవించు వ్యాధులనుండి అదృష్టవశమున మనము తప్పించుకొన గల్గినను, దానివలన శరీరము చక్కగ పెరుగక నష్టముపాలగుట అనివార్యము.

పై యంశములనుండి మన మొక యారోగ్య సూత్రమును నిర్మింపగల్గుచున్నారము. చిన్నబిడ్డ లందరికిని ఒకే విధమగు దుస్తుల నీయవలెనని నిర్బంధము లేదు. కాని వారి దేహమున కేమాత్రమును శీతలబాధ కలుగకుండ వారిని కాపాడుట మాత్రము అత్యవసరము. శాస్త్రజ్ఞులును, వైద్యులును, అనుభవశాలురగు నితర పెద్దమనుష్యులును కూడ ఈ యంశము నంగీకరించియున్నారు. చిన్నబిడ్డల దుస్తుల

లకు కూడ నిరోధము కల్గించును. కంటికింపుగ నుండుట
కొరకై మన తల్లులు రంగు రంగుల నాజూకు బట్టలతో
బిడ్డలకు దుస్తులను కుట్టింతురు. ఇవి నోటవాడకమున కేంత
మాత్రమును పనికిరావు. ఇట్టి దుస్తులను ధరించి బిడ్డలు
తమ యిచ్చవచ్చిన చొప్పున ఆడుకొనుటకు వలను పడదు.
దుస్తులు చెడిపోవకుండుటకై తల్లులు తమ బిడ్డలను యథే
చ్ఛగ వాడుకొననీయక నిర్బంధములకు లోనుకావింతురు.
పిల్లవాడు నేలపై ప్రాకుచు ఆడుకొనుచున్న సందర్భములో
వాని దుస్తులు మురికియైపోవు నను కారణముచే ప్రాకుట నే
నిషేధించెడి తల్లులను మన మనుదినము చూచుచుం
దుము. బాలుడు కాలిబాటనుండి యించుక ప్రక్కకుపోయి
ఏదైన మంటి దిబ్బ నెక్కుటకై యత్నించిన పక్షమున "వద్దు!
వద్దు. నీ మేజోళ్లు మాసిపోవును," అని కోపగించి బాలుని
వెనుకకు పిలుచునట్టి ఉపాధ్యాయినుల మన మెందరిని గాం
చుట లేదు? ఈ విధముగ చిన్న బిడ్డలకు రెండు విధము
లైన నష్టములు సంభవించుచున్నవి. తల్లికోరిన అందమును
పొంది, చూడవచ్చిన వారందరిచే "సెబాసు" అనిపించు
కొనగలందులకై బాలబాలికలకు ఒడలునిండనట్టియు, చలి
నాపజాలనట్టియు దుస్తులు లభించును. ఈ నాజూకైన
దుస్తులు చెడిపోవకుండ గలందులకై బిడ్డలకు సహజమును,
ఆరోగ్యప్రదమును అగు ఆటపాటలు నిరోధింపబడుచున్నవి.
దుస్తులు దేహమునకు చాలియు చాలనట్లుగ నున్న యెడల

దేహపరిశ్రమయొక్క ఆవశ్యకత ఇంకను హెచ్చుగనుండును. కాని అంగీలు మాసిపోవునను భయముచే తల్లులు ఈ యాట పాటలనిషేధింతురు. ఇట్టి పద్ధతులవలన పసిబాలుర యారోగ్య మెట్లు చెడుచున్నదో, వారి దేహదార్ఢ్యమెట్లు క్షీణించు చున్నదో ఈ కారణముచే బాలురు తమ భావిజీవితమున పొంద వలసినంత విజయలాభము నెట్లు పొందజాలకున్నారో, కొన్ని సందర్భములలో వారెట్లు అకాలమరణమునకు గురియగు చున్నారో మేము సవిస్తరముగ తెలుపనక్కరలేదు. ఆ చర్చ ఈ వరకే కావింపబడినది. కాని తల్లుల అజ్ఞానము వలనను, వారి మూఢభావముల వలనను మన చిన్న బిడ్డలకును, తన్మూలముగ మనజాతికిని కల్గుచున్న నష్టమును చూచుసరికి మాకు చాల బాధకల్గి, ఈ అతిముఖ్యవిషయములో తండ్రులు కలుగ జేసికొని, తల్లుల అవకతవకలను సరిదిద్దుటకై కఠినపద్ధతుల నవలంబింప వలయునా యని యనుమానము తోచుచున్నది.

దుస్తులను గూర్చి మా బుద్ధికి తోచిన సూత్రముల నిట పొందుపరచుచున్నాము. చిన్న బిడ్డలకు విస్తారముగ బట్టలను కట్టబెట్టి వారికనావశ్యకమగు వేడిమిని సంప్రాప్తింప జేయుటకు మేమంగీకరింపము. కాని వారి దేహమునకు చలి బాధకలుగకుండుటకై అవసరమగునట్టి దుస్తులను మాత్రము వారికి తప్పక తొడుగవలయును. ఇప్పుడు మనవారు తరచుగ ప్రత్తివస్త్రములనో, లేక ఉన్ని ప్రత్తి కలసిన బట్టలనో తమ బిడ్డలకొరకై వాడుచున్నారు. ఇది తప్పు. చలిని

బాగుగా ఆపుటకొరకై మోసైన ఉన్నిదుస్తులను బిడ్డలకు తుట్టించవలెను. బిడ్డలు తమ యిచ్ఛవచ్చిన చొప్పున ఆడు కొనుచున్నప్పుడు అవి రాటుపోటులకాగి చెడిపోకుండ నుండ వలెను. శీతోష్ణముల ప్రభావముచే సులభముగ చెడిపోనట్టి రంగులు గల దుస్తులనే చిన్నబిడ్డలకొరకై వాడుట చాల యవసరము.

దేహపరిశ్రమయొక్క ఆవశ్యకతను మనలో చాల మంది గుర్తించుచున్నారు. కావున ఇతర విద్యావిషయము లను గూర్చి చర్చించిన విధముగ ఈ యంశమును గూర్చి విస్తరించి ప్రశంసచేయనవసరములేదు. అధమపక్షము బాలు రను గూర్చి యిట్టి చర్చసాగింపనక్కరలేదు. మన దేశ ములోని పాఠశాల లన్నిటిలోను కూడ బాలురు ఆడుకొను టకై విశాలమగు ఆటస్థలములు ఏర్పాటు చేయబడుచున్నవి. చిన్నబిడ్డలు నిత్యమును కొంతకాలమాటలాడు కొనవలెనను అంశమును గుర్తించి, అందుకొరకై పాఠశాలాధికారులు కొంతకాలమును వినియోగించుచున్నారు. ఈ విషయ మం దును, తదితర విషయములందును కూడ బాలుర సహజ ప్రవృత్తుల ననుసరించి వర్తించుటవలన లాభము చేకూరు నను యంశము నేడు గుర్తింపబడుచున్నది. ఉదయము నం దును, మధ్యాహ్నము నందును కూడ దీర్ఘమగు పాఠశాలా కార్యక్రమమును కొంత తడవు ఆపి ఆరుబయళ్ళలో ఆట పాటలకై కొంత విరామము నిచ్చుట ఇప్పుడు వాడుకగ

సున్నది. ఈ విధముగ బాలురకు సహజముగ కల్గు భౌతిక వాంఛలు సక్రమమైనవని గుర్తించి పాఠశాలలు తదనుగుణముగ వర్తించుచున్నవి. కావున యీ విషయములో మేము చేయదగిన వాదముగాని, చేయదగిన సూచనలుకాని లేవు.

కాని మేము మొదటనే మా వాక్యములలో నొక హంసపాదమును చేర్చినారము. బాలురకు సంబంధించినంత వరకును దేహపరిశ్రమ కొరకై కావింపబడుచున్న ఏర్పాట్లు చక్కగనున్నవని మేము తెల్పినాము. కాని ఇది బాలికలకు వర్తించుటలేదు. మే మనుదినమును ఒక బాలికా పాఠశాలను, ఒక బాలుర పాఠశాలను శ్రద్ధగచూచుచు, ఈ రెంటిని పోల్చుచుందుము. బాలుర పాఠశాలలకు చేరియుండు విశాలమగు మైదానము చదును చేయుబడియుండును. అందు వివిధమగు ఆటలు ఆడుటకై ఏర్పాట్లు చేయుదురు. శరీర వ్యాయామము కొరకై అచ్చటచ్చట వ్యాయామ స్తంభములు నెలకొని యుండును. అనుదినమును ప్రాతఃకాల భోజనమునకు పూర్వమును, పదునొకండు గంటలకును, మధ్యాహ్న కాలమునను, అపరాహ్ణము నందును, సాయంకాలమునందును బాలురు నవ్వుచు, ప్రేలుచు, ఆటలాడు కొనుచున్నప్పుడు వారి అట్టహాసధ్వనులు పాఠశాల చుట్టు ప్రక్కలలో కూడ ప్రతిధ్వనించును. కొంతకాలము వరకును ఆ బాలుర ఉత్సాహాతిరేకమును మన కండ్లతో చూడనచ్చును. ఆనంద పూరితములగు వారి కేకలు మన చెవులకు విందుచేయును.

ఈ ఖేలనమువలన బాలుర దేహములలో రక్తప్రసారము చక్కగ జరుగును. వారి యంగములన్నిటికిని బలము చేకూరును. ఇక బాలికల కొరకై ఏర్పడెడి పాఠశాలలలో పరిస్థితు లిందులకు సంపూర్ణముగ వ్యతిరేకము. మా మిత్రు డొకడు తెల్పువరకును మాకు బాలుర పాఠశాలకు మిక్కిలి సమీపముననే బాలికల పాఠశాలకూడ కలదను యంశమే తెలియరాలేదు. ఈ పాఠశాలకు సంబంధించిన బయలు ప్రదేశము కూడ మిక్కిలి విశాలమైనదే కాని అందు పిన్నవారి ఆటపాటల కొరకై ఎట్టి ఏర్పాట్లును లేవు. అందులకు మారుగ ఆ మైదానములో చిన్న గడ్డి ఖండికలు, నునుపైన కాలిదారులు, పొదరిండ్లు పూలతోటలు ఏర్పడి యున్నవి. అది యొక సంపన్నుని నివాసగృహమువలె మాత్రము కాన వచ్చుచుండును. ఆ మైదానము నుండి గడచిన ఐదారు నెలలలో ఆనందద్యోతకములగు నవ్వులు, కేకలును మాకు కర్ణగోచరములు కాలేదు. అప్పుడప్పుడు బాలికలు చెట్టాపట్టాలు వేసికొని అచ్చట విహరించుటయో, పుస్తకముల చేతబూని కాలిదారులలో నడయాడుటయో మాకు కాన వచ్చినది. చురుకైన దేహపరిశ్రమ కచ్చట యెట్టి స్థానమును లేనట్లు మాకు తోచినది.

ఈ భేద మేల యుండవలెనో మాకు తోచుటలేదు. బాలురకును బాలికలకును భౌతికలక్షణములలో చాలభేదము కలదనియు, అందువలన వారికి చురుకైన శరీరవ్యాయామము

ఆవశ్యకము కాదనియు తలంచుట పొరపాటు. గట్టిగ అరచుచు, కేకలు వేయుచు ఆడుకొనవలెనని మగబిడ్డల కెట్లు కోర్కె యుండునో ఆడుబిడ్డలకు కూడ నట్టి కుతూహలమే యుండును. చురుకుగ ఎగురుచు, దుముకుచు, గంతులు వేయుచు, ఆడు కొనవలయు ననుకోర్కె చిన్నబిడ్డల శారీరక పరిస్థితికి దోహదము కల్పించుటకై ప్రకృతిచే ఏర్పాటు చేయబడిన యొక సాధనము. ఈ సత్యము బాలురకును బాలికలకును సమానముగ వర్తించును. బహుశః మన ఉపాధ్యాయవర్గ ములో నొక తప్పగు అభిప్రాయము ప్రబలియున్నదేమో నని మా యనుమానము. బాలికలను కృశగాత్రులుగ కాపాడుట వాంఛనీయము కాదేమో నని వీరిలో కొందరు భావించు చుండవచ్చును. చక్కని దేహదార్ఢ్యము, అకుంఠితమగు చురుకు తనమును కల్గియుండుట ఉన్నత తరగతివారలకు తగదని వారి భావమై యుండనోపును. ఘరానా కుటుంబములకు చెందిన స్త్రీలు సుకుమారులుగ నుండవలెననియు, వారొకటి రెండు మైళ్ళ దూరము మాత్రము నడువగల శక్తిని గల్గి యుండవలె ననియు, వారేవో రెండు మెతుకులు ముక్కున కంటించుకొనవలెనే కాని కడుపార భుజించుట నాజూకుతన మునకు భిన్నమనియు, దౌర్బల్యమునకు చేరువచుట్టమగు పిరికితనము వారికొక భూషణ మనియు తలంచువారు కొందరు మనలో కలరని మే మెరుంగుదుము. ఇట్టి భావములు సర్వ వ్యాప్తములై యుండకపోవచ్చును. కాని బాలికలకు విద్యను

నేర్పు ఉపాధ్యాయినుల మతమునందు ఘరానా స్త్రీలలో పై లక్షణము లన్నియు నుండవలెను. ప్రస్తుతము బాలికల విద్యాభ్యాసమునకై ఆచరణలోనున్న విద్యావిధాన మిట్టి స్త్రీలను తయారు చేయుట కెంతయును అనుకూలముగ నున్నది. కాని స్త్రీజాతి కిది యాదర్శముగ నుండవలయు నని తలచుట చాల తప్పు. మగవీరుల వలెనున్న స్త్రీలు పురుషుల కింపు కారని మాకు తెలియును. స్త్రీలు తమకంటె ఇంచుక దుర్బలలై యుండవలె ననియు, తత్కారణమున వారు (స్త్రీలు) తమ సంరక్షణను కోరవలె ననియు పురుషులు వాంఛింతురు. స్త్రీలలో గల యీ అబలత్వమే బహుశః పురుషుల నాకర్షించును. ఈ యంశమును కూడ మే మంగీకరించుచున్నాము. స్త్రీల యాకర్షణకు మూలమైన యీ విభేదము సహజముగ, అనాదినుండియు వారిలో నెలకొని యున్నది. అందులకై మనము కృత్రిమపద్ధతులను ప్రత్యేకముగ నవలంబింపవలసిన యావశ్యకత లేదు. కృతకసాధనములచే స్త్రీ పురుషులలో గల యీ విభేద మింకను పెంపొందింపబడిన యెడల స్త్రీలలో గల యాకర్షణ నశించి పురుషులకు వారియెడల ఏవగింపు గల్గుట సత్యము.

"అయినచో ఆడుబిడ్డలు మగరాయండ్రవలె విచ్చలవిడిగ తిరుగుచు, బాలురవలెనే పెరుగవచ్చునా?" యని సంఘమర్యాదల యెడల పట్టుదలగలవారు ప్రశ్నింపవచ్చును. ఇట్టి ప్రమాదము స్త్రీలకు సంభవించు నేమోయని మన

ఉపాధ్యాయిను లెల్లప్పుడును భయపడుచుందురు. స్వేచ్ఛాను
ప్రేలుచు బాలురవలె ఆటలాడుకొనుట బాలికల పాఠశాల
లలో నేరముగ పరిగణింపబడుచున్న దని మాకు తెలియ
వచ్చినది. స్త్రీలమర్యాదకు ఇట్టి ఆటపాటలు విరుద్ధములు
కావున అవి వారి పాఠశాలలలో నిషిద్ధములుగ భావింపబడు
చున్నవట. కాని ఇట్టి నిషేధము లనావశ్యకము లని మా
మతము. ఆటపాటలలో పాల్గొనుట వలన బాలుడు పెరిగి
పెద్దవారైన తరువాత భద్రపురుషులుగ పరిగణింపబడుట
కెట్టి యభ్యంతరమును లేనప్పుడు ఆటపాటలవలన బాలిక
లుత్తమ స్త్రీ లగుట కేల ఆటంకముండవలయును? మగ
బిడ్డలు ఆట మైదానములో కొంత మోటుగ ప్రవర్తించినను,
నిత్యజీవితములో వారు సంఘమర్యాదల నతిక్రమింపరు.
బాల్యదశను దాటగానే వారు బాల్యచేష్టలను కూడ చాల
వరకు విడచివేయుదురు. పెద్ద మనుష్యులవలె కానిపించు
టకై వారు సర్వవిధముల యత్నింతురు. వయస్సు వచ్చిన
తరువాత పురుషసహజమగు హుందాతనమును రక్షించు
కొనవలెనను నుద్దేశ్యముతో బాలుడు తన ఆటపాటలను
కట్టిపెట్టుచున్నాడు. అదే విధముగ యుక్తవయస్సు వచ్చిన
మీదట స్త్రీలు సహజమగు బిడియమును, లజ్జయు పెంపొందిన
తరువాత బాల్యమునందలి ఆటపాటలకు స్వస్తిచెప్పరని యేల
భావించవలెను? పురుషుల కంటె స్త్రీలకు సంఘమర్యాదల
యందు ఎక్కువ పట్టుదల. కావున మోటుగను, అల్లరి చిల్లర

గను, కన్పించు ప్రవర్తనను విడనాడుటకై యువతులు విశేష ముగ ప్రయత్నింతురు. ఉపాధ్యాయినుల కట్టుదిట్టములు లేని పక్షమున స్త్రీల సహజప్రవృత్తులకు ప్రోత్సాహము కలుగదని తలంచుట హాస్యాస్పదము.

సర్వసాధారణముగ లోకములో ఒక లోపమును తొలగించు ప్రయత్నములో వేరొక లోపమును ప్రజలు తెచ్చిపెట్టుకొందురు. ఇయ్యది విద్యావిషయమునకు కూడ వర్తించుచున్నది. మన విద్యావిధానములో బాలుర సహజప్రవృత్తుల కనుగుణ్యమగు దేహపరిశ్రమ నిషేధింపబడినది. అందువలన కల్గు దుష్టఫలితము లిప్పుడు స్పష్టముగ కానవచ్చుచున్నవి. వీనిని నివారించుటకై ఇప్పుడు మన పాఠశాలలలో జమాస్టిక్సు అనబడు కృత్రిమమైన శరీరవ్యాయామ మేర్పాటు కావింపబడినది. శరీరవ్యాయామము బొత్తుగ లేకుండుట కంటె ఈ విధమైన వ్యాయామముండుట మంచిదియే. కాని ఇట్టి వ్యాయామము ఆటపాటల స్థానము నాక్రమించుటకు మాత్ర మనర్హమని మా భావము. ఇందు ప్రత్యక్షములును, పరోక్షములును అగు లోపములు కలవు. కృత్రిమ మగు నీ శరీర వ్యాయామమునందు ఆటపాటలలోవలె శరీరమందలి సర్వాంగములకును పరిశ్రమలభింపదు. ఇట్టి వ్యాయామము చేయునప్పుడు మన శరీరమునందలి కొన్ని భాగములపై మాత్రమే విశేషము భారము పడును. కావున ఆటపాటలలో కంటె వ్యాయామములో మనము శీఘ్రముగ అలసిపోవుదుము.

ప్రత్యేకాంగములకు పరిశ్రమ నిచ్చునట్టి యీ వ్యాయామము
లను మనము తరచుగ చేసిన పక్షమున దేహమందలి కొన్ని
అంగములు మాత్రము పెంపుచెంది, సమగ్రపరిపుష్టి లోపిం
చును. కృత్రిమవ్యాయామములు శరీరమునకు పాక్షికపుష్టిని
కల్గించుటయే కాదు. అయ్యవి మరియొక విధముగ కూడ
లోపభూయిష్ఠములు. వీని యందు ఎవ్వరికిని అభిరుచి యుండ
జాలదు. ఈ వ్యాయామమును కూడ బడి పాఠములవలె
నిర్బంధము కావించినచో, బాలురకు వాని యెడల ఏవగింపు
కల్గితీరును. వీనియందు బాలుర కుల్లాసము కల్గించు లక్షణ
ములు కొరవడియున్నవి. ఆ కారణమువలన చర్విత చర్వణ
ప్రాయమైన యీ పరిశ్రమయెడల బాలురు త్వరలో విసువు
చెందుదురు. పోటీవలన ఒకపనిచేయుటకై కొంత ప్రోత్సా
హము లభించు నను విషయము వాస్తవమే కాని ఆ ప్రోత్సా
హము కూడ కృత్రిమమే. ఆటపాటలలో బాలుర కుండెడి
సహజమగు నభిరుచి మరేవిధముగను కలుగజాలదు. కృత్రిమ
మగు శరీరవ్యాయామమునకు ప్రతికూలముగ మేము మరొక
బలవత్తర కారణమును కూడ చూపగలము. దీనివలన కల్గు
నితర ఫలితములు కూడ ఏమంత మంచివి కావు. కృత్రిమ
వ్యాయామము బాలుర కుల్లాసము కల్గింపకపోవుట దాని
యందలి ప్రథమలోపము. ఇందలి మరొక లోపమును కూడ
గమనింపుడు. శరీరమునకు తగినంత పరిశ్రమ లభించినప్పుడు
ఆ పరిశ్రమ సంతోషదాయకమైనను కాకపోయినను కూడ

నష్టములేదని పలువురు భావింతురు. ఇది గొప్ప పొరపాటు. మనస్సున కుల్లాసము కల్గించు వ్యాపారము దేహమునకు కూడ ఉత్తేజము కల్గించును. రోగగ్రస్తుడై యున్న యొకని కేదైన మంచివార్త తెలిసినను, లేక ఎవ్వరైన ఆప్తమిత్రు డాతని కడకువచ్చినను కల్గు సత్ఫలితమును గుర్తింపుడు. బలహీనులై యున్న రోగుల కడ సంతోషదాయక మగు నంశములను మాత్రమే చర్చింపవలెనని వైద్యులు సలహోయిచ్చుచుండుట మీరు గమనించి యుందురు. ఒక ప్రదేశమునుండి వేరొక ప్రదేశమునకు మకాము మార్చిన పక్షమున మన ఆరోగ్యమున కెంతయో మేలు చేకూరును. ఆనందమే మానవుని కుత్తమోత్తమమగు బలవర్ధకౌషధము. సంతోషము రక్తప్రసారమును వృద్ధిచెందించును. దీనివలన దేహమందలి వివిధాంగములు తమ తమ ధర్మములను తొల్లింటి కంటె బాగుగ నిర్వర్తించును. సంతోష మారోగ్యముగ నున్నవారి కధికారోగ్యమును ప్రసాదించును. రోగుల కారోగ్యమును పునః లభింపజేయును. కావున కృత్రిమ వ్యాయామము కంటె ఆటపాట లెన్నియోవిధముల శ్రేష్ఠతరములు. ఆటపాటలలో బాలురకు లభించు శరీరవ్యాయామముతోపాటు వారికి కల్గు ఆనందోల్లాసములుకూడ అతిముఖ్యమైనవని. కృత్రిమవ్యాయామము మానసికముగ నెట్టి యానందమును చేకూర్పదు. కావున నయ్యది లోపభూయిష్ఠమని నిర్ణయింపవలసియున్నది.

శరీరవ్యాయామము బొత్తుగ లేకుండుట కంటె కృత్రిమ

వ్యాయామమైన చేయుట మన కవసరమని మే మంగీకరిం తుము. ఈ వ్యాయామమును సహజమగు వ్యాయామమున కనుబంధముగ నుపయోగింపవచ్చును. కాని ప్రకృతి ప్రోద్బలముచే అల్పవయస్కులగువారు పాల్గొనెడి ఆటపాటల కీ యసహజమగు వ్యాయామ మెంత మాత్రమును సాటి రాదు. బాలబాలికల శరీరారోగ్యము చక్కగ సంరక్షింపబడ వలయునన్న వారు తమ సహజ ప్రవృత్తుల ప్రోత్సాహము ననుసరించి క్రీడలలో తప్పక పాల్గొనవలెను. ఇట్టి ఆటపాటల కభ్యంతరములు కల్పించువారు శరీరపరిపుష్టికై ప్రకృతిమాత కావించిన ఏర్పాట్లను తిరస్కరించుచున్నారని యర్థము.

మరియొక ముఖ్యవిషయమును గూర్చి యిచ్చట ఆలోచింపవలసియున్నది. చదువు సంధ్యలు నేర్చిన యాధు నికులలో బాలురును, నవయువకులును, ప్రాతతరమువారివలె బలాఢ్యులును, దృఢగాత్రులును కారని పలువురు పలుకు చుండుట మే మెరుంగుదుము. "ఈ విధముగ ప్రసంగించుట పూర్వము నుండియు ఆచారముగ నున్నది. ఘనత యంత యును గతమందే నెలకొనియున్నట్లు పలుకుట కొందరికి స్వభావమైపోయినది." అని మొట్టమొదట యీ ప్రసంగ ముల విని నప్పుడు మేము భావించితిమి. కాని ఈ యంశ మును సవిస్తరముగ పరిశీలించిన మీదట మా భావములలో కొంత పరివర్తనము కల్గినది. ఒక్క పారిశ్రామికవర్గములో తక్క తక్కిన యితర జనులందరిలోనుకూడ నే డొక మార్పు

కానవగుచున్నది. బిడ్డలు సాధారణముగ తమ తండ్రులంత ఉన్నత దేహులుగను, దృఢగాత్రులుగను పెరుగుటలేదు. వయోభేదములను గుర్తించిన మీదట కూడ ఈ మార్పు విస్పష్టముగ కానవచ్చుచున్నది. తొల్లింటితరములో గల భౌతికనిరోధకశక్తి నేటి వారిలో లేదని వైద్యులు వ్రాయుచున్నారు. ఆధునికులలో పలువురకు అకాలమందే బట్టతలలు సిద్ధించుచున్నవి. ఈ తరమువారిలో అనేకులకు దంతక్షయము సంభవించుచున్నది. శరీరదార్ఢ్యము విషయములో నీ వ్యత్యాసము విస్పష్టముగ కానవగుచున్నది. పూర్వపు తరములో మద్యసేవ కావించెడివారుకూడ భౌతికముగ దృఢతరులై యుండుచు వచ్చిరి. మద్యమును సేవింపకుండియు ఆధునికులు దుర్బలులుగ నున్నారు. ప్రాతతరమువారు మద్యపానమున కలవాటుపడి యుండిరి; వారు మనవలె సకాలమునందు తమ నిత్యకృత్యముల నిర్వర్తించెడివారు కారు; పరిశుభ్రమగు గాలిని పీల్చుట, పరిశుభ్రముగ జీవించుట మున్నగు నంశములు వారి కెరుకయే లేకుండెను. అయినను క్రిందటి తరములవారు వార్థక్యదశయందుకూడ కష్టపడి పనిచేయగల్గెడివారు. పూర్వపు తరములలో న్యాయాధిపతులును, న్యాయవాదులును ఎట్లు కష్టించి పనిచేయుచుండిరో గమనింపుడు. ఆధునికయుగములో మనము మన శరీరారోగ్యము విషయమై యెక్కుడు శ్రద్ధ పూనుచున్నాము; మనము మితముగ భుజించుచున్నాము; మత్తుపదార్థముల మితిమీరి సేవించుట

లేదు; పరిశుభ్రమగు గాలిని సేవించుచున్నాము; తరచు స్నానాదికముల కావించుచున్నాము; ప్రతి సంవత్సరమును ఆరోగ్యప్రద మగు ప్రదేశములకు యాత్రలు కావించుచున్నారము; మనకు చక్కని వైద్యసహాయముకూడ లభించుచున్నది. ఇన్ని అనుకూలతలు కల్గియు కార్యభారమును వహింపజాలక మనము క్రుంగిపోవుచున్నాము. ఆరోగ్య సూత్రముల కనుగుణ్యముగ వర్తించుచుండియు మనము మన తండ్రి తాతలకంటె బలహీనులుగ నున్నారము. ఆరోగ్య సూత్రముల తిరస్కరించియు వారు సుఖజీవనము గడపిరి. నేటి తరమువారు మనకంటెను దుర్బలులు ; వారి కనుదిన మును ఏదో యొక అనారోగ్యమే. కావున మన కుమారులు మనకంటె అల్పజీవులుగ నుందురనట్లు కానవచ్చుచున్నది.

దీని యర్థ మేమికావచ్చును ? నేటి కాలమున చిన్న బిడ్డలకు వారి కావశ్యకమగు నాహారము నీయకుండుట పరిపాటి యైనదని మే మీవరకే తెల్పినాము. పూర్వకాలమున పసివాండ్రకు మితిమీరిన యాహారము నొసంగుచుండినను వారి యారోగ్య మేల చెడిపోయెడిది కాదు ? అల్పవయస్కులకు కష్టసహిష్ణుత నలవాటు చేయవలయు నను కొన్ని తప్పుడు సూత్రముల నంగీకరించి నేటి తల్లిదండ్రులు తమ బిడ్డల కావశ్యకమగు దుస్తుల నిచ్చుట మానినారు. ఇందు వలన నేవైన దుష్పరిణామములు కల్గుచున్నవా ? ఆధునికులలో పలువురు నాజూకుతనము పేరిట తమ బిడ్డలను వారి

కిచ్చువచ్చిన తీరున నాడుకొనుట కవకాశములు కల్గించుట మానినారు. ఈనాటి వారి దౌర్బల్యమున కిది కారణమై యుండవచ్చునా? లేక వీని కన్నిటికిని మించిన మరి యే కారణమువలన నైన మన ప్రజలు దినదినము దుర్బలురుగ పరిణమించుచున్నారా? బహుశః అయ్యది మితిమీరిన మానసిక పరిశ్రమ అయియుండవచ్చునా? ఈ విషయము లన్నియు విచారింపదగినవి.

ఆధునిక జీవితవిధానమునందు పెద్దలపైనను, పిన్నలపైనను కూడ పెద్దభారము పడుచున్నది. ఆ భారము దినదినాభివృద్ధి చెందుచున్నట్లు మా యభిప్రాయము. వ్యాపారమునందును, సమస్త వృత్తులందును ఈనాడు పోటీ తీవ్రముగనున్నది. ఈ పోటీని తట్టుకొనుటకై ఆ యా వృత్తులలో పాల్గొనువారు తమ సర్వశక్తుల ధారపోయవలసి వచ్చుచున్నది. జీవితరంగములోని ఈ పోటీలో విజయవంతముగ మెలగగలందులకై మనవారు తమ బాల్యదశయందు తొల్లింటికంటె కఠినమగు క్రమశిక్షణకు బద్ధులు కావలసి వచ్చుచున్నది. ఈ విధముగ మన తరమువారికి రెండు విధములుగ నష్టము కలుగుచున్నది. దినదినము పెరిగిపోవుచున్న పోటీదారుల ధాటికి నిలువగల్గుట కొరకై ఈనాటి సంసారులు అత్యంతము కష్టపడి పనిచేయుచు, సంపాదించిన సొమ్మంతను తమ ఉన్నత జీవనప్రమాణమును నిలువబెట్టుకొనుటకై సెలవు చేయుచు, ఉదయమునుండి సాయంకాలము వరకును కష్టించుచు, శరీర

వ్యాయామ మనునది యెరుగక, విశ్రాంతికి నోచుకొనక, క్రమక్రమముగ దుర్బలదేహు లగుచున్నారు. నిరంతర పరిశ్రమచే దేహదార్ఢ్యమును కోల్పోయిన పూరుషుల సంతాన మెట్టివారుగ నుందురో తెలుపనక్కర లేదుకదా! జన్మతః దుర్బలురైన ఈ బిడ్డలు సామాన్యమగు కార్యభారమునకే తట్టుకొనజాలరు. అట్టి పరిస్థితులలో మన మీ యల్పప్రాణులపై పూర్వకాలమునాటి దృఢతరగాత్రులపై వేయనంతటి క్రమశిక్షణ భారమును వేయుచున్నాము. పాఠశాలలయందు వారి కెన్నెన్నో విషయముల బోధింప జూచి వారిని బాధించుచున్నాము. దీని ఫలితము లెట్లుండునో ఇంచుక యోచింపుడు.

పైన వర్ణింపబడిన పరిస్థితుల వలన కలుగగల దుష్పరిణామములు సర్వత్ర కానవచ్చుచున్నవి. ఏ వైపునకు పోయి చూచినను అత్యధిక మానసికపరిశ్రమ వలన దేహదార్ఢ్యమును కోల్పోయిన చిన్నబిడ్డలును, యువతీ యువకులును నీకు కానవత్తురు. ఆరోగ్యమును బాగుపరచుకొనుటకై కొందరొక సంవత్సరముపాటు చదువులను కట్టిపెట్టుచున్నారు. మరికొందరు యువకులు విపరీతమగు మానసికపరిశ్రమచే మతిచెడి, స్వాస్థ్యము చేకూరక, ఎన్నో నెలలపాటు బాధపడుచున్నారు. బడిచదువుల వలన మస్తిష్కము విస్తారముగ నుడుకెత్తి జ్వరబాధకులైన వారిని మన మెందరినో గాంచుచున్నాము. ఆరోగ్యకారణముల వలన కొంతకాలము చదువునకు స్వస్తిచెప్పి మరల బడిలో ప్రవేశించిన బాలురు,

అచ్చటి మానసికశ్రమ కోర్వలేక తరగతిలోనే మూర్ఛ పోయినట్లు మనము తరచు వినుచుందుము. మేము తెల్పనట్టి యంశములలో నతిశయోక్తి ఎంత మాత్రమును లేదు. గడచిన రెండు మూడు సంవత్సరములలో యాదృచ్ఛికముగ మాకు తెలియవచ్చిన విషయములను మాత్రమే మేము తెల్పుచున్నాము. ఇట్టి సంఘటనలను మే మింకను పేర్కొనగలము. మేము పైన వర్ణించిన దౌర్బల్య మెట్లు అనువంశికముగ పరిణమించునో చూపుటకై యొక ఉదాహరణము నొసంగెదము. మాకు పరిచితురాలగు నొక యువతి కలదు. ఆమె తల్లిదండ్రులు దృఢగాత్రులు. కాని ఈ యువతి కొన్ని సంవత్సరములపాటు స్కాట్లండులోని ఒక బోర్డింగు స్కూలులో చదువుకొన్నది. అచ్చట ఆమెకు తగిన యాహారము నిచ్చెడివారుకారు. పని మాత్రము తలమునకలుగ నుండెడిదట. తత్ఫలితముగ ఆమె దేహము రోగగ్రస్తమైనది. ఉదయమున లేచుసరి కామెకు తలదిమ్ముగ నుండునట. ఆమె బిడ్డలకు బలహీనమగు మస్తిష్కములు సంక్రమించినవి. ఏ కొంచెము పాటి చదువు చదివినను ఆ బిడ్డలకు తలనొప్పియు, తలదిమ్మును తప్పక కల్గుచుండును. కాలేజి చదువువలన ఆరోగ్యమును శాశ్వతముగ కోల్పోయిన ఒక యువతీమణి మాకు నిత్యమును కానవచ్చుచుండును. చదువునందే ఆమె శక్తి యంతయు వ్యయమైపోయి, ఆమెకు శరీరవ్యాయామమున కోపికయుండెడిది కాదు. ఇప్పు డామె చదువు సంపూర్ణమైనది

కాని ఆమె కిప్పుడేదియును సరిపడదు. ఈ యువతి కాకలి క్షీణించినది. అందులో కూడ నిలుకడలేదు. మాంసాహార మామె కిప్పుడు తరచుగ గిట్టదు. ఎండకాయుచున్నప్పుడు కూడ ఆమె కాలుసేతులు చల్లబడి పోవుచుండు నట! దేహ దౌర్బల్యమువలన ఆమె ఎక్కువ దూరము నడువజాలదు. ఆ నడకయైనను తాబేలు నడక. మేడమెట్లు ఎక్కినచో ఆమెకు గుండెదడ ప్రారంభించును. దృష్టిపాటవము తగ్గినది. ఈమె ఎదుగవలసినంత చక్కగ ఎదుగలేదు. ఈ యమ కెల్లప్పుడును నరముల బలహీనత కల్గుచుండును. ఈ యువతి కన్ని విధముల జోడైన యొక సహాధ్యాయిని కలదు. ఈమె కూడ స్నేహితురాలివలెనే దుర్బలదేహ. నలుగురు స్నేహితురాండ్రతో కలసి ఉత్సాహముగ మాట్లాడిన చాలును. ఆమెకు మూర్ఛవచ్చును. తుదకు వైద్యమహాశయు డామెను చదువు పూర్తిగ కట్టిపెట్టవలసినదని సలహా ఇచ్చియున్నాడు.

అత్యధికమగు మానసిక పరిశ్రమవలన తరచు పెద్ద నష్టములు సంభవించునని మనము తెలిసికొన్నాము. అంతే కాదు. మనకు తెలియరాని అనేకములగు చిన్న చిన్న నష్టములు కూడ దీనివలన సంభవించుచున్నవి. శక్తికి మించిన మానసికకృషివలన కొన్ని సందర్భములలో మనుజులకు తీవ్రమగు రుగ్మతలు కలుగవచ్చును. మరికొన్ని సందర్భములలో దేహయంత్రమునకు సంభవించునట్టి యీ హాని లోలోపలనే సాగుచు, అప్పుడప్పుడు వివిధరూపములలో తల యెత్తుచుం

డును. ఇట్టివారికి తరచు ఏదో ఒక విధమగు ననారోగ్యము కల్గుచుండును. ఇందుల కా వ్యక్తి సహజ సుకుమారత్వమో, లేక మరేయితర కారణమో మూలమని మనము భావించుచుందుము. కొన్ని సందర్భములలో ఇట్టివారు (అధిక మానసికపరిశ్రమ చేయువారు) తగినంత ఏపుగ పెరుగకుండుట కాని లేక అకాలముననే వృద్ధులగుట కాని సంభవించును. మరికొందరు అంతర్గతమై అణగిమణగి యున్న క్షయమున్నగు వ్యాధులకు గురియగుదురు. ఇట్టి అల్పవయస్కులలో కొందరికి మెదడు మిక్కిలి బలహీనమై భావికాలమున తీవ్రమగు మానసికవ్యాధులకు దారి తీయవచ్చును. నేటి కాలమున నిట్టి రుగ్మతలు సర్వసామాన్యముగ పరిణమించినవి కదా! అత్యధికముగ పనిచేయునట్టి వ్యాపారస్థులు, న్యాయవాదులు, వైద్యులు మున్నగువారు వివిధవ్యాధులకు లోనగు చుందురు. ప్రాప్తవయస్కులును, దృఢగాత్రులును అగు వీరికే ఇట్టి బాధలు సంభవించుచుండగా అల్పవయస్కులును, అపరిణతదేహులును అగు విద్యార్థులకు హద్దుమీరిన మానసికకృషివలన నెట్టి నష్టములు సంభవించునో మీ రూహించుకొనగలరు. పెద్దవారు సహించగల కష్టములను కాని, వారు భరించగల భౌతిక మానసిక కార్యభారములను కాని పిన్నవారు సహింపజాలరు, భరింపజాలరు. అధిక కార్యభారముచే పెద్దలే క్రుంగిపోవుచున్నప్పుడు పిన్నల సంగతి వేరుగ తెల్పవలయునా?

మన పాఠశాలలలో అనుసరింపబడుచున్న కార్యక్రమ విధానమును సూక్ష్మముగ పరిశీలించిన మీదట, దాని వలన నిట్టి నష్టములు సంభవించుచున్నవా యని మన మాశ్చర్య పడనక్కరలేదు. ఇంత భారమును చిన్నబిడ్డ లెట్లు భరించు చున్నారాయని మన మక్కజము చెందవలెను. సర్ జాన్ ఘోర్బ్స అను విద్వాంసుడు మన దేశమునందలి బాలికా పాఠశాలలలో అనుసరింపబడుచున్న కార్యక్రమమును గూర్చి కొన్ని అంశములు తెలుపుచున్నాడు. దినము నందలి ఇరువదినాల్గు గంటల కాలము అచ్చట ఎట్లు వినియోగింపబడు చున్నదో గమనింపుడు :

విశ్రాంతి — 9 గంటలు (చిన్నబిడ్డలకు 10 గంటలు)

పాఠశాలలో చదువు — 9 గంటలు

| | |
|---|---|
| బడిలోకాని ఇంటిలోకాని విద్యార్థులకు ప్రత్యేకాభిమాన విషయములను, పనులను చేయుట కొరకున్ను, చిన్నబిడ్డలకు ఆటల కొరకున్ను. | 3½ గంటలు (చాల చిన్న బిడ్డలకు 2½ గంటలు) |
| భోజనము కొరకు | 1¾ గంటలు |
| బయలు ప్రదేశములో శరీర వ్యాయామము పేరిట నడచుటకై (ఈ వ్యాయామ సమయమున కూడ విద్యార్థినుల చేతులలో పుస్తకము లుండితీరవలసినదే. వాతావరణము చక్కగానున్న పక్షమున మాత్రమే ఈ వ్యాయామము సాగును. లేనిచో లేదు). | 1 గంట |

ఇట్టి అసాధారణమగు శిక్షణా విధానమువలన కల్గు పరిణామములను గుర్తింపుడు. విద్యార్థినులు దుర్బలురాండ్రై, పాలిపోయిన దేహముతో, ఉత్సాహ మనునది ఎంతమాత్ర మును లేక ఎప్పుడును ఏదో వ్యాధిచే బాధపడుచుందురు. అంతేకాదు. దేహమునకు తగినంత వ్యాయామము నొసంగక, మనస్సునకు చాల కాలము భారము కల్పించుటవలన భౌతిక యంత్రము తన ధర్మములను చక్కగ నెరవేర్పజాల కుండుటయే కాక, అనేక వికారములకు లోనగుచున్నది. సర్ జాన్ ఫోర్బ్సు తన యనుభవముల నిట్లు తెల్పుచున్నాడు. "నేను ఇటీవల ఒక పట్టణములోని ఒక బాలికల బోర్డింగు పాఠశాలకు పోవుట తటస్థించినది. అందు నలుబదిమంది విద్యార్థినులు కలరు. అచ్చటి పరిస్థితులను నేను సూక్ష్మము గను, శ్రద్ధగను తెలిసికొంటిని. ఈ నలుబది విద్యార్థినులును ఆ బోర్డింగు పాఠశాలలో రెండు సంవత్సరములు గడపినా రట. ఈ నలుబది విద్యార్థినులలో ఇంచుమించు అందరికిని కూడ ఏదో యొక విధమగు అంగవికారము ఈ కాలములో సంభవించినది."

మేము పైన తెల్పిన యంశములు 1833 నాటివి. ఇటీవల కాలములో విద్యాసంస్థలలో కొన్ని మార్పులు వచ్చి యుండవచ్చును. కాని వానియందలి లోపము లింకను సంపూర్ణముగ దూరముకాలేదు. ఇటీవల మేము యువక విద్యార్థుల కొరకై ఏర్పడిన ఒక శిక్షణా కళాశాలకు పోయి

యుంటేమి. అయ్యాది ప్రభుత్వము వారు నడుపుచున్న సంస్థ. కావున ప్రభుత్వేతర పాఠశాలలలో కంటె ఇచ్చట ఉత్తమ మగు ఏర్పాట్లు ఉండవలెనని మన మూహింపవచ్చును. ఆ శిక్షణా పాఠశాలలలోని ఏర్పాట్లను దిగువ సూచించు చున్నాము ;—

ప్రతి దినము ఆరుగంటలకు విద్యార్థులు నిద్రలేవ వలెను.

7 గంటల నుండి 8 గంటల వరకు చదువు.

8 గంటల నుండి 9 గంటల వరకు—బైబిలు పఠ నము, ప్రార్థన, ప్రాతఃకాల భోజనము.

9 నుండి 12 గంటల వరకు చదువు.

12 గంటలనుండి 1–15 వరకు శరీర వ్యాయామము నిమిత్తమై నడచుట (కాని ఇది నామమాత్రమే. ఈ కాలము కూడ చదువులోనే వ్యయపడును.)

1–15 నుండి 2 గంటల వరకు మధ్యాహ్న భోజనము. కాని ఇందు భోజనము ఇరువది నిముషములలో పూర్తి యగును.

2 గంటలనుండి 5 గంటల వరకు చదువులు.

5 నుండి 6 గంటల వరకు—తేనీరు, విశ్రాంతి.

6 గంటల నుండి 8½ వరకు చదువులు

8½ నుండి 9½ వరకు విద్యార్థులు తమకవసరమగు విషయములను చదువుకొనుట లేక మరునాటి పాఠముల కొరకై సిద్ధపడుట.

10 గంటలకు పరుండుట.

ఈ విధముగ దినమునందలి ఇరువది నాలుగు గంటలలో ఎనిమిది గంటల కాలము నిద్ర, 4 గంటల 15 నిమిషములు దుస్తులు వేసికొనుట, ప్రార్థన, భోజనము-భోజనానంతరము స్వల్పకాలము విశ్రాంతి కొరకును వినియోగింపబడుచున్నవి. 10½ గంటల కాలము చదువుల కొరకు ప్రత్యేకింపబడినది. 1 గంట 15 నిమిషములు శరీరవ్యాయామము నిమిత్తము ఏర్పడియున్నది. కాని వ్యాయామము చేయవలెనను నిర్బంధములేదు. అది ఐచ్ఛికము. విద్యార్థులు ఈ వ్యాయామమునుండి తరచు తప్పించుకొనుచుందురు. చదువుల కొరకై ప్రత్యేకింపబడిన 10½ గంటల కాలమును 11½ గంటల వరకును విద్యార్థుల హెచ్చింతురు. శరీరవ్యాయామమునకై ఏర్పడిన కాలము కూడ ఇందులోనే చేరిపోవును. ఇంతే కాదు. తమ పాఠములను సిద్ధపరచుకొనుటకై కొందరు విద్యార్థులు తెల్లవారుజామున 4 గంటలకే లేచి తమ కార్యక్రమమును ప్రారంభింతురు. ఇట్లు చేయవలసినదిగా ఉపాధ్యాయులు వారిని ప్రోత్సహింతురు. శిక్షణాకాలములో విద్యార్థులు నేర్వవలసిన యంశములు అనేకము లుండును. విద్యార్థుల నందరను పరీక్షలో నుత్తీర్ణుల కావింపవలెనని ఉపాధ్యాయుల కమితమగు పట్టుదల. ఈ రెండు కారణముల వలనను విద్యార్థులు దినమునకు పండ్రెండు పదమూడు గంటల కాలము మానసిక పరిశ్రమ చేయవలసి వచ్చును.

ఇట్టి పరిస్థితులవలన శరీరమునకు చాల హాని కల్గునని ఎట్టి సామాన్యునికైనను తెలియవచ్చును. కలకలలాడు ముఖములతో ఈ కళాశాలలో ప్రవేశించువారు త్వరలోనే శుష్కించి పాలిపోవుదురని ఇచ్చటి విద్యార్థులలో కొందరు మాకు తెల్పినారు. విద్యార్థులు తరచు రోగములకు గురి యగుచుందురు. ఎల్లప్పుడును ఎవరికో యొకరికి అనారోగ్యమే. ఆకలి లేకపోవుట, అజీర్ణము అను వ్యాధులు సర్వసామాన్య ముగ పరిణమించినవి. చదువుకొనువారిలో పలువురు గ్రహణి వ్యాధిచే బాధపడుచుందురు. మొత్తము విద్యార్థులలో సుమారు మూడవ వంతువారికి రుగ్మత తప్పక కల్గుచునే యుండును. పలువురు విద్యార్థులు దినమంతయు శిరోవేదనచే బాధపడుచు కొన్ని నెలలపాటు కాలము పుచ్చుదురు. అందు కొందరీ బాధను సహింపజాలక మధ్యకాలములో చదువులు మానుకొని మరలిపోవుదురు.

విద్యాధికులును, విజ్ఞానఖనులును అనదగిన పెద్దలచే నిర్వహింపబడుచున్న ఆదర్శప్రాయ మగు విద్యాసంస్థలో నిట్టి పరిస్థితులు కానవచ్చుట చాల ఆశ్చర్యకరమైన విషయము. ఈ సంస్థవారు కావించు పరీక్షలు మిక్కిలి కష్టమైనవి. పరీక్షాంశములను నేర్చుటకై యొసంగబడుచున్న కాలము మిక్కిలి పరిమితము. ఈ రెండు కారణములచే ఈ విద్యా సంస్థయందలి అంతేవాసుల శరీరారోగ్యము మిక్కిలి చెడి పోవుచున్నది. ఇట్టి పరిస్థితులకు కారణభూతులగు నుపాధ్యా

యులు క్రూరులు కాకపోవచ్చును. కాని వా రజ్ఞానులని తెల్పుటలో మా కెట్టి సంశయమును లేదు.

కాని మేము తెల్పిన పరిస్థితులు మన దేశమందలి విద్యాసంస్థ లన్నిటిలోను ప్రబలి యుండలేదు. పైన వర్ణింపబడిన సంస్థ అసాధారణమైనది. ఇట్టి సంస్థలు మన దేశమున నితరములుకూడ గలవు. ఈ యంశముల విమర్శింపగా నేటి మన దేశపు విద్యార్థుల కత్యధికమగు మానసిక పరిశ్రమ కల్పింపబడుచున్నట్లు తేలుచున్నది. ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలలో నొసంగబడుచున్న ఈ తర్ఫీదు మన విద్యాధికుల భావముల కనుగుణ్యాముగ నున్నది. వీరైనంత తక్కువ కాలములో విద్యార్థులకు సమస్త విషయములను నేర్పివేయవలెనను తొందర ఇందు ద్యోతక మగుచున్నది.

బాల్యదశయందు చిన్నబిడ్డల కీడునకు మించిన విద్య నేర్పించుటవలన కల్గు నష్టమును ఈనాడు సర్వసాధారణముగ గుర్తించుచున్నారు. కాని అత్యధికవిద్యవలన కౌమారావస్థయందు కూడ విద్యార్థులకు నష్టము సంభవించునని తల్లిదండ్రు లేల గుర్తింప జాలకున్నారో మాకు తెలియవచ్చుట లేదు. పసితనములో ఈడునకు మించిన బుద్ధికుశలతను చూపునట్టి బిడ్డలు పెద్దవారైన తరువాత మందబుద్ధులుగ పరిణమింతురు. ఈ యంశము నేటి తల్లిదండ్రులలో కొందరకైన తెలిసియే యున్నది. అతిబాల్యములో బాలబాలికల మెదడున కెక్కువ పని కల్పింపరాదని పలువురు పల్కుచుండుట

పేము వినియున్నాము. ఇందువలన కల్గు దుష్ఫలితముల
గుర్తించువారు, ఈ అతివ్యాప్త విద్యావిధానమును పూర్తిగ
గర్హింతురు. మా కొక మిత్రుడు కలడు. ఆతడు మానసిక
శాస్త్రమున పండితుడు. తన కుమారున కెనిమిదవయేడు
వచ్చువరకును ఎట్టి పాఠములను నేర్పనని ఆతడు తరచు
మాతో పల్కుచుండును. ఇందు గర్భితమైయున్న భావము
గమనింప దగినది. మిక్కిలి చిన్నతనమునందే బాలబాలికల
మనస్సున కుత్తేజము కల్గించిన పక్షమున ఆ బాలబాలికలు
దుర్బలులు కావచ్చును; లేదా తుట్టతుదకు మిక్కిలి జడు
లుగ మారవచ్చును. లేనిచో అకాలమరణము పాలుకావ
చ్చును. ఈ యంశము బాల్యావస్థకే కాక కౌమారావస్థకు
కూడ సమానముగ వర్తించునని యెల్లరును గ్రహింపవల
యును. ఇందులకు సంశయము లేదు. మనయందిమిడియున్న
శక్తులు ఒక క్రమవిధానము, క్రమపద్ధతి ననుసరించి వికసిం
చుచు పోవును. మన విద్యావిధాన మీ పద్ధతులను, ఈ దశ
లను గుర్తించిన పక్షమున మంచి ఫలితములు కల్గును. ఇట్లు
కాకుండ మనలో నిమిడియున్న ఉన్నతతరములగు శక్తులకు
సమయము రాకముందే ప్రోత్సాహము కల్పించినచో అనగా
విద్యార్థి సులభముగ జీర్ణించుకొనజాలని క్లిష్టవిషయముల
నాతనికి నేర్పినయెడలను, లేక ఈడునకు మించిన విజ్ఞాన
భారముచే విద్యార్థి మనస్సునకు శ్రమకల్గించినను నష్టము
తప్పక కల్గును. నేడు నీకు తాత్కాలికముగ కల్గిన లాభ

ఎక్కువ కాయకష్టము చేసిన పక్షమున మనస్సు చక్కగ పని చేయలేదనుట మన కెల్లరకును విదితము. ఒక సందర్భమున నీవొక్క బిగిని ముప్పదిమైళ్ళ దూరము నడచినావని తలంపుము. అప్పుడు దేహము మిక్కిలి అలసిపోయి, మానసికముగ ఎట్టి పనిని చేయుటకును కూడ నీ విష్టపడవు. ఒక నెల రోజులపాటు నీవు పాదయాత్ర చేసినచో, దేహము బాగుగా అలసిపోయి, కొన్నిరోజుల వరకును నీ వెట్టి పనులను చేయజాలని స్థితిలోనుండి పోవుదువు. సామాన్య స్థితికి వచ్చుటకై నీకు కొంత కాలముపట్టును. నిరంతరము కాయకష్టముచేయు వ్యవసాయదారులు మానసికముగ నెట్టి పనిని చేయజాలరు. బాల్యమునందు ఏ బాలుడైనను కొన్ని యంశములలో అసాధారణముగ పెరుగుదల చూపిన యెడల ఆతనియం దిమిడి యున్న శక్తి వ్యయమైపోయి ఆ బాలుడు కొంత కాలము వరకు భౌతికముగను, మానసికముగను సొమ్మసిల్లినట్లు కాన వచ్చును. అన్నము తినగానే శరీరవ్యాయామము చేసిన పక్షమున జీర్ణశక్తి క్షీణించును. అతిబాల్యమునందే మిక్కిలి కాయకష్టమును చేయుట ప్రారంభించు చిన్నబిడ్డలు ఎదుగు బొదుగులు లేకుండ నుండిపోవుదురు. ఈ యంశముల నాధారము చేసికొని మనము కొన్ని సత్యముల, తెలిసికొనవచ్చును. ౨న్నములగు రెండు అభివృద్ధులు అన్యోన్యవిరుద్ధములై యుండుట సహజము. జీవితరంగములో నొక భాగమున నేదైన తీవ్రకృషి సాగుచున్న యెడల, అట్టి కృషి ఇతర భాగము

ులలో కుంటుపడుట అనివార్యము. ప్రకృతి ధర్మములను సంపూర్ణముగ నుల్లంఘించినను, కొంతవరకు ఉల్లంఘించినను పైన సూచింపబడిన దుష్టఫలితములు తప్పక కల్గితీరును. నియమోల్లంఘనము తరచుగ జరిగినను, లేక అప్పుడప్పుడు జరిగినను నష్టము వాటిల్లక తప్పదు. మానసిక పరిశ్రమ కొరకై ప్రకృతిమాత మన కొసంగిన శక్తిని మించి మనము మానసికకృషి సల్పిన యెడల, ఇతర విషయములలో మనము తగినంత వృద్ధిని పొందజాలము. అంతేకాదు. అందువలన వివిధ రూపములలో మనకు నష్టము సంభవింపగలదు. ఈ విషయము నించుక పరిశీలింతము.

ఉదాహరణముగ ఒక బాలుడు తాను సహజముగ చేయవలసిన మానసికకృషికంటె ఒకించుక హెచ్చుగ కృషి సల్పినట్లు భావింపుము. అందువలన నాతని భౌతికాభివృద్ధి కొంతవరకు మాత్రమే క్షీణించును. అతడు ఎదుగవలసినంత యెత్తుగ నెదుగడు. తగినంతగ ఒడలు చేయడు. అతని నరములు తగినంత బలిష్ఠములు కాజాలవు. పైన తెలుపబడిన నష్టములలో నేదైన యొకటి అతనికి తప్పక కల్గితీరును. మనము మానసిక కృషి చేయుచున్నప్పుడు మెదడునకు బాగుగా పనికల్గును. అట్లు పనిచేయుటవలన మెదడు తనకు సహజముగ గల పటిమను కోల్పోయి బలహీనమగుట సంభవించును. మెదడు చక్కగ పనిచేయుటకును, కోల్పోయిన బలమును మరల సంపాదించుటకును, రక్త ప్రసారము ధారాళముగ

నుండవలయును. దేహమునందలి రక్తము మెదడుకొరకే విస్తారముగ వినియోగపడిన యెడల, శరీరమందలి ఇతర భాగములకు వలసినంత రక్త ప్రసారము లభించుట సాధ్యము కాదు. ఈ విధముగ అత్యధిక మానసిక కృషి శరీరము కృశించుటకు మూలమగును. ఒక వంక మనస్సు బలపడును. వేరొక వంక దేహమునకు హాని సంభవించును. ఇట్టి సందర్భములో మానవునకు కల్గు మేలు అతనికి సంభవించుచున్న హాని కంటె హెచ్చుగ నున్నదా యని మనము చింతింపవలెను. దేహమునకు సహజముగ నుండవలసిన దార్ఢ్యము, కష్టసహిష్ణుత, ఆకారమున కుండవలసిన సంపూర్ణత మున్నగు వానిని పణముగ పెట్టి మనము జ్ఞానమును హెచ్చుగ సంపాదించినామని భావింపుడు. ఈ స్థితి మనకు లాభదాయకమా? నష్టదాయకమా? చింతింపుడు.

మానసికకృషి అత్యధికముగ చేసినపక్షమున సంభవించు నష్టము చాల తీవ్రమైనది. ఇట్టి సందర్భములో దేహాభివృద్ధి మాత్రమేకాక మానసికాభివృద్ధికూడ క్షీణించును. ఇయ్యది శరీరశాస్త్రమునకు సంబంధించిన యొక ముఖ్యసిద్ధాంతము. శాస్త్రజ్ఞులనేకులు దీనిని బలపరచినారు. వారీ విధముగ తెల్పుచున్నారు. "అభివృద్ధి, వికాసము, అనునవి అన్యోన్యవిరుద్ధములు. ఈ సందర్భములో అభివృద్ధి యనగా ఒక జీవియొక్క దేహపరిమాణము హెచ్చుట యని తెలుపవచ్చును. వికాస మనగా నిర్మితి యొక్క పెంపుదల. ఈ రెం

టిలో ఏదైన నొక్కటి బలపడుచున్నప్పుడు రెండవదానికి క్షీణత వాటిల్లును. ఈ విషయమును గుర్తించుటకై గొంగళి పురుగుయొక్కయు, రెక్కలురాని స్థితియందలి పురుగు యొక్కయు ఉదాహరణను గైకొనుడు. గొంగళిపురుగు యొక్క దేహపరిమాణము శీఘ్రకాలములో వృద్ధిగాంచును. కాని ఈ జీవి బాల్యదశయందున్నప్పుడును, పెరిగి పెద్దదై నప్పుడును కూడ దీని నిర్మితి ఒకే విధముగ నుండిపోవును. ఇందెట్టి సంశ్లిష్టతయును ద్యోతకముకాదు. కాని రెక్కలు రాని స్థితియందలి పురుగు విషయ మట్లుకాదు. దీని దేహ పరిమాణము విశేషముగ పెరుగదు. అంతేకాక ఈ జీవి పెరుగుచున్నకొలదియు దీని బరువు క్షీణించును. కాని దీని నిర్మితి నానాటికిని సంశ్లిష్టతరమగుచు పోవుచుండును. అభి వృద్ధి వికాసముల కన్యోన్యవైరుధ్య మున్నవిషయము సత్యమే కాని ఈ వైరుధ్యము తక్కువ తరగతి ప్రాణులలో మాత్రమే విస్పష్టముగ కానవచ్చును. ఉన్నత తరగతికి చెందిన ప్రాణు లలో నీ వైరుధ్యము స్పష్టముగ కానరాదు. ఈ ప్రాణులలో అభివృద్ధియును వికాసమును తోడ్తోడనే జరుగుచుండును. కాని మానవులలోకూడ ఈ లక్షణము కొంతవరకు లేకపో లేదు. స్త్రీపురుషులను పోల్చి చూచినచో ఈ అంశము బాగుగా స్పష్టపడును. బాలికలయందు భౌతిక మానసిక వికాసములు రెండును కూడ శీఘ్రముగ ప్రారంభమై త్వర లోనే ఆగిపోవును. బాలురలో భౌతిక మానసిక వికాసములు

నెమ్మదిగ జరుగును. కాని వారియందు సంభవించు అభివృద్ధి హెచ్చుగ నుండును. బాలికలలో చిన్నతనమందే ఒక విధమగు పరిణతి, సంపూర్ణతయు గోచరించును. వారి శక్తులన్నియు ఉన్నతతమ మగు స్థాయిని చేరును. ఇది యిట్లుండగా బాలునియందు నిహితమగు నిర్మాణశక్తి యంతయు అతని దేహాభివృద్ధి యందు వినియోగపడుచున్నది. అతని నిర్మితి తగినంతగ వృద్ధిచెందదు. కావున ఈ దశలో బాలుడు మానసికముగను, భౌతికముగను కూడ ఒకింత వికారముగ నుండును. ఇప్పుడు మేము నిర్వచించిన సూత్రము దేహము యొక్క వివిధభాగములకును, దేహము మొత్తమునకును కూడ సమానముగ వర్తించును. దేహమునందలి ఏదైన నొక భాగము నియమిత సమయమునకు పూర్వమే నిర్మితిసంశ్లిష్టత (లేక సంకీర్ణత) పొందినచో దాని అభివృద్ధి చాలవరకు నిరోధింపబడును. ఈ యంశము దేహమందలి యితర భాగములకు వర్తించినట్లే మనస్సునకు కూడ వర్తించును. జీవితారంభ దశలో మెదడు యొక్క స్థూలత హెచ్చుగ నుండును. కాని అందు నిర్మితిసంపూర్ణత కుంటుపడియుండును. ఇట్టి మెదడునకు దాని యీడున కర్హమగుదానికంటె హెచ్చు పనిని విధించినచో నయ్యది నిర్మితి యందు కూడ పురోగమింప వచ్చును. కాని ఇట్లు జరగిననాడు మున్ముందు మెదడు ఎదుగ వలసినంతగ ఎదుగదు. దానికి సంపూర్ణమగు శక్తి కూడ అలవడదు. ఈ విధముగ మెదడునకు రావలసిన అభివృద్ధి

వికాసములు నష్టపడును. బాల్యములోనే ఈడునకు మించిన మేధాసంపదను ప్రదర్శించు బాలురు కొంత కాలము గడచిన తరువాత ఎట్టి ఎదుగుబొదుగును లేక స్తబ్ధత్వమును వహించి, తమ తల్లిదండ్రుల యాశలను వమ్ముచేయుదురు. ఇందులకు పై భౌతికసూత్రమే ముఖ్యకారణ మని మా తలంపు.

ఈడునకు మించిన విద్యను గరపుట వలన బాలబాలికలకు మేము పైన తెల్పిన నష్టములు సంభవించును. కాని వారి ఆరోగ్యమునకు సంభవించు హాని ఇంత కంటెను ప్రమాదకరము. ఇట్టివారల దేహయంత్రమునకు క్షీణత కల్గును. వారిశక్తులు దుర్బలమగును. వారిభావప్రపంచములో చీకటి యలముకొనును. దేహము తన ధర్మముల నిర్వహించు నప్పుడయ్యది మనస్సుపై ఎంత హెచ్చుగ తన ప్రభావమును ప్రసరింపజేయునో శరీరశాస్త్ర పరిశోధనలవలన తెలియవచ్చినది. మనస్సు ఉద్రిక్తత చెందిన యెడల జీర్ణశక్తి, రక్త ప్రసారము, వానికి సంబంధించిన భౌతికకార్యకలాపములు హానిని పొందును. మన మెదడునందు నరములెన్నియో కలవు. అందుగల సుదీర్ఘమగు నొక నరమును శాస్త్రజ్ఞులు వాగస్ అని వర్ణించుచున్నారు. ఈ నరమునకును మన దేహములోని ప్రేవులకును సంబంధము కలదు. ఈ వాగస్ నరమునకు క్లిష్టత సంభవించిన పక్షమున ప్రేవులకు హానికల్గును; గుండెకాయ పనిచేయుటలో కూడ కొంత మాంద్యమేర్ప

డును. పై నరమునకు సంభవించు క్లిన్నత తగ్గగానే గుండె నెమ్మదిగ యథాప్రకారము పనిచేయసాగును. ఈ క్లిన్నత మరల ప్రారంభము కాగానే హృదయస్పందనము మరల మందగించును. ఈ యంశములను శాస్త్రపరిశోధకులు కావించిన ప్రయోగముల మూలముగ మేము తెలిసికొన్నారము. కావున అత్యధికశ్రమకు గురియైన మనస్సు దేహమునకు కూడ నష్టము నాపాదించునని మా విశ్వాసము. శాస్త్రరీత్యా తెలుపబడిన ఈ యంశములు మన నిత్యానుభవములచే బలపడుచున్నవి. మనకు ఆశ, భయము, కోపము, ఆనందము మున్నగు భావములు కల్గినప్పుడు గుండె దడదడ కొట్టుకొనును. భావము ఉద్రిక్తత చెందినప్పుడు గుండెకాయ నీరసముగ పనిచేయును. అత్యంత భావోద్రేకము వలన కొందరు మూర్ఛ చెందుదురు. బహుశః ఇట్టి అనుభవమును మా పాఠకులలో పలువురు పొందియుందురు. కాని ఇట్టి మూర్ఛ యొక్క కార్యకారణసంబంధములను వారు చక్కగ గుర్తింపగలరని మా నమ్మకము. మానసికోద్రేక మొకహద్దును దాటిపోయిన పక్షమున అయ్యది ఉదరకోశపు వ్యాపారమును కూడ ప్రభావితము చేయును. మిక్కిలి దుఃఖము కాని, మిక్కిలి ఆనందము కాని కల్గినప్పుడు ఆకలి నశించు నను విషయ మెల్లరకును తెలిసినదే. భోజనము పూర్తికాగానే మనస్సునకు మిక్కిలి ఆనందము కాని, మిక్కిలి దుఃఖము కాని కల్గించు సంఘటన ఏదైన జరగినచో, మనము తినిన

ఆహారము వమనరూపమున కుక్షినుండి బయటకు వెల్వడును. లేదా మనజీర్ణకోశ మతికష్టముపై ఆ యాహారమును జీర్ణించుకొనగల్గును. మానసికవ్యాపారము కూడ మితిమీరిన పక్షమున ఇంచుమించు ఇట్టి పరిణామములే సంభవించును. మెదడునకును, దేహమునకును గల సంబంధము సామాన్య విషయము లందును, అసామాన్య విషయములందును కూడ కాన్పించును. మనస్సునకు తీవ్రమగు నుద్రిక్తత కల్గినప్పుడు జీర్ణకోశమునందలి ప్రేవులకు తీవ్రమగు అలజడి తాత్కాలికముగ సంభవించును. కాని మెదడునకు సంభవించు ఉద్రిక్తత సామాన్యమే అయినను, అయ్యది నిరంతరము సంభవించుచు పోయిన పక్షమున జీర్ణకోశమునకు కొలదిపాటి హాని సంభవించును. కాని అయ్యది శాశ్వతముగ పరిణమించును. ఈ యంశము కేవల మూహాలపై యాధారపడినది కాదు. వైద్యశాస్త్రనిపుణు లీ విషయమును బలపరుపగలరు. సుదీర్ఘమగు మా స్వానుభవము కూడ ఈ సత్యమునే దృఢపరచుచున్నది. చిరకాలము వరకును మనస్సున కత్యధికపరిశ్రమ కల్గించిన యెడల దేహమునకు వివిధమగు వైకల్యములు కలుగవచ్చును. ఈ వైకల్యములను తొలగించుటకై రోగి యగు వాడు చాలకాలము విశ్రాంతి తీసికొనవలసి వచ్చును. అప్పుడు కూడ దేహము యథాస్థితిని పొందజాలదు. కొన్ని సందర్భములలో అత్యధిక మానసికశ్రమవలన గుండెకాయకు హాని సంభవించును. నాడి

రములు మున్నగునవి చక్కఁగ ఎదికి తమ తమ ధర్మములను నెరవేర్పజాలవు. కాయకష్టమువలన దేహ మలసిపోయినప్పు డయ్యది మరల యథాస్థితికి వచ్చుటకు కూడ చక్కని రక్త ప్రసార మావశ్యకము. బాలు డెదుగవలసిన కాలములో ఆతని జీర్ణకోశము చెడి, దేహమునకు తగినంత పరిశుభ్రమగు రక్తమును అందజేయజాలక గుండెకాయ ఆ రక్తమును తగినంత వేగముతో వివిధాంగములకు ప్రసారము చేయని పక్షమున, ఆ యల్పవయస్కుని కెంత నష్టము సంభవించునో ఆలోచింపుడు.

పై విషయములను గూర్చి సవిమర్శముగ తర్కించు వారికి ఈడునకు మించిన విద్యవలన కల్గు హాని చక్కఁగ బోధపడును. అట్టి వారు నేఁడు మనదేశమున వ్యాపించియున్న విద్యాపద్ధతులను తీవ్రముగ ఖండింపక మానరు. ఈ అతివ్యాప్త విద్యావిధానము నే దృక్కోణమునుండి చూచినను అయ్యది మనకు నష్టదాయకమే. జ్ఞానార్జనము దృష్ట్యా ఈ విధానము లోపభూయిష్ఠము. దేహమువలెనే మనస్సుకూడ ఒక హద్దు వరకు మాత్రమే విషయజాలమును జీర్ణించుకొనగలదు. ఆ మనస్సులో నీ వెల్లప్పుడును క్రొత్తసంగతులను నింపుచు వచ్చిన పక్షమున, అయ్యది వానిని జీర్ణించుకొనజాలక వెలుపలికి నెట్టివేయును. ఆ విషయములు మన మనోరంగమున శాశ్వతనివాస మేర్పఱచుకొనజాలక, త్వరలోనే మరపునకు వచ్చును. విద్య నీ విధముగ నేర్పించినయెడల, వానికి చదు

బలహీనమగును. నిమిషమునకు 72 పర్యాయములు కొట్టు కొనవలసిన నాడి మందగించి అరువదిసారులో అంతకు తక్కువయో కొట్టుకొనును. మరికొన్ని సందర్భములలో జీర్ణకోశమునకు తీరనిహాని వాటిల్లును. అజీర్ణవ్యాధి దేహమున ప్రవేశించి జీవితమును దుర్భరము కావించును. ఇట్టి వ్యాధులు కాలక్రమమున నివారణ కావలసినదే కాని వీనికి చికిత్స లేదు. మరికొన్ని సందర్భములలో గుండెకాయ, జీర్ణకోశము ఈ రెండింటికిని కూడ హాని కలుగవచ్చును. ఇట్టి రోగములు కలవారికి నిద్ర సరిగ పట్టదు. నిద్రలో తరచు మెలకువ వచ్చుచుండును. అత్యధిక మానసికపరిశ్రమచే ఆరోగ్యము కోల్పోయిన వారెల్లప్పుడును నిరుత్సాహముగ నుందురు.

పై యంశములను తెలిసికొనిన మీదట అత్యధిక మానసికపరిశ్రమవలన పసిబిడ్డలకును, పిన్నవయస్సు వారికిని ఎట్టి నష్టము సంభవించునో యాలోచింపుడు. హద్దు మీరిన మానసికకృషి వలన మనకు ఏదో ఒక హాని తప్పక సంభవించును : దేహము రోగగ్రస్తమైన కావచ్చును. లేదా క్రమక్రమముగ మన కాయము క్షీణించుటయైన సంభవింపవచ్చును. ఆకలి సన్నగిల్లి, జీర్ణశక్తి తగ్గిపోయి రక్తప్రసారము మందముగ సాగుచున్నప్పుడు ఎదుగుచున్న దేహమెట్లు వృద్ధి గాంచగలదు ? మన శరీరమందలి నిర్మాణకార్యక్రమమంతయు చక్కని రక్తప్రసారము పైననే ఆధారపడి యుండును. రక్తప్రసరణము చక్కగ లేనిచో నరములు, కండ

రములు మున్నగునవి చక్కగ ఎదికి తమ తమ ధర్మములను నెరవేర్పజాలవు. కాయకష్టమువలన దేహ మలసిపోయినప్పు డయ్యది మరల యథాస్థితికి వచ్చుటకు కూడ చక్కని రక్త ప్రసార మావశ్యకము. బాలు డెదుగవలసిన కాలములో అతని జీర్ణకోశము చెడి, దేహమునకు తగినంత పరిశుభ్రమగు రక్తమును అందజేయజాలక గుండెకాయ ఆ రక్తమును తగి నంత వేగముతో వివిధాంగములకు ప్రసారము చేయని పక్ష మున, ఆ యల్పవయస్కుని కెంత నష్టము సంభవించునో ఆలోచింపుడు.

పై విషయములను గూర్చి సవిమర్శముగ తర్కించు వారికి ఈడునకు మించిన విద్యవలన కల్గు హాని చక్కగ బోధ పడును. అట్టి వారు నేడు మన దేశమున వ్యాపించియున్న విద్యాపద్ధతులను తీవ్రముగ ఖండింపక మానరు. ఈ అతిస్వాస్త విద్యావిధానము నే దృక్కోణమునుండి చూచినను అయ్యది మనకు నష్టదాయకమే. జ్ఞానార్జనము దృష్ట్యా ఈ విధానము లోపభూయిష్ఠము. దేహమువలెనే మనస్సుకూడ ఒక హద్దు వరకు మాత్రమే విషయజాలమును జీర్ణించుకొనగలదు. ఆ మనస్సులో నీ వెల్లప్పుడును క్రొత్తసంగతులను నింపుచు వచ్చిన పక్షమున, అయ్యది వానిని జీర్ణించుకొనజాలక వెలు పలిక నెట్టివేయును. ఆ విషయములు మన మనోరంగమున శాశ్వతనివాస మేర్పచుకొనజాలక, త్వరలోనే మరపునకు వచ్చును. విద్య నీ విధముగ నేర్పించినయెడల, వానికి చదు

వనిన నసహ్యాము కల్గును. చదువు నేర్చుకొను చున్నప్పుడు తనకు కల్గుచుండిన అసౌకర్యములవలననో లేక మెదడునం దేదైన అసాధారణపరిస్థితి యేర్పడుట వలననో, బాలునికి పుస్తకము లనిన ప్రతికూలభావము కల్గును. సామాన్య పరిస్థితులలో విద్య నేర్చినవానికి కాలము గడచినకొలదియు తనంత తాను నూతన విషయముల తెలిసికొనవలెనను నుత్సాహాము కల్గును. ఈ బాలునియం దట్లుగాక జ్ఞానసముపార్జనాసక్తి క్షీణించును. ఈ అతివ్యాప్తవిద్యావిధానము మరియొక కారణముచేకూడ లోపపూరితమైనది. ఏలననగా — కేవలము విషయములను నేర్చుటవలన నెట్టి లాభమును లేదు. నేర్చిన విషయములను మనము చక్కగ సమన్వయము చేసికొనవలెను. ఇందులకు కాలమును, స్వయంవిమర్శయు ఆవశ్యకములు. బాలుడు చక్కగ గ్రహించి, జీర్ణించుకొనజాలని యంశముల నితరంతర మాతని మెదడులోనికి పంపుటకు యత్నించుట నిరర్థకము. అయ్యది మనస్సున కధికభారము కల్గించి, మనోవికాసమునకు ఆటంకముగ పరిణమించును. హాంబోల్టు అను శాస్త్రజ్ఞుడు కూడ ఈ భావమునే బలపరచుచున్నాడు. జీర్ణించుకొనని జ్ఞానము మన మనోదేహామునకు క్రొవ్వు వంటిది. జీర్ణించుకొనిన జ్ఞానము ఆ మనోదేహామునకు కండరముల వంటిది. అత్యధికవిద్యవలన మరియొక గొప్ప హాని కల్గుచున్నది. గమనింపుడు. ఈ విధానము వలన బాలకుని దేహాము క్రమక్రమముగ క్షీణించును. అట్టి పరిస్థితియందు

మనస్సు ఎంత నిశితముగ నున్నను లాభ మెట్లు కలుగ గలదు? మానవుడు జీవితరంగమున విజయలాభములను పొందవలె నన్నచో ఆతనికి విశేషజ్ఞాన మున్నంతమాత్రమున లాభములేదు. ఆ జ్ఞానముతోపాటు ఆతనికి శరీరపాటవము కూడ కావలెను. జ్ఞానార్జనముకొరకై శరీరపాటవమును బలి చేయు విద్యావిధానము ఆత్మఘాతకము కాదా? విద్యావిష యములో నెట్టి లోపమున్నను, దృఢనిశ్చయము వలనను, నిరంతర పరిశ్రమ వలనను మానవుడు జీవితరంగమున విజయ ముల సాధింపగలడు. ఆరోగ్యమును చెడగొట్టుకొన నక్కర లేకయే మనము మన కావశ్యకమగు విద్యను సాధింపవచ్చును. ఇట్టి విద్యయొక్క సహాయముచే మనము జీవితరంగమున నెంతటి మేధాసంపన్నులనైనను ఓడించి, ముందునకు సాగి పోవచ్చును. తన శక్తి నంతను వినియోగించి పనిచేసిన పక్షమున చిన్నపాటి యంత్రముకూడ హెచ్చు పనిని సాధింప గలదు. దుర్బలముగ పనిచేయు యంత్ర మెంత పెద్దదైనను, అది యెక్కువ పని చేయజాలదు. యంత్రమునకు వన్నె పెట్టుచు శక్త్యుత్పాదకమగు ఆవిరిని సిద్ధముచేయు బాయిలర్‌ను పాడు చేయుట అవివేకము కాదా! అత్యధికవిద్యను సముపార్జించు వారికి జీవితసౌఖ్యమునకై ఏ యే యర్థములు కావలయునో తెలియవని చెప్పవలయును. ఒకవేళ మన మీ మార్గము వలన జీవితమందు విజయమును సాధించినను, మన ఆరో గ్యము సంపూర్ణముగ చెడినందున నిజమగు నానందము మన

కెంతమాత్రమును లభింపదు. ధనమును సంపాదింప గల్గినను, నిరంతర రోగగ్రస్తులమై బాధపడుచుండిన పక్షమున నా ధనము మన కెట్లు లాభింపగలదు? లోకములో మనకు కీర్తిప్రతిష్ఠలు లభించినంత మాత్రమున లాభమేమి? దానితో పాటు మనకు అజీర్ణవాతవ్యాధి సంభవించినచో పేరు ప్రతిష్ఠల వలన నేమి సౌఖ్యము కలుగగలదు? చక్కని జీర్ణశక్తి, దృఢమైన నాడి, నిరంతరమగు ఉత్సాహాతిరేకమును మానవుని సౌఖ్యజీవనమునకు హేతువులని మేము వేరుగ తెలుపనక్కరలేదు. ఇతరములగు నెట్టి అనుకూలతలును వీనితో తులదూగజాలవు. మన భావిదశ యెంత ప్రకాశవంతముగ నున్నను ఆరోగ్యము లేనియెడల జీవిత మంధకారపూర్ణ మగును. చక్కని దేహారోగ్య మున్ననాడు కష్టములలో కూడ కొంత సౌఖ్యము కాననగును. కావున అతివ్యాప్తవిద్య ఈ దిగువ కారణముల వలన నష్టదాయకమని మేము ప్రతిపాదించుచున్నారము: ఈ విద్యావిధానముచే సంపాదించు జ్ఞానమును మనము త్వరలోనే మరచి పోవుదుము. ఈ విధానము వలన బాలునకు జ్ఞానార్జనము నెడ వైముఖ్యతకల్గును. ఈ విధానమునందు జ్ఞానసముపార్జనమునకే గాని దాని సద్వినిమయమున కెట్టి తావును లేదు. నిజమునకు జ్ఞానసంపాదనము కంటె జ్ఞానవినిమయమే ముఖ్యతరము. శరీరపాటవము క్షీణించినను, లేక నశించినను ఎంత సుశిక్షితమగు బుద్ధియును కూడ పనిచేయజాలదు. అతివ్యాప్త విద్య మన శరీరపాటవమును నష్ట

పరచును. ఈ విద్యావిధానమువలన బాలుని ఆరోగ్యము నశించును. జీవితమందలి యితర లాభము లారోగ్యముతో సమానములు కావు. అనారోగ్యముచే నవయుచుండువానికి స్వకార్యవైఫల్యము వలన కల్గు దుఃఖ మింతింత యని వర్ణింపజాలము.

ఈ అతివ్యాప్త విద్యావిధానము వలన పురుషులకంటె స్త్రీలకు ఎక్కుడు హాని కల్గును. బాలురు మనస్సున కుల్లాసము కల్గించు ఆటల నాడియు, ఇతరవిధముల శరీరవ్యాయామము చేసియు, విశేష మానసికపరిశ్రమచే కల్గు దుష్పరిణామముల కొంతవరకు నివారణ కావించుకొందురు. బాలికల కిట్టి యవకాశములు తక్కువ. కావున అతివ్యాప్తవిద్య వలన కల్గు నష్టములకు వా రెక్కుడుగ పాలగుదురు. కావుననే బాలురలో కంటె బాలికలలో చక్కని దేహసౌష్ఠవమును, ఆరోగ్యమును తక్కువగ కానవచ్చుచున్నది. ఈనాడు మన లండను సమాజమున కానవచ్చు యువతులలో పలువురు పాలిపోయిన ముఖములతో, పూచికపుడకలవంటి దేహములతో, ఎండిపోయిన వక్షములతో ప్రత్యక్ష మగుచుందురు. ఇందులకు హేతువు ఆటపాటల యానందము నెరుగని నేటి క్రూర విద్యావిధానమే యని మా యభిప్రాయము. ఇట్టి యువతులకు వారి విద్యార్జనమువలన కల్గు లాభములకంటె దేహక్షీణతవలన సంభవించు నష్టములే హెచ్చుగ నుండును. ఈ విద్యావిధానము మనస్సుయొక్క పుష్టికొరకై దేహసౌష్ఠ

వమును బలిచేయుచున్నది. తమ ఆడుబిడ్డలు సౌందర్యవతులుగ నుండవలయునని కోరు తల్లు లెవ్వరును ఇట్టి విద్యా విధానము నంగీకరింపకూడదు. నేటి విద్యావతులకు పురుషుల అభిరుచులు తెలియవు కాబోలు. లేదా ఆ యభిరుచుల గూర్చి వారు (స్త్రీలు) తప్పుడు అభిప్రాయముల నేర్పరుచుకొని యుండవచ్చును. పురుషులకు స్త్రీల పాండితీ విభవముతో పనిలేదు. వారికి స్త్రీయందు కావలసినవి దేహ సౌందర్యము, సత్స్వభావము, లోకజ్ఞానము. చారిత్రికజ్ఞానము కంటె, నీలదుకూలసౌందర్యముచే వనిత యెక్కుడు విజయముల సాధింపగలదు. ఇటాలియను భాషను చక్కగ నేర్చినదను కారణముచే ఒక స్త్రీపై మరులుగొన్న పురుషు లెవ్వరినైన మీరు చూచినారా? శకుంతలయొక్క గీర్వాణభాషా పాండితీవైభవమును గాంచి ఆమె పాదదాసుడైన దుష్యంతుడు మీకు కానవచ్చినాడా? తళతళలాడెడు చెక్కిళ్ళును, నవ్వుచూపులును పురుషుని తప్పక ఆకర్షింప గలవు. చక్కని నిండైన విగ్రహము నెల్లవారును సాపేక్షముగ తిలకింతురు. దేహారోగ్యము బాగుగా నున్నపక్షమున చురుకుదనమును, సత్స్వభావమును అలవడును. వీనివలన వనిత పురుషులకు ప్రేమపాత్రురా లగును. ఇతరములగు మంచిలక్షణములు లేకపోయినను కేవల శారీరకసౌందర్యమును చూచి, యువతులను ప్రేమించిన పురుషు లనేకులు కలరు. ఇది మన మెల్లరమును ఎరింగిన యంశమే. కాని భౌతిక నైతిక సౌందర్య

ములు లేక కేవల విద్యాసంపదచే పురుషుని ఆకర్షించిన స్త్రీలు మిక్కిలి అరుదు. పురుషుని హృదయమున నుద్భవించు ప్రేమ యను సంకీర్ణ భావమునం దనేకాంశములు చేరియున్నవి. ఇందు బాహ్యసౌందర్యము ప్రథమస్థానమును వహించుచున్నది. గుణసౌందర్యమునకు రెండవ స్థానము లభించును. బుద్ధిసంపద కథమస్థానము మాత్రమే మిగులును. బుద్ధిసంపద యనగా గ్రంథములనుండి సేకరించిన జ్ఞానసంచయము కాదు. సహజ మగు చురుకుదనము, తెలివితేటలు, పరేంగితజ్ఞానము అను లక్షణములను మేము బుద్ధిసంపదగ వర్ణించినారము. మేము తెల్పిన విషయములు పురుషజాతి కగౌరవము కల్గించుచున్న వని కొందరు విమర్శకులు మాపై ఆగ్రహపడవచ్చును. కాని యియ్యది దైవనిర్ణయ మని మా సమాధానము. ఈ యేర్పాటు లోని ఆంతర్యము మనకు గోచరింపకపోవచ్చును. కాని ఇందువలన కొన్ని లక్ష్యములు సాధింపబడుచున్నవి. సూక్ష్మ ముగ పరిశీలించువారి కిందలి యాంతర్యముకూడ తెలియ వచ్చును. మానవుని భావితరముల సంరక్షించి కాపాడుట ప్రకృతిమాతయొక్క ముఖ్యలక్ష్యములలో నొక్కటి. భావి తరములు క్షేమముగ నుండవలయు ననిన సుశిక్షితమగు మనస్సుకంటె దృఢగాత్ర మెక్కుడు ముఖ్యము. దుర్బల దేహులగువారి సంతతి ఒకటి రెండు తరములలో నశించును. బుద్ధివిశేషము కొరవడినను మనలో చక్కని దేహపుష్టి నెల కొని యున్న పక్షమున నయ్యది భావితరములకు క్షేమంకరము.

భావితరములవారు బుద్ధిసంపదను క్రమక్రమముగ నుత్తమో త్తమ స్థాయికి తెచ్చుటకు సావకాశము కలదు. కావున మానవునియందు నెలకొనియున్న సహజమగు కోర్కె యెంత సమంజసములో గుర్తింపుడు. లాభనష్టములమాట యట్లుండ నిచ్చి, బాలికల మనస్సులను జ్ఞానపూర్ణములు గావించుట కొరకై వారి దేహముల క్రుంగదీయునట్టి విద్యావిధాన మెంతమాత్రమును సమర్థనీయము కాదు. బాలికలకు మీ చిత్తము వచ్చినంత ఉన్నతవిద్య గరపింపుడు. కాని దాని వలన వారి దేహమున కెట్టి హానియు సంభవింపకూడదు. దేహమునకు క్షీణత నాపాదించు విద్యావిధానము నవలం బించుట ఆత్మవినాశకరము. ఇట్టి విద్యవలన బాలికల భావి జీవితము పాడైపోవును. ఇందువలన వారి ఆరోగ్యము పాడై వా రాజన్మమును బాధపడుటయే కాదు. వారి కాజన్మ నిర్బంధకన్యాత్వముకూడ సిద్ధించును.

ఈ నాడు మన బాలబాలికల కొసంగుబడుచున్న శారీరకశిక్షణ అనేకవిధముల అసంతృప్తికరముగ నున్నది. వారికి మన మొసంగుచున్న ఆహారము, దుస్తులు, శరీర వ్యాయామమును లోపభూయిష్ఠములు. వారిచే మన మీాడు నకు మించిన మానసికకృషి చేయించుచున్నాము. ఈనాటి విద్యావిధానమును బాగుగా విమర్శించి చూచిన యెడల మనము శ్రేయపు విద్యార్థుల అభివృద్ధికై కల్పించు దోహ దములు మిక్కిలి పరిమితమైయున్నవనియు, వారినుండి మనము

రాబట్టుచున్న పనిపాటలు చాల హెచ్చుగ నున్నవనియు తెలియవచ్చుచున్నది. పనిని రాబట్టుటలో ఈ విద్యాపద్ధతి పిన్నవారికిని, వయస్సు వచ్చిన వారికిని నడుమ నెట్టి తారతమ్యమును చూపుటలేదు. ఈ పద్ధతుల నవలంబించువారు శారీరశాస్త్రవిషయిక మగు నొక ముఖ్యసత్యమును విస్మరించుచున్నారు. ఇతర ప్రాణులందును, మానవులందును కూడ బాల్యదశయందు శారీరకశక్తులన్నియు తత్పోషణమునకును, అభివృద్ధికిని వినియోగపడుచుండును. కావున నీ పసివారిలో మానసికకృషి కొరకును శారీరకకృషి కొరకును ఎట్టి సత్వమును మిగిలి యుండదు. కావున శైశవమందును, బాల్యమందును జీవియొక్క దేహాభివృద్ధి కొరకే ఆతని యందలి సర్వశక్తులును వ్యయపడవలెను. ఇతర కార్యకలాపము లీ సందర్భమున నంత ముఖ్యములు కాజాలవు. కావున నీ దశయందు మనము జీవి కాహారరూపముసను, తదితర సౌకర్యముల రూపమునను సాధ్యమైనంత బలిమిని చేకూర్పవలెను. కాని ఆ ప్రాణినుండి మనము విశేషము పనిని ఆశింపరాదు. శిశువెంత శీఘ్రముగా నెదుగుచున్న మన మాతనిపై అంత తక్కువ శారీరకమానసిక భారమును వేయవలయు నని దీని భావము. బాలుని ఎదుగు పొదుగులు తక్కువ యగుచున్న కొలదియు మన మాతని శారీరక మానసిక కృషి క్రమముగ హెచ్చింపవచ్చునని ఇందువలన వ్యక్తమగుచున్నది.

ఈనాడు సార్వత్రికముగ కాననగుచున్న ఈ అతివ్యాప్తవిద్యావిధానము సామాజికవికాసము నందలి మన ప్రస్తుత

దశనుండి యుద్భవించినదని మా యభిప్రాయము. అనాగరక దశయందు మానవుని ముఖ్యకార్యకలాపము లాత్మసంరక్షణము కావించుకొనుట, ఇతరులపై దాడి కావించుటయు మాత్ర మైయుండెను. అందులకై ఆతనికి శరీరపాటవము, ధైర్యసాహసములు చాల అవసరముగ నుండెను. అప్పటి విద్యావిధానము కేవల శారీరకశిక్షణరూపమును వహించెను. మానసికశిక్షణ కానాడెట్టి ప్రాముఖ్యతయును లేకుండెను. జమీందారీ యుగములో వ్రాతకోతలు నేర్చినవారును, గ్రంథముల చదువువారును అనిన నిరసనభావ ముండెడిది. ఇప్పుడు కాలము మారినది. మన సమాజమున శాంతి నెలకొనినది. ఇప్పుడు శరీరపాటవము కాయకష్టము చేయువారికే కాని ఇతరుల కవసరములేదు. సమాజము నం చున్నతిని సాధించుటకై నేడు మనకు కావలసినది మానసికబలము. కావున నిప్పుడు మన విద్యావిధానము కేవల మానసికశిక్షణగ పరిణమించినది. శరీరబలము నెడ మన్నన చూపి మానసికాభివృద్ధిని తిరస్కరించుటకు మారుగ నిప్పుడు మనము మానసికాభివృద్ధికి గౌరవము కల్పించి శరీరపోషణను తిరస్కరించుచున్నారము. ఈ రెండు పద్ధతులును కూడ తప్పు. మానసికాభివృద్ధికి శరీరదార్ఢ్యము మూలము. కావున మనస్సునకు మెరుగులు దిద్దుచు మనము శరీరము నలక్ష్యము చేయరాదు. శరీరమును బలిపెట్టి బుద్ధిని పెంపుచెందించుట అవివేకము. కావున విద్యావిషయమున మనము అర్వాచీన ప్రాచీన భావములను సమ్మేళనము కావింపవలెను.

శరీరారోగ్యమును కాపాడుకొనుట మన విధులలో నొక్కటి యని తెలిసికొనిననాడు మనము దేహమును మన స్సును కూడ సమానమగు శ్రద్ధతో కాపాడుకొందుము. దేహమునెడ నిర్వహింపవలసిన నైతికధర్మములు కొన్ని కలవను నంశమునే యెవ్వరును నేడు గుర్తించుటలేదు. మనము సర్వసాధారణముగ పలుకునట్టి పలుకులను, చేయునట్టి చేత లను శ్రద్ధగ గమనించిన యెడల శరీరమును మన యిష్టము వచ్చిన చొప్పున వాడుకొనవచ్చునను నొక భావము సర్వత్ర వ్యాపించియున్నట్లు వ్యక్తముకాగలదు. ప్రకృతి ధర్మముల నుల్లంఘించుట వలన కల్గు కలతలను నిర్హేతుకములగు బాధ లుగ మనము పరిగణించుచున్నాము. ఘోరమగు నేరముల కయ్యది ప్రతిఫలమని మనము గుర్తించుటలేదు. శరీరమును చక్కగ కాపాడుకొననివారు భావితరముల యెడల ఘోర మగు నపరాధమును చేసినవారు. కాని వారు తాము కావించు చున్న నేరముల కన్గొనుటలేదు. సురాపానము శారీరకధర్మ ముల వ్యతిరేకించుటయని మనము గుర్తించి, ఖండించు చున్నాము. సురాపానమువలెనే ఇతర శారీరక నియమోల్లం ఘనములు కూడ పాపహేతువులు. సమాజము నందెల్లవారును ఈ సత్యమును గుర్తించిననాడు మన విద్యావిధానమునందు బాలబాలికల శారీరకశిక్షణ కగ్రస్థానము లభింపగలదు.



# GLOSSARY.



Abstract=సిద్ధాంతాత్మకము; అనుపలక్షితము; పరోక్షము
Abdomen = పొత్తికడుపు
Alternate = ఒకటి విడచి ఒకటి
Anatomy = శారీరకశాస్త్రము ; శరీరవిభాగజ్ఞానము
Apex = కేంద్రము
Boiler = నీటికాగు
Carbonic acid = అంగారక్షారం
Caterpillar = గొంగళిపురుగు
Chrysalis = రెక్కలురాని పురుగు
Compass = నావికాయంత్రము ; దిక్సూచి
Concrete = ప్రయోగాత్మకము ; ఉపలక్షితశాస్త్రము ; ప్రత్యక్షము
Consciousness = విషయగ్రహణశక్తి
Conservation = నిక్షేపక
Complexity = సంశ్లిష్టత
Division of Labour = కార్యవిభాగము
Education = విద్య
Equivalence = సమానీకరణ
Evolution = క్రమపరిణామము
Expose = వివృతము

Irritation = క్లిన్నత
Larvae = కీటక అండములు
Liver = కార్జము
Magnetism = అయస్కాంతశాస్త్రము
Mineral acid = ధాత్వామ్లము
Muscles = కండరములు
Mothers' Manual = మాతృబోధిని
Nursery = శిశుగృహము
Nitrogenous = నత్రజని సంబంధ
Negitive = పరోక్షము
Nursery school = బాలభవనము
Numeration = అంకగణనము
Organism = జీవము
Oxide = భస్మము
Proof = నిదర్శనము, ఋజువు
Pocket money = జేబుఖర్చు
Positive = ప్రత్యక్షము
Perspective = దూరస్థిత వస్తుచిత్రణ
Pistles = గర్భకేసరములు
Parallelograms = సమానాంతర చతుర్భుజములు
Planes = చెక్కులు, సమతలములు
Perpendicular = లంబము

Resistance = నిరోధకశక్తి
Ratio = సంబంధసామ్యము
Saccharine = చక్కెర
Starch = పిండిపదార్థము
Structure = నిర్మితి
Surveyor = భూములు కొల్చువాఁడు, పర్యవేక్షకుఁడు
Safty lamp = రక్షితదీపము
Sciences = శాస్త్రములు
Sincerity = ఆశయశుద్ధి ; నిష్కాలుష్యము
Stamens = కింజల్కములు
Staggers = గొఱ్ఱెలకు వచ్చు పుర్రె వ్యాధి
Tetrahedron = త్రిస్రఫలకశంకు, త్రిభుజఫలకశంకు
Thermometer = ఉష్ణమాపకము
Tissue = పేశీజాలము
Vagus = వాగస్ అను నరము
Vegitable acid = శాకామ్లములు
Variety = వివిధత్వము
Whey = పాలవిరుగు
Zinc = తుత్తునాగము



# మానవులు : మహీధరములు

## విజ్ఞానశాస్త్రీయ గ్రంథం

"దరిదాపు 500 పేజీలున్న పుస్తకం చదవడానికి తీరిక, ఓపిక తక్కువ అని దీనిని చూడగానే చాలమంది శంకించవచ్చు.........కాని, చదువ నారంభించగనే మొదటి పేజీల్లోనే చదవడానికి ఆసక్తి, దానితో శ్రద్ధా వస్తాయి. పై ప్రకరణంలో యింకా యేముందో తెలుసుకోవాలను త్రుతతో పుస్తకమంతా చదివేసి, యింకా వంద పేజీలైనా యీ విధంగా వ్రాస్తే బాగుండు ననిపిస్తుంది......ఇలిన్ తన విజ్ఞానాన్ని, అనుభవాన్ని యింగ్లీషులో చాల వినోదకరంగా చిత్రించేడు...ఆంధ్ర పాఠకుల కర్థమయ్యే సామెతలతోను, ఉదాహరణలతోను శ్రీ జగన్మోహన్ గారు దీన్ని అనువాదం చేసేరు. స్త్రీలు, వయోజనులు యీ పుస్తకం చదివితే యెంతో విజ్ఞానం వస్తుంది... ఈతిబాధలకులోనై, నిస్పృహాభాంగు వ్యవసాయదారులు యిది చదివితే 'మనిషిలో యింత శక్తివుందా ?' యని ఆశ్చర్యపడతారు. వారిలో ఆశ, ఉత్సాహం, ధైర్యం వస్తాయి. దీనికి 'మానవులు : మహీధరములు' అని పేరు పెట్టడానికి యిదే కారణం. మహీధరములు గొప్పవే కాని, వాటిని సాధించగలుగుతూ మానవుడంతకంటె గొప్పవా డవుతూన్నాడు ... ఇది చదివితే 'ప్రకృతిశక్తుల్ని జయించుకోగలం' అను ఉత్సాహం మనకు కలుగక తప్పదు. పైగా అనువాదకులు ముక్కకు ముక్క గాకుండా ఆంధ్ర ప్రజల అనుభవ విషయాలను చాల ఉదాహరించేరు...ఇది యెన్నినాళ్లు చదివితే అంత విజ్ఞానం, అంత ఆత్మవిశ్వాసం, ఉత్సాహం పెరుగుతాయి."

అని యీ పుస్తకాన్ని గూర్చి సుప్రసిద్ధులు శ్రీ గోపరాజు రామచంద్ర రావుగారు 31—7—53 తేదీ 'ఆర్థికసమత' లో వ్రాసేరు.

రచన : మైకేల్ ఇలిన్, అనువాదం : జగన్మోహన్.

రెండవ ముద్రణ. గ్లేజు కాగితము. 120 బొమ్మలతో.

540 పుటలు క్రౌను, చక్కని బైండు, జాకెట్‌తో. వెల రు **7-8-0**

---

వలయువారు : విశ్వసాహిత్యమాల – రాజమండ్రి.

# జ్ఞానం : విజ్ఞానం

## రచన : ఇలిన్ & సెగాల్      అనువాదం : జగన్మోహన్

"తన్ను తా నెరుగుట జ్ఞానం, తన్నువినా యితరము నెరుగుట విజ్ఞానం అని చెపుతారు...సృష్టిలోని సమస్త జీవకోటిలోనూ వివేచనాజ్ఞానం ఉన్న మానవుడు జ్ఞానసేకరణ మొదలుపెడతాడు. ఆదిలో తామువినా యితర ప్రజలు లేరనీ, తమకు కనిపిస్తూన్నదే ప్రపంచమనీ భావించిన మానవులు క్రమంగా ప్రపంచమంటే ఇంకా చాల ప్రదేశమున్నదని, ప్రజలింకా యెందరో ఉన్నారని తెలుసుకున్నారు. అప్పటి వారి పరిశీలనవల్ల అణువుకంటె చిన్నదీ, మేరువుకంటె పెద్దదీ లేదని తేలినట్లుగా ప్రతీతి గాని అణువే మేరువుగా గోచరించేంతటి సూక్ష్మాణువులూ, మేరువే అణువుగా గోచరించేంతటి మహామేరువులూ సృష్టిలో ఉన్నట్లుగా పరిశోధనలవల్ల విశదమవుతూంది. అనాదినుంచీ ఎందరో జ్ఞానులూ, విజ్ఞానులూ పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. ఐననూ వారికి తెలిసినది అత్యల్పమనే చెప్పాలి. అంతమాత్రాన **మానవుడు నిరుత్సాహపడక** ప్రకృతిని స్వాధీనపరచుకోడానికి జ్ఞాన సేకరణ చేస్తూనే ఉన్నాడు. అలా మానవుడు ప్రోగుచేసిన జ్ఞానసంపత్తి ఏ పాటిదో రేఖామాత్రంగా సూచించేదే యీ 'జ్ఞానం : విజ్ఞానం'.

ఇందులో, తాము నివసించేదే ప్రపంచమని, తామే ప్రజలమని భావన గలిగివున్న నైలునదీ తీరవాసులతో ఆరంభించి, వివిధకాలాల్లో వివిధ దేశాల్లో విజ్ఞానులు సంతరించిన విజ్ఞానం గోచరిస్తూంది."

— ఆంధ్రపత్రిక – 9-6-1957.

సుమారు రెండువేల సంవత్సరాల మానవ సంస్కృతీ వికాసాల చరిత్రను కథలా చెప్పిన ఉద్గ్రంథం. ఈజిప్టు, బాబిలన్, ఫొనీషియన్, గ్రీకు, రోమను సంస్కృతీ నాగరికతలు ఆధ్యాత్మిక, లోకాయతవాదమార్గముల ననుసరించి గావించిన అనన్యకృషి యిందులో వివరించబడింది.

అనువాదకులు భారతీయ తత్త్వగ్రంథాలనుంచి ఎన్నో ఉదాహరణలను ఫుట్‌నోట్సుగా యిచ్చియున్నారు.

504 పుటలు క్రౌన్, గ్లేజుకాగితం, బైండుతో రు. **5/-** లు.

---

వలయువారు : విశ్వసాహిత్యమాల – రాజమండ్రి.

# యూదుల చరిత్ర

## రచయిత : శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, M.A.

"ఇందులో రచయిత యూదులచరిత్ర అతిప్రాచీనకాలంనుంచీ చక్కగా సమీక్షించారు. ఎన్నో అవరోధాలు ఎదుర్కొని యూదులు రాజ్యాలేర్పరచుకోవడం, చివరకు వారిలో చీలిక లేర్పడటం తేలికగా అర్థమయ్యేట్లుగా వ్రాశారు. జెరూసలెం నగరం పతనమై యూదులు స్వదేశం విడిపోయిన సంఘటన, రోమన్‌లు సాగించిన హత్యాకాండ బాగా వివరించారు. ఎన్ని అవాంతరాలనో ఎదుర్కొని యీనాటికి స్వతంత్రజాతిగా మనగలుగుతున్న యూదుల పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకోనగోరే ప్రతి యువకుడు, విద్యార్థి చదువదగిన గ్రంథం యిది." — ఆంధ్రపత్రిక 4-11-56.

3 మ్యాప్‌లు, చక్కని ముఖచిత్రంతో వెల రు. 1-8-0

# ఆంధ్రుల చరిత్ర

## రచయిత : శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, M.A.

"దేశచరిత్ర జదివే విద్యార్థులకు ఎక్కువగా ఉత్తరదేశపు చరిత్రేగాని ఆంధ్రజాతి చరిత్ర అంతగా తెలియదు. ఈ కొరతను యీ పుస్తకం తీరుస్తున్నది. ఇందులో ఆంధ్రు లెవరు ? అన్నప్రశ్ననుంచి రాష్ట్రాల పునర్నిర్మాణసంఘ సిఫార్సులవరకు ఆంధ్రుల చరిత్రను క్లుప్తంగా సమీక్షించారు. వివిధప్రాంతాలలో వర్ధిల్లిన ఆంధ్ర రాజ్యాలు, వాటి క్షీణదశ, ముస్లిం పాలన, జాతీయోద్యమం, రాష్ట్రోద్యమం అన్నీ వివరించారు. ప్రాచీన కాలపు ఆంధ్ర రాజ్యాలలో ప్రజల స్థితిగతులు, ఆచార వ్యవహారాలు చక్కగా పేర్కొన్నారు. విద్యార్థులకు అత్యంత ఉపయోగకరమైన పుస్తకం." — ఆంధ్రపత్రిక — 4-11-56.

3 మ్యాప్‌లు, మంచి గెటప్, గ్లేజుప్రతి, వెల రు. 1-8-0

---

వలయువారు : విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

# జనులు : మహాజనులు

[మహాజనో యేన గతః స పంథాః]

ఆహార నిద్రా భయ సంతానాదులలో మానవులు ఇతర జంతులోకంతో బాటే. కాని, వేదనలను, అనుభూతులను జ్ఞాపకం ఉంచుకుంటూ, మేధా శక్తిని క్రమంగా వృద్ధి పరుచుకుంటూ వచ్చిన మానవజాతి యితర ప్రాణి లోకం కంటె అత్యున్నతమైన, విలక్షణమైన దశకు వచ్చింది. బుద్ధివికాసంలో గూడిన రమ్యాలోచనలూ, ఆవేదనలూ సంగీత సాహిత్య శిల్ప యంత్రాది విద్యలన్నిటికీ మూలమైనాయి. మానవజాతి శైశవదశనుంచీ యెందరెందరో మహాజనులు మానవ సంస్కృతీ నాగరికతలను నూతన పథముల వెంట కొనిపోతూనే వున్నారు. జనులు ఆ మహాత్ముల ననుసరిస్తూనే వున్నారు. "శ్లో. యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః। సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥" అనే గీతావాక్యంలో చెప్పినట్లు శ్రేష్ఠులు ఆచరించినట్లుగా యితరులు కూడా నడచుకుంటూంటారనీ, శ్రేష్ఠ వ్యక్తులు దేన్ని లోకానికి ప్రమాణంగా నిర్ణయిస్తే వాటిని అనుసరిస్తూ లోకం నడుస్తుందనీ అందరకూ తెలిసిందేగదా.

ఈ గ్రంథంలో మానవజాతి చరిత్రలోని కొన్ని దృశ్యాలు అత్యద్భుతంగా వర్ణించబడినాయి. మానవ నాగరికతను, సంస్కృతిని నశించకండా పెంచుకున్న, అభివృద్ధి చేసుకున్న ప్రాణాలొడ్డి కృషిచేసిన మహాత్ముల గాథలు అతిమనోజ్ఞంగా చెప్పబడినాయి. దృష్టిని విశాలమొనర్చి, బుద్ధికి వికాసాన్నిచ్చే గ్రంథం.

రచన : ఇలిన్ & సెగాల్.

అనువాదం : మహీధర జగన్మోహనరావు.

"దుర్ముఖి సంవత్సరంలో వెలువడిన వైజ్ఞానిక గ్రంథాలలో ముక్తాఫలం వంటి దీ గ్రంథం." — ఆంధ్రపత్రిక.

504 పుటలు క్రౌను చక్కని బైండు, జాకెట్‌తో. వెల రు. 5-/ లు.

---

వెలువరించువారు : విశ్వసాహిత్యమాల – రాజమండ్రి.

# యక్షప్రశ్నలు (67 బొమ్మలతో)

కార్యకారణ సంబంధాల నన్వేషించడమే శాస్త్రం, విజ్ఞానం అనబడుతుంది. శైశవదశ నుంచీ ఏమిటి? ఎందుకు? ఎల్లాగ? అని లక్షల ప్రశ్నలు వేస్తూనే వుంటారు, పిల్లలు. సహజ కుతూహలంతో వేసే అమాయక యక్షప్రశ్నలకు వాళ్ళని కసరడమో లేక తప్పు సమాధానా లీయడమో చేస్తూంటారు. అది తప్పుపద్ధతి. పిల్లల లేతమనస్సుల్లో వివిధవస్తు విషయాదుల యదార్థస్వరూప జ్ఞానాన్ని, సార్వత్రిక పరిణామశీలమైన శాస్త్రీయ దృష్టినీ కలుగచేయాలి. అదైనా అతిసులభంగా, శాస్త్రీయ పరిభాషలో జిలుగుగా కాకుండా చిన్న కథలవలె చెప్పి, వాళ్ళ మనస్సుల్లో హత్తుకొనేటట్లు చేయాలి. నేటి మన వాఙ్మయంలో, విజ్ఞానంలో మానవజాతి కూడబెట్టుకుంటూ వచ్చిన అభిప్రాయాలూ, విశ్వాసాలూ చేరి వున్నాయి. నేటి అర్థసత్యాలూ, విశ్వాసాలూ అనుభవపరిశీలనల వల్ల రేపు నిరాకరించబడు లగుటో, సవరించబడుటో జరిగి, వాటిస్థానే నూతన సత్యాలూ, విశ్వాసాలూ నిర్వచించబడుతూంటాయి. మానవాభివృద్ధియొక్క ఏ దశలలో విజ్ఞానస్థాయి యెల్లావుందో తెలుసుకోవడమూ ప్రధానమే. నేడు కనుగొన్న ప్రతివిషయమూ పూర్వకాలంలో మా తాతలకే తెలుసునని గాని, లేదా నేటి విజ్ఞానదృష్ట్యా పూర్వుల కృషియెడల నిరసన భావాన్ని వహించడంగాని చేయకుండా వుంటూ, పరిణామాత్మకమైన శాస్త్రీయ దృష్టి పెంపొందించుకోవాలి. అందుకు తోడ్పడుతుంది, యీ గ్రంథం.

ఆంధ్ర పాఠకలోకం మా 'యక్షప్రశ్నలు' ఆమోదించి, అభినందించి, ఆదరించడంవల్లనే నాలుగో కూర్పు తేవాల్సివచ్చింది. ఇందులో 67 బొమ్మలను కూడ చేర్చి, విషయం సుబోధకంగానూ, వినోదకరంగానూ కూడా వుండునట్లు చేయబడింది.

స్కూలు లైబ్రరీలకు, గ్రంథాలయాలకూ కూడ అత్యవసరమైనది. బహుమతులకు, పిల్లల కిచ్చుటకు యోగ్యమైన చక్కని గ్రంథం.

క్రౌను 240 పుటలు, చక్కని గెటప్, బైండుగలది. వెల రు. **2-8-0**

వలయువారు : విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

# నా బాల్యం - మాగ్జిం గోర్కీ

మహాకవి గోర్కీయొక్క ఆత్మస్మృతి కథనము. తన చిన్ననాటి జ్ఞాపకాలనూ; తన కుటుంబ పరిసరవాతావరణాన్ని, తన లేతమనస్సుమీద చెరగని ముద్రలను వైచిన చిన్నచిన్న సంఘటనలనూ అతి సహజంగా వ్రాసి, పొందుపరచేరు గోర్కీ. మన యీనాటి కుటుంబ వాతావరణం, పిల్లల చదువులు, దండనలు, పెద్దల అనాలోచితచర్యలు, బడి వాతావరణం, ఆటపాటలు, అసూయాద్వేషాలు, — అన్నీ మనం నిత్యం చూస్తూ అనుభవిస్తూన్నట్లే ఉంటుంది. ఆంధ్రపత్రికాలోకం ప్రశంసల నందినది. పిల్లలూ, తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ తప్పక చదువదగినది. చక్కని అనువాదం.

504 పుటలు క్రౌన్ సైజు — బైండు — చక్కని కెటప్. వెల రు 5/-

# గోర్కీ జీవితం - బొమ్మలతో

రచన : ఎ. రోస్కిన్, అనువాదం : జగన్మోహనరావు.

ఆధునిక రష్యను మహాకవి గోర్కీ వోల్గానదీతీరంలో నిఝ్నినొవొగ్రాడ్ నగరంలో నొక వడ్రంగి యింట జన్మించేడు. చిన్ననాటనే తలిదండ్రులను గోల్పోయి, పొట్టకూటికై ఛప్పన్నవృత్తులూ చేస్తూ, దేశమంతటా తిరిగేడు. బడిలో ఈతని చదువు అంతంత మాత్రమే. స్వయంగా గ్రంథపఠనం చేసీ, చదువుకున్న విప్లవవాదులతో పరిచయం చేసికొనీ, జీవితంలో అమూల్యమైన అనుభవాల్ని పొందీ, స్వీయబుద్ధి విశేషంచేతా యీయన ఉత్తమ రచయితగా తయారయేడు. దొంగలు, త్రాగుబోతులు, బికారులు, వేశ్యలు, బిచ్చగాళ్ళు, ఒకటేమిటి? — సంఘంలో ఆఖరిమెట్టున వున్న మనుష్యుల్నీ, వాళ్ళ నికృష్ట జీవితాల్నీ అంధకారంలోంచి వెలుగులోకి దెచ్చి, 'వీళ్లూ మానవులే! అందరికి వలెనే వీళ్ళకీ అవకాశాలిస్తే వీళ్ళు యితరుల కెంతమాత్రం తీసిపోయీవాళ్లు కారు!' అని తన రచనలద్వారా లోకానికి చాటిన మహాత్ముడీతడు. ఎన్నో గ్రంథాలు రచించి, సాహిత్య ప్రపంచంలో తాగ్రపథాన్నందుకున్నాడు. ఈయన రచన 'అమ్మ' 57 భాషలలోని కనువదించబడింది!

క్రౌన్ 190 పుటలు — 8 పటములు. రు 2/-

---

వలయువారు : విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.